మనుష్యుడు మొదలు పై బ్రహ్మపర్యంతము సుఖతారతమ్యము చెప్పబడినది. అది సుఖహేతువగు వారివారి ధర్మముయొక్క తారతమ్యమునుబట్టి వచ్చినదే. ఆధర్మతారతమ్యమునకు కారణము అధికారి తారతమ్యమే.

మనుష్యుడు మొదలు దిగువ స్థావరాది పర్యంతము గోచరించు సుఖలేశతారతమ్యముకూడ ధర్మతారతమ్య—అధికారితారతమ్యములనుబట్టి వచ్చినదే.

అట్లు గోచరించుచున్న దుఃఖతారతమ్యముగూడ వారివారి అధర్మతారతమ్యమూలకమే. అని.

దీని ఫలితార్థము—శ్రుతిస్మృతులచే విధింపబడినది ధర్మము; నిషేధింపబడినది అధర్మము. ఆధర్మాధర్మములు శరీరవాఙ్మనఃకృతకర్మరూపములు. వాని ఫలములు శరీరవాఙ్మనస్సులద్వారా ప్రత్యక్షముగా అనుభవింపబడు సుఖదుఃఖములు. అని.

ఇట్లు ధర్మాధర్మముల స్వరూపము, ప్రమాణము, ఫలము నిరూపింపబడినది.

ఈ ధర్మాధర్మములకే అదృష్ట— దురదృష్టములని, సుకృత—దుష్కృతములని, పుణ్య— పాపము లని పేరు.

లోకములో సుఖపడువానిని చూచి అదృష్టవంతుడని, పుణ్యము చేసి పుట్టినాడని అనుచుండుట, కష్టపడువానిని చూచి దురదృష్టవంతుడని, ఏపాపము చేసెనో అని అనుచుండుట బాలగోపాలము ప్రసిద్ధమైన విషయము. ఇదియే ధర్మాధర్మపరిజ్ఞానపద్ధతి.

—• ఆయుర్వేదోక్తమైన అధర్మఫలము •—

"తమువాచ భగవానాత్రేయః— మనుష్యాణాం యే౽న్యే భావాః సామాన్యాః తద్వైగుణ్యాత్ సమానకాలాః సమాన లింగాశ్చ వ్యాధయో౽భినిర్వర్తమానా జనపద ముద్ధ్వంసయన్తి। తే తు ఖల్విమే భావాః సామాన్యా జనపదేషు భవన్తి। తద్యథా— వాయు రుదకం దేశః కాల ఇతి ...జనపదోద్ధ్వంసనే కారణాని। పునరపి భగవన్త మాత్రేయ మగ్నివేశ ఉవాచ—

అథ ఖలు భగవన్! కుతో మూల మేషాం వాయ్వాదీనాం వైగుణ్య ముత్పద్యతే। యేనోపపన్నా జనపద ముద్ధ్వంసయన్తీతి।

త మువాచ భగవా నాత్రేయః—

సర్వేషా మప్యగ్నివేశ! వాయ్వాదీనాం యద్వైగుణ్యముత్పద్యతే తస్య మూల మధర్మః। తన్మూలం చాఽసత్కర్మ పూర్వకృతం। తయో ర్యోనిః ప్రజ్ఞాపరాధ ఏవ। తద్యథా—

యదా వై దేశ– నగర– నిగమ– జనపద– ప్రధానాః ధర్మ ముత్క్రమ్యాఽధర్మేణ ప్రజాం వర్తయన్తి, తదాశ్రితోపాశ్రితాః పౌర– జానపదాః వ్యవహారోపజీవినశ్చ త మధర్మ మభివర్ధయన్తి। తత స్సోఽధర్మః ప్రసభం ధర్మ మన్తర్ధత్తే। తత స్తేఽన్తర్హిత ధర్మాణో దేవతాభి రపి త్యజ్యన్తే॥ తేషాం తథాఽన్తర్హితధర్మాణా మధర్మప్రధానానా మపక్రాన్తదేవతానా మృతవో వ్యాపద్యన్తే।

తేన నాఽఽపో యథాకాలం దేవో వర్షతి; న వా వర్షతి; వికృతం వా వర్షతి; వాతా న సమ్య గభివాన్తి; క్షితి ర్వ్యాపద్యతే; సలిలా న్యుపశుష్యన్తి; ఓషధయః స్వభావం పరిహాయాఽఽపద్యన్తే వికృతిం; తత ఉద్ధ్వంసన్తే జనపదాః స్పృశ్యాఽభ్యవహార్యదోషాత్।

(చరకసంహిత.)

సర్వసాధారణములైన వాయువు, ఉదకము, దేశము, కాలము అను వానియందు పుట్టిన వికృతినిబట్టి మనుష్యులకు ఏకకాలమందు ఏకవిధమైన వ్యాధు లేర్పడి గ్రామములను విధ్వంసము చేయును. నీరు గాలి మొదలైనవానియందు అట్టి వికృతి ఒకప్పుడు పుట్టుటకు కారణము అధర్మము. అది ఆజన్మములోనిది కాని, పూర్వజన్మము లోనిది కాని అగును. అది మనుష్యుల స్వయంకృతాపరాధము. అది యెట్లనగా—

దేశనాయకులు, నగరనాయకులు, గ్రామనాయకులును ధర్మ ముల్లంఘించి అధర్మమార్గమున ప్రజల నెప్పుడు నడిపింతురో అప్పుడు అయాదేశస్థులు, గ్రామస్థులు, పౌరులు ఆ అధర్మమును అభివృద్ధి చేయుదురు. అట్లు పెరిగిన అధర్మము ధర్మమును అంతరింపజేయును.

అంతరించిన ధర్మము గల ప్రజలు దేవతలచే పరిత్యజింపబడుదురు. అట్లు అంతరించిన ధర్మము గలిగి, దేవతలచే త్యజింపబడి, అధర్మప్రధానులై ప్రజ లున్నపుడు ఋతువుల గమనిక మారును. అందుచే దేవుడు యథాకాలములో వర్షము కురిపింపడు; లేదా అసలే కురిపింపడు; వికృతముగా కురిపింపగలడు; వాయువులు అనుకూలముగా వీచవు; భూమికి వైగుణ్యా మేర్పడును; జల మింకిపోవును; ఓషధుల స్వభావము మారి వికృతి యేర్పడును. అట్టి స్థితిలో తాకుటలోను, తినుటలోను సంభవించిన దోషములనుబట్టి జనపదములకు విధ్వంసము కలుగును.

'తథా శస్త్రప్రభవస్యాఽపి జనపదోద్ధ్వంసస్య అధర్మ ఏవ హేతుర్భవతి...తథాఽభిశాపప్రభవస్యాపి అధర్మ ఏవ హేతుర్భవతి; యే లుప్తధర్మాణో ధర్మాదపేతాః తే గురు-వృద్ధ-సిద్ధ-ఋషి-పూజ్యా నవమత్యాఽహితా న్యాచరన్తి' (జనపదోద్ధ్వంసనీయాధ్యాయము).

ఆయుధమూలకమైన సంఘాతమరణమునకుగూడ అధర్మమే కారణము. శాపమూలకమైన ప్రాణహానులకుగూడ అధర్మమే కారణము. అధర్మపరులు గురువులను, పెద్దలను, సిద్ధులను, ఋషులను, పూజ్యులను అవమానించి వారియెడ అహితము నాచరించి వారి శాపములకు పాలగుచుందురు. అని.

ఇట్లు అనివార్యములై ప్రజలకు అనుభవసిద్ధము లగుచున్న అనర్థములకు మూలకారణ మధర్మ మని, అనర్థనివృత్తికై ప్రజలు ధర్మపరులు కావలయు నని ఆయుర్వేదోపదేశము.

## —• ధర్మమునుగూర్చి అభిప్రాయభేదములు •—

ఆర్య సంప్రదాయానువర్తు లందరును వేదశాస్త్రోక్త వర్ణాశ్రమ కర్మానుష్ఠానమే ధర్మ మనియు, యథాశక్తి దాని నాచరించుట, ఆచరింపలేని దానినిగూర్చి పశ్చాత్తప్తు లగుచుండుట ధర్మపరుల లక్షణమనియు చెప్పుచున్నారు. చెప్పుటమాత్రమే కాక అట్లు ఆచరించుచున్నారు.

అన్యులు కొందరు లోకములో అవ్యవస్థ కలుగకుండుటకై

కేవల దృష్ట(ఐహిక)ఫలార్థమె వేదోక్తవిధానముకాని, అదృష్ట (ఆముష్మిక) ఫలార్థము కాదనుచున్నారు. 1.

మరికొందరు— ఈవర్ణమున కిది ధర్మ మని కాక, ఈకర్మ చేసిన వాడు ఈవర్ణమువా డగు ననుటకే వర్ణవిభాగ మనుచున్నారు. 2.

మరికొందరు— ఆధర్మములను ప్రస్తుతపరిస్థితుల ననుసరించి మార్చవలె ననుచున్నారు. 3.

మరికొందరు—ఆనాటి ధర్మములు ఆనాటివారికే గాని, యీనాటివారికి పనికిరా వనుచున్నారు. 4.

మరికొందరు—అంతరాత్మకు ఏది చేయదగిన సత్కార్య మని తోచునో అది చేయుట ధర్మ మనుచున్నారు. 5.

వేదశాస్త్రవిశ్వాసము లేకుండుటలో ఈ 5 వాదములు సమానమే.

కేవలమైహికఫలార్థమె వేదవిధానము. అను ప్రథమవాదముగూర్చి—

కామశాస్త్రములో నిట్లు చెప్పబడినది—

“నాకాంగునికై ... దవ్యవస్థాయాం మాత్స్యన్యాయ ఇతి దృష్టార్థం వర్ణతా “... హి ప్రియా లోకయాత్రావిద ఇతి।

తాం చ లోకవిశ్వాసనార్థ మాచరద్భిః కథం నాచరితో ధర్మః ?
దృష్టార్థశ్చ యద్యదృష్టార్థోపి స్యాత్కో విరోధః ?”

అనగా, లోకవ్యవహారమునకు వ్యవస్థ లేకున్నపుడు కర్మసాంకర్యము, వృత్తిసాంకర్యము ఏర్పడి ప్రబలులవలన దుర్బలులకు హాని కలిగిపోవునని లోకవ్యవహారవ్యవస్థ చేయుటకే వేదముకాని, ఆముష్మిక మనబడు అదృష్టఫలముకై వేదము కాదని చార్వాకు లని యున్నారు. వారన్న ట్లయినను లోకవిశ్వాసార్థము వేదోక్తవిధానము నవలంబించినవారు ధర్మము నాచరించినవా రేల కారు ? దృష్టప్రయోజనముగలది, అదృష్టప్రయోజము గలదియు నగుటలో అభ్యంతర మేమున్నది ? అని.

దీనిచే- “వర్ణాశ్రమాచారస్థితిలక్షణత్వాచ్చ లోకయాత్రాయాః” అని కామసూత్రములో చెప్పినట్లు లోకయాత్రా నిర్వాహకమైన

స్వధర్మవ్యవస్థతో ఆముష్మికఫలవిధానము వేదబోధిత మగుచున్నందున పరిశ్రమవాద మయుక్త మని తేలినది.

వర్ణమునుబట్టి కర్మకాక, కర్మనుబట్టి వర్ణము. అను ద్వితీయ వాదమునుగూర్చి—

ఎట్టి వారి కేది కర్తవ్యమో తెలియుటకై వర్ణవ్యవస్థ అవసర మగును. సర్వులకు సర్వము కర్తవ్యమే అయియుండి వారు స్వేచ్ఛగా అప్పుడప్పుడు చేయునట్టి ఆయా కర్మలనుబట్టి ఆయా వర్ణము నిర్దేశింపబడు పక్షములో కర్మలు స్వేచ్ఛాకృతములు గనుక ఇక వర్ణవిభాగమున కవసర మేమున్నది? స్వధర్మ— పరధర్మ పరిజ్ఞానము కలుగుట యెట్లు?

“స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః” అను గీతావచన మేమి కావలయును?

వర్ణవిభాగము ఉత్పత్తిసిద్ధ మని యంగీకరింపనిచో మొదల “ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయో౽న్యత్ క్షత్రియస్య న విద్యతే” అను భగవద్వాక్య మెట్లు సరిపడును?

ఈ వాదప్రకారము యుద్ధము చేయుటనుబట్టి క్షత్రియు డనబడును. ఘాతుకకార్యమైన యుద్ధము నేను చేయ నని పార్థుడు మొరపెట్టెను. అట్టి పార్థునితో నీవు క్షత్రియుడవు; నీకు యుద్ధము స్వధర్మము అని భగవంతు డెట్లు చెప్పెను? స్వధర్మబుద్ధితో యుద్ధమునకు పార్థు డెట్లు పూనికొనెను? కనుక వర్ణము జన్మసిద్ధము. ధర్మము వర్ణసిద్ధము. స్వవర్ణవిహితధర్మము స్వధర్మము; అన్యవర్ణవిహిత ధర్మము పరధర్మము. అని యంగీకరింపక తప్పదు. ఈ నిర్ణయమే సర్వగ్రంథసమ్మతము.

ఈ విషయమై కొందరి యాక్షేప మిట్లున్నది—

“మనుష్యులు జన్మచేతనే భిన్నజాతులుగా ఏర్పడినారని చెప్పుటకు వీలులేదు. భిన్నజాతులైన జంతువులకు సంతాననిమిత్తమైన సంబంధము కలుగుట లేదు. భిన్నజాతులుగా చెప్పబడు మనుష్యులలో అట్టి సంబంధము కలుగుచున్నది. అందుచేత మనుష్యులలోని జాతిభేదము జన్మసిద్ధము కాదు’ అని.

ఇచ్చట చెప్పవలసిన దేమనగా, జన్మసిద్ధమైన జాతిభేదముగల జంతువులు కలియవనునది సరియైనమాటకాదు. అశ్వ–గర్దభములు కలియుచున్నవి; కంచరగాడిదలు కలుగుచున్నవి. అట్లే మనుష్యులలో సంఘటింపవచ్చును. కావున జాతిభేదము జన్మసిద్ధ మనుటకు ఎట్టి యుపపత్తియు లేదు.

ఇంకొకటి. మనుష్యజాతి, పశుజాతి జన్మసిద్ధమైన జాతిభేదము కలదనుట నిర్వివాదమేకదా! అట్టిమనుష్యులు పశువులలో గమనము చే యుట చెప్పబడి ధర్మశాస్త్రములో దోషనివృత్తికై ప్రాయశ్చిత్తము విధింపబడినది. చూడుడు—

"యేషాం పశుజాతీనాం గమనే కృచ్ఛ్రమాచరేత్।
సహిష్యుష్ట్రిఖరీగామీ త్వహోరాత్రేణ శుద్ధ్యతి॥"

ఇట్లుండుటచే బ్రాహ్మణాదిజాతులు జన్మసిద్ధము లనుట నిరాక్షేప మని తేలినది.

ఇంకొకటి. మనుష్యులలో ఉత్పత్తిసిద్ధమైన జాతిభేదము లేదను వారు 'స్త్రీజాతి వేరు పురుషజాతి వేరు' స్త్రీజాతి, పురుషజాతి అని రెండే జాతు లనుకున్నారు. ఆ రెండును ఉత్పత్తిసిద్ధములని యొప్పుకునే యున్నారు. ఆ స్త్రీపురుషు లనబడు భిన్నజాతులకు సంతాననిమిత్తమైన సంబంధమును అంగీకరించుచునే యున్నారు.

ఇట్టివారు ఉత్పత్తిసిద్ధమై, లోకప్రసిద్ధమై యున్న మనుష్య జాతులలోని విభేదమును అంగీకరింపమనుట, జాతిభేద ముత్పత్తిసిద్ధమై యున్న పక్షములో భిన్నజాతులకు సంతాననిమిత్తమైన సంబంధము నిరోధింప మనుట స్వవచనవ్యాఘాతము.

ఈ బ్రాహ్మణాదిజాతులు మనుష్యులలో మాత్రమే కాక దేవతలలో గనబడుచున్నవి; అశ్వములలో, వృక్షములలో గనబడుచున్నవి. అశ్వములనుగూర్చి చూడుడు—

లఘుశబ్దార్థసర్వస్వమ్—'పునరశ్వాః బ్రాహ్మణాది జాతిభేదేన చతుర్విధాః...బ్రాహ్మణాదిజాతయో బ్రాహ్మణాదితత్తజ్జాతిభి స్సహైవ స్థాప్యాః నతు భిన్నజాతిభిః।' (పు. 364)

వృక్షములనుగూర్చి 'యుక్తికల్పతరువు' అను గ్రంథములో నున్న విషయము భారతీయనౌకానిర్మాణప్రస్తావములో సంస్కృత పత్రికలో (14-7-58) వ్రాయబడియున్నది చూడుడు—

'వృక్షాయుర్వేదే హి వృక్షా అపి బ్రాహ్మణ-క్షత్రియ-వైశ్యాది చతసృషు శ్రేణిషు విభక్తాః—లఘుః కోమలః అనాయాసమేవ అన్యేన వృక్షేణ సహ సుయోజ్యో బ్రాహ్మణః। లఘుః సుదృఢః సహజమేవ అన్యేన సహ అసంయోజ్యః క్షత్రియః। కోమలో గురుభారో వైశ్యః, దృఢో గురుభారశ్చ శూద్రః...

జలయాననిర్మాణవిషయే భోజమతం ప్రాయః ప్రామాణిక మనున్యతే। ఏతస్య మతే క్షత్రియకాష్ఠఘటితాని జలయానాని సుఖసంపత్ప్రదాని ॥'

ఇట్లు సర్వత్ర ఈవిభాగ మున్నందున ఈజాతులు జన్మసిద్ధములే కాని, కల్పనామాత్రములు కావని తేలినది.

బ్రాహ్మణాదిశబ్దములు అవస్థావాచకములేకాని, జాతివాచకములు కావని యొకరివాదము—ఇది తప్పు. స్త్రీలింగములో బ్రాహ్మణ శబ్దమునకు బ్రాహ్మణీ అని రూపము. అట్టిరూపము జాతివాచకమైనపుడే సంభవించునని—'జాతే రస్త్రీవిషయా దయోపధాత్' అను వ్యాకరణసూత్రము శాసించుచున్నది. కనుక శబ్దశాస్త్రమునకుగూడ విరుద్ధమైన ఈవాద మయుక్తము.

'సవర్ణేభ్య స్సవర్ణాసు జాయన్తే హి సజాతయః।
బ్రాహ్మణ్యాం బ్రాహ్మణా జ్జాతో బ్రాహ్మణః పరికీర్తితః ॥'

ఇత్యాదివచనములచే ఎవ్వరు ఏజాతిదంపతులకు జన్మింతురో వారు ఆజాతికి చెందుదు రని చెప్పబడినది.

'జన్మనా బ్రాహ్మణో జ్ఞేయః సంస్కారాత్తు ద్విజో భవేత్।
వేదాభ్యాసా ద్భవే ద్విప్రః త్రిభి శ్శ్రోత్రియశబ్దభాక్ ॥'

అను యాజ్ఞవల్క్యస్మృతి, జాతిమాత్రబ్రాహ్మణ్యమునకు ఉపనయనాదిసంస్కార—వేదాభ్యాసములనుబట్టి శ్రేష్ఠత్వము చెప్పుచున్నది.

'జన్మనా జాయతే శూద్రః కర్మణా జాయతే ద్విజః ॥'

అను వాక్యములోని శూద్రశబ్దము జాతివాచకముకాదు. జాతి వాచకమె అయినయెడల 'అష్టవర్షం బ్రాహ్మణ ముపనయీత' అనుచు బ్రాహ్మణజాతికే ద్విజత్వసాధకముగా విధింపబడిన ఉపనయనాది కర్మలు జాతిశూద్రునకు సంభవింపనందున పైనున్న 'కర్మణా జాయతే ద్విజః' అనుమాట విరుద్ధ మగును.

'జన్మనా బ్రాహ్మణో జ్ఞేయః' అను వెనుకటివాక్యమునకును విరుద్ధ మగును. కనుక ఆశూద్రశబ్దమునకు 'శూద్రసదృశః' అని యర్థము చెప్పవలెను. అప్పుడు విరోధ ముండదు. రెండువచనముల కును ఏకార్థమే సంభవించును.

ఇచ్చట క్షత్రియబీజసంభూతు డగు విశ్వామిత్రునకు బ్రాహ్మణ్య మెట్లు ? అని శంక కలుగును. ఈశంక చేయబడి సమాధానము భీష్మ యుధిష్ఠిరసంవాదములో మహాభారతమున చెప్పబడినది. దాని సారాంశ మిది—

విశ్వామిత్రుని తల్లి, మంత్రసంస్కృత—బ్రహ్మోదన—ప్రాశన చేయుటవలన ఆమె పుత్రునకు బ్రాహ్మణ్యము కలిగిన దని.

నీలకంఠీయము:— "చరౌ పూర్వం బ్రహ్మ వా హితమ్ । అతః క్షత్రబీజోద్భవస్యాపి బ్రాహ్మణ్యలాభో జాతః । బీజా పేక్షయా సంస్కారస్య బలవత్త్వాత్ । తథాహి— దావాగ్ని దగ్ధేభ్యో వేత్రబీజేభ్యః కదలీకాండోత్పత్తి ముదాహరన్తి"

(అనుశా॥ అ 4)

దావాగ్ని సంస్కృతములైన వేత్రబీజములనుండి వేత్రాంకుర ములుకాక కదళీకాండములు (అరటిచెట్లు) పుట్టుచుండుటనుబట్టి బీజము కంటె ప్రబలమైనది సంస్కార మనవలసియున్నందున చరుద్రవ్యము నకు అట్టి మంత్రసంస్కారము ఋచీకమహర్షి చేసియుండుటవలన బ్రాహ్మణ్య మని భావము. ఆమహర్షుల శక్తులు అద్భుతములని, అసా ధారణములని అభిజ్ఞులకు విదితమే.

"కలౌ బ్రాహ్మణతా వీర్యాత్ తపశ్చర్యాదనా న హి" అని కూడ చెప్పబడినది. కనుక వర్ణము లనబడు జాతివిశేషములు జన్మసిద్ధ ములే. ఆవర్ణముల నుద్దేశించి విధింపబడినవే వర్ణధర్మములు.

ఆయావర్ణములు తమ విధులను గుర్తించి నడచుకొనుచు శ్రేయస్సును పొందవలె ననియే "చాతుర్వర్ణ్యం మయా సృష్టమ్" అన్నట్లు పరమేశ్వరునిచే చాతుర్వర్ణ్యము సృష్టింపబడినది.

వర్ణ మనబడు జాతివిశేషము జన్మసిద్ధమైన యెడల ఒకవ్యక్తిని చూచినపుడు ఇతనిది యీవర్ణ మని తెలియుచున్నదా? అని శంకింతురేమో! ఒక వ్యక్తిని చూచినపుడు ఈతని తల్లితండ్రులు ఫలానా, ఈతడు వీరి పుత్రుడు అని మాత్రము తెలియుచున్నదా?

అది తెలిసినవారు చెప్పగా తెలియుచున్నది. అట్లే జాతివిశేషముగూడ తెలియుచున్నది. మనకు తెలియని వెన్నియో తెలిసిన వారివలన తెలియబడుచున్నవి. అందులో ఇది యొకటి యని గ్రహింపవలెను.

పశు వృక్షాది– వర్గములలోని జాతులు జన్మసిద్ధము లనుట సర్వవాద మయినట్లు మనుష్యవర్గములలోని జాతులుగూడ జన్మసిద్ధములే యని చెప్పబడినది. చూడుడు—

"సర్వేషాం జన్మనా జాతి ర్నాన్యథా కర్మకోటిభిః ।
పశ్వాదీనాం యథా జాతి ర్జన్మనైవ న చాన్యథా॥ (సూతసంహితా)

మరియు స్వజాతివిహితకర్మానుష్ఠానముచేతనే సంసారవిముక్తి యనియుగూడ సూతసంహితలో చెప్పబడినది—

"స్వజాత్యుక్తం యథాశక్తి కర్మ యః కురుతే పుమాన్ ।
ముక్తి స్తస్యైవ సంసారా దితి వేదానుశాసనమ్ ॥"

"ప్రసిద్ధివ్యవహారాభ్యాం వర్ణసిద్ధిః" అనున్యాయమున లోకప్రసిద్ధము, లోకవ్యవహారసిద్ధమునై, ప్రమాణప్రసిద్ధమైయున్న వర్ణవ్యవస్థకు శాస్త్రములో అపార్థములు కల్పించుట అన్యాయము.

వచనము లన్నిటకిని ఏకవాక్యత నాలోచింపక తమ అభినివేశముతో నేదియో యొకవాక్య మందుకొని తాము తలచిన అర్థమును దానికి చెప్పి వచనాంతరవిరోధము సంపాదించుట సిద్ధాంత మని చెప్పుట ఆస్తికత్వమునకు [illegible] గ్రహింపవలసిన విషయ మిది—.

బ్రాహ్మణాదివర్ణములకు జాత్యభివ్యంజకముగా "శమో దమస్తప శ్శౌచమ్" ఇత్యాదిలక్షణములు వేరువేరుగా చెప్పబడియున్నవి. ఆలక్షణములు గల ఆవర్ణములయందు ఆబ్రాహ్మణాదిశబ్దములు వాడబడినపుడు అది ముఖ్యప్రయోగ మనబడును. కనుకనే వ్యాకరణ మహాభాష్యములో నిట్లున్నది—

"తప శ్శ్రుతం చ యోని శ్చేత్యేత ద్బ్రాహ్మణకారకమ్।
తపశ్శ్రుతాంభ్యా యో హీనో జాతిబ్రాహ్మణ ఏవ సః ॥

కైయటవ్యాఖ్యా—తపశ్చాంద్రాయణాది కర్మ; శ్రుతం వేదతదంగాదీనామధ్యయనం; యోనిః బ్రాహ్మణా ద్బ్రాహ్మణ్యాం జన్మ; బ్రాహ్మణకారకం బ్రాహ్మణవ్యపదేశస్యైత న్నిమిత్త మిత్యర్థః"

దీనిని బట్టి విద్యాతపస్సులు, జాతి, బ్రాహ్మణశబ్దమునకు ముఖ్యార్థమనియు, విద్యాతపస్సులు లేనివాడు కేవలజాతిబ్రాహ్మణు డనియు స్పష్ట మయినది.

బ్రాహ్మణవర్ణమునకు చెప్పబడిన లక్షణములు అన్యవర్ణమునందుండ అచ్చట బ్రాహ్మణశబ్దము వాడబడినపుడు అది గౌణప్రయోగ మనబడును.

శౌర్యాదిలక్షణములు, సింహత్వజాతి కల సింహమందు సింహశబ్దప్రయోగము ముఖ్యము. శౌర్యాదిలక్షణములుగల మనుష్యునియందు 'ఈతడు 'సింహము అని సింహశబ్దమును వాడుటలో గౌణప్రయోగము అయినట్లు.

ఈవిధముగా బ్రాహ్మణజాతికి చెప్పబడిన లక్షణములు ఇతరజాతియందు గోచరించినపుడు లక్షణములనుబట్టి బ్రాహ్మణశబ్దము వారియందును, ఇతరజంతులకు చెప్పబడిన లక్షణములు బ్రాహ్మణజాతియందు గోచరించినపుడు ఆలక్షణములనుబట్టి ఆశబ్దములు బ్రాహ్మణునియందును ప్రయోగించుట సంభవించును.

ఇట్లు జన్మసిద్ధమైన చాతుర్వర్ణ్యములో గుణకృతమైన చాతుర్విధ్యము ప్రతివర్ణమునందును గలదని—

'ఏకస్మిన్నేవ వర్ణే తు చాతుర్వర్ణ్యం గుణాత్మకమ్।'

అను సర్వసిద్ధాంతసంగ్రహవచనము బోధించుచున్నది.

దీనినిబట్టి బ్రాహ్మణబ్రాహ్మణ, బ్రాహ్మణక్షత్రియ, బ్రాహ్మణ వైశ్య, బ్రాహ్మణశూద్ర ఇత్యాదివిధముగా జన్మసిద్ధమైన ప్రతివర్ణమునకును గుణకృతమైన బ్రాహ్మణాది వ్యవహారము సిద్ధించినది.

పూజ్యములైన గుణములు ఏజాతియందున్నను ఆజాతి పూజ్యమగును.

విదురుడు, ధర్మవ్యాధుడు మొదలగువారు పూజ్యులు కాలేదా? వారు జాతిధర్మములను పాటింపలేదా? కనుక పూజ్యతకు జాతియే ప్రధానము కాదు. స్వధర్మమును గుర్తించి ప్రవర్తించుటకే జాతి; ఇహాపరములకు సంబంధించిన క్రియాకలాపమును నడపుకొనుటకే జాతి.

ఈవిషయము శుక్రనీతిలోగూడ నిట్లు చెప్పబడినది—

'కర్మశీలగుణాః పూజ్యాః తథా జాతికులే న హి।
న జాత్యా న కులేనైవ శ్రేష్ఠత్వం ప్రతిపద్యతే।
వివాహే భోజనే నిత్యం కులజాతివివేచనమ్॥' అ. 2 55)

సత్కర్మానుష్ఠాన-శీల- గుణములచే శ్రేష్ఠత్వముకాని, జాతి-కులములచేతనే శ్రేష్ఠత్వము కాదు. పూజ్యతయందు కాక భోజన వివాహములయందు కుల-జాతి వివేచనము. అని భావము.

కొందరు, ఆహార—విహారములలో కుల—జాతి—వివక్ష లేకుండ సంచరింపవలసిన యీకాలములో శాస్త్రము లేమిచేయును? అని భావించుచున్నారు. శాస్త్రములు- స్వేచ్ఛాప్రవృత్తిలో గలుగు అధర్మమునుబట్టి దురదృష్ట మేర్పడ ఇహలోకములో నిట్టి అనర్థములు కలుగునని, పరలోకములో నిట్టి కష్టములు కలుగునని బోధించును. యుగాంతరములకు, జన్మాంతరములకు, కల్పాంతరములకు, లోకాంతరములకు సంబంధించినది శాస్త్రదృష్టి; తాత్కాలికభోగములకు సంబంధించినది మానవదృష్టి. కనుక శాస్త్రోక్తప్రకారము చేయబడినదే ధర్మమగుట వలన ద్వితీయ వాదము అయుక్తము.

ధర్మములను మార్చవలెను. అను తృతీయవాదమునుగూర్చి—

ప్రస్తుతపరిస్థితుల ననుసరించి ధర్మములను మార్చవలె ననుట యుక్తము కాదు. ధర్మమునుగూర్చ శ్రుతిస్మృతులే ప్రమాణము లగుట

చేతను, పరిస్థితులనుబట్టి మారుచుండుట ధర్మమునకు లక్షణము కాకుండుటచేతను మార్చబడినది అధర్మమే అగును.

ఇంకొకటి—దేనిని మార్చవలెనని చెప్పుదురో దానిని ధర్మమని భావించినట్లా? అధర్మమని భావించినట్లా? అధర్మమని భావించిన పక్షములో 'ధర్మములను మార్చవలెను.' అనుట ఎట్లు సరిపడును? ధర్మమని భావించునపుడు దానిని మార్చుటలో అధర్మమైపోదా? శ్రేయస్సాధనము ధర్మము; ధర్మమును మార్చిన శ్రేయస్సు ప్రాప్తింపక పోవును.

లోకుల ప్రవృత్తినిబట్టి ధర్మము మారవలెననుటకూడ మంచిది కాదు. ధర్మమునుబట్టి ప్రవృత్తి యుండవలెనుకాని, ప్రవృత్తినిబట్టి ధర్మ ముండరాదు. ప్రవృత్తినిబట్టి యుండునది అధర్మమేకాని, ధర్మము కాదు.

ధర్మదూరమైనను లోకప్రవృత్తిని బలపరచుటయందే తాత్పర్యమైనయెడల శాస్త్రముల జోలికి పోకుండుటే మంచిది. వానికి అపార్థము లెందుకు చెప్పుదురు?

'అన్యే కృతయుగే ధర్మాః...అన్యే కలియుగే నృణామ్।'

అను పరాశరస్మృతివచనమునుబట్టి ధర్మస్వరూపము మారుచున్నట్లు కనబడుటలేదా? అని యందురేమో అచ్చట పరాశరమాధవీయ మందేమి చెప్పబడినదో చూడుడు—

'అత్ర అన్యశబ్దో ధర్మస్య న స్వరూపాన్యత్వ మాచష్టే, కిన్తు ప్రకారాన్యత్వమ్। అన్యథా ధర్మప్రమాణచోదనానా మపి యుగభేదేన భేదాపత్తేః। నహీయం చోదనా కృతేఽధ్యేతవ్యా, ఇయన్తు త్రేతాయా మిత్యాది వ్యవస్థాపకం కించిదస్తి। ప్రకారాన్యత్వేత్వస్తి దృష్టాన్తః।'

అనగా యుగభేదమునుబట్టి ధర్మస్వరూపమునకు భేదము చెప్పబడలేదనియు, అట్లే అయినయెడల ధర్మముపట్ల ప్రమాణమైన వేదమునకుగూడ భిన్నత్వము చెప్పవలసివచ్చుననియు, ఈయుగమందు ఈవేదము, ఆయుగమందు ఆవేదము అని యెచ్చటను చెప్పబడలేదనియు, ధర్మము నాచరించు పద్ధతిలోని భేదమే ఇచ్చట చెప్పబడినదనియు భావము.

ధర్మబుద్ధితో యాగాద్యాచరణప్రకారమునకును, లాభ-పూజా-ఖ్యాతి—బుద్ధితో యాగాద్యాచరణప్రకారమునకును భేదముండును. తత్ఫలములకును భేదముండును. యాగాదిస్వరూపమునకు మాత్రము భేదముండదు. అని తెలిసికొనవలెను.

ఆయాయుగములలో ధర్మాచరణముచేయువారి శక్తి శ్రద్ధా మనశ్శుద్ధి తారతమ్యాదులనుబట్టి ఆచరించుపద్ధతిలో మాత్రము భేదము కలుగుచున్నదని గ్రహింపవలెను.

ఉదాహరణము—

"అభిగమ్య కృతే దానం త్రేతాస్వాహూయ దీయతే।
ద్వాపరే యాచమానాయ సేవయా దీయతే కలౌ॥

"అభిగమ్యోత్తమం దాన మహూయైవ తు మధ్యమమ్।
అధమం యాచమానాయ సేవాదానం తు నిష్ఫలమ్॥"

ఇక్కడ దానపద్ధతి చెప్పబడుటలో దానఫలతారతమ్యము, దాతృబుద్ధి తారతమ్యము స్పష్టీకరింపబడినది. స్వస్వత్వనివృత్తి పూర్వక పరస్వత్వోత్పాదనమ్" అనులక్షణముగల దానస్వరూపము అన్నియుగములలో సమానమే. ఇట్లే శ్రౌతస్మార్త కర్మలన్నిటిలో నూహింపవలెను.

మాధవీయములో—

"నహి నానావిధేషు మన్వంతరేషు ధర్మం భిద్యమానం క్వచి దుపలభామహే॥"

అనికూడ చెప్పబడినది. దీనిచేత ఏమన్వంతరమందును ధర్మస్వరూపము మారినట్లు మాకు ఎక్కడను గోచరింపలేదని మాధవాచార్యుల సాక్ష్యము కనబడుచున్నది.

"కృతే తు మానవా ధర్మాః...కలౌ పారాశరా స్మృతాః।"

అనువాక్యమునుబట్టి ధర్మములు మారినట్లు భ్రాంతిపడరాదు. కృతాదియుగములలో మన్వాదిప్రోక్తధర్మములకు ప్రచురప్రవృత్తి యనియు, కలియుగములో పరాశరప్రోక్తధర్మములకు ప్రచురప్రవృత్తి యనియు ఆవాక్యమునకు తాత్పర్యము.

మాధవీయమును చూడుడు—"మానవాదిగ్రంథోక్తధర్మాణాం ప్రచురప్రవృత్త్యా గ్రన్థప్రామాణ్యప్రాచుర్య మర్థసిద్ధమ్,"

మరియు మునులచేత ఆయాయుగముల సామర్థ్యమునకు సంబంధించి, ప్రాయశ్చిత్తములు విధింపబడినవి. కలియుగసామర్థ్యమునకు సంబంధించి పరాశరమునిచే విధింపబడినవి. సర్వకల్పములలోని కలియుగములకును సంబంధించినది పరాశరస్మృతి. అందుచేత కలియుగ విషయములైన ప్రాయశ్చిత్తములలో పరాశరుడు ముఖ్యముగా ఆదరణీయు డని చెప్పబడినది.

మాధవీయము చూడుడు— "సర్వేష్వపి కల్పేషు పరాశర స్మృతేః కలియుగధర్మపక్షపాతిత్వాత్ ప్రాయశ్చిత్తేష్వపి కలియుగ విషయేషు పరాశరః ప్రాధాన్యే నాదరణీయః"

ఇట్లుండుటచే మునులు ధర్మములను మార్చలేదు; యుగ సామర్థ్యమునుబట్టి, ప్రజల శక్తిశ్రద్ధామనశ్శుద్ధితారతమ్యమునుబట్టి ఆధర్మమును నాచరించు పద్ధతిలో ప్రభేదములను ప్రదర్శించినారు. మునులు భిన్నభిన్నముగా చెప్పిన విషయములు వేదములోని వికల్ప విధులకు సంబంధించిన వని గ్రహింపవలెను.

ఇక్కడ మహామహోపాధ్యాయ— అభ్యంకర— వాసుదేవ శాస్త్రిగారి 'ధర్మతత్త్వనిర్ణయము' లోని కొన్నివిషయము లుదాహ రింపబడుచున్నవి—

—• లోకవిద్విష్టాచార పరిత్యాగవిచారము •—

కొంద రిట్లనుచున్నారు—శ్రుతిస్మృతి సమ్మతములయిన యాచా రములుగూడనెప్పుడు లోకులకు విద్వేషపాత్రము లగునో అప్పుడవి విడువబడుచు వచ్చినవి. అందుచేత వారధార్మికులు గాలేదు. ఇది స్మృతు లలో జెప్పబడినదే—

"పరిత్యజే దర్థకామౌ యౌ స్యాతాం ధర్మవర్జితౌ ।
ధర్మం చాప్యసుఖోదర్కం లోకవిక్రుష్ట మేవ చ" (మను.)
'అస్వర్గ్యం లోకవిద్విష్టం ధర్మ్య మప్యాచరే న్న తు'(యాజ్ఞవల్క్య)

ఈ శ్లోకములకు తాత్పర్యము— ధర్మవిరుద్ధములైన అర్థ్య కామములు అనగా చౌర్యాదులచేత అర్థసంపాదనము, దీక్షాకాల మందు పత్నీ సంబంధాదికము అనునవి పరిత్యజింపదగినవి. ఉత్తరకాల మందు అసుఖహేతువగు ధర్మము, అనగా పోష్యవర్గము కలవాడు సర్వస్వదానము చేయుట పరిత్యాజ్యమే.

విహితమైయుండియు ఆముష్మికసాధనము కాక కేవల మైహిక ఫలకారియై లోకనిందితమై యుండు ఆభిచారికకృత్యము లాచరింప రాదు. అని.

శ్రుతిలో సూక్ష్మమై లోకుల కవగతముకానట్టి యభిప్రాయ ముతో నేది ప్రతిపాదింపబడునో, యేది చేయకున్న ప్రత్యవాయ జనకమో అది స్థూలదృష్టిగల లోకులకు విద్వేషపాత్ర మయినను పరిత్యజింపదగినది కాదు. ఏది చేసిన ప్రశంసాపాత్రమై చేయకున్న ప్రత్యవాయజనకము కాకుండునో అట్టిది లోకవిద్విష్టమైనపుడు పరి త్యాజ్య మగును. ఇది శాస్త్రమర్యాద.

శ్రాద్ధమందు మాంసదానము పూర్వ ముండెడిది. శ్రాద్ధకర్త లందరును అది చేయుచుండువారా? అసామర్థ్యముచేత నది చేయని వారును అప్పుడు గలరు. అది ప్రశంసార్థమయి, చేయకున్న ప్రత్య వాయజనకము కాకుండుటే దానికి కారణము. అట్టిది యీనాడు త్యజింపబడినది. అట్టిదానిని త్యజింపు మనియే పై వచనములకు భావము. శ్రుతిమూలకమైన ప్రామాణ్యముగల స్మృతివచనములు శ్రుత్యర్థము నెట్లు బాధించును? శ్రుతివిరుద్ధార్థమును స్మృతి చెప్పరాదు.

పై వచనములనుబట్టుకొని కొంద రిట్లనుచున్నారు— 'లోక విద్విష్టం నాచరేత్' అనుటలో నెప్పు డేయాచారము బహుజనులకు విద్విష్ట మగునో అప్పుడు అందరును దానిని త్యజింపవలసినదే. అని. ఇక్కడ గొంచెము చెప్పవలసియున్నది—

"లోకవిద్విష్టం పరిత్యజేత్; నాచరేత్" అనియున్నది. ఇక్కడ కర్తృవిశేషము చెప్పబడియుండలేదు. లోకపదమునుబట్టి కర్తను కల్పింప వలయును. లోకపదము శిష్టాశిష్టసాధారణముగా బహుజనసమూ

హంమును బోధించును. శిష్టులును లోకాన్తర్గతులే గనుక బహుజన సమూహబోధకమైన లోకపదమునుబట్టి పరిత్యజించుటలో కర్తలు అల్పసంఖ్యాకు లని చెప్పవలసియున్నది. ఇప్పుడు జనబాహుళ్యమున కేది యంగీకృతమో అదియే అల్పసంఖ్యాకుల కంగీకర్తవ్య మని తేలినది. దీనిని శిష్టాశిష్టవిభాగముతో యోజన చేసినపుడు, శిష్టజన బాహుళ్యమున కేది విద్విష్టమో అది యల్పసంఖ్యాకులగు శిష్టులకు త్యాజ్యము. అజ్ఞజనబాహుళ్యమున కేది విద్విష్టమో అది అల్పసంఖ్యాకులగు అజ్ఞులకు త్యాజ్యము. అని పర్యవసించుచున్నది. ఇట్లుండుటచే అశిష్టులును అజ్ఞులును అగు బహుజనులకు విద్విష్టమైనది అల్పసంఖ్యాకులగు శిష్టులకును త్యాజ్యమే అనెడి యర్థము పై వచనములనుండి లభించుట లేదని స్పష్టమే.

అనేకవిధముగా ననుచున్నారు— పురాణములలో కలివర్జ్య ప్రకరణమున్నది. అది కలియుగాదియందు మహాత్ములు అధర్మములుగా నిర్ణయించిన ఆచారముల సంకలన మయియున్నది. ధర్మాధర్మములపట్ల శ్రుతికే ప్రాధాన్య మివ్వబడినను వారు ఆశ్రుత్యర్థమును పరిత్యజింపవలసిన దని యెట్లు చెప్పినారు? వారట్లు చెప్పినపుడు మన మిపుడు లోకవిద్విష్టములయినవానిని ఏల విడువరాదు? అని. ఇచ్చట గొంచము చెప్పవలసియున్నది—

ఆమహాత్ములు అధర్మములుగా నిర్ణయించి చెప్పలేదు. అకర్తవ్యములుగా నిర్ణయించి చెప్పినారు. చూడుడు— 'అయం కార్తయుగో ధర్మో న కర్తవ్యః కలౌ యుగే' దేనికి అకర్తవ్యత చెప్పబడునో దానికి అధర్మత్వము చెప్పబడినట్లు కాదు. నిషేధింపబడినది సర్వత్ర అధర్మ మనబడదు. ఏది యనర్థహేతువో అది అధర్మ మనబడును. 'నాతిరాత్రే షోడశినం గృహ్ణాతి' ఇత్యాదు లుదాహరణములు. కనుక కలినిషిద్ధము లధర్మము లనుట తగదు. శ్రుతిని బురస్కరించుకొని ప్రవర్తించిన మహాత్ములు శ్రుత్యర్థమును అధర్మమని చెప్పినా రనుట తగునా?

సంధ్యావందన—అగ్నిహోత్రాది నిత్యకర్మలు శ్రుత్యుక్తములయియున్న వానిని అపవిత్రప్రదేశములందును, గ్రహణ-నిశీథాది కాల

ములయందును, ఆశౌచావస్థయందును చేయబూనువానికి అప్పు డివి యకర్తవ్యము లని చెప్పినవారు ఆకర్మలు అధర్మములు లని చెప్పి నవా రగుదురా ?

యజ్ఞదీక్షలోని నియమముల ననుసరించుట కసమర్థుడై యజ్ఞ మును చేయబూనువానియొక్క అసమర్థతను పరిశీలించి యజ్ఞమిప్పుడు నీవు చేయరాదని చెప్పు హితోపదేశకుడు యజ్ఞ మధర్మమని చెప్పినవా డగునా ? నీకిప్పు డకర్తవ్యమని చెప్పినవాడగునా ? అతని యసమర్థత నెరిగియు నీవు చేయవద్దని చెప్పకున్న యెడల నట్టి యజ్ఞకర్తకు గలుగు దోషమునకు కారకుడగుటచే నీతడు దోషి కావలసివచ్చును.

ఈవిధమున నాలోచింపగా కలియుగములో నిట్టివి చేయవలదని కలియుగాదియందు చెప్పిన మహర్షుల తాత్పర్య మిది—

కలియుగప్రజలు బహుళముగా జనిత్వావస్థపరాయణులు, అజి తేంద్రియులు నయి యుందురు. శ్రాద్ధమాంసాశనమునుబట్టి ఇతర సమయములందును అదియే చేయుదురు. నియోగాచరణమునుబట్టి కామాంధులై చెడిపోవుదురు. ఆవిధమున సంభవించిన దురదృష్టముచే వారు దుఃఖమనుభవింపవలసివచ్చును. అని వారాలోచించి వర్జింపవలసినవాని నుపదేశించినారు. కనుకనే-

'ఏతాని లోకగుప్త్యర్థం కలే రాదౌ మహాత్మభిః ।
నివర్తితాని విద్వద్భి ర్వ్యవస్థాపూర్వకం బుధైః ॥'

లోకరక్షణముకొరకు మహర్షులు వర్జింపవలసినవానిని కలియు గాదియందు బోధించినారని చెప్పబడినది.

కాబట్టి పూర్వయుగములలోనివారికి గల మనశ్శుద్ధి, దేశ-కాల- యోగ్యత, సమర్థత, జితేంద్రియత, శాస్త్రపరాయణత కలవా రవలం బింపవలసిన యాధర్మములు అవి కాని, కలియుగప్రజలు అవలంబింపదగ వనియే కలివర్జ్యప్రకరణమునకు తాత్పర్య మని తెలిసికొనవలెను.

ఇది ధర్మతత్త్వనిర్ణయములోని విషయసంగ్రహము. ఇట్లుండుటను బట్టే ధర్మమునకు మార్పునకలేదు. ఇను తృతీయపాద మయుక్తము.

అనాటి ధర్మము లీనాడు పనికిరా వను చతుర్థవాదమునుగూర్చి—

ఆనాటి ధర్మములు ఆనాటివారికేగాని, యీనాటివారికి పనికి రావను మాట అయుక్తము.

ధర్మప్రమాణభూతము లైన శ్రుతిస్మృతులు ఆనాటివే యీ నాడును ఆశ్రుతిస్మృతిప్రోక్తములైన ధర్మములు ఆనాటివే యీనా డును. ఆధర్మాధర్మఫలముల ననుభవింపజేయు భగవంతుడు ఆనాటివాడే ఈనాడును. ఆధర్మాధర్మనిమిత్తమైన సంసారమందు జననమరణప్రవాహ ములో చిక్కుకొని యున్న జీవులు ఆనాటివారే యీనాడును. ఇట్లు పరిశీలింపగా శ్రుతిస్మృతులు మారలేదు; ధర్మాధర్మస్వరూప ములు, వాని ఫలములు మారలేదు; ఫలదాత యగు భగవంతుడు మార లేదు; జీవులు మారలేదు. ఆధర్మములు ఈనాడేల పనికిరావు ?

పోయిన దేహముతో జీవుడు పోయె నని, పుట్టిన దేహముతో క్రొత్తజీవుడు పుట్టె నని అనుకొనుట అనుభవవిరుద్ధము కూడను. పుట్టినదిమొదలు జీవులలో సుఖదుఃఖాదిప్రభేదములు కనబడుచున్నవి. ఆప్రభేదములకు కారణము కర్మ యనియే చెప్పవలసియున్నది. ఆకర్మ అప్పటిదికాక జన్మాంతరీయ మనవలసియున్నది. ఆకర్మ జన్మాంతరీయ మెప్పుడైనదో ఆకర్మ చేసిన జీవుడును వెనుకటివాడే కావలసియున్నది. కనుకనే 'స జీవో మ్రియతే' అను శ్రుతి మరణ మనునది దేహధర్మము కాని, జీవధర్మము కాదని బోధించుచున్నది.

'భూతగ్రామ స్స ఏవాఽయం భూత్వా భూత్వా ప్రలీయతే।'

అనుచు వెనుకటి జీవులే దేహాంతరధారు లగుచు వచ్చుచున్నా రని గీతలో భగవంతుడే చెప్పియున్నాడు.

మరణించిన జీవులు ఏమేమో చెప్పుచున్నట్లు కొన్ని నిదర్శన ములుకూడ ఆధునికలోకములో గానవచ్చుచున్నవి.

ఆనాటివారు కోరినట్టి సుఖములనే యీనాటివారును కోరుచు ఆసుఖములకు హేతువులుగా ఆనాటివా రవలంబించిన ఆధర్మములు ఈ నాటివారికి పనికిరావనుట అసంగతముకనుక చతుర్థవాదము నిరస్తము.

పంచమపాదమునుగూర్చి—

'అంతరాత్మకు ఏది చేయదగిన సత్కార్య మని తోచునో అది చేయుట ధర్మము' అనుమాట అయుక్తము.

అమరకోశములో—'శ్రుతిః స్త్రీ వేద ఆమ్నాయ స్త్రయీ ధర్మస్తు తద్విధిః' అని వేదవిహితమైనదే ధర్మమని చెప్పబడియుండ, శబ్ద మర్యాదనుకూడ పాటింపకుండ మాటలాడుట అన్యాయము.

ఇంకొకటి—ఇక్కడ అంతరాత్మశబ్దమునకు అంతఃకరణ మనియే అర్థము. ఆ అంతఃకరణము వ్యక్తి కొకటిచొప్పున అందరకును కలదు. అది రాగద్వేషాదిదోషదూషితము; భ్రమప్రమాదములకు స్థానము. అంతఃకరణమునకు తోచిన పనినే ప్రతివ్యక్తియు చేయుచుండుట స్వభావము; ఆతోచులో సత్కార్యమే సత్కార్య మని తోచవచ్చును; దుష్కార్య మనియు తోచవచ్చును. దుష్కార్యము సత్కార్యమని తోచవచ్చు; దుష్కార్య మనియు తోచవచ్చును. ఇట్లు అవ్యవస్థితమైన అంతఃకరణవృత్తినిబట్టి చేసినది ధర్మమగునా? శాస్త్రమునుబట్టి చేసినది ధర్మమగునా? సత్కార్య మను బుద్ధితో దుష్కార్యమును చేసినప్పుడు అది ధర్మమే అని లోకము హర్షించుచున్నదా! కనుక సత్కార్య మని తోచిన పనిని చేయుటె ధర్మ మని చెప్పుట అన్యాయము. ధర్మ నిర్ణయముపట్ల బుద్ధికే ప్రాధాన్య మిచ్చుట అనర్థము.

ఎంతటి బుద్ధియైనను ప్రమాణములను పురస్కరించుకొనకుండ యథాతథముగా విషయమును గ్రహింపజాలదు. ఎంతబుద్ధియున్న వాడయినను చక్షుస్సును పురస్కరించుకొనకుండ వస్తుస్వరూపమును గ్రహింపలేనట్లు మనుజునిది ఎంత బుద్ధియైనను, శాస్త్రమును పురస్కరించుకొనకుండ ధర్మాధర్మస్వరూపమును గ్రహింపనేరదు.

ఒకవేళ గ్రహింపగలిగెనని అది శిక్షావిశేషమునుబట్టియు, శాస్త్రజ్ఞులగు పెద్దల ఆచరణ జూచుటనుబట్టియు, సజ్జనుల బోధలను బట్టియు గ్రహింపవలసినదేకాని బుద్ధి స్వతస్సిద్ధముగా గ్రహింపజాలదు. కనుక శాస్త్రజ్ఞానమువిని లోకసామాన్యముయొక్క వ్యవహారములోని ధర్మాధర్మపరిజ్ఞానమునకైనను మొత్తముమీద శాస్త్రమే మూలాధా

రమై యున్నదని తెలిసికొనవలయును. కామశాస్త్రమం దేమి చెప్ప బడినదో చూడుడు—

'సర్వత్ర హి లోకే కతిచిదేవ శాస్త్రజ్ఞాః, సర్వజనవిషయస్తు ప్రయోగః। ప్రయోగస్య చ దూరస్థ మపి శాస్త్రమేవ హేతుః। అస్తి వ్యాకరణ మితి అవై యాకరణా అపి యాజ్ఞికా ఊహం క్రతుషు ప్రయుంజతే। అస్తి జ్యోతిషమితి పుణ్యాహేషు కర్మ కుర్వతే। తథా అశ్వారోహా గజారోహాశ్చ అశ్వాన్ గజాంశ్చ అనధిగతశాస్త్రా అపి వినయన్తే। తథా అస్తిరాజేతి దూరస్థా అపి జనపదాః న మర్యాదా మతివర్తన్తే తద్వదేతత్॥"

అనగా, లోకములో సర్వవిషయములలోను కొద్దిమందియే శాస్త్రజ్ఞు లుందురు. వారి నాధారముచేసికొని ఆయా వ్యవహారము మాత్రము సర్వజనసాధారణమై యుండును. ఆ సర్వసాధారణమైన వ్యవహారమునకు దూరస్థమైన శాస్త్రమే పరంపరగా హేతువు. వ్యాకరణశాస్త్ర మున్నదికనుకనే వ్యాకరణాధ్యయనము చేయని వారుగూడ సుశబ్దములను ప్రయోగింపగలుగుచున్నారు. వారి సుశబ్ద ప్రయోగమునకు పరంపరగా వ్యాకరణశాస్త్రమే మూలాధారము.

జ్యోతిశ్శాస్త్ర మున్నదిగనుకనే ఆశాస్త్రము జదువనివారు గూడ శుభముహూర్తములలో పనులు చేయుచున్నారు. దానికి జ్యోతిశ్శాస్త్రమే మూలాధారము.

అశ్వశాస్త్ర— గజశాస్త్రములను చదువనివారుకూడ అశ్వము లను గజములను శిక్షించుటలోను, పోషించుటలోను కుశలత కలిగి యున్నారు. దానికి పరంపరగా ఆ శాస్త్రములే మూలాధారము.

ప్రభువుయొక్క మొగమెరుగని యెక్కడనో ఉన్న ప్రజలు కూడ హద్దుమీరక భయభక్తులతో ప్రవర్తించుచుండుటకు పరంపరగా ప్రభువే మూలాధారమైయున్నట్లు లోకానుగతములై యున్న ఆయా వ్యవహారములకు ఆయా శాస్త్రములే పరంపరగా మూలాధారములై యున్నవి. అని భావము.

దీనినిబట్టి ఇది మంచి, ఇదిచెడ్డ అని యుక్తాయుక్తవివేకముతో నడచుచున్న లోకవ్యవహారము పండితపామరసాధారణముగా శాస్త్ర

మూలకమే అయియున్నదికాని, అంతరాత్మ (అంతఃకరణ) మూలకమై యుండలేదు. కనుక పంచమవాద మయుక్తము.

భగవదనుగ్రహపాత్రుడు, భగవత్సఖుడు అగు పార్థునకుగూడ నీయంతరాత్మకు కర్తవ్యమని తోచిన పని నీకు ధర్మము. దానిని నీవు చేయుచుండుము అని భగవంతుడు చెప్పక "తస్మా చ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ" శాస్త్రమునుబట్టియే నీవు కర్తవ్యాకర్తవ్యములను నిర్ణయించుకొనుచుండు మని గట్టిగా చెప్పి యుద్ధము అకార్య మని పార్థుని అంతరాత్మకు తోచియుండగా నీకదియే కర్తవ్య మని శాస్త్రాధారమున శాసించిన భగవంతుని సిద్ధాంతమునకు అత్యంతవిరుద్ధములైన పైఐదు వాదములు ఆస్తికత్వమునకు చెందినవి కావు.

—• ధర్మమునుగూర్చి భిన్నాభిప్రాయములకు కారణము •—

మానవులు సాత్త్వికులు, రాజసులు, తామసులు అని మూడు విధములుగా నుందురు. ప్రపంచమంతయు గుణత్రయాత్మకమే అయినను సత్త్వగుణాధిక్యమున సాత్త్వికులని, రజోగుణాధిక్యమున రాజసులని, తమోగుణాధిక్యమున తామసులని విభాగము. గుణత్రయములో ఏయొక్క గుణ మతిశయించినను అది మిగిలిన రెండింటిని అభిభవించుచుండును. తినెడి ఆహారమునుబట్టియు, చూచెడి విషయములనుబట్టియు, చదివెడి పుస్తకములనుబట్టియు, చేసెడి సాంగత్యములనుబట్టియు ఆయాగుణములు అతిశయించుచుండును.

అందు వాత–పిత్త–శ్లేష్మములు మూడును శారీరదోషములైనట్లు రజస్తమస్సులు రెండును మానసదోషము లని చరకసంహితలో చెప్పబడియున్నది—

"వాయుః పిత్తం కఫశ్చోక్త శ్శారీరో దోషసంగ్రహః ।
మానసః పున రుద్దిష్టో రజశ్చ తమ ఏవ చ ॥"

సత్త్వగుణము ప్రశస్తమైనది. భగవద్గీతలో గుణత్రయవిభాగములో సత్త్వరజస్తమస్సుల లక్షణములు చెప్పబడియున్నవి. దేవీభాగవతములో చెప్పబడిన లక్షణము లిట్లున్నవి—

"యదా సత్త్వం ప్రవృద్ధం వై మతి ర్ధర్మే స్థితా తదా ।
న చిన్తయతి బాహ్యార్థం రజ స్తమస్సముద్భవమ్ ॥
సాత్త్వికే ష్వేవ భోగేషు కామం వై కురుతే సదా ।
యదా రజః ప్రవృద్ధం వై త్యక్త్వా ధర్మాన్ సనాతనాన్ ॥
అన్యథా కురుతే ధర్మాన్ శ్రద్ధాం ప్రాప్య చ రాజసీమ్ ।
యదా తమో వివృద్ధం స్యా దుత్కటం సంభవావహ ॥
తదా వేదే న విశ్వాసో ధర్మశాస్త్రే తథైవ చ ।
ద్రోహం సర్వత్ర కురుతే న శాన్తి మధిగచ్ఛతి ॥
సత్త్వే సమనురాగేణ భావేషు వితతేషు చ ।
సత్త్వం ప్రకాశయితవ్యం నియన్తవ్యం రజ స్సదా ॥
సంహర్తవ్యం తమః కామం జనేన శుభ మిచ్ఛతా ।" (స్క-3. అ7)

సత్త్వగుణ మతిశయించియున్నపుడు బుద్ధి ధర్మబద్ధమై రాజస తామసవిషయములను చింతింపక సాత్త్వికభోగవాంఛనే కలిగి యుండును.

రజోగుణమతిశయించియున్నపుడు బుద్ధి రాజసశ్రద్ధ వహించి సనాతనధర్మములను త్యజించి ధర్మముల నన్యథా చేయుచుండును.

తమోగుణ మతిశయించియున్నపుడు బుద్ధికి వేదశాస్త్రముల యందు విశ్వాసము లేకుండుట, ద్రోహముచేయుచుండుట, స్వేచ్ఛగా ప్రవర్తించుచుండుట, శాంతి లేకుండుట కలుగుచుండును.

శ్రేయస్సు గోరెడి జనులు రజస్తమస్సులను నిగ్రహించి సత్త్వ గుణమును అతిశయింపజేసికొనవలయును. అని తాత్పర్యము.

దీనినిబట్టి సర్వాదరణీయములైన భోజ్యవస్తువులయందు వారి వారికి అరుచి కలుగుచుండుటకు వారివారి శారీరదోషము లనబడు వాతపిత్తాదుల ప్రకోపమే కారణ మగుచుండినట్లు సర్వాదరణీయము లైన వైదికధర్మములయందు వారివారికి అరుచి కలుగుచుండుటకు వారివారి మనోదోషము లనబడు రజస్తమస్సుల ప్రకోపమే కారణ మగుచున్న దని తెలియవచ్చుచున్నది.

రజస్తమస్సులు లోభమోహములనుబట్టి ఉత్కటములగుచుండు ననిచెప్పి శాస్త్రాభ్యాసముచేత సత్త్వగుణ ముత్కట మగుచుండు నని దేవీభాగవతమందే చెప్పబడినది—

"సత్త్వం సముత్కటం జాతం ప్రవృద్ధం శాస్త్రదర్శనాత్ ।
వైరాగ్యం తత్ఫలం జాతం తామసార్థేషు నారద ॥"

శ్రీమద్భాగవతములోగూడ ఉద్ధవునకు కృష్ణభగవానుడు ఉపదేశించుటలో— "సత్త్వం రజస్తమ ఇతి గుణా బుద్ధేర్న చాత్మనః" అని యుపక్రమించి చెప్పుచు ఇట్లు చెప్పెను—

"ఆగమోఽపః ప్రజా దేశః కాలః కర్మ చ జన్మ చ ।
ధ్యానం మన్త్రోఽథ సంస్కారో దశైతే గుణహేతవః ॥
సాత్త్వికాన్యేవ సేవేత పుమాన్ సత్త్వవివృద్ధయే ।
తతో ధర్మస్తతో జ్ఞానమ్ ॥ (స్క. 11. అ 13.)

వ్యాఖ్యా— సాత్త్వికాన్యేవ నివృత్తిశాస్త్రాణ్యేవ సేవేత, న ప్రవృత్తిపాషండశాస్త్రాణి । తీర్థాప ఏవ, న గంధోదకసురాద్యాః । ప్రజాః నివృత్తా జనాన్, న ప్రవృత్తదురాచారాన్ । వివిక్తదేశం, న రథ్యాద్యూతదేశాన్ । కాలం బ్రాహ్మముహూర్తాదికం ధ్యానాదౌ, న ప్రదోషనిశీథాదీన్ । కర్మ చ నిత్యం, న కామ్యాభిచారాదీని । జన్మచ వైష్ణవశైవదీక్షాదిలక్షణం, న శాక్తక్షుద్రదీక్షారూపం । ధ్యానం శ్రీవిష్ణోః, న కామినీవిద్విషామ్ । మన్త్రం ప్రణవాదికం, న కామ్యక్షుద్రాదీన్ । సంస్కారమ్ ఆత్మనస్సంశోధనం, న తు కేవలదేహగృహాదీనామ్ ॥"

అధ్యసింపబడు గ్రంథములనుబట్టియు, ఆస్వాదింపబడు పానీయములనుబట్టియు, అనుసరింపబడు ప్రజలనుబట్టియు, అధిష్ఠింపబడు ప్రదేశములనుబట్టియు, ఆశ్రయింపబడు కాలములనుబట్టియు, అవలంబింపబడు కర్మలనుబట్టియు, ఆదరింపబడు దీక్షలనుబట్టియు, ఆచరింపబడు ధ్యానములనుబట్టియు, ఆమోదింపబడు మంత్రములనుబట్టియు, అభిలషింపబడు సంస్కారములనుబట్టియు ఆయాగుణములకు అభివృద్ధి కలుగుచుండును. అందు సత్త్వగుణాభివృద్ధికరములయిన గ్రంథా

భ్యాసాదులనే మనుజుడు చేయవలెను. అప్పుడే ధర్మము, జ్ఞానము, సిద్ధించును. అని తాత్పర్యము.

దీనిచేత రాజసతామసవిషయములను సేవించుట, అవైదికము లగు నాస్తికగ్రంథములను అభ్యసించుట మొదలగువానిచే రజస్తమస్సులు ప్రకోపించి విరుద్ధభావము లుద్భవించి లోకోద్ధరణహేతువైన ధర్మ మధర్మ మని భావించుట, లోకానర్థకరమైన అధర్మము ధర్మ మని భావించుట అను వికారములను కలిగించుచున్నవని తేలినది. ఇదియే వేదోక్తధర్మమునుగూర్చి విరుద్ధాభిప్రాయములకు కారణము.

వైదికమతప్రాశస్త్యమును గుర్తించుటకై అవైదికమతముల లోని విషయములయొక్క పరిచయము ఒకింత అవసరముగనుక చార్వాకాది నాస్తికమతస్వరూపము సంక్షేపముగా ప్రదర్శింప బడుచున్నది.

# చార్వాకమతము.

ఇది చార్వాకునిచే వ్యాపింపజేయబడిన మతము. ఆ చార్వాకుడు రాక్షసు డనియు, దుర్యోధనసఖుడై యుండువాడనియు మహాభారతములో చెప్పబడియున్నది.

దుర్యోధనుడు భీమసేనగదాఘాతముచే ఊరుభంగమై నేలపై బడియుండి విలపించుచు ఇట్లనుకొనెను—

"యది జానాతి చార్వాకః పరివ్రాడ్వాగ్విశారదః ।
కరిష్యతి మహాభాగో ధ్రువం సోఽపచితిం మమ ॥ (శల్యపర్వ-అ64)
వ్యా-చార్వాకఃబ్రాహ్మణవేషధారీరాక్షసః; అపచితింప్రతీకారమ్"

నేనిట్లయిపోతి నని మా చార్వాకునకు తెలిసినయెడల దీనికి తగిన ప్రతిక్రియను ఆతడు తప్పక చేసితీరును. అని. స్థలాంతరములోగూడ చార్వాకవృత్తాంతము చెప్పబడినది—

యుద్ధానంతరము ధర్మజుడు ఖిన్నుడై నేను రాజ్యము చేయనని కూర్చుండ మహర్షులు మొదలగువారు బోధించి నిర్బంధింప పరప్రేరణచే హస్తినాపురప్రవేశము చేసినతరువాత బ్రాహ్మణోత్త

ష్ఠులగు పాండవులకు హానికలిగించు దుష్టసంకల్పముతో నిర్భీకుడై యుధిష్ఠిరునితో నిట్లనెను—

ఈవిప్రసమూహము అందరును నిన్నుగూర్చి మాటలాడుభారము నాపై బెట్టియున్నారు. జ్ఞాతిక్షయము చేసిన నీవు నింద్యుడవు; నీవు ప్రజాపాలనమునకు తగవు; జ్ఞాతిక్షయము, గురుజనహింస జేసిన నీవు జీవించుటకంటె మరణించుట మేలు. అని.

ఆదుష్టు డిట్టి మాటలాడుచుండ విని బాధపడి విప్రులును, యుధిష్ఠిరుడును తలవంచుకొని మాటాడలేకపోయిరి.

అంతట యుధిష్ఠిరు డిట్లు ప్రార్థించెను—మహనీయులారా! నమస్కారపూర్వకముగా యాచించుచున్న నన్ను మీ రనుగ్రహింపవలెను. నన్ను పరివేష్టించియుండి చిరకాలదుఃఖితులైనట్టి నాసోదరుల దుఃఖపరిహారార్థమే నేని రాజ్యము చేయుటతప్ప ఆత్మసుఖార్థము కాదు. అని.

'తతో రాజన్ బ్రాహ్మణాస్తే సర్వ ఏవ విశాంపతే ।
ఊచు ర్నైత ద్వచోఽస్మాకం శ్రీరస్తు తవ పార్థివ ॥
జజ్ఞు శ్చైవ మహాత్మాన స్తత స్తం జ్ఞానచక్షుషా ।
బ్రాహ్మణా వేదవిద్వాంస స్తపోభి ర్విమలీకృతాః ॥

బ్రాహ్మణా ఊచుః—

ఏష దుర్యోధనసఖా చార్వాకో నామ రాక్షసః ।
పరివ్రాజకరూపేణ హితం తస్య వివక్షతి ॥
న వయం బ్రూమ ధర్మాత్మ న్వ్యేతు తే భయ మీదృశమ్ ।
ఉపతిష్ఠతు కల్యాణం భవన్తం భ్రాతృభి స్సహ ॥
తత స్తే బ్రాహ్మణా స్సర్వే హుంకారైః క్రోధమూర్ఛితాః ।
నిర్భర్త్సయన్త శ్శుచయో నిజఘ్నుః పాపరాక్షసమ్ ॥'

అది విని ఆవిప్రసమూహము లెక్కపెట్టున యుధిష్ఠిరునితో మహారాజా! ఇది మామాటకాదు. నీకు శుభమగుగాక? అని పలికి వేదవేత్తలు, తపస్సంపన్నులు, పరిశుద్ధాంతఃకరణులు అగు ఆవిప్రులు జ్ఞానదృష్టిచే దెలిసికొని యుధిష్ఠిరున కిట్లు చెప్పిరి— యుధిష్ఠిరా! ఈతడు దుర్యోధనసఖుడైన చార్వాకుడను రాక్షసుడు, యతివేషధారియై దుర్యోధనహితార్థియై యిట్లు ప్రసంగించినాడు. ఇవి మామాటలు కావు.

నీవు భయపడకుము. సోదరసహితుడవైన నీకు కల్యాణము కలుగుగాక ! అని చెప్పి చార్వాకోక్తులకు క్రుద్ధులై విప్రులందరును హుంకారములు చేయ చార్వాకుడు చనిపోయెను.

కృష్ణభగవానుడిట్లు చెప్పెను—

'పురా కృతయుగే రాజం శ్చార్వాకోనామ రాక్షసః ।
తప స్తేపే మహాబాహో బదర్యాం బహువార్షికమ్ ॥
వరేణ చ్ఛన్ద్యమానశ్చ బ్రహ్మణా చ పునః పునః ।
అభయం సర్వభూతేభ్యో వరయామాస భారత !
ద్విజావమానా దన్యత్ర ప్రాదా ద్వర మనుత్తమమ్ ॥
అభయం సర్వభూతేభ్యో దదౌ తస్మై జగత్పతిః ।
స తు లబ్ధవరః పాపో దేవా నమితవిక్రమః ॥
రాక్షస స్తాపయామాస తీవ్రకర్మా మహాబలః ।
తతో దేవా స్సమేతాశ్చ బ్రహ్మాణ మిద మబ్రువన్ ॥
వధాయ రక్షస స్తస్య బలవిప్రకృతా స్తదా ।
తా నువాచ తతో దేవో విహిత స్తత్ర వై మయా ॥
యథాఽస్య భవితా మృత్యు రచిరేణేతి భారత! ।
రాజా దుర్యోధనోనామ సఖాఽస్య భవితా నృషు ॥
తస్య స్నేహావబద్ధోఽసౌ బ్రాహ్మణా నవమంస్యతే ।
తత్రైనం రుషితా విప్రా విప్రకారప్రధర్షితాః ।
ధక్ష్యన్తి వాగ్బలాః పాపం తతో నాశం గమిష్యతి ॥
స ఏష నిహత శ్శేతే బ్రహ్మదండేన రాక్షసః .' (శాన్తి అ. 39)

యుధిష్ఠిరా ! ఈచార్వకుడు పూర్వము బదరికాశ్రమందు చాల సంవత్సరములు తపస్సుచేయగా బ్రహ్మ నీకేమి కావలయునని అడుగ నాకు సర్వభూతములనుండియు అభయము (ప్రాణభయములేకుండుట) కావలయునని చార్వాకుడు కోరగా బ్రహ్మ ఒక్క బ్రాహ్మణావమాన మూలకముగా తప్ప మరేవిధమునను ప్రాణభయములేకుండునట్లు వర మిచ్చెను. అక్కడనుండి దేవతలను వరదర్పితుడై పీడింప నారంభించెను. ఆదేవతలు బ్రహ్మతోచెప్పుకొనగా బ్రహ్మ వారికిట్లుచెప్పెను.

ఈ చార్వాకునకు అచిరకాలములో మృత్యువు ప్రాప్తించుటకు తగిన యుపాయము కల్పింపబడినది. దుర్యోధనుడను రాజు

ఈతనికి సఖుడు కాగలడు. ఆ దుర్యోధన సఖ్యమునుబట్టి బ్రాహ్మణావమానమును ఈతడు చేయగలడు. అప్పుడు వారు వాగ్బలమున నీతని దగ్ధముచేయగలరు. అని. అదే విధముగా పాపియగు చార్వాకుడు నిహతుడయ్యెను. అని.

ఇది మహాభారతోక్త చార్వాకవృత్తాంతము. ఈతనిచే వ్యాపింపజేయబడుటనుబట్టి వచ్చినదే చార్వాకమత మను పేరు.

—• చార్వాకమతమునకు బృహస్పతి ప్రవర్తకుడగుట •—

దేవగురువైన బృహస్పతి తనశిష్యులగు దేవతలకు అసురగణమువలన కలుగు బాధలను తొలంగించుట కుపాయ మాలోచించెను. అసురగణము యజ్ఞాదికర్మలను విస్తృతముగా చేసి తన్మూలమున సామర్థ్యోత్సాహములను సంపాదించుచు దేవతలను జయించుచు వచ్చెను. అది చూచి యజ్ఞాదికర్మలయందు ఆ అసురగణమునకు శ్రద్ధ పుట్టకుండుటకును, పుట్టియున్న శ్రద్ధ పోవుటకును, ఆవిధమున వారు నిర్వీర్యులగుటకును ఉపదేశము చేయదలచి అట్టి సూత్రములను రచించెను. అందుచేత చార్వాకమతప్రచారము అసురులయందే బృహస్పతిద్వారా సంభవించినది. బృహస్పతిసూత్రములను బట్టి ఆమతము బృహస్పతికి సమ్మతమే అని యనుకొనుట పొరపాటు.

బృహస్పతి శుక్రాచార్యరూపమును ధరించి దేవశత్రువులగు అసురులకు అవైదికమార్గము నుపదేశించి యజ్ఞాదికర్మలు హింసాయుక్తములగుటచే చేయరాదని యిట్లు బోధించెను- దేవీభాగవతము— స్క-4. అ62.

"భో దేవరిపవ స్సత్యం బ్రవీమి భవతాం హితమ్।
అహింసా పరమో ధర్మోఽహంతవ్యా హ్యాతతాయినః॥

వ్యా— బృహస్పతిమత మాహ— భో దేవరిపవ ఇతి। ఆతతాయినోఽపి అహన్తవ్యా ఇతి ఛేదః। న హన్తవ్యా ఇత్యర్థః।

ద్విజై ర్భోగరతై ర్వేదే దర్శితం హింసనం పశోః।
జిహ్వాస్వాదపరైః కామ మహింసైవ పరా మతా॥

వ్యా—వేదోక్తాపి హింసా న కర్తవ్యేత్యాహ- ద్విజై రితి।"

ఓ దేవశత్రుపులారా! మీహితముగోరి సత్యము చెప్పుచున్నాను. అహింసయే పరమధర్మము. దుష్టులనుగూడ హింసింపరాదు. యజ్ఞములలో వేదమందు బోధింపబడినట్లున్న పశుహింస భోగాసక్తులగు ద్విజులచే ప్రదర్శింపబడినది. అహింసయే సర్వోత్తమము. అని.

ఇట్లు బోధించుచుండగా నసలుశుక్రాచార్యులు వచ్చి విని ఆశ్చర్యపడి యిట్లనుకొనెను—

"ప్రమాణం వచనం యస్య సోఽపి పాఖండధారకః ।
గురుస్సురాణాం సర్వేషాం ధర్మశాస్త్రప్రవర్తకః ॥
అహోఽయమపి సురశ్రేష్ఠో జాతః పాఖండపండితః ।
వంచయత్యతిసంమూఢాన్ దైత్యాన్యాట్యాన్ మహాఽప్యసౌ॥"

దేవతలకు గురుడు, సర్వులకు ధర్మశాస్త్రప్రవర్తకుడు, ప్రామాణికుడు అగు బృహస్పతిగూడ అవైదికమార్గము నుపదేశించు చున్నాడే! తాను ఈ మార్గములోని వాడు కాకుండియు, గురువై యుండియు నిప్పుడు పాఖండపండితుడై మూఢులైన దైత్యులను నాశిష్యులను వంచనచేయుచున్నాడే! అని.

ఇట్లు ఆశ్చర్యపడి అసురులతో ఈతడు నాస్వరూపముతో మిమ్ములను వంచించి యీమార్గము నుపదేశింప వచ్చిన బృహస్పతి. ఈతని మాటలు మీరు వినవద్దు. అసలుశుక్రాచార్యులను నేను. అని యెంత చెప్పినను వినిపించుకొనక కపటవేషధారివై వచ్చిన బృహస్పతివి నీవే యని నిరాకరింప శుక్రాచార్యులు కపించి వెళ్ళిపోయెను. ఆమత మసురులలో వ్యాప్తి జెందెను.

దీనిని బట్టి అంతకు పూర్వము ఏ వైదికమతమును వారవలంబించి యుండిరో ఆమత మన్యాయ్యమని, హేయమని, అవైదికమతము న్యాయమని, ఉపాదేయమని వంచితులై నమ్మి గురుధిక్కారము గూడ జేసినట్లు కనబడుచుండ, నేడు వంచకుల అవైదికమతోపదేశ వాక్యములకు లోబడి పరంపరాగతమైన వైదికమతమును ప్రజలు దూషించి పరిత్యజింపబూనుటలో ఆశ్చర్య మే మున్నది?

## —• మాయామోహోపదేశము •—

విష్ణుపురాణము—అం. 3 అ. 17లో నిట్లు చెప్పబడియున్నది—

ఒకప్పుడు నర్మదానదీతీరమందు దైత్యులు కొందరు వేదోక్త ప్రకారము ఏకాగ్రతతో తపస్సు జేయుచుండిరి. దేవతలు భయపడి శ్రీహరిని శరణు పొంది యిట్లనిరి—

'స్వవర్ణధర్మాభిరతా వేదమార్గానుసారిణః ।
న శక్యా స్తేఽరయో హన్తు మస్మాభి స్తపసా వృతాః ॥'

దేవా! వేదమార్గానువర్తులై, స్వధర్మాసక్తులై, తపోబలసంపన్నులై యుండు దైత్యులను హింసింప నశక్య మగుచున్నది. అని.

అది విని శ్రీహరి తనశరీరమునుండి యొకపురుషుని మాయామోహు డను వాని నుద్భవింపంజేసి యీతని వలన మీకు కార్యసిద్ధి యగునని చెప్పి పంపెను. ఆ మాయామోహుడు తన నామము సార్థక మగునట్లు తపశ్చర్యయందున్న ఆదైత్యులను తన యుక్తులచే వ్యామోహితులను జేసి వైదికమార్గభ్రష్టులను జేసెను. బృహస్పతి ప్రోక్తానుగతములైన మాయామోహోపదేశములను వినివిని విశ్వసించి ఆదైత్యులు తపోదీక్షను విడిచివేసిరి.

"ఏవం ప్రకారై ర్బహుభి ర్యుక్తిదర్శనచర్చితైః ।
మాయామోహేన తే దైత్యా వేదమార్గా దపాకృతాః ॥

వ్యా— ఏవంప్రకారై ర్వాక్యైః యుక్తిదర్శనం శుష్కతర్కవాదః తేన చర్చితైః"

మాయామోహుడు శుష్కతర్కమును వినియోగించి అవైదిక మార్గము లనేక ముపదేశించి వేదమార్గవిశ్వాసహీనులనుగా దైత్యులను చేసివేసెను. అని.

## —• చార్వాకమత సిద్ధాంతములు •—

శ్రీమచ్ఛంకరాచార్యవిరచిత సర్వసిద్ధాంత సంగ్రహము, శ్రీ మాధవాచార్యవిరచిత సర్వదర్శనసంగ్రహము, పురాణసంహిత మొదలగు గ్రంథములయందు ఇట్లున్నది— 1 పృథివి, జలము, అగ్ని, వాయువు అని నాలుగే భూతములు. ఆకాశము లేదు. 2 ప్రత్యక్ష

సిద్ధములైన పదార్థములుమాత్రమే యున్నవి. అప్రత్యక్షపదార్థములు అప్రత్యక్షము గనుకనే లేవు. అందుచేతనే అదృష్ట మనునది లేదు.

3 లోకములో అనుభవింపబడు సుఖదుఃఖములు స్వభావసిద్ధములే అయి యున్నందున వానికి అప్రత్యక్షములు (అదృష్టరూపములు) అయిన ధర్మాధర్మములు కారణమని కల్పింప వీలులేదు. 4 దేహమే ఆత్మ, దేహముకంటె వేరుగా ఆత్మ లేదు. ఆకు, వక్క, సున్నము వీనియొక్క మేళనములో ఎరుపు పుట్టినట్లు పృథివ్యాది భూతవికారములైన దేహములయందు చైతన్యము పుట్టుచున్నది. కనుక చైతన్యము దేహధర్మమే. 5 ఇహలోకముకంటె వేరుగాస్వర్గము నరకము అని చెప్పబడు పరలోకము లేదు. ఉన్నట్లు చెప్పువారు వంచకులు. మృష్టాన్న స్రక్చందనవనితాద్యుపభోగమూలక సుఖమునకే స్వర్గసుఖమని పేరు. శత్రు- శస్త్ర- వ్యాధ్యాది ఉపద్రవమూలక దుఃఖమునకే నరకదుఃఖమని పేరు.

6 దేహ ముననుండి ప్రాణవాయువు పోవుటే మరణము. అట్టి మరణమునకే మోక్షమని పేరు. ఇట్టిదే మోక్షము గనుక దానికై వ్రతోపవాస తపశ్చర్యాది క్లేశము వ్యర్థము.

7 దుర్బలులు స్త్రీలను కాపాడుకొనదలచి తమబుద్ధిబలమున పాతివ్రత్య మను సంకేతమును కల్పించినారు.

8 అన్నదాన, స్వర్ణదాన, భూదానాదులు కుటుంబరులైన దరిద్రులచే కల్పింపబడినవి.

9 సత్ర-కూప-ఆరామ-దేవాలయాది నిర్మాణకర్మలను బాటసారులు మాత్రమే ప్రశంసింతురు.

10 వేద-అగ్నిహోత్ర- భస్మధారణ- సంన్యాసాదులు బుద్ధిపౌరుషహీనులకు జీవనోపాయమాత్రములే.

11 కృషి-గోరక్షణ-వాణిజ్య-దండనీతి- ప్రభృతి దృష్టకార్యములచేతనే భోగములను సదా అనుభవించుచుండవలెను.

12 యజ్ఞములో హింసింపబడిన పశువునకు స్వర్గప్రాప్తి నిజమైనయెడల యజ్ఞముజేయు యజమానుడు తన తండ్రినే హింసించి స్వర్గప్రాప్తి కలిగింపకపోవుటేమి ?

13 మరణించినవారికి శ్రాద్ధము తృప్తికరమగుట నిజమైన యెడల ఇంటియొద్ద పెట్టు శ్రాద్ధముచేత గ్రామాంతరగతులకు తృప్తి కలుగదేమి ?

14 ఇక్కడ చేసిన దానములచేత ఊర్ధ్వలోకములలోనివారికి దృప్తి కలుగుట నిజమైనయెడల మేడలపై నున్నవారికి అన్యులిచ్చిన దానములచేత తృప్తి కలుగదేమి ?

15 మరణించినపుడు దేహమునుండి జీవుడు లోకాంతరమునకు వెళ్ళులే నిజమైనయెడల బంధుస్నేహమునుబట్టి చూచుటకు మరల రాడేమి ?

16 ప్రేతకార్యాదులు జీవనోపాయముగా బ్రాహ్మణులచే కల్పింపబడినవే కాని మరియొకటి కాదు.

17 జీవించునంతకాలము ఋణముచేసియైనను సుఖముగా జీవింపవలయును. దేహము భస్మీభూతమైనపుడు మరల వచ్చుటెట్లు? ఎక్కడికి ?

18 ప్రత్యక్షము కానట్టి లోకములుకాని, దేవుడుకాని, జీవుడుకాని లేదు. జీవుడు లేనందున పుణ్యాపాపములు లేవు. పుణ్యము లేనందున స్వర్గాదిలోకములు లేవు. పాపము లేనందున నరకాదిలోకములు లేవు.

మయూరములకు చిత్రవర్ణము, కోకిలలకు మధురధ్వని. నర—వానర—పశు—పక్షి—క్రిమి—కీటాది సృష్టివైచిత్ర్యము, సుఖదుఃఖతారతమ్యము ఇదంతయు స్వాభావికమే. అని.

ఈవిధమైన సిద్ధాంతములు చార్వాకమతస్థులవై యున్నవి. ఇవన్నియు అసురవంచనార్థము శుక్రాచార్యరూపముతో వెళ్ళి బోధించిన బృహస్పతియొక్కయు, శ్రీవారిచే ఆవిర్భవింపజేయబడి వెళ్ళి అసురులను వైదికమార్గమునుండి తప్పించుటకై బోధించిన మాయామోహునియొక్కయు ఉపదేశసారాంశములే.

ఈవిషయములో 'దేవుడులేడు, జీవుడులేడు' మొదలగు మాటలతోనే నేటి రచనలలో గానవచ్చుచున్నవి.

'ప్రత్యక్షమేకం చార్వాకాః' అని ప్రత్యక్షము తప్ప మరియొక ప్రమాణము నంగీకరింపనిది చార్వాకమతము.

దీనికే లోకాయతమతమనికూడ పేరు. 'లోకే-ఆయతమ్ అనాయాసేన ప్రసృతమితి లోకాయతమ్ ॥'

అనాయాసముగా లోకములో ప్రసరించినది కనుక లోకాయత మనబడుచున్నది.

ఈచార్వాకసిద్ధాంతములు—ప్రత్యక్షైకప్రమాణవాదము, దేహాత్మవాదము, స్వభావవాదము అను వానిపై ఆధారపడియున్నవి. ఈ వాదములు దుష్టములని వైదికవాఙ్మయము యుక్తి-ప్రమాణ-అనుభవ బలములో నిరూపించియున్నది.

—• చార్వాక వాద దోషములు •—

ప్రత్యక్షమే ప్రమాణమనువారు ఇంద్రియములను ప్రత్యక్ష ప్రమాణముగా చెప్పుచున్నారు. ఆయింద్రియములు అప్రత్యక్షములే; శ్రవణేంద్రియము, త్వగింద్రియము, ఘ్రాణేంద్రియము, మొదలగునవి ఉన్నట్లు ఏ యింద్రియములకు ప్రత్యక్ష మగుచున్నది? శబ్దజ్ఞానమునుబట్టి శ్రవణేంద్రియమున్నట్లు, స్పర్శజ్ఞానమునుబట్టి త్వగింద్రియమున్నట్లు, గంధజ్ఞానమునుబట్టి ఘ్రాణేంద్రియమున్నట్లు అనుమానింప (ఊహింప) బడుచున్నది. ఇట్టి స్థితిలో అనుమానప్రమాణ మంగీకరింపని ప్రత్యక్షైకప్రమాణవాదులకు అప్రత్యక్షములైన యింద్రియము లున్నవనుటే అసాధ్య మగుటచే దోషము.

ఈ విషయమే చరకసంహితలో నిట్లు చెప్పబడినది—

'తత్ర బుద్ధిమా న్నాస్తిక్యబుద్ధిం జహ్యాత్ విచికిత్సాం చ। కస్మాత్? ప్రత్యక్షం హ్యల్పమ్। అనల్ప మప్రత్యక్ష మస్తి...యై రేవ తావదిన్ద్రియైః ప్రత్యక్ష ముపలభ్యతే తాన్యేవ సన్తి చాఽప్రత్యక్షాణి...తస్మా దపరీక్షిత మేత దుచ్యతే ప్రత్యక్ష మేవాఽస్తి నాన్య దస్తీతి ॥" అ 11 సూత్రస్థానమ్)

దేహముకంటె వేరుగా జీవాత్మ లేదనువారి కయినను నాదేహమని, నాయింద్రియములని, నాప్రాణములని నామనస్సు అని నా బుద్ధి అని యున్న అనుభవమునుబట్టి దేహేంద్రియాదులకంటె నేను అనబడు జీవాత్మ వేరుగా నున్నట్లు సిద్ధించుచుండుటచేతను, జీవద్దేహ

మందు గోచరించు చైతన్యము శరీరధర్మమె అయినయెడల శరీరమున్నంతవరకు మృతశరీరమందుగూడ చైతన్య ముండవలసియుండ, అట్లు లేకుండుటనుబట్టి అది శరీరధర్మము కాదు, జీవధర్మమే అని చెప్పవలసియుండుటచేతను దేహాత్మవాదము దుష్టము.

స్థిరమైన జీవుడు అస్థిరములైన నర—వానరాదిశరీరముల నాశ్రయించుచు విడిచివేయుచు జనన—మరణప్రవాహమున చిక్కుకొని సుఖదుఃఖము లనుభవించుటలో ఆజీవుని పుణ్యాపాపములే కారణ మని చెప్పక తప్పదు.

జీవునితోబాటు పుణ్యాపాపము లున్నవి. ఆపుణ్యాపాపములతోబాటు వాని ఫల మనుభవింపజేయు దేవు డుండెను. ఫలానుభవస్థానములైన లోకము లుండెను. అని చెప్పక తప్పదు.

విచిత్రమైన జగత్తు స్వభావముచేతనే కలుగుచున్నది. అను మాటకు తన ఉత్పత్తికి తానే కారణ మని యర్థమా? కారణము లేకయే కార్యోత్పత్తి యగుచున్నదని యర్థమా? మొదట పక్షములో తన ఉత్పత్త్యనంతరమందుగాని స్వరూపసిద్ధి లేనట్టి తాను తనఉత్పత్తికే కారణ మగుట యెట్లు?

రెండవపక్షములో కార్యమునకు కారణాపేక్ష లేకుండుట అనుభవవిరుద్ధముగూడను; కార్యార్థులందరును తత్తత్కారణముల నాశ్రయించుచుండుట ప్రత్యక్షసిద్ధము. ధాన్యార్థులు మంచివిత్తనములు, పంటభూమి, వర్షాకాలము అను కారణముల నాశ్రయించి కార్యసిద్ధిని పొందుచున్నారా? కారణాపేక్ష లేకుండ కూర్చుండి కార్యసిద్ధిని పొందుచున్నారా? భోజనజన్యతృప్తి భోజనకారణమున కలుగుచున్నదా? అకారణముగా కలుగుచున్నదా? కనుక నిది అయుక్తము.

కర్త లేకుండ కార్యోత్పత్తి అసంభవముగనుక జగదుత్పత్తిప్రమైన కార్యమునుబట్టి జగత్కర్త కలడని యొప్పుకొని తీరవలెను. ఆ జగత్కర్త, ఆజగత్తులోని జీవకోటియొక్క అదృష్టమనబడు పుణ్యాపాపములను తెలిసికొని వాని ఫలమును ఎవ్వరు ఏయుపాధితో ఏస్థానమందు అనుభవింపవలయునో ఆస్థానమందే ఆరీతిగా వారిని పుట్టింపగల మహాసామర్థ్యము, సర్వజ్ఞత్వముకల పరమేశ్వరు డని చెప్పి తీరవలెను.

కనుక నిట్లు చార్వాకుల స్వభావవాదము అసంగతము.

ఈవిధముగా చార్వాకసిద్ధాంతములకు మూలాధారములైన మూడువాదములును దుష్టములైనవి.

ప్రత్యక్ష మొక్కటే ప్రమాణమను చార్వాకవాదమును అనుమానముకూడ ప్రమాణ మను బౌద్ధులును ఖండించియున్నారు. (ఇది సర్వదర్శనసంగ్రహములో చూడ నగును.)

# బౌ ద్ధ మ త ము.

ఇది యొకప్పుడు మాయామోహునిచేత అసురులలో ప్రవృత్తమైనది. (విష్ణుపురాణ— 3 అం. అ 17.)

నాస్తికమతప్రచారము గావింపబూనిన మాయామోహుని ఉపదేశ మనేకవిధములుగా నున్నది. అందు సర్వసాధారణమైనది యొకటి-యజ్ఞాదికర్మలు పశుహింసాపూర్వకములగుటచే అధర్మము. అహింసయే పరమధర్మము, వేదము ధూర్తప్రలాపమాత్రము. అప్రమాణము. అని.

అది విని అట్లే దృఢముగా నమ్మి తమ పూర్వబుద్ధిని మార్చుకొని వ్యవహరించుచు పరుల కుద్బోధించుచువచ్చినవారు చార్వాకులు. తావన్మాత్రోపదేశముచేత ఎవ్వరియందు తన యభీష్టము సిద్ధింపక పోయెనో వారియందు అపూర్వముగా మరికొన్ని విశేషములను మాయామోహుడు ఉపదేశించుటలో 'బుధ్యధ్వమ్ బుధ్యధ్వమ్' అని బోధింపబడినవారు బౌద్ధులుగను, మరికొందరిలో మరికొన్ని విశేషము లుపదేశించి 'అర్హథ అర్హథ' అని బోధింపబడినవారు ఆర్హతులుగను పరిగణింపబడిరి.

చార్వాక-బౌద్ధ-ఆర్హత-మతములకు అహింసావాదము, యజ్ఞనింద, వేదాప్రామాణ్యము అనునవి సమానములు.

—• కాశీఖండము— బౌద్ధమతప్రచారము •—

ఈ బౌద్ధమతము మరియొకప్పుడు దివోదాసరాజ్యకాలములో విష్ణువునకు రూపాంతరమైన బుద్ధునిచే ప్రవర్తింపచేయబడినది. ఆదివోదాస రాజ్యకాలము 'పాద్మే కల్పే పురావృత్తే మనోః స్వాయంభువేఽన్తరే' అని పాద్మకల్పములోని స్వాయంభువ మన్వంతరమునకు చెందినది.

(కాశీఖండము. అ. ౫౮)

ఆదివోదాసమహారాజు తపోనిష్ఠలో నున్న పరిస్థితిలో దేశము క్షామపీడితము కాగా ఆ యుపద్రవమును తొలగించుటకై రాజ్యపాల కుడవు ధర్మాత్ముడవైన నీవు కావలయు నని దివోదాసమహారాజును బ్రహ్మ ప్రోత్సహించెను. అప్పుడా రాజర్షి యిట్లు చెప్పెను—దేవత లను ప్రజలు ధర్మబద్ధులై యథావిధిగా పూజించుచుండుట, ఆదేవతలు భూతలమందు అడుగుపెట్టకుండ తమ లోకమందె యుండుట, నిశ్ఛిద్ర ముగా నేను రాజ్యముచేయుట. ఈనిర్ణయముపై నేను రాజ్యము చేయుదును. అని.

దానికి బ్రహ్మ అంగీకరించెను. అంతట మహారాజు కాశీపుర మందు నివసించుచు పరిపాలనము చేయుచుండెను. కాశీపురాధీశ్వరు డగు శ్రీవిశ్వేశ్వరుడుకూడ సపరివారముగా తప్పుకొనెను. యోగశక్తు లతో, దివ్యమహిమలతో దివోదాసమహారాజు ధర్మబద్ధముగా ఎట్టి లోపములు రాకుండ పరిపాలనము అద్భుతముగా జరుపుచుండెను.

అట్లు వైదికధర్మశరాయిష్ఠమై నిశ్ఛిద్రముగా నడచుచున్న దివోదాసరాజ్యములోని కాశీపురములో శ్రీ విశ్వేశ్వరప్రవేశము జరు గుటకు ప్రజలలో అధర్మాభిరుచిరూపమైన ఛిద్రమేర్పడవలయును. దానికై ప్రజలలో అట్టి అధర్మోపదేశములు, వ్యామోహింపజేయు నట్టి సర్వసమర్థతలు గల మహాపురుషుని ద్వారా జరుగవలయును. అని యెంచి యిట్టి మార్గ మవలంబింపబడినది— శ్రీహరి పుణ్యకీర్తి యను పేరుతో అతిసుందరమైన బుద్ధరూపమును ధరించెను. శ్రీదేవి లోక వ్యామోహకరమగు పరివ్రాజికాస్వరూపమును ధరించెను. గరుత్మం తుడు వినయకీర్తి అను పేరుతో లోకోత్తరాకృతితో శిష్యరూపమును ధరించెను. ఆపరివ్రాజికయు, శిష్యుడును పుస్తకహస్తులై యుండిరి. శిష్యుడు సంసారనివర్తకమైన ధర్మస్వరూపమునుగూర్చి ప్రశ్నింపగా గురువు బోధించుచుండెను. ఈ విధముగా, లోకులు వచ్చి వినుచుండ బౌద్ధమతధర్మములను అనగా అవైదికమతధర్మములను వివరించుటలో అవి సులభముగా ప్రజలలో వ్యాపించినవి. ఈ విషయ మీ శ్లోకము లలో చెప్పబడినది.

"తతస్తు సౌగతం రూపం శిశ్రియ శ్రీపతిః స్వయమ్ ।
అతీవ సున్దరతరం త్రైలోక్యస్యాపి మోహనమ్ ॥
శ్రీః పరివ్రాజికా జాతా నితరాం సుభగాకృతిః ।
యా మాలోక్య జగత్సర్వం చిత్రన్యస్త మివార్పితమ్ ॥
గరుత్మా నపి తచ్ఛిష్యో జాతో లోకోత్తరాకృతిః ।
గురుశుశ్రూషణపరో న్యస్తహస్తాగ్రపుస్తకః ॥
అపృచ్ఛ త్పరమం ధర్మం సంసారవినిమోచకమ్ ।"

ఆశిష్యుని నిమిత్తముగా జేసికొని ఆగురువు చేసిన ఉపదేశముల లోని ప్రధానాంశములు ఇవి—

బ్రహ్మ— విష్ణు— మహేశ్వరు లనబడువారు మనవంటివారే. వారికి చతుర్ముఖ— చతుర్భుజ— పంచముఖాది స్వరూపవర్ణనము కల్పనామాత్రము.

భీతులకు అభయదానము, వ్యాధిగ్రస్తులకు ఔషధదానము, విద్యార్థులకు విద్యాదానము, క్షుధాతురులకు అన్నదానము, ఈ నాలుగు దానములే చేయవలసినవి. మణి— మంత్ర— ఓషధుల బలము సంపాదించి తన్మూలమున ధనార్జనము చేయవలయును. అట్లు ఆర్జించిన ధనముచే ద్వాదశాయతనపూజనే చేయవలెను. ఇతరపూజలు వ్యర్థము. ద్వాదశాయతనము లనగా పంచకర్మేంద్రియములు, పంచజ్ఞానేంద్రియములు, మనోబుద్ధులు. ఇవియే ద్వాదశాయతనములు. వీని పూజకై అనగా ఇంద్రియతృప్తికై పాటుపడవలయును.

స్వర్గ— నరకములు ఇక్కడనే యున్నవి. మఱెక్కడనో లేవు. సుఖపడుటే స్వర్గము. దుఃఖపడుటే నరకము.

సుఖపడుచున్నప్పుడు శరీరమును విడచుటే ముక్తి, అహింసయే పరమధర్మము.

"ప్రామాణికీ శ్రుతి రియం ప్రోచ్యతే వేదవాదిభిః ।
న హింస్యా త్సర్వభూతాని నాన్యాహింసాప్రవర్తికా ॥
అగ్నిషోమీయ మితి యా శ్రామికా సాऽపసతా మిహ ।
న సా ప్రమాణం జ్ఞాతౄణాం పశ్వాలంభనకారికా ॥"

వ్యాఖ్యా— అహింసా పరమో ధర్మ ఇత్యుక్తం, తచ్ఛ్రుతిసంవాదేన దర్శయతి— ప్రామాణికీతి। నను హింసానివర్తకశ్రుతివద్ధింసాప్రవర్తికాపి కాచి చ్ఛ్రుతి ర్భవిష్యతి ? నేత్యాహ— నాన్యేతి। శ్రుతి రితి శేషః। నను "అగ్నిషోమీయం పశు మాలభేత" "వాయవ్యం శ్వేత మాలభేత" ఇత్యాదికా దృశ్యన్తే ఇతి చేత్తత్రాహ— అగ్నిషోమీయమితి। భ్రామికా భ్రమజనికా అసత్యామితి ఛేదః।

ఇత్యేవం ధర్మజిజ్ఞాసాం పుణ్యాకీర్తౌ ప్రకుర్వతి।
పారంపర్యేణ తచ్ఛ్రుత్వా పౌరా యాత్రాం ప్రచక్రిరే॥"

అహింసయే పరమధర్మ మని ప్రామాణికమైన శ్రుతికూడ చెప్పుచున్నది. యజ్ఞాదికర్మలలో పశుహింసను చేయవలె నని చెప్పుచున్న శ్రుతి అప్రమాణము. అని.

ఈ విధముగా పుణ్యాకీర్తి ధర్మవిచారణ చేయుచుండగా పరంపరగా విని పౌరులు యాత్రగా వెళ్ళుట సాగించిరి.

ఇక ఆ పరివ్రాజిక విజ్ఞానకౌముది యను పేరుతో పురస్త్రీల నాకర్షించినది—

"తత స్తాసాం పురస్తా త్సా బౌద్ధధర్మా నవీవదత్॥"

ఆ పురస్త్రీలకు బౌద్ధధర్మములను బోధించినది. అదియెట్లనగా-

"ఆనందం బ్రహ్మణో రూపం శ్రుత్యైవం య న్నిగద్యతే।
త త్తథై వేహ మన్తవ్యమ్॥

యావ త్స్వస్థ మిదం వర్ష్మ యావ న్నేన్ద్రియవిక్లబః।
యావ జ్జరా చ దూరే స్తి తావ త్సౌఖ్యం ప్రసాధయేత్॥
శరీర మపి దాతవ్య మర్థిభ్యోఽత స్సుఖేప్సుభిః।
యాచమానమనోవృత్తిప్రీణనే యస్య నో జనిః॥
తేన భూ ర్భారవ త్యేషా సముద్రాఽగద్రుమై ర్న హి।
ముధా జాతివికల్పోఽయం లోకేషు పరికల్ప్యతే॥
మానుష్యే సతి సామాన్యే కోఽధమః కోఽథ చోత్తమః।
వర్ణాఽవర్ణవివేకోఽయం తస్మా న్న ప్రతిభాసతే॥

అతో భేదో న మన్తవ్యో మానుష్యే కేన చిత్క్వచిత్ ।
విజ్ఞానకౌముదీవాణీ మిత్యాకర్ణ్య పురాంగనాః ॥
భర్తృశుశ్రూషణవతీం విజహు ర్మతి ముత్తమామ్ ॥"

ఆనందమే పురుషార్థము; అదియే బ్రహ్మస్వరూప మని శ్రుతి కూడ చెప్పుచున్నది. ఈ శరీరము స్వస్థమైయుండగనే, ఇంద్రియములు సమర్థములై యున్నపుడే, యౌవనము దాటిపోకున్నపుడే సౌఖ్యమును సాధింపవలయును.

సుఖమును గోరువారు అర్థులకు తమశరీరమునుగూడ సమర్పింప వలసినదే. యాచకుల మనోరథముల నీడేర్పనివారి జన్మములచేతనే భూభార మగును. జాతిభేదము కల్పనామాత్రమే. మనుష్యు లంద రును ఒకటే. ఉచ్చ– నీచ భావ మెక్కడిది? వర్ణ– అవర్ణ విచ క్షణ వ్యర్థము.

ఇట్టి విజ్ఞానకౌముదీకృతోపదేశములను విని పురాంగనలు ఉత్తమమైనట్టి తమతమ పతిశుశ్రూషణబుద్ధిని విడిచివేసినారు.

"అభ్యస్యాఽఽకర్షణీం విద్యాం వశీకృతిమతీ మపి ।
పురుషా స్సఫలీచక్రుః పరదారేషు మోహితాః ॥
అన్తఃపురచరా నార్య స్తథా రాజకుమారకాః ।
పౌరాః పురాంగనా శ్చాపి సర్వే తాభ్యాం విమోహితాః ॥
కస్మైచి దంజనం దత్తం కస్మైచి త్తిలకౌషధమ్ ।
వశీకరణమన్త్రశ్చ తథా బహవోఽపి దీక్షితాః ॥
ఏవం సర్వేషు పౌరేషు నిజధర్మేషు సర్వథా ।
పరాఙ్ముఖేషు జాతేషు ప్రోల్లలాస వృషేతరః ॥"

పురుషులు వశీకరణశక్తిగల ఆకర్షణీవిద్యను అభ్యసించి పరదారల యందు ప్రవర్తింప నారంభించిరి.

పుణ్యకీర్తి, విజ్ఞానకౌముది అను ఇద్దరి ఉపదేశములచేతను స్త్రీపురుషులు స్వేచ్ఛాసంచారమున కారంభించిరి. ఆ విజ్ఞానకౌముది అంజనము కొందరికి, ఓషధీతిలకము కొందరికి ఇచ్చి వశీకరణమంత్రము లిచ్చి స్త్రీలను బౌద్ధధర్మమందు ప్రవేశింపజేసినది.

ఇట్లు పౌరులు స్వధర్మవిముఖులు కాగా అధర్మము తాండవింప నారంభించినది.

"సిద్ధయోఽకృష్టపచ్యాద్యా నష్టా ఏనఃప్రవేశనాత్ ।
ఆసీ త్కుంఠితసామర్థ్యో నృపోఽపి స మనా ఙ్మనాక్ ॥"(కాశీ.ఉ.అ౮౨)

ప్రజలలో పాపము ప్రవేశించుటచేత దున్నకుండగనే సస్య సంపత్తి మొదలగు సిద్ధులు క్రమముగా క్షీణించినవి. దివోదాసమహా రాజు సామర్థ్యము కొంచెముకొంచెముగా కుంఠితమైపోయినది.

దీనినిబట్టి బౌద్ధమతధర్మములు పాపహేతువు లనియు, అలౌకిక శక్తులను క్షీణింపజేయునట్టివనియు, బౌద్ధవాదమునకు అనుకూలమైనపుడు శ్రుతిస్మృతివాక్యములు ప్రమాణముగా దీసికొనుట, ప్రతికూలమైనపుడు అప్రమాణ మని త్రోసివేయుట లక్షణమనియు, వ్యభిచారము గుణముగనే గ్రహింపబడుట, ఉచ్చనీచములు మానవులలో పాటింపబడకుండుట, ఇంద్రియతృప్తియే పురుషార్థ మనుట బౌద్ధమతమందలి ముఖ్యాంశము లనియు స్పష్టమైనది.

—• శ్రీమద్రామాయణము— బుద్ధమతనింద •—

ఈ అవైదిక (నాస్తిక) మతముయొక్కయు, బుద్ధునియొక్కయు ప్రసక్తి ఆదికావ్య మనబడు వాల్మీకిరామాయణమందు గూడ గలదు.

శ్రీ సీతారామలక్ష్మణులు వనవాసదీక్షను సంకల్పించి చిత్రకూటమునకు చేరియున్నపుడు భరతుడు ప్రార్థించి అయోధ్యకు తీసికొని వెళ్ళదలచి సపరివారముగా మునిబృందపురస్సరముగా వెళ్ళి ప్రార్థించినను అంగీకరింపని రామచంద్రభగవానుని ఎట్లయినను అంగీకరింపజేయవలెనని జాబాలిమహర్షి —

"ఆశ్వాసయన్తం భరతం జాబాలి ర్బ్రాహ్మణోత్తమః ।
ఉవాచ రామం ధర్మజ్ఞం ధర్మాపేత మిదం వచః ॥"

ధర్మజ్ఞుడగు రామచంద్రభగవానునకు వైదికధర్మవిరుద్ధమై నాస్తికమతమునకు చెందిన మాటలు చెప్పెను.

ఆమాటలకు సమాధానము చెప్పుచు శ్రీరామప్రభు విట్లినెను—

"నిన్దా మ్యహం కర్మ పితుః కృతం త
ద్యస్త్వా మగృహ్ణా ద్విషమస్థబుద్ధిమ్ ।
బుద్ధ్యాఽనయైవం విధయా చరన్తం
సునాస్తికం ధర్మపథా దపేతమ్॥"

"యథా హి చోర స్స తథా హి బుద్ధః
తథాగతం నాస్తిక మత్ర విద్ధి ।
తస్మా ద్ధి య శ్శంక్యతమః ప్రజానాం
న నాస్తి కే నాఽభిముఖో బుధ స్స్యాత్॥" (అయోధ్యా.స.109)

వ్యాఖ్యా— ప్రత్యక్షమాత్రప్రమాణవాదీ బుద్ధమతావలంబీ రాజ్యే యది కశ్చి త్సంభవేత్ సోఽపి నిరాకరణీయ ఇత్యాహ-యథా హీతి । చోరో యథా నిరాకరణీయః స వేదబాహ్యత్వేన ప్రసిద్ధో బుద్ధః తథైవ నిరాకరణీయః। అత్ర అస్మిన్ లోకే నాస్తికం చార్వాక మపి తథాగతం బుద్ధతుల్యం విద్ధి। తస్మాత్ ప్రజానాం యః శంక్యతమః అవైదికత్వేన పరిహర్తవ్యః తేన నాస్తికేన బుధః అభిముఖో న స్యాత్ ॥

అవైదికమార్గమునకు చెందిన యిట్టి బుద్ధితో వ్యవహరించుచు వైదికునివలె నటించు నిన్ను పరిగ్రహించిన నాతండ్రికృత్యము గర్హింపదగినది.

వేదప్రామాణ్య మంగీకరింపనట్టి బుద్ధమతావలంబి చోరునివలె నిరాకరింపదగినవాడు. చార్వాకుడును బుద్ధునితో తుల్యుడే. అట్టి వేద బాహ్యుడైన నాస్తికునితో వివేకి వ్యవహరింపరాదు. అని.

దీనినిబట్టి బౌద్ధమతమును, చార్వాకమతమును వేదబాహ్యము లని రామచంద్రభగవానుడు గర్హించినట్లు స్పష్టమైనది.

కొందరు మొన్నటి గౌతమబుద్ధుని ప్రశంస ఆదికావ్యమైన రామాయణములో నుండుట అసంభవముగనుక ఆగ్రంథము ప్రక్షిప్త మని భ్రాంతిపడుచున్నారు. మరికొందరు ప్రక్షిప్త మనక ఆ బుద్ధప్రశం సనుబట్టి గౌతమబుద్ధుని అనంతరమే మహాభారతరచనానంతరము

రామాయణరచన జరిగియుండవచ్చునని తలచుచున్నారు. ఆవిషయ మిదిగో—

'రామాయణము బుద్ధుడు నాస్తికు డని స్మరించియుండుటచే మహాభారతకాలమునకు తరువాతనే రామాయణరచనము జరిగి యుండుననియు, నందలి కథమాత్రము మహాభారతపూర్వగాథయే యై యుండవచ్చుననియు దోచుచున్నది.' (పు. 340 భా. 2)

'మహాభారతము యుద్ధమునకు సమీపకాలమందే రచింపబడి యుండుటచే...వీరగీతమే మొదట భారతమైయుండ నగును. దీని రచనాకాలము క్రీ. పూ. ౧౧౦౦ ప్రాంతమై యుండును.' (పు. 334 భా 2 భారతీయతత్త్వశాస్త్రము.)

ఈవిషయములనుగూర్చి కొంచెము చెప్పవలసియున్నది. రామాయణరచన రామరాజ్యకాలములో జరిగినదని రామాయణశ్లోకమే స్పష్టీకరించుచున్నది. చూడుడు—

'ప్రాప్తరాజ్యస్య రామస్య వాల్మీకి ర్భగవా నృషిః ।
చకార చరితం కృత్స్నం విచిత్రపద మాత్మవాన్ ॥
కృత్వాపి తన్మహాప్రాజ్ఞ స్సభవిష్యం సహోత్తరమ్ ।
చిన్తయామాస కోన్వేత త్ప్రయుంజీయా దితి ప్రభుః ॥ (స. 4)
అనాగతం చ యత్కించి ద్రామస్య వసుధాతలే ।
తచ్చకారోత్తరే కావ్యే వాల్మీకి ర్భగవా నృషిః ॥ (తిల. స. 3)

వ్యాఖ్యా— ప్రాప్తరాజ్యస్యేత్యనేన రామరాజ్యకరణకాలే రామాయణకరణమితి గమ్యతే। ఏతద్ జ్ఞాపనాయైవ పునరారంభః॥'

ఈగ్రంథసందర్భమునుబట్టి అనాగతవేదియగు వాల్మీకిమహర్షి భవిష్యద్గాథతోగూడిన రామచరితమును సాకల్యముగా రామరాజ్య కాలమందే రామాయణరూపమున రచించెనని స్పష్టమగుచున్నందునను, రామరాజ్యము త్రేతాయుగమునకు సంబంధించియున్నందునను, మొన్నటి గౌతమబుద్ధుని తరువాత రామాయణరచన యనుమాట సరియైనది కాదు.

ఇక రెండవది మహాభారతరచన. ఇది యుద్ధమునకు సమీపకాల మందని, క్రీ. పూ. ౧౧౦౦ ప్రాంతమని చెప్పుట యుక్తముకాదు. భారత యుద్ధకాలము మహాభారతమందే విశదీకరింపబడినది. చూడుడు—

'అన్తరేచైవ సంప్రాప్తే కలిద్వాపరయో రభూత్ ।
సమన్తపంచకే యుద్ధం కురుపాండవసేనయోః ॥ (ఆది. అ. 2)

దీనినిబట్టి భారతయుద్ధము కలిద్వాపరసంధిలో అనగా ద్వాప రాంతమున జరిగినట్లు స్పష్టము. ఆంధ్రభారతమందును ఇట్లే యున్నది. చూడుడు—

'తొల్లి కృతత్రేతావసానసమయంబున దేవా-సుర,రామ-రావణ యుద్ధంబులుం బోలె ద్వాపరాంతంబునం బాండవ- ధార్తరాష్ట్రు లకు మహాఘోరయుద్ధం బయ్యె.' (ఆది. ఆ 1.)

మహాభారతరచనగూడ ద్వాపరాంతమందే జరిగినదనియు, అష్టా దశపురాణములను, లక్షగ్రంథాత్మకమహాభారతమును ఒక్క వేదవ్యాస మహర్షియే రచించె ననియు తెలుపుచున్న ప్రమాణవచన మిట్లున్నది-

'అష్టాదశపురాణాని కృత్వా సత్యవతీసుతః ।
భారతాఖ్యాన మకరో ద్వేదార్థై రుపబృంహితమ్ ।
లక్షేణైకేన తత్ప్రోక్తం ద్వాపరాన్తే మహాత్మనా ॥'

మహాభారతము ఒక్కవేదవ్యాసమహర్షిచేత రచితమే అని ఆంధ్రభారతముగూడ బోధించుచున్నది. చూడుడు—

"ఇట్టి మహాభారతంబు ననేకవిధ పదార్థప్రపంచసంచితంబు నుప పర్వమహాపర్వశోభితంబు, నుపద్వీపమహాద్వీప సంభృతంబయిన భువనం బట్టుల నిర్మించినట్లు కృష్ణద్వైపాయనుండు...నిర్మించి."

ఇంతవరకు మహాభారత మేకకర్తృకమని, దాని రచన ద్వాప రాంతమందని విద్వత్సమ్మతమైన ప్రామాణికపద్ధతి ప్రదర్శింపబడినది. ఈవిషయమై భారతీయతత్త్వశాస్త్రములో విరుద్ధముగా వ్రాయబడినది.

"మహాభారతరచనాకాలము మనకు సరిగా దెలియదు. బౌద్ధ మత ముదయించిన కాలమున మహాభారత మున్నదని నిస్సంశయ ముగా జెప్పవచ్చును. దీని మూలస్వరూప మించుమించుగా క్రీ.

పూ. ౯వ శతాబ్దమునాటికి రచింపబడియుండవచ్చునని మెక్డొనల్ భావమై యున్నది. ఇందు బుద్ధుని స్మరణయే లేని కారణమున నై యూహకు బలము కలుగుచున్నది ...... ఈ సాక్ష్యముల నన్నిటిని బట్టి చూడ మహాభారతము బుద్ధునికాలమునాటికి సుస్థాపితమై యున్నదని స్పష్టము. ... క్రి. పూ. ౯వ శతాబ్దానంతరమైనను చాలమంది రచయితలు తమ...భావముల నందు జొప్పించుటకాని, తదనుగుణముగా గొన్ని మార్పులు చేయుటకాని జరుగలేదని నిశ్చయింపజాలము... ఏది ఎట్లున్నను గ్రంథము క్రీ. పూ 500నాటి కేస్థితిలో నున్నదో యిప్పటికి నాస్థితిలో నవిచ్ఛిన్నమై యున్నది.'' (పు 337)

ఇది కేవల మూహాగానముమాత్రమే. ఇక రామాయణము బుద్ధుని స్మరించియుండుటచే గౌతమబుద్ధునకు తరువాతనే రామాయణ రచన యని వెనుక తేల్చినవిషయముకాద—

పూర్వోక్త రామాయణశ్లోకమునకు విరుద్ధమైయున్నది. ఆశ్లోక ప్రకారము త్రేతాయుగమునకు జెందిన రామాయణము మొన్నటి గౌతమబుద్ధుని స్మరించుట విరుద్ధము కాదా? అని ప్రశ్నింపవచ్చును. అందు స్మరింపబడినది గౌతమబుద్ధుని విషయము కాదు. గనుక విరోధము లేదు. ఈ విషయము నిరూపింపబడుచున్నది—

పూర్వోక్త రామాయణశ్లోకములో నున్నవి "బుద్ధ" "తథాగత" శబ్దములు. అవి గౌతమబుద్ధుని బోధించునవి కావు. వేరొకబుద్ధుని బోధించును. ఇంతమంది బుద్ధులున్నారా? అని శంకింపవలసినపనిలేదు. వెనుక జూపబడినట్టి కాశీఖండోక్త బుద్ధుడు, మాయాదేవీసుతుడగు గౌతమబుద్ధుడు కాడనుట నిర్వివాదము కదా.

—: బుద్ధుడు వేఱు, గౌతమబుద్ధుడు వేఱు అనుటకును, బుద్ధనామములు వేఱు, గౌతమబుద్ధనామములు వేఱు అనుటకును అమరసింహుని సాక్ష్యము :—

సర్వజ్ఞః, సుగతః, బుద్ధః, ధర్మరాజః, తథాగతః, సమంతభద్రః, భగవాన్, మారజిత్, లోకజిత్, జినః షడభిజ్ఞః, దశబలః,

అద్వయవాదీ, వినాయకః, మునీంద్రః, శ్రీఘనః, శాస్తా, మునిః "ఈ 18 బుద్ధదేవుని పేర్లు.

శాక్యమునిః, శాక్యసింహః, సర్వార్థసిద్ధః, శౌద్ధోదనిః, గౌతమః, అర్కబన్ధుః, మాయాదేవీసుతః, "ఈ 7 శాక్యముని పేళ్ళు" అని అమరకోశము.

"తస్మా దిక్ష్వాకువంశ్యా స్తే శాక్యా ఇతి భువి స్మృతాః ॥"

అని చెప్పబడుటచే ఇక్ష్వాకువంశీయులైన రాజులకు శాకవన వాసముచే శాక్యులని యొక పేరున్నది. ఆ శాక్యవంశములో జన్మించి నట్టి మునిగనుక శాక్యముని. ఈతడే మాయాదేవీసుతుడును, గౌతముడును అగు గౌతమబుద్ధుడు.

ఈవిభాగమునుబట్టి బుద్ధ-గౌతమబుద్ధులకు భేదమున్న దనియు, కేవల బుద్ధశబ్దము, తథాగతశబ్దము గౌతమబుద్ధుని బోధించునవి కావనియు స్పష్టమైనది.

ఇట్టిస్థితిలో శ్రీమద్రామాయణములోనున్న బుద్ధ, తథాగత శబ్దములు గౌతమబుద్ధుని ఎట్లు చెప్పును? చెప్పినప్పుడు విరోధ మేమున్నది? లేనప్పుడు ప్రక్షిప్తమనికాని, ఆరామాయణము గౌతమబుద్ధానంతరము రచితమనికాని కల్పించుటకు ఆధార మేమున్నది?

వేదమందే విశదీకరింపబడిన నాస్తిక (దేహాత్మ)వాదము, రామాయణమం దుండుటలో ఆశ్చర్య మేమి? వేదమం దెట్లున్నదో చూడుడు-

—• ఛాందోగ్యోపనిషత్తు—దేహాత్మవాదము •—

సురరాజగు ఇంద్రుడును, అసురరాజగు విరోచనుడును ప్రజాపతియొద్ద శుశ్రూషచేసి ఆత్మవిద్యను గ్రహించుటలో ప్రజాపతి సూత్రప్రాయముగా చెప్పుచువచ్చిన వాక్యములకు విరుద్ధార్థము గ్రహించి వారు సంతుష్టులై వెళ్ళిపోవునపుడు ప్రజాపతి యిట్లు పిలిపించి చెప్పెను—

ఆత్మస్వరూపమును యథార్థముగా గ్రహింపక విరుద్ధాభిప్రాయముతో సంతుష్టులై వెళ్ళుచున్న మీవలన దేవతలలోగాని, అసురులలోగాని యెవ్వరికి విరుద్ధాత్మజ్ఞానము సంక్రమించునో వారికి పతనము. అని.

అది విని ఇంద్రుడు సందేహించి వెనుకకువచ్చి మరల శుశ్రూష చేసి ఆత్మయాథార్థ్యమును గ్రహించెను.

విరోచనుడు మాత్రము వెనుకకు రాక సందేహము లేక అసురులయొద్దకు శాంతహృదయుడై వెళ్ళి యిట్లు దేహాత్మవాదము నుపదేశించెను—

"స హ శాన్తహృదయ ఏవ విరోచనోఽసురాన్ జగామ। తేభ్యో హైతా ముపనిషదం ప్రోవాచ। ఆత్మైవేహ మహయ్యః। ఆత్మా పరిచర్యః। ఆత్మాన మేవేహ మహయ న్నాత్మానం పరిచరన్నుభౌ లోకా వవాప్నోతీమం చాఽముం చేతి॥

భాష్యమ్—... ఆత్మైవ దేహ ఇహ లోకే మహయ్యః పూజనీయః। తథా పరిచర్యః పరిచరణీయః। తథాఽఽత్మాన మేవేహ లోకే దేహం మహయన్ పరిచరంశ్చోభౌ లోకా వవాప్నోతి।"

"తస్మా దప్యద్యేహ అదదాన మశ్రద్దధాన మయజమాన మాహు రాసురో బతేతి। అసురాణాం హ్యేషోపనిషత్। ప్రేతస్య శరీరం భిక్షయా వసనేనాఽలంకారేణేతి సంస్కుర్వన్త్యేతేన హ్యముం లోకం జేష్యన్తో మన్యన్తే॥ (అ. 8 ఖం. 8)

భాష్యమ్— తస్మా త్తత్సంప్రదాయోఽద్యా ప్యనువర్తత ఇతి। ఇహ లోకే అదదానం దాన మకుర్వాణ మవిభాగశీల మశ్రద్దధానం సత్కార్యేషు శ్రద్ధారహితం యథా శక్తి అయజమాన మయజనస్వభావ మాహుః। ఆసురః ఖల్వయం। యత ఏవం స్వభావో బతేతి విద్యమానా ఆహు శ్శిష్టాః। అసురాణాం హి యస్మా దశ్రద్దధానతాదిలక్షణైషోపనిషత్। తయోపనిషదా సంస్కృతాస్సన్తః ప్రేతస్య శరీరం కుణపం భిక్షయా గన్ధమాల్యాన్నాదిలక్షణయా, వసనేన వస్త్రాదినా ఆచ్ఛాదనాది ప్రకారేణాఽలంకారేణ ధ్వజపతాకాదికరణేనేత్యేవం సంస్కుర్వన్తి। ఏతేన కుణపసంస్కారేణ అముం ప్రేత్య ప్రతిపత్తవ్యం లోకం జేష్యన్తో మన్యన్తే॥"

ఇచ్చట దేహమే ఆత్మ యని, అదియే పూజనీయ మని, దానికే పరిచర్య చేయవలె నని విరోచనాసురప్రవర్తితమైన యీ సంప్రదాయము లోకములో అనువర్తమాన మగుచున్నదని, దానము చేయకుండుట, సత్కార్యశ్రద్ధ లేకుండుట, యథాశక్తి యజనము (దేవతారాధనము) లేకుండుట ఆసురలక్షణము లని, మృతశరీరమును గంధ-మాల్య- అన్నాదులచేతను, వస్త్రాచ్ఛాదనాదులచేతను సంస్కరించుటయే తరణోపాయమని, అసురసిద్ధాంత మీవిధముగా నున్నదని బోధింపబడినది.

— శ్రుతివాక్యములే అపార్థమునుబట్టి నాస్తికవాదములకు మూలాధారము లగుట —

ఆత్మ యొకటి వేరుగా లేదను నాస్తికులలో కొందరిది దేహాత్మవాదము. వీరికి "స వా ఏష పురుషోఽన్నరసమయః" అను శ్రుతివాక్యము మూలాధారము.

కొందరిది ఇంద్రియాత్మవాదము. వీరికి ఇంద్రియసంవాదములోని "తే హ (చక్షురాదయః) వాచ మూచుః" అనుశ్రుతివాక్యము మూలాధారము.

కొందరిది మన ఆత్మవాదము. వీరికి "మన ఉవాచ" అను శ్రుతివాక్యము మూలాధారము.

కొందరిది విజ్ఞాన(బుద్ధి) ఆత్మవాదము. వీరికి "యోఽయం విజ్ఞానమయః" అను శ్రుతివాక్యము మూలాధారము.

మరికొందరిది శూన్యాత్మవాదము. వీరికి "అస దేవేద మగ్ర ఆసీత్" అను శ్రుతివాక్యము మూలాధారము.

ఇట్లు ఆయా వాస్తికవాదములు ఏకైకశ్రుతివాక్యాధారమున బయలుదేరి యావద్వాక్యసమన్వయము లేక పూర్వవాదముమ ఉత్తరవాదము నిరసించుపద్ధతిని వ్యాప్తి నొందినవి.

అట్లు వేదములోనే నాస్తికవాదములకు మూలమ్ముగా వాక్యము లున్నట్లు కనబడుచుండ, అట్టి వాదములను ఆయా పురుషులు ఆయా కాలములలో ప్రచారము గావించుచున్నట్లు నిదర్శనము లుండ అట్టి వేదమే "వేదః ప్రాచేతసా దాసీ త్సాక్షా ద్రామాయ

ణాత్మనా" అని రామాయణ రూపముతో ఆవిర్భవించినట్లు చెప్పబడి యుండ శ్రీమద్రామాయణములో శ్రీరామప్రభువును వనవాస దీక్షనుండి మరలించుట కుపయుక్తముగా జాబాలిమహర్షి నాస్తిక వాదము నెత్తికొని మాటలాడుట, వైదికధర్మమర్యాదారక్షకు రామచంద్రభగవానుడు దానిని నిందించుట యుక్తమైయున్న దనుటలో సందేహమా? అది ప్రక్షిప్తమనుట, బౌద్ధమతప్రవర్తకుడు గౌతమబుద్ధుడే అనుట అయుక్తము.

—• శబ్ద కల్పద్రుమము— బుద్ధనానాత్వము •—

బుద్ధావతరణస్య వివరణం యథా—

"ఇహ ఖలు బౌద్ధశాస్త్రసమూహేషు సంప్రోక్తాః పంచవింశతి ర్బుద్ధా దృశ్యన్తే। శుద్ధోదనౌరసః మాయాదేవీగర్భజాతః శాక్య సింహ, సర్వార్థసిద్ధ, అర్కబన్ధు, గౌతమ ఇతినామచతుష్టయే ప్రసిద్ధోఽంతిమతమో లోకవిశ్రుతో బుద్ధః."

కపిలవస్తునగరే కలేః చతుశ్శతషడశీత్యధికద్విసహస్ర (2486) మితేషు గతే ష్వబ్దేషు. శుక్రవాసరే సురద్విషాం సమ్మోహనాయ సాక్షాద్వివేకమూర్తిః స్వేచ్ఛావిగ్రహేణ ప్రాదుర్బభూవ। లలితవిస్తర నామకే గ్రన్థేఽస్యేతివృత్తం వర్ణిత మస్తి॥"

దీనినిబట్టి బౌద్ధగ్రంథములలోనే బుద్ధులు ఇరువదియైదుగురు కలరని కనబడుచున్నదనియు, అందు కడపటివాడు గౌతమబుద్ధుడనియు స్పష్టమయినది. కనుక గౌతమబుద్ధునకు ప్రాచీనకాలములో చాలమంది బుద్ధులు గడచినట్లు బౌద్ధగ్రంథములే ప్రతిపాదించుచుండుట వలన రామాయణములోని బుద్ధుడు గౌతమబుద్ధుడు కాక మరియొకడని గ్రహింపవలెను.

—• వ్యాససమ్మత బ్రహ్మసూత్రభాష్య నిర్ణయగ్రంథము- బుద్ధ నానాత్వము •—

"బౌద్ధజైనాదీనాం మతం సార్ధద్విసహస్ర (2500) వర్ష ప్రాచీన గౌతమబుద్ధ-మహావీరయోః పూర్వస్మిన్ కాలేఽపి ఆసీత్ ఇత్యు భయవాదిసమ్మత మేవ।

తథాహి—బౌద్ధగ్రన్థేషు దృశ్యతే—

గౌతమబుద్ధావిర్భావా త్ప్రాక్ ద్వావింశతి ర్బుద్ధా స్సమభవన్। గౌతమస్తు త్రయోవింశః। తత్పశ్చాత్ చతుర్వింశః మైత్రేయో బుద్ధ ఆగమిష్యతీతి ॥

బౌద్ధజాతకాదిగ్రన్థేషు ఇయం కథా సుప్రసిద్ధైవ। ఇయం కథా సువిదితా చ సర్వేషాం విదుషామ్ ॥

జైనమతేఽపి గౌతమబుద్ధసమకాలీనమహావీరాత్పూర్వం ఋషభదేవా దారభ్య త్రయోవింశతిః తీర్థంకరా ఆవిర్బభూవుః। మహావీర స్తత్రాఽన్తిమః ॥

ఏతదపి సర్వేషాం సువిదితమేవ, యత్ పంచసహస్ర వర్షేభ్యః ప్రాక్ కలే రాదౌ వ్యాససమకాలీనః క్రకుచ్ఛన్దనామా కశ్చి ద్బుద్ధ ఆసీత్। తతః కనకమునిః, తతః కశ్యపః, తతో గౌతమో బుద్ధ స్సంజాత ఇత్యపి ప్రసిద్ధమ్। ఏతదర్థం లంకావతారసూత్ర—మహావస్తు—లలితవిస్తర—ప్రభృతయో గ్రన్థా ద్రష్టవ్యాః ॥

వస్తుతః బుద్ధస్య బహుత్వం ప్రసిద్ధమేవ। యథోక్తం లంకావతారే—
కాశ్యపః క్రకుచ్ఛన్దశ్చ కనకశ్చ వినాయకః।
అహంచ విరజో ఽన్యే చ సర్వేతే కృతినో జినాః।
అహం చాన్యే కృతయుగే శాక్యసింహాః కలౌ యుగే ॥"

ఇచ్చట చెప్పబడిన విషయ మిది—

2500 సంవత్సరములకు పూర్వులు గౌతమబుద్ధుడును, జైనమతప్రవర్తకుడగు మహావీరుడును. ఆయిద్దరికి పూర్వకాలమందుగూడ బౌద్ధమతము, జైనమతము ఉన్నదని సర్వసమ్మతము. గౌతమబుద్ధుని యావిర్భావమునకు పూర్వము ఇరువదియిద్దరు బుద్ధులు ఆవిర్భవించినారని, యిరువదిమూడవవాడు గౌతమబుద్ధు డని యిరువదినాల్గవవాడుగా మైత్రేయుడను బుద్ధుడు ఆవిర్భవింపగలడని బౌద్ధజాతకాదిగ్రంథములలో గనబడుచున్నది. జైనమతములోగూడ ఋషభదేవుడు మొదలుకొని గౌతమబుద్ధసమకాలికు డగు మహావీరునివరకు ఇరువదిముగ్గురు తీర్థంకరులు ఆవిర్భవించినారు. అందు కడపటివాడు మహావీరుడు.

ఇంకొకటి. కలియుగమునకు, ఆదియందు వ్యాససమకాలికుడై క్రకుచ్ఛందుడను బుద్ధు డుండెను. ఆపై కనకముని, ఆపై కశ్యపుడు, ఆపై గౌతమబుద్ధుడు ఉద్భవించిరి. ఈ విషయము లంకావతార సూత్రాదిగ్రంథములలో నున్నది. శాక్యసింహు డనబడు గౌతమ బుద్ధుడు కలియుగములోనివాడు. వెనుకటివారు పూర్వయుగములకు సంబంధించినవారు, కృతికర్తలు. అని కూడ ఆగ్రంథములోనున్నది. అని.

దీనికిని, వెనుకటి శబ్దకల్పద్రుమోక్తవిషయమునకును ఈషద్భేద మున్నది. అది ఆ బౌద్ధగ్రంథములలో గలభేదమే అయి యుండును. ఏమయినను బుద్ధనానాత్వములో సందేహము లేదు.

బౌద్ధమత మనాదిగా వచ్చుచున్నది కనుకనే న్యాయదర్శన— పూర్వమీమాంసాదర్శన— వేదాంతదర్శనాదులలో, వ్యాసరచితపురాణ ములలో, వాల్మీకిరామాయణములో, చరకసంహితాదులలో అవైదిక మైన ఆమతము నిరాకరింపబడుచువచ్చినది. ఆమత మొక్క గౌతమ బుద్ధునితోనె ముడిపెట్టి ఆ గ్రంథములన్నియు గౌతమబుద్ధుని తరు వాత వనియో, ఆయంశము లందు ప్రక్షిప్తములనియో చెప్పువారి వాద మసంగతము.

—• శ్రీమద్భాగవతము—బుద్ధావతారము •—

భగవంతుని ఆయాకాలములలోని ఆయాఅవతారములను, ఆయా అవతారకృత్యములను చెప్పుచు ఇరువదియవదిగా శ్రీకృష్ణావ తారమును, భూభారహరణకృత్యమును చెప్పి ఆపై బుద్ధావతార మిట్లు చెప్పబడినది—

"**తతః** కలౌ సంప్రవృత్తే సంమోహాయ సురద్విషామ్ ।
బుద్ధో **నామ్నా**ఽజన(జిన)సుతః కీకటేషు భవిష్యతి ॥

శ్రీధరీయమ్—బుద్ధావతారమాహ—తత ఇతి । అజనస్య సుతః **జినసుత ఇతి** పాఠే జినోఽపి స ఏవ। కీకటేషు మధ్యగయా ప్రదేశే"

ఇచ్చట కలియుగములోనిది బుద్ధావతారమనియు, దేవశత్రు వులను వ్యామోహింపజేయుట (వైదికమార్గమునుండి తొలగించుట) బుద్ధావతారకృత్య మనియు స్పష్టముగా జెప్పబడినది.

భగవంతుని అవతారమే అట్లు విషమబుద్ధిని కలిగించునా? అని శంకింపరాదు. అది దేవతలతో భగవంతుడే చెప్పెను.

హరివంశము—అ. 48.

"అహన్తు దుష్టభావానాం యుష్మాసు సుదురాత్మనామ్ ।
అసమ్యగ్వర్తమానానాం మోహం దాస్యామి దేవతాః ॥
టీ. మోహం విషమబుద్ధిం, యథా ధర్మ మప్యధర్మ ఇతి త్యక్ష్యన్తి,
అధర్మ మపి ధర్మ ఇతి మత్వాఽనుష్ఠాస్యన్తి"

దేవతలయందు విరుద్ధవర్తనముకలిగి, దుస్స్వభావులై యుండు వారికి ధర్మమందు అధర్మబుద్ధిని, అధర్మమందు ధర్మబుద్ధిని పుట్టింతునని భగవంతుడు చెప్పియుండెను.

—: భగవదవతారమైన బుద్ధుని మత మవలంబింపకపోవుట
భగవదపచారము కాదా? అను ప్రశ్నకు
సమాధానము :—

బుద్ధావతార మొక్కటియె గాక శ్రీరామావతారమును, శ్రీకృష్ణావతారమును భగవదవతారములే. శ్రీరామ-శ్రీకృష్ణావతారములు వేదప్రామాణ్యప్రకటనముతో ప్రవర్తించినవి బుద్ధావతారము వేదప్రామాణ్యనిరసనముతో ప్రవర్తించినది.

ఇందు శ్రీరామావతార శ్రీకృష్ణావతారములకు సమ్మతమైనది బుద్ధావతారమునకు సమ్మతము కాదు; బుద్ధావతారమునకు సమ్మతమైనది శ్రీరామావతార-శ్రీకృష్ణావతారములకు సమ్మతము కాదు. ఇట్టి స్థితిలో బుద్ధమత మవలంబింపని వైదికమతస్థులపై ఆపాదింపబడు భగవదపచారము బుద్ధమతస్థులకుమాత్రము లేకపోవు టెట్లు?

విషమబుద్ధిని కలిగించుటకు ఏర్పడినది బౌద్ధమతమని తెలిసినపుడు దానినవలంబింపకుండుట భగవదపచార మెట్లగును? శ్రీరామశ్రీకృష్ణమతవిరుద్ధమైన ఆబౌద్ధమతము నవలంబించుట భగవదపచార మెట్లు కాకుండును? అవతారములలో గూడ విశేషము లున్నవి.

"అవతారా హ్యసంఖ్యేయా హరే స్సత్త్వనిధే ర్ద్విజాః ।
యథాఽవిదాసినః కుల్యాః సరస స్స్యు స్సహస్రశః ॥

శ్రీధరీయమ్—అనుక్తసర్వసంగ్రహార్థ మ్మాహ—అవతారా ఇతి। అసంఖ్యేయత్వే దృష్టాంతః—యథేతి। అవిదాసినః= ఉపక్షయ శూన్యాత్; 'దసు ఉపక్షయే' ఇత్యస్మాత్...
ఋషయో మనవో దేవా మనుపుత్రా మహౌజసః।
కలా స్సర్వే హరే రేవ సప్రజాపతయ స్తథా॥

శ్రీధరీయమ్— విభూతీ రాహ— ఋషయ ఇతి।
ఏతేచాఽంశకలాః పుంసః కృష్ణ స్తు భగవాన్ స్వయమ్।
ఇన్ద్రారివ్యాకులం లోకం మృడయన్తి యుగేయుగే॥ (భాగ.అ.3)

శ్రీధరీయమ్— తత్ర విశేషమాహ— ఏతే చేతి। పుంసః పరమేశ్వరస్య కేచిదంశాః; కేచిత్కలాః; విభూతయశ్చ। తత్ర మత్స్యాదీనా మవతారత్వేన సర్వజ్ఞత్వ సర్వశక్తిమత్త్వేపి యథోపయోగ మేవ జ్ఞానక్రియాశక్త్యావిష్కరణమ్।

కుమార నారదాదిషు ఆధికారికేషు యథోపయోగ మంశ—కలాఽఽవేశః। తత్ర కుమారాదిషు జ్ఞానావేశః। పృథ్వాదిషు శక్త్యావేశః। కృష్ణస్తు భగవాన్ సాక్షాన్నారాయణ ఏవ—ఆవిష్కృత సర్వశక్తికత్వాత్।
సర్వేషాం ప్రయోజనమాహ- ఇంద్రారయో దైత్యాః।
తైః వ్యాకుల ముపద్రుతం లోకం మృడయన్తి సుఖినం కుర్వన్తి॥"

భగవంతుని అవతారములు అసంఖ్యేయములు. అవి అక్షయమైన జలరాశినుండి చిన్నకాలువలువలె పరమేశ్వరుని వలన అసంఖ్యాకముగ ప్రాదుర్భవించుచుండును ఋషులు, మనువులు, దేవతలు, మనుపుత్రులు, ప్రజాపతులు వీరందరును పరమేశ్వరుని కలా (విభూతి) అవతారములే. కొన్ని పరమేశ్వరునకు అంశావతారములును, కొన్ని కలావతారములును. మత్స్యాద్యవతారములయందును సర్వజ్ఞత్వ సర్వశక్తిమత్త్వము లున్నను అవసరమైనంత జ్ఞాన- క్రియా శక్తులే అక్కడ ఆవిష్కృతమ్ము లగుచుండును.

సనత్కుమార- నారదాది ఆధికారికపురుషులయందు జ్ఞానావేశము, పృథుచక్రవర్తి ప్రభృతులయందు శక్త్యావేశము. ఇట్లున్నది.

సర్వశక్తులను ప్రకటించిన శ్రీకృష్ణుడు సాక్షాద్భగవంతుడే. సర్వావతారములకు ప్రయోజనము దైవశత్రుకృతోపద్రవములనుండి లోకమును కాపాడుటే.

వంశీధరీయోక్తవిశేషములు—

"అత్ర ప్రాచాం కారికాః—
నృసింహో జామదగ్న్యశ్చ కల్కిః పురుష ఏవ చ।
భగవత్త్వే చ తత్రాదే రైశ్వర్యస్య ప్రకాశకాః॥
నారదోఽథ తథా వ్యాసో వారాహో బుద్ధ ఏవ చ।
ధర్మాణా మేవ వైవిధ్యా దమీ ధర్మప్రదర్శకాః॥
రామో ధన్వన్తరి ర్యజ్ఞః పృథుః కీర్తిప్రదర్శినః।
బలరామో మోహినీ చ వామనశ్శ్రీప్రధానకాః॥"

"టీకా. శ్రీరత్ర సౌన్దర్యమ్।
దత్తాత్రేయశ్చ మత్స్యశ్చ కుమారః కపిలస్తథా।
జ్ఞానప్రదర్శకా ఏతే విజ్ఞాతవ్యా మనీషిభిః॥
నారాయణో నరశ్చేతి కూర్మశ్చ ఋషభ స్తథా।
వైరాగ్యదర్శినో జ్ఞేయా స్తత్తత్కర్మానుసారతః॥
కృష్ణః పూర్ణషడైశ్వర్యమాధుర్యాణాం మహోదధిః।
అన్తర్భూతసమస్తావతారో నిఖిలశక్తిమాన్ ॥"

గర్గసంహితాయా న్తు—
అంశాంశోఽంశః తథాఽఽవేశః కలా పూర్ణః ప్రకథ్యతే।
వ్యాసాద్యైశ్చ స్మృతః షష్ఠః పరిపూర్ణతమ స్స్వయమ్॥
అంశాంశస్తు మరీచ్యాది రంశో బ్రహ్మాదయ స్తథా।
కలాః కపిలకూర్మాద్యా ఆవేశా భార్గవాదయః॥
పూర్ణో నృసింహో రామశ్చ శ్వేతద్వీపాధిపో హరిః।
వైకుంఠోఽపి తథా యజ్ఞో నరనారాయణ స్స్మృతః॥
పరిపూర్ణతమ స్సాక్షా చ్ఛ్రీకృష్ణో భగవాన్ స్వయమ్।
అసంఖ్యబ్రహ్మాండపతి ర్గోలోకే ధామ్ని రాజతే।
కార్యాధికారం కుర్వన్త స్సదాఽంశా స్తే ప్రకీర్తితాః॥

తస్మాత్కృతావతారం కుర్వన్తః తేఽంశాంశా విదితాః ప్రభోః ।
యేషా మన్తర్గతో విష్ణుః కార్యం కృత్వా వినిర్గతః ॥
తా నావేశావతారాంశ్చ విద్ధి రాజన్ మహామతే ।
ధర్మం విజ్ఞాప్య కృత్వా యః పున రన్తరధీయత ॥
యుగేయుగే వర్తమానం సోఽవతారః కలా హరేః ।
చతుర్వ్యూహో-భవే ద్యత్ర దృశ్యన్తే చ రసా నవ ॥
అతః పరం చ వీర్యాణి స తు పూర్ణః ప్రకథ్యతే ।
యస్మిన్ సర్వాణి తేజాంసి విలీయన్తే స్వతేజసి ।
తం వదన్తి పరం జ్ఞానం పరిపూర్ణతమం స్వయమ్ ॥''

భగవదవతారములలో కొన్ని ఐశ్వర్య (నియంతృత్వ) ప్రకాశకములు, కొన్ని ధర్మప్రదర్శకములు, కొన్ని కీర్తిప్రదర్శకములు, కొన్ని సౌందర్యప్రధానములు, కొన్ని జ్ఞానప్రదర్శకములు, కొన్ని వైరాగ్యప్రదర్శకములు.

ఈ షడ్విధలక్షణములకును, మాధుర్యమునకును మహోదధియై నిఖిలశక్తియుక్తమై సమస్తావతారములను అంతర్భూతము గావించుకొని యున్నది శ్రీకృష్ణావతారము.

అందు నియంతృత్వప్రకాశకములు, నృసింహ- పరశురామ- కల్కి- అవతారములు.

ధర్మప్రదర్శకములు, వ్యాస- నారద- యజ్ఞవరాహ- బుద్ధ- అవతారములు.

కీర్తిప్రదర్శకములు శ్రీరామ- ధన్వంతరి- యజ్ఞపురుష- పృథుచక్రవర్తి- అవతారములు.

సౌందర్యప్రధానములు, బలరామ- మోహినీ- వామన- అవతారములు.

జ్ఞానప్రదర్శకములు, దత్తాత్రేయ- మత్స్య- సనత్కుమార- కపిల- అవతారములు.

వైరాగ్యప్రదర్శకములు, నర- నారాయణ- కూర్మ- ఋషభదేవ- అవతారములు.

ఈ యవతారము లన్నియు ఏకైకప్రధానములు. శ్రీకృష్ణావతారము సమగ్ర సర్వలక్షణ సంపన్నము.

ఇంకొకటి. భగవంతునకు అంశావతారమని, అంశాంశావతారమని, ఆవేశావతారమని, కలావతారమని, పరిపూర్ణావతారమని, పరిపూర్ణతమావతారమని, అవతారములు ఆరువిధములుగా నున్నవి.

అందు భగవదాజ్ఞకు లోనయి సృష్ట్యాది కార్యమం దధికృతులైన బ్రహ్మాదులు అంశావతారములు.

ఆ బ్రహ్మాదుల ఆజ్ఞకు లోనయి కార్యభారమును వహించు మరీచ్యాది ప్రజాపతులు అంశాంశావతారములు.

భగవంతుని శక్తులు ఎవ్వరియందు ఆవిష్టము లగుచుండునో అట్టి పరశురామ-బుద్ధాదులు ఆవేశావతారములు.

ఆవేశము గూడ మహాశక్త్యావేశము, అల్పశక్త్యావేశము అని ద్వివిధము. మహాశక్త్యావేశముకలవి అవతారముగా పరిగణింపబడును. అల్పశక్త్యావేశముకలవి విభూతులుగా పరిగణింపబడును. అట్టి విభూతులను గూర్చియే—

"యద్యద్విభూతిమ త్సత్త్వం శ్రీమ దూర్జిత మేవ వా ।
తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోంశసంభవమ్ ॥"

(భగవద్గీత-10.41)

అని కృష్ణభగవానుడు చెప్పియుండెను.

ఇట్లు ఒకానొక కార్యమునకై తనశక్తిని కొంత ఎవ్వరియందు ప్రవేశపెట్టి కార్యనిర్వహణము గావించి యాశక్తి నుపసంహరించునో అట్టి పరశురామ-బుద్ధాదులు ఆవేశావతారములు.

తత్తదనుగుణమైన ధర్మమును బోధించునట్టి కపిల- కూర్మాదులు కలావతారములు.

**చతుర్వ్యూహాత్మకమైనట్టియు, నవరసములు కాటపట్టయినట్టియు, వీర్యాతిశయాస్పదమయినట్టియు శ్రీరామ- నృసింహ- నరనారాయణ- శ్వేతద్వీపాధిప- యజ్ఞపురుష- వైకుంఠులు పరిపూర్ణావతారములు.**

అసంఖ్యేయ బ్రహ్మాండాధిపతియై, సర్వతేజస్సులను తనతేజస్సులో లీనముచేసికొని జ్ఞానఘనమైయున్న శ్రీ కృష్ణపరమాత్మ పరిపూర్ణతమావతారము. అని.

ఇట్లు భగవంతుని పూర్ణావతారమైన రామచంద్రభగవానుని యొక్కయు, శ్రీకృష్ణభగవానునియొక్కయు, ఉపదేశానుసారము వైదికమత మవలంబించియున్న మనుజులది భగవదపచారము కాదు. దేవశత్రువులను వ్యామోహింపజేసి వైదికమార్గమునుండి దూరము చేసి వారిని నిర్వీర్యులను చేయుటకై భగవంతుని ఆవేశావతారమైనట్టి బుద్ధునియొక్క ఉపదేశము నవలంబించుటే భగవదపచార మగును.

ఇంకొకటి— ఒకవిధమున బుద్ధుడును భగవదవతారమె అయినను, లోకక్షేమకరమైన శక్తికలవాడయినను, శ్రీరామ, శ్రీకృష్ణుల నాశ్రయించి తృప్తిపరచుటలోనే లోకులకు దుఃఖనివృత్తిపూర్వక సుఖప్రాప్తి యగునుకాని వేరొకవిధమున కాదు.

"శక్తిః సమాపి పుర్యాదిదాహే దీపాఽగ్నిపుంజయోః ।
శీతాద్యార్తిక్షయే చాఽగ్నిపుంజా దేవ సుఖం భవేత్ ॥"

అని భాగవతామృతములో చెప్పినట్లు గ్రామములను దగ్ధము చేయు శక్తి దీపమునకును, అగ్నిపుంజమునకును సమానమె అయినను శీతబాధానివృత్తిపూర్వకమైన సుఖము అగ్నిపుంజము నాశ్రయించినపుడే సంభవించునుగాని, దీపము నాశ్రయించిన సంభవింపదు. అట్లే తాపత్రయనివృత్తి, నిరతిశయసుఖప్రాప్తి అగుటకు శ్రీరామ శ్రీకృష్ణులే భజింపదగినవారు. వారిని భజింపకుండుట, వారి యుపదేశములకు బద్ధులుకాకుండుట భగవదపచారము.

—• బుద్ధుని ఉపదేశములు వైదికమతస్థులకు ఆదరణీయములు కాకపోవుటకు కారణములు •—

'హరిభక్తిరసామృతసింధువు' వ్యాఖ్యలో ఇట్లున్నది—

'యేనైవ వేదాదిప్రామాణ్యేన బుద్ధాదీనా మవతారత్వం గమ్యతే, తేనైవ బుద్ధస్య అసురమోహనార్థం పాషండశాస్త్ర ప్రవర్తయితృత్వం చ శ్రూయతే। విష్ణుధర్మాదౌ నిర్గుణస్యాపి

ఖ్యానే తత్రి తు భగవదావేశమాత్రం చోపాఖ్యాయతే। తస్మా త్తదాజ్ఞాపి న ప్రమాణీకర్తవ్యేతి ॥'

ఏవైదికవాఙ్మయముచేత బుద్ధాదులు అవతారపురుషులనిబోధింపబడుచుండెనో ఆవైదికవాఙ్మయముచేతనే బుద్ధుడు అసురమోహనార్థము పాషండశాస్త్రమును (అవైదికమార్గమును) విస్తరింపజేసినట్లు చెప్పబడుచున్నది. బుద్ధుడు భగవంతుని స్వరూపమనికాక, ఆవేశమాత్రమనియే కీర్తింపబడినది. అందుచేత మోహజనకమైన బుద్ధుని ఉపదేశము ప్రమాణీకరింపరాదు. అని.

భగవన్నామములలో 'త్రియుగ' నామ మొకటి కలదు. దానికి కృత-త్రేతా-ద్వాపరము లనబడు మూడుయుగములలో మాత్రమె భగవంతుడు లోకమునకు స్వరూపమును ప్రదర్శించువాడు. అని యర్థము. కలియుగములో స్వరూపమును ప్రదర్శింపడు.

ఈవిషయము శ్రీమద్భాగవతములో ఇట్లు చెప్పబడినది—

"ఇత్థం నృతిర్యగృషిదేవఝషావతారైః
లోకాన్ విభావయసి హంసి జగత్ప్రతీపాన్।
ధర్మం మహాపురుష పాసి యుగానువృత్తం
ఛన్నః కలౌ యదభవస్త్రియుగోఽథ సత్వమ్ ॥" (స్క-7.అధ్యా .38)

వంశీధరీయవ్యాఖ్య—

"సత్యాద్యే త్రియుగే విష్ణు స్సాక్షాద్రూపేణ జాయతే।
గో వేద విప్ర సాధూనాం రక్షణాయ కలౌ తు సః ॥
స్వావేశమేవ కురుతే సాక్షా ద్రూపం పిధాయ చ।
వ్యాజాత్త్వేవ నాస్త్యత్ర త్రియుగత్వ మతో హరేః ॥"

దీనినిబట్టి సాక్షాద్భగవత్స్వరూపమైన త్రేతాయుగములోని శ్రీరామావతారమువంటిదికాని, సాక్షాత్పరిపూర్ణతమావతారమైనద్వాపరములోని శ్రీకృష్ణావతారమువంటిది కాని కలియుగములోని బుద్ధావతారము కాక, అది కేవలము శక్త్యావేశమూలకమె అని స్పష్టమైనది.

ఇట్టి బుద్ధుని ఉపదేశము ప్రమాణవిరుద్ధమగుటచేతను, అసురుల నుద్దేశించియే అది ప్రసారిత మగుటచేతను ఆఅసురులనుగూడ

ర్వా మోహింపజేయుటకే అది యేర్పడుటచేతను పూర్వోక్త ప్రకారము "యథా హి చోర స్స తథా హి బుద్ధః" అని బుద్ధుడు రామ చంద్రభగవానునిచే నిరసింపబడుటచేతను, వేదము అప్రమాణ మని చెప్పిన బుద్ధుని మాట భగవద్గీతోక్త ప్రకారము 'తస్మా చ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ' అని శాస్త్ర మనబడు వేదము పరమప్రమాణమని చాటునట్టి కృష్ణపరమాత్మచే నిరసింపబడుటచేతను, విశ్వరూపప్రదర్శనాదులను బట్టియు,

"అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రలయ స్తథా ।
మత్తః పరతరం నాన్య త్కించి దస్తి ధనంజయ ॥"

ఇత్యాది గీతావాక్యములనుబట్టియు, జగదీశ్వరుడై యున్న కృష్ణ భగవానుడు—

"యే మే మత మిదం నిత్య మనుతిష్ఠన్తి మానవాః ।
శ్రద్ధావన్తోఽనసూయన్తో ముచ్యన్తే తేఽపి కర్మభిః ॥
యే త్వేత దభ్యసూయన్తో నానుతిష్ఠన్తి మే మతమ్ ।
సర్వజ్ఞానవిమూఢాం స్తా న్విద్ధి నష్టా నచేతసః ॥"

అనుచు నామతమును శ్రద్ధాభక్తులతో అనువర్తించునమానవులు తరింతురనియు, అనువర్తింపని వారు చెడిపోవుదురనియు స్పష్టీకరిం చుటచేతను భిన్నకారణములచేత వైదికమతస్థులకు అవైదికములగు బౌద్ధాదిమతములు ఆదరణీయములు కాకపోయినవి.

## —• బుద్ధుని విరుద్ధోపదేశములు-బౌద్ధుల సిద్ధాంతభేదములు •—

బుద్ధుని శిష్యులందరును ఏకసిద్ధాంతము కలిగియుండక, భిన్న భిన్నసిద్ధాంతములు కలవారయినారు. ఆశిష్యులలో మాధ్యమికులని, యోగాచారులని, సౌత్రాన్తికులని, వైభాషికులని, నాలుగు తెగలు ఏర్పడినవి. అది యెట్లనగా—

బుద్ధుడు సూత్రప్రాయముగా నిట్లుపదేశించెను—

'సర్వం క్షణికమ్ 1, సర్వం దుఃఖమ్ 2, సర్వం స్వలక్షణమ్ 3, సర్వం శూన్యం 4, అని. ఇందు మొదటివాక్యముచేత స్థిరమైనది యేదియు లేదనియు, రెండవవాక్యమునుచేత సుఖప్రదమైనది ఏదియు లేదనియు,

మూడవవాక్యముచేత సర్వానుగతమైనది యేదియు లేదనియు, నాల్గవవాక్యముచేత సత్యమైనది యేదియు లేదనియు ప్రతిపాదించిన గురువుచేత సర్వశూన్యత్వమే బోధింపబడినదని గ్రహించి దానిపై ఆక్షేపింపక అది యథార్థమని పరిగ్రహించిన శిష్యులు మధ్యమబుద్ధి కలవారగుటచేత మాధ్యమికులని వ్యవహరింపబడిరి. వీరు సర్వశూన్యత్వవాదులు.

మరికొందరు శిష్యులు, సర్వశూన్యత్వపక్షములో జ్ఞానమునకు గూడ శూన్యత్వమే ఘటస్థించిన జగత్తునకు ఆంధ్యమే ప్రసక్తమైపోవును. గనుక బాహ్యార్థములకే శూన్యత్వమనవలయును. అని పలికిరి. వీరు గురూక్తార్థము నంగీకరించినవారును, అజ్ఞాతార్థజ్ఞానమునకై ఆక్షేపించినవారును అగుటచే యోగాచారులని వ్యవహరింపబడిరి.

"శిష్యేణ హి ద్వయం కరణీయం యోగ ఆచారశ్చేతి। తత్ర అజ్ఞాతార్థస్య జ్ఞానాయాక్షేపో యోగః। గురూక్తార్థస్య అంగీకరణ మాచారః॥"

ఆక్షేపపూర్వకముగా విషయమును తెలిసికొనుటకు యోగమని పేరు, గురూక్తము నంగీకరించుటకు ఆచారమని పేరు. ఇట్టి ఈ యోగాచారులు బాహ్యార్థశూన్యత్వవాదులును, విజ్ఞానమాత్రాస్తిత్వవాదులును.

మరికొందరు శిష్యులు, బాహ్యార్థశూన్యత్వవాదములో విజ్ఞానమునకు అస్తిత్వము చెప్పుటకు వీలులేదని బాహ్యార్థాస్తిత్వమును అంగీకరింపవలసినదే అనిరి. అప్పై గురువు— "భవతునామ బాహ్యార్థః, పరన్తు న స ప్రత్యక్షః, కిన్తు అనుమేయః" అనుచు బాహ్యార్థమున్నను అది అనుమేయమేకాని ప్రత్యక్షము కాదని చెప్పెను.

గురువు సర్వము శూన్యమని యుపదేశించినపుడు విజ్ఞానవాదులచే సర్వశూన్యత్వాసంభవము ప్రశ్నింపబడగా సరే యని జ్ఞానమాత్రాస్తిత్వమును స్వీకరింపుమనుట, బాహ్యార్థాస్తిత్వవాదులచే బాహ్యార్థము శూన్యమైనయెడల జ్ఞానమునకు అస్తిత్వమెట్లని ప్రశ్నింపబడగా బాహ్యార్థాస్తిత్వమును స్వీకరింపుమనుట జూచి 'కియత్పర్యన్తం

సూత్రస్య అన్తో భవిష్యతి' ఇట్లు ఎంతవరకు సూత్రమునకు అంతము (నిశ్చయము) సంభవించును ? అని సూత్రాన్తమును ప్రశ్నించినవారు సౌత్రాన్తికులని వ్యవహరింపబడిరి. వీరు బాహ్యార్థానుమేయత్వవాదులు.

మరికొందరు శిష్యులు, అనుభవబలమున బాహ్యపదార్థమైన ఘటపటాదికము అంగీకరింపబడినట్లు దానికి ప్రత్యక్షబలమున ప్రత్యక్షత్వముకూడ- అంగీకరింపదగినదే. ఇట్టిబాహ్యపదార్థములు, అభ్యన్తరపదార్థములు ప్రత్యక్షము లగుచుండ గురువు మొదట సర్వము శూన్యమని చెప్పుట, తరువాత కొందరికి విజ్ఞానమాత్రాస్తిత్వమును చెప్పుట, తరువాత బాహ్యాభ్యన్తరాస్తిత్వభావనకల కొందరికి అభ్యన్తరము విజ్ఞేయము, బాహ్యమనుమేయము అని చెప్పుట, 'సేయం గురోః విరుద్ధా భాషా' గురువున కిది విరుద్ధభాషణము అనుకొనుటచేత వైభాషికు లని వ్యవహరింపబడిరి.

వీరు బాహ్యార్థప్రత్యక్షత్వవాదులును, సర్వాస్తిత్వవాదులును. ఇట్లు బౌద్ధులలో నాలుగు తెగలు ఏర్పడినవి. వీరందరును ప్రత్యక్ష- అనుమాన ప్రమాణద్వయవాదులే. బౌద్ధుల సంప్రదాయ మిట్లు చెప్పబడినది—

సర్వదర్శనసంగ్రహము—

"ద్వాదశాయతనపూజా శ్రేయస్కరీతి బౌద్ధనయే ప్రసిద్ధమ్—
అర్థానుపార్జ్య బహుశో ద్వాదశాయతనాని వై ।
పరితః పూజనీయాని కిమన్యై రిహ పూజితైః ॥
జ్ఞానేన్ద్రియాణి పంచైవ తథా కర్మేన్ద్రియాణి చ ।
మనో బుద్ధి రితి ప్రోక్తం ద్వాదశాయతనం బుధైః ॥ ఇతి ॥

వివేకవిలాసే బౌద్ధమత మిత్థ మభ్యధాయి—
"బౌద్ధానాం సుగతో దేవో విశ్వం చ క్షణభంగురమ్ ।
ప్రత్యక్ష మనుమానం చ ప్రమాణద్వితయం తథా ॥
చతుఃప్రస్థానికా బౌద్ధాః ఖ్యాతా వైభాషికాదయః ।
కృత్తిః కమండలు ర్మౌండ్యం చీరం పూర్వాహ్ణభోజనమ్ ।
సంఘో రక్తాంబరత్వం చ శిశ్రియే బౌద్ధభిక్షుభిః ॥"

అర్థమార్జించి కర్మేంద్రియములున్, జ్ఞానేంద్రియములున్, మనస్సు-బుద్ధి అనబడు ద్వాదశాయతనములను పూజింపవలయును. అనగా యోగ్యములైన విషయములను సేవించుటద్వారా ఇంద్రియములను పూజింపవలెను. ఇతర పూజలు వ్యర్థములు.

సుగతుడను నామాంతరముకల బుద్ధుడే బౌద్ధులకు దేవుడు. ప్రత్యక్షము అనుమానము రెండే ప్రమాణములు. ఇత్యాదులు— బౌద్ధులకు సంప్రదాయాగతవిషయములు. జగత్కారణ మీశ్వరుడని వీరంగీకరింపరు.

—• వేదాంతదర్శనము- బుద్ధసిద్ధాంతనిరాసనము •—

"సర్వథాఽనుపపత్తేశ్చ" (బ్రహ్మసూత్రమ్)—

శ్రీశాంకరభాష్యమ్— "కిం బహునా, సర్వప్రకారేణ యథా యథా అయం వైనాశికసమయ ఉపపత్తిమత్త్వాయ పరీక్ష్యతే, తథా తథా సికతాకూపవద్విదీర్యత ఏవ। నకాంచిద ప్యత్రోపపత్తిం పశ్యామః। అతశ్చానుపపన్నో వైనాశికతన్త్రవ్యవహారః। అపి చ బాహ్యార్థ- విజ్ఞాన- శూన్య- వాదత్రయ మితరేతరవిరుద్ధ ముపదిశతా సుగతేన స్పష్టీకృత మాత్మనోఽసంబద్ధప్రలాపిత్వమ్। ప్రద్వేషో వా ప్రజాసు విరుద్ధార్థప్రతిపత్త్యా విముహ్యేయు రిమాః ప్రజా ఇతి। సర్వథా ప్యనాదరణీయోఽయం సుగతసమయః శ్రేయస్కామై రిత్యభిప్రాయః॥"

ఈసుగత (బుద్ధ) సిద్ధాంతము ఎంత పరీక్షించినను ఉపపన్నమగుట లేదు. పరీక్షించినకొలది ఇసుకనుయ్యివలె కూలుచున్నది.

అన్యోన్యవిరుద్ధముగా నుపదేశించిన సుగతుని మాటలు అసంబద్ధము లని చెప్పవలెను. లేదా, ఆతడు సర్వజ్ఞుడు అసంబద్ధభాషణము చేయునా? అను పక్షములో వేదబాహ్యులైన ప్రజలయందు ప్రద్వేషముతో విరుద్ధవిజ్ఞానముచే వ్యామోహితులు వారు కావలె నని యే అట్లుపదేశించె నని చెప్పవలెను. ఏవిధమున నయినను సుగతసిద్ధాంతము శ్రేయస్కాములకు ఆదరణీయము కాదని బ్రహ్మసూత్ర తాత్పర్యము. అని.

బ్రహ్మసూత్రములు వేదవ్యాసమహర్షికృతములు. అందు ద్వితీయాధ్యాయద్వితీయపాదములో సముదాయాధికరణ, అభావాధి

కరణము లనబడు రెండధికరణములలో 15 సూత్రము లున్నవి. ఆ సూత్రములకు సంబంధించిన శ్రీశాంకరభాష్యము, ఆ సూత్రములు సుగతసిద్ధాంతనిరసనపరములని విపులముగా ప్రతిపాదించుచున్నవి. భాష్య మనునది సూత్రతాత్పర్యమును నిరూపించునట్టిదే కాని భాష్యకర్త తాత్పర్యము తెలుపునట్టిది కాదనియు, అట్లే అయినచో అది అప్రమాణ మగుననియు తెలిసికొనవలెను. ఇట్టి శ్రీశాంకరభాష్యములో—

"సర్వథాఽనుపపత్తేశ్చ" అను సూత్రములో—"సర్వథా ప్యనాదరణీయోఽయం సుగతసమయః శ్రేయస్కామై రిత్యభిప్రాయః" అన్నట్టి అభిప్రాయము సూత్రకర్త యగు వేదవ్యాసమహర్షి దని శ్రీశంకరభగవత్పాదులు విశదీకరించియున్నారు.

దీనినిబట్టి ఆసుగతసిద్ధాంతము వేదవ్యాసమహర్షి కాలమునకున్న దని స్పష్టమగుచున్నది. సుగతశబ్దము గౌతమబుద్ధ వాచకము కాదని [illegible]ట్లు అమరకోశమునుబట్టి ధ్రువ మగుచున్నది. కనుక శ్రీశాంకరభాష్యఖండితమైన బౌద్ధమతము గౌతమబుద్ధునిమత మేఅనియు, [illegible] ఆగౌతమబుద్ధుడు వేదవ్యాససూత్రములలో చేరుట అసంభవమనియు, తన కాలమునకు ప్రసిద్ధికెక్కిన గౌతమబుద్ధమతమును శ్రీశంకరులు స్వాభిప్రాయముగా ఖండించినారనియు చెప్పు వారిమాటలు ఆదరణీయములు కావు. శ్రుత్యర్థవిచారణాత్మకములైన బ్రహ్మసూత్రములచేత బౌద్ధమతము శ్రుతివిరుద్ధ మని వ్యాసమహర్షి ప్రతిపాదించెను. వ్యాసమహర్షి నాటికి ఆబౌద్ధమత మున్నదని గ్రహింపవలయును.

—• గౌడపాదాచార్యునిది బౌద్ధమతమే అను వారిమాటలకు సమాధానము •—

కొందరిట్లు చెప్పుచున్నారు—గౌడపాదాచార్య గ్రంథములో బౌద్ధమతసాదృశ్యము కనబడుచున్నది. బౌద్ధులు వాడిన శబ్దముల ప్రయోగము కనబడుచున్నది. మంగళాచరణశ్లోకములో—"ద్విపదాం వరమ్" అను మాటచేత బుద్ధునకు వందనము కనబడుచున్నది. ఈ కారణముచేత గౌడపాదాచార్యులు బౌద్ధమతానుయాయి. అని. ఇట్లనుట అయుక్తము.—

గౌడపాదాచార్యునకు వేదాంతాచార్యుడని ప్రసిద్ధి. అట్టి గౌడపాదులు వేదాంతసమ్మతమైన స్వమతమును వర్ణించి బౌద్ధమత మును నిరసించెను. కనుకనే కడపటిశ్లోకములో—'జ్ఞానం నైత ద్బుద్ధేన భాషితమ్' అనుచు స్వమతము బుద్ధమతముకంటె విలక్షణమైన దని విశదీకరించెను.

ఇక్కడ శాంకరభాష్యమం దిట్లున్నది—

"జ్ఞానం జ్ఞేయజ్ఞాతృభేదరహితం పరమార్థతత్త్వ మద్వయ మేత న్న బుద్ధేన భాషితమ్। యద్యపి బాహ్యార్థనిరాకరణం జ్ఞానమాత్ర కల్పనాచాఽద్వయవస్తుసామీప్య ముక్తమ్। ఇదన్తు పరమార్థతత్త్వ మద్వైతం వేదాన్తే ష్వేవ విజ్ఞేయ మిత్యర్థః ॥

ఆగౌడపాదవాక్యమునుగూర్చి ఆనందగిరివ్యాఖ్యలో ఇట్లున్నది-

"జ్ఞానమాత్రం పారమార్థికం, తత్రైవ జ్ఞాతృజ్ఞేయాది కల్పిత మితి సౌగతమత మేన భవతాపి సంగృహీత మిత్యాశంక్యాహ— జ్ఞానమితి ॥"

ఈగ్రంథములచేత గౌడపాదాచార్యోక్తము బౌద్ధమతము కాదని, ఆరెండింటికిని చాల అంతరమున్నదని, ఉపనిషద్విరుద్ధము బౌద్ధమత మని, ఉపనిషదనుబద్ధము గౌడపాదాచార్యమతమని స్పష్టమయినది.

వేదాంతుల విజ్ఞానము—'సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ' 'విజ్ఞాన మానన్దం బ్రహ్మ' ఇత్యాదిశ్రుతిచోదితమైన నిత్య మగు సద్వస్తువు.

బౌద్ధుల విజ్ఞానము క్షణికము. 'యత్ సత్ తత్ క్షణికమ్' అను అనుమానము, 'సర్వం క్షణికమ్' అను బుద్ధవచనము వారి నిర్ణయము నకు ప్రమాణములు.

గౌడపాదాచార్యమతముతో బౌద్ధమతమునకు పోలిక ఎక్కడ నయిన కలదేని అది గౌడపాదాచార్యున కనుకరణ మనవలెను కాని, గౌడపాదునిది బౌద్ధమత మనుట అసంగతము. వేదవ్యాసపుత్రుడగు శుకయోగికి శిష్యుడు గౌడపాదాచార్యుడు—'వ్యాసం శుకం గౌడ పదం మహాన్తమ్' అనువచనము జూడుడు. వ్యాసమహర్షి బ్రహ్మ

సూత్రములలో బౌద్ధమతము అనుపపన్నమని కంఠోక్తిగా చెప్పిన విషయము వెనుక ప్రదర్శింపబడినది. అట్టి వ్యాసమహర్షికి ప్రశిష్యుడగు గౌడపాదాచార్యులు బౌద్ధమతానుయాయి అనుట విరుద్ధము.

ఇంకొకటి-గౌడపాదునిది బౌద్ధమతమే అయిన యెడల బౌద్ధులు తమగ్రంథములలో ఆమాటను చెప్పకుందురా? కనుక గౌడపాదునిది వేదాంతమతమేకాని బౌద్ధమతము కాదు.

బౌద్ధులు వాడిన శబ్దములను గౌడపాదాచార్యులు ప్రయోగించె నను మాట యున్నది. ఆశబ్దములు ప్రాచీనశ్రుత్యాదిశాస్త్ర గ్రంథములలో నున్నవని యేల చెప్పరాదు? ఆవేదాంతాచార్యుని ప్రయోగములనే బౌద్ధులు వాడినారని యేల చెప్పరాదు? కనుక నిదియు అసంగతమే.

ఒక 'ద్విపదాం వరమ్' అను పదముచేత గౌడపాదాచార్యుడు బుద్ధుని నమస్కరించెను. అను మాట యొకటి యున్నది. ఇక్కడ వీరికి బోధింపవలసియున్నది—

ఈ'ద్విపదాం వరమ్' అను పదమునకు బుద్ధు డర్థమనుటకు దగిన ఆధారము లేదు. అమరకోశాదులలో నీశబ్దము బుద్ధపర్యాయములలో చెప్పబడలేదు. అందుచేత నిది యోగరూఢము కాక యౌగికశబ్దమై పురుషశ్రేష్ఠు డను అర్థమునే చెప్పుచున్నది. కనుకనే మహాభారతములో పురుషశ్రేష్ఠులగు నలమహారాజాదులయందు ఈపదము వాడబడినది.

'వివాహం కారయామాస దమయన్త్యా నలస్య చ ।
ఉష్య తత్ర యథాకామం నైషధో ద్విపదాం వరః ।
భీమేన సమనుజ్ఞాతో జగామ నగరం స్వకమ్ ॥" (వనపర్వ- అ.57)

ఇక్కడ 'ద్విపదాంవరః' అను శబ్దము నలమహారాజునందు వాడబడినది. 'నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమమ్' అని యున్న నరోత్తమశబ్దము వంటిదే ఈ'ద్విపదాంవర' శబ్దము.

ఇంకొకటి—'ద్విపదాంవరమ్' అను అర్థము కల 'ద్విపదాం వరిష్ఠమ్' అనుపదము నారదునియందును, నారాయణునియందును మహాభారతములో వాడబడినది చూడుడు—

"స ఏవ ముక్త్వా ద్విపదాం వరిష్ఠో నారాయణో నోత్తమపూరుషేణ । జగాద వాక్యం ద్విపదాం వరిష్ఠం నారాయణం లోక హితాధివాసమ్ ॥" (శాన్తిప. అ. 335)

ఇక గౌడపాదాచార్యశ్లోకము నవలోకింతము—

"జ్ఞానేనాకాశకల్పేన ధర్మాన్ యో గగనోపమాన్ ।
జ్ఞేయాభిన్నేన సంబుద్ధ స్తం వన్దే ద్విపదాం వరమ్ ॥

శాంకరభాష్యమ్-తత్రాఽద్వైతదర్శనసంప్రదాయకర్తు రద్వైతస్వరూపేణైవ నమస్కారార్థోఽయ మాద్యశ్లోకః । ఆచార్యపూజాహ్యభిప్రేతార్థసిద్ధ్యర్థేష్యతే శాస్త్రారంభే...ఆకాశకల్పేన (విభుత్వా దావుపమా) జ్ఞానేన ధర్మాన్ ఆత్మనః గగనోపమాన్, జ్ఞానస్యైవ పునర్విశేషణం జ్ఞేయై ర్ధర్మై రాత్మభి రభిన్న మగ్న్యుష్ణవత్సవితృప్రకాశవచ్చ జ్ఞానం తేన జ్ఞేయాభిన్నేన జ్ఞానేన ఆకాశకల్పేన జ్ఞేయాత్మరూపావ్యతిరిక్తేన గగనోపమాన్ ధర్మాన్ య స్సంబుద్ధ స్సంబుద్ధవానితి । అయమేవేశ్వరో యో నారాయణాఖ్య స్తం వన్దే । ద్విపదాంవరం ద్విపదోపలక్షితానాం పురుషాణాం వరం ప్రధానం; పురుషోత్తమ మిత్యభిప్రాయః ॥

ఆనన్దగిరివ్యాఖ్య—

ఆచార్యో హి పురా [illegible] మే [illegible] నారాయణం భగవన్త ముద్దిశ్య తపో మహ దన్వతిష్ఠత । తతో భగవా నతిప్రసన్న స్తస్మై విద్యాం ప్రాదా దితి ప్రసిద్ధం పరమ గురుత్వం పరమేశ్వర స్యేతి భావః ॥"

ఈభాష్యము, వ్యాఖ్యానము— 'సంబుద్ధ స్తం వన్దే ద్విపదాం వరమ్" అను వాక్యముచేత గౌడపాదాచార్యులు తన తపస్సునకు మెచ్చి ప్రత్యక్షమై తనకు బ్రహ్మవిద్య ననుగ్రహించిన పరమేశ్వరుడగు నారాయణుని నమస్కరించినట్లు, అది సుప్రసిద్ధవిషయమైనట్లు విశదీకరించుచున్నవి.

మరియు—"సంబుద్ధ స్తం వన్దే ద్విపదాంవరమ్" అను వాక్యమందలి సంబుద్ధశబ్దము బుద్ధుని జెప్పు ననుకొనుటకు డ భ్రాంతియే.

'తెలిసినవాడు' అను అర్థములో బుద్ధశబ్దము మహాభారతములో వాడబడుచువచ్చినది—

"ఏవ మేవ మనుష్యేన్ద్రి ధర్మం త్యక్త్వాఽల్పకం నరః।
బృహన్తం ధర్మ మాప్నోతి స బుద్ధ ఇతి నిశ్చితమ్।" (వనప.అ.33)

వ్యాఖ్యా— ఏవమేవ బీజౌపమ్యేన ప్రతిజ్ఞానిర్వాహజమ్ అల్పం ధర్మం త్యక్త్వా రాజ్యలాభజో దానయాగాదిర్మహాన్ ధర్మ ఆదర్తవ్య ఇత్యర్థః॥

ఇది భీమసేనుడు ధర్మరాజునితో చెప్పు మాట. ఇక్కడ విత్తనము లైన కొద్దిధాన్యమును త్యాగముచేసి సస్యముద్వారా ధాన్యరాశిని ఆర్జించినట్లు ప్రతిజ్ఞానిర్వహణ మనెడు స్వల్పధర్మమును త్యజించి రాజ్యలాభమూలకమైన దాన-యాగాది రూపమహాధర్మము సంపాదించువాడే తెలివిగలవాడు. అని చెప్పబడినది. కాబట్టి పూర్వము చెప్పినట్లు అసురవ్యామోహార్థము అవైదికమైన మతమును ప్రవర్తింపజేసిన బుద్ధుని వేదాంతాచార్యుడగు గౌడపాదులు తన గ్రంథములో నమస్కరించె నని చెప్పుట అన్యాయము. శబ్దమర్యాదకు, అనాదిసిద్ధమైన గురుశిష్యసంప్రదాయమునకు విరుద్ధము.

(ఈవిషయము శ్రీచిద్ఘనానన్దపురీవిరచితమైన 'వ్యాససమ్మత బ్రహ్మసూత్రభాష్యనిర్ణయము' అను గ్రంథమునందు చూడదగును.)

—• బౌద్ధమతము—ఆత్మస్వరూపము •—

బౌద్ధులలోని మాధ్యమికుల మతములో వ్యవహారదశలో భాసించు జీవునకు మూలస్వరూపము శూన్యమే. అని.

మిగిలిన బౌద్ధుల మతములో జీవుడు విజ్ఞానస్వరూపము. ఆవిజ్ఞానములు (బుద్ధులు) క్షణికములు. అట్టి క్షణికవిజ్ఞానముల ప్రవాహమే జీవాత్మ. ఆవిజ్ఞానములు ప్రతిక్షణము భిన్నభిన్నములై పుట్టుచు పోవుచుండును గనుక ఆజీవుడనిత్యుడు.

విజ్ఞానభేదముచేత జీవభేదము ఒకవ్యక్తిలోనే తటస్థించినపుడు ఒకని అనుభవములోని విషయమును మరియొకడు స్మరింపలేనట్లు ఒకవ్యక్తికూడ జీవభేదముచేత స్మరించుట అసంభవమగును. అను శంకకు సమాధాన మేమనగా—

పూర్వపూర్వవిజ్ఞానగతములైన సంస్కారములు ఉత్తరోత్తర విజ్ఞానములలో సంక్రమించుచుండును. అందుచేత విజ్ఞానభేదమున్నను సంస్కారజన్యమై పూర్వవిషయస్మరణము కలుగుట కభ్యంతరము లేదు. అని.

అయితే స్మృతిజనకమైనది సంస్కారము. అట్టి సంస్కారము ఏవిజ్ఞానము నాశ్రయించియుండునో ఆవిజ్ఞానము క్షణికమే. ఆసంస్కారముకూడ క్షణికమే. అట్టి స్థితిలో కాలాంతరమందు స్మరణము కలుగుట యెట్లు ? అను ప్రశ్నకు సమాధాన మేమనగా—

సుగంధద్రవ్యముయొక్క వాసన వస్త్రమందు సంక్రమించినట్లు పూర్వవిజ్ఞానసంస్కారము ఉత్తరవిజ్ఞానమందు సంక్రమించుటను బట్టి అదికలుగును అని. అయితే క్షణికవిజ్ఞానాత్మవాదములో సుషుప్తిలో ఆత్మ సిద్ధింపకపోవును—సుషుప్తికి పూర్వము పుట్టిన విజ్ఞానము క్షణిక మగుటచే నశించినది. సుషుప్తిలో విజ్ఞానోత్పత్తి లేదు. ఆత్మ యెట్లు సిద్ధించును? అని యడగెదరేమో వినుడు—ప్రవృత్తివిజ్ఞానము, ఆలయవిజ్ఞానము అని విజ్ఞానము రెండువిధములు. అందు ఘటపటాది విజ్ఞానము ప్రవృత్తివిజ్ఞానము. "అహమ్" అను విజ్ఞానము ఆలయవిజ్ఞానము. ఈఆలయవిజ్ఞానమే ఆత్మ. ఈఆలయవిజ్ఞానము ఉత్తరోత్తరవిజ్ఞానమునకు కారణమగుచుండును. సుషుప్త్యవస్థలోగూడ ఈఆలయవిజ్ఞానధార అబాధితమై యుండును. కనుక సుషుప్తిలోగూడ ఆత్మ సిద్ధించినది. అని. (ఈవిషయముసవ్యాఖ్యసర్వదర్శన సంగ్రహముయొక్క ఉపోద్ఘాతమునందు,సవ్యాఖ్యసిద్ధాంతము క్తావళియందును చూడనగును.) ఈఆలయవిజ్ఞానము గ్రాహ్యగ్రాహకభావము లేదని బుద్ధుని ఉపదేశము. దీనినిబట్టియే అమరకోశములో బుద్ధునిపేర్లు చెప్పునపుడు—'సర్వజ్ఞ స్సుగతో బుద్ధః...అద్వయవాదీ' అని చెప్పబడెను. 'అద్వయమద్వైతం వసత్యవశ్యమ్' 'ఆవశ్యకే' (3-3-170పాణిని)అని అద్వయవాదిశబ్దమునకు వ్యుత్పత్తి చెప్పబడినది. ఇక్కడ అద్వయమనబడు అద్వైతము ఆలయవిజ్ఞానముయొక్క గ్రాహ్యగ్రాహకభావరాహిత్యమేకాని, వేదాంతసమ్మతమైన అద్వైతము కాదు.

బౌద్ధులొప్పిన క్షణికవిజ్ఞానమునకు అనేకత్వము, అనిత్యత్వము కలదు. వేదాంతవిజ్ఞానమునకు ఏకత్వము నిత్యత్వము కలదు. కనుక మహాభేదమున్నదని గ్రహింపవలయును.

(ఈవిషయము 'వ్యాససమ్మత సూత్రభాష్యనిర్ణయము'లో చూడనగును.)

—• బౌద్ధుల విజ్ఞానాత్మవాదముపై దోషములు •—

సిద్ధాంతముక్తావళిలో నిట్లున్నది—

"1 సుషుప్తిలో ఆలయవిజ్ఞానధార యుండు ననియు అది 'అహమ్' అను ఆకారము కలదనియు చెప్పెడి పక్షములో సుషుప్తియందు 'అహమ్ అహమ్' అని భాసింపవలసియుండును. అట్టిది అనుభవములో లేదు. ఆసుషుప్తిలో విషయసంబంధము లేకుండగనే విజ్ఞానసంతతి అనువర్తించుచుండు నందురా? విషయసంబంధము లేనప్పుడు అది జ్ఞాన మనియే అనబడదు.

2 పూర్వవిజ్ఞానసంస్కారము ఉత్తరవిజ్ఞానమందు సంక్రమించుచుండుటనుబట్టి ఒక్కనిలోనే ఆత్మభేదమున్నను స్మరణము కలుగునను పక్షములో తల్లి అనుభవములోని విషయము గర్భస్థునిచేత స్మరింపబడవలసివచ్చును.

ఇంకొకటి— పూర్వవిజ్ఞానముతోబాటు ఆసంస్కారముకూడ ఏక్షణమున కాక్షణమే నశించుచుండును గనుక అది యుత్తర విజ్ఞానమందు సంక్రమించుట అసంభవము." ఇత్యాదులు.

సర్వదర్శనసంగ్రహమందలి 'ఆర్హతదర్శన' మం దిట్లున్నది—

"ముక్తకచ్ఛానాం మత మసహమానా వివసనాః కథం చిత్ స్థాయిత్వ మాస్థాయ క్షణికత్వపక్షం ప్రతిక్షిపన్తి ॥

యద్యాత్మా కశ్చిన్నాఙ్గీక్రియేత స్థాయీ, తదా ఇహలౌకికపారలౌకికఫలసాధన సంపాదనం విఫలం భవేత్, న హ్యేత త్సంభవత్యన్యః కరో త్యన్యో భుంక్తే ఇతి। తస్మా ద్యోఽహం ప్రాక్కర్మాఽకరవం సోఽహం సంప్రతి తత్ఫలం భుఞ్జ ఇతిపూర్వాపర కాలానుయాయినః స్థాయిన స్తస్య స్పష్టప్రమాణావసితతయా...... క్షణికతా పక్షీ క్షకైః రక్షద్భి ర్న పరిగ్రాహ్య'

అనగా ఆత్మ చిరస్థాయికాక ప్రతిక్షణమున కాక్షణమే పుట్టినశించు పక్షములో ఇహపరసాధనసంపాదనము వ్యర్థము. ఒక విజ్ఞానాత్మ కర్మ చేయుట, మరియొకవిజ్ఞానాత్మ దానిఫల మనుభవించుటయునా? 'వెనుక ఇట్టి కర్మచేసిన నేను ఇప్పుడు దానిఫల మనుభవించుచున్నాను' అను లోకానుభవమునుబట్టి పూర్వోత్తరకాలములకు సంబంధించి ఆత్మ స్థాయియై యున్నట్లు స్పష్ట మగుచుండుటవలన ఆత్మకు బౌద్ధులుచెప్పిన క్షణికత్వము పరీక్షకులకు గ్రాహ్యము కాదు. అని అర్థము.

ఇంకను దోషము లిట్లు ఉద్ఘాటింపబడినవి—

"కృతప్రణాశాఽకృతకర్మభోగభవప్రమోక్షస్మృతిభంగదోషాః,
ఉపేక్ష్యసాక్షాత్ క్షణభంగమిచ్ఛ న్నహో మహాసాహసికః పరోఽసౌ।"

క్షణికవిజ్ఞానవాదిబౌద్ధమతములో వచ్చు దోషము లయిదు. 1 కృత ప్రణాశదోషము. 2 అకృతకర్మభోగదోషము. 3 భవభంగదోషము. 4 ప్రమోక్షభంగదోషము 5 స్మృతిభంగదోషము. అవియెట్లనగా—

బౌద్ధులు, క్షణికవిజ్ఞాన (బుద్ధి) పరంపరయే ఆత్మ అని చెప్పుదురు. అంతియకాని ముక్తాహారములోని ముత్తెములన్నిటిలోను అనుస్యూతమై ముత్తెములకంటె వేరుగానుండు సూత్రమువలె ఆక్షణికబుద్ధిపరంపరలో అనుస్యూతమై, ఆబుద్ధిపరంపరకంటె వేరయి ఒకవస్తు వున్నదని చెప్పరు. ఆబుద్ధులు తమసంస్కారములతో ఉత్తరోత్తరబుద్ధులను పుట్టించుచు సక్షణమున కాక్షణమే నశించుచుండునని చెప్పుదురు.

ఇప్పుడు చూడుడు— ఉపాధ్యాయుడు, శిష్యుడు కలరు. ఉపాధ్యాయుని బుద్ధిపరంపరలో క్రమముగా క్షణికములైన అనేకబుద్ధులు పుట్టుచున్నవి. అందు శిష్యున కుపదేశించుకాలములోని క్షణికబుద్ధినుండి బుద్ధిద్వయము పుట్టును. ఒకటి ఉపాధ్యాయునియందును, మరొకటి శిష్యునియందును.

ఆపుట్టిన ఉపాధ్యాయునిబుద్ధి ఆఉపదేశమునకు పూర్వమందైన ఆతనీ క్షణికబుద్ధియొక్క అనుభవములోని విషయమును స్మరింపగలుగునుకదా! అట్లే ఉపాధ్యాయుని ఆపూర్వ బుద్ధినుండియే శిష్యుని

యందు పుట్టిన బుద్ధికూడ ఉపాధ్యాయబుద్ధితోపాటు స్మరింప వలసివచ్చును.

ఇట్లే ఉపాధ్యాయబుద్ధికృతమైన కర్మయొక్క ఫలము శిష్యబుద్ధికిగూడ అనుభూతము కావలసివచ్చును.

ఆస్థితిలో ఉపాధ్యాయుని యేబుద్ధి కర్మచేసినదో ఆబుద్ధి ఆఫలమనుభవింపకుండ నశించుటవలన కర్మ విఫలమగుటలో మొదటి కృతప్రణాశదోషము.

ఆకర్మ చేయని శిష్యునకు దానిఫల మనుభూత మగుటలో రెండవ అకృతకర్మభోగదోషము.

పూర్వజన్మకృతకర్మానుగుణముగా వచ్చునట్టిది సంసారము; ఆత్మ క్షణికమన్నపుడు అట్టిసంసారము అసంభవము గనుక మూడవ భవ(సంసార)భంగదోషము.

పునరావృత్తి లేకుండ కర్మబంధమునుండి ముక్తుడగుటకు ప్రమోక్ష మని పేరు. బౌద్ధమతములో స్థిరమైన ఆత్మ లేనందున మరణానంతరసుఖప్రాప్తికై ప్రయత్నించువాడు లేకపోవుటలో నాల్గవ ప్రమోక్షభంగదోషము.

ఏవిషయమునో అనుభవించిన ఆత్మ ఆక్షణములోనే నశించుటలో ఆవిషయముయొక్క స్మృతి అసంభవముకనుక అయిదవ స్మృతిభంగదోషము.

"కించ క్షణికత్వపక్షే జ్ఞానకాలే జ్ఞేయస్యాఽసత్త్వేన, జ్ఞేయకాలే జ్ఞానస్య చాఽసత్త్వేన గ్రాహ్యగ్రాహకభావానుపపత్తౌ సకలలోకయాత్రాఽస్తమియాత్ ।"

విషయజ్ఞానము కలుగుటలో విషయము కారణము. కారణము కార్యముకంటె పూర్వభావి అయి తీరవలెను. ఇట్టి స్థితిలో పూర్వక్షణమందైన ఘటము ఉత్తరక్షణమందైన జ్ఞానముచే గ్రహింపబడు నని చెప్పవలెనుకాని ఘటము, జ్ఞానము క్షణికములేకనుక ఘటక్షణములో జ్ఞానము, జ్ఞానక్షణములో జ్ఞేయమైన ఘటము లేనందున గ్రాహ్యగ్రాహకభావము లేక లోకవ్యవహారము లోపించును. ఇత్యాదులు.

"...తస్మాన్మ్వ్వరుషార్థాభిలాషుకైః పురుషైః సౌగతీ గతి ర్నానుసర్తవ్యా । అపి త్వార్హత్యేవార్హణీయా ।"

పురుషార్థకాములు ఇట్టి బుద్ధసిద్ధాంతము ననుసరింపక ఆర్హత సిద్ధాంతమునే అనుసరింపవలయును. అని.

# ఆర్హతమతము.

ఇది వెనుక చెప్పినట్లు విష్ణుపురాణోక్తప్రకారము మాయా మోహునిచేత అసురులలో ప్రవర్తింపచేయబడినది.

మరియొకప్పుడు అంగుని పుత్రుడగు వేనునకు శ్రీహరి మహామోహస్వరూపముతో ఈమతము నుపదేశించినట్లును, వేనుడు దాని నవలంబించి వైదికమతమును నిర్మూలింపబూనినట్లును పద్మపురాణమం దున్నది.

పాద్మము—భూమిఖండము. వేనుని తల్లి సునీథ. తండ్రి అంగుడు. అంగుడు వివాహముకాకపూర్వమే శ్రీహరినిగూర్చి తపస్సుచేసి ధర్మాత్ముడు, సచ్చరిత్రుడు నగు పుత్రుడు కలుగునట్లు వరము పొందెను. సునీథ వివాహముకాకపూర్వము ఒకానొక అపచారము చేసి సుశంఖునివలన ఇట్లు శపింపబడెను—

"గార్హస్థ్యం హి సమాస్థాయ సంగో భర్త్రా యదా తదా ।
పాపాచారమయః పుత్రో దేవబ్రాహ్మణనిన్దకః ॥
సర్వపాపరతో దుష్ట స్తవ గర్భా ద్భవిష్యతి" (అ. 30)

నీకు వివాహమైనతరువాత నీగర్భమునుండి పుట్టెడి పుత్రుడు పాపాత్ముడగును. అని.

ఇట్టి ఈ సునీథకును, ఆ అంగునకును వివాహఘటన జరిగినది. వేనుడు పుట్టెను. అతడు "వేదశాస్త్ర మధీత్యైవ...శిష్టాచారేణవర్తతే" (అ 35) వేదశాస్త్రాధ్యయనము చేసి సదాచారసంపన్నుడై రాజ్యాభిషిక్తుడై పాలించుచుండెను. అంతట నొక పురుషుడు వేనునియొద్దకు వచ్చెను.

అతడు నగ్నరూపముతోనుండి నెమలికన్నుల కట్టను చంకబెట్టుకొని, కొబ్బరిచిప్పను పాత్రగా ధరించి వేదశాస్త్రదూషకమైన గ్రంథమును పఠించుచు వచ్చెను. ఆ శ్లోకము లివిగో—

"పురుషః కశ్చి దాయాతో బ్రహ్మలింగధర స్తదా।
నగ్నరూపో మహాకాయ స్సితముండో మహాప్రభః॥
మార్జనీం శిఖిపత్రాణాం కక్షాయాం సహి ధారయన్।
గృహీత్వా పానపాత్రం చ నారికేలమయం కరే॥
పఠమానో మరుచ్ఛాస్త్రం వేదశాస్త్రవిదూషకమ్"

ఇట్లు వచ్చి వేనుని ప్రశ్నలపై ఇట్లు బోధింప నారంభించెను—

"అహం ధర్మస్య సర్వస్వ మహం పూజ్యతమ స్సురైః।
అహం జ్ఞాన మహం సత్య మహం ధాతా సనాతనః॥
అహం ధర్మ మహం మోక్ష స్సర్వదేవమయో హ్యహమ్।
బ్రహ్మదేహా త్సముద్భూత స్సత్యసన్ధోఽస్మి నాన్యథా॥
జినరూపం విజానీహి సత్యధర్మకలేబరమ్।
మమ రూపం హి ధ్యాయన్తి యోగినో జ్ఞానతత్పరాః॥

నేను ధర్మమూర్తిని; దేవలకు పూజ్యుడను; ఈశ్వరుడను. జ్ఞానము, సత్యము, ధర్మము మోక్షము నాస్వరూపమే. సత్యము, ధర్మము శరీరముగా గల జినుడనునేను. యోగులగు జ్ఞానులు నన్ను ధ్యానించుచుందురు.

నీవడుగుచున్నావుకనుక జైనధర్మముయొక్క లక్షణమువినుము.

"అర్హన్తో దేవతా యత్ర నిర్గ్రన్థో గురు రుచ్యతే।
దయా వై పరమో ధర్మ స్తత్ర మోక్షః ప్రదృశ్యతే॥
ఈదృశోఽస్మి న్న సందేహ ఆచారం ప్రవదా మ్యహమ్।
యజనం యాజనం నాపి వేదాధ్యయన మేవ చ॥
నాస్తి సంధ్యా తపో దానం స్వధా స్వాహా వివర్జితమ్।
హవ్యకవ్యాదికం నాస్తి నాస్తి యజ్ఞాదికా క్రియా॥
పితౄణాం తర్పణం నాస్తి నాతిథి ర్వైశ్వదేవికమ్।
కృష్ణస్య న తథా పూజా హ్యర్హ న్తధ్యాన ముత్తమమ్॥
ఏవం ధర్మసమాచారో జైనమార్గే ప్రదృశ్యతే॥
ఆరాధయేద్ధ్రువా దేవం జిన మేకం చరాచరమ్।
మనసా శుద్ధభావేన జిన మేకం ప్రపూజయేత్॥
నమస్కారః ప్రకర్తవ్య స్తస్య దేవస్య నాన్యథా।

మాతాపితోర్ స్తు వై పాదౌ కదా నై వాభివన్దయేత్ ॥
అన్యేషా మేవ కా వార్తా శ్రూయతాం రాజసత్తమ ।"

ఓ వేనభూపతీ ! జిను డను నామాంతరము కల అర్హంతుడే దేవుడును, గురువును. ఆతని వాక్యములే ప్రమాణములు దయయే పరమ ధర్మము. దానిలోనే మోక్షము.

ఇక జైనమతాచారము వినుము—యజనముకాని, యాజనముకాని, వేదాధ్యయనముకాని లేదు; సంధ్యావందనము లేదు; తపస్సు లేదు; దానము లేదు; శ్రాద్ధములు లేవు; హోమములు లేవు; హవ్యకవ్యములు లేవు; యజ్ఞములు లేవు; పితృతర్పణము లేదు; అతిథిపూజ లేదు; వైశ్వదేవము లేదు; శ్రీకృష్ణుని పూజించుటలేదు; అర్హంతునే ధ్యానింపవలెను. ఇది జైనమతాచారము. జినునకే ధ్యానపూజా నమస్కారములు చేయవలెను. తల్లితండ్రుల పాదములకుగూడ వందనము కూడదు. ఇతరులమాట చెప్పనక్కరలేదు. అని.

ఈయుపదేశము వేనభూపతి మనస్సునకు నచ్చినది. అంతట తన పూర్వపద్ధతిని విడిచి వేదములను, వైదికధర్మములను నిందించి వ్యవహరించుచుండ మహర్షులు వచ్చి నీవిట్లు ప్రవర్తించుట యుక్తముకాదు. ప్రజలకు క్షేమకరము కాదు. వైదికమార్గ మనువర్తింపు మని యెంత బోధించినను ధిక్కరించియుండ మహర్షులు దూర మాలోచించి ఆతని పట్టుకొని—

"సవ్యం పాణిం మమన్థు స్తే ...తస్మా జ్జాతో మహా హ్రస్వః"

ఆతని సవ్యహస్తమును మథింప పాపపురుషుడు ఆతనినుండి యీవలకు వచ్చెను. తరువాత—

"మమన్థు ర్దక్షిణం పాణిమ్...తస్మా జ్జజ్ఞే మహాత్మాసౌ... పృథు ర్నామ మహాప్రాజ్ఞః"

దక్షిణహస్తమును మథింప పృథుచక్రవర్తి ఆవిర్భవించెను.

ఆపై వేనుడు పుణ్యాత్ముడై భగవంతునిగూర్చి చేసినతపస్సునకు మెచ్చి ప్రీత్యాత్ముడై భగవంతు డిట్లనెను.

"సాధు భూప మహాభాగ పాపం తే నాశ మాగతమ్।
తవ మాత్రే పురా దత్తః శాపః క్రుద్ధేన భూపతే ॥

సుశంఖేన సునీథాయై బాల్యే పూర్వం మహాత్మనా।
తత స్త్వంగే వరో దత్తో మయైవ విదితాత్మనా॥
త్వాం సముద్ధర్తుకామేన సుపుత్రస్తే భవిష్యతి।
ఏవ ముక్త్వా తు పితరం తవాఽహం గుణవత్సల॥
భవదంగాత్సముద్భూతః కరిష్యే లోకపాలనమ్।
దివీన్ద్రో హి యథా భాతి తథాహం భూతలే స్థితః॥
ఆత్మా వై జాయతే పుత్ర ఇతిసత్యవతీ శ్రుతిః।

ఓ వేనభూపతీ ! నీపాపము నశించినది. బాల్యములో నీతల్లి సునీథను సుశంఖుడు నీపుత్రుడు పాపాత్ము డగు నని శపించెను. నీతండ్రి అంగుడు నన్ను గూర్చి లోకోత్తరుడగు పుత్రుడు కావలెనని తపస్సు చేయగా నిన్నుద్ధరింపదలచి అట్టి సుపుత్రుడు కలుగు నని నేను వర మిచ్చితిని. ఆవర మిచ్చిన నేనే నీశరీరమునుండి జన్మించిన పృథుచక్రవర్తిని. "ఆత్మా వై పుత్రనామాసి" అనుశ్రుతినిబట్టి నీపుత్రుడు నీ స్వరూపమే.

ఆసుశంఖునిశాపము సార్థకము చేయవలయునుకనుక నేనే ఆజినరూపముతో వచ్చి నిన్ను పాపాత్ముని చేయుటకు బోధించితిని. విధినిషేధములు నాస్వరూపమే. వారివారి కర్మానుగుణముగా ఫల మిచ్చుట నాపని. అనుచు చెప్పెను. ఆవాక్యము లివిగో—

"యస్త్వాం పాతకరూపోఽహం సునీథాయాః పరన్తప।
అబ్రువం నగ్నరూపేణ కర్తుం త్వాం తు విధర్మగమ్॥
అన్యథా తు సుశంఖస్య వాక్యమేవాఽన్యథా భవేత్।
అతో విధి ర్నిషేధశ్చ హ్యాహ మేవ నృపోత్తమ॥
కర్మానురూపఫలదో బుద్ధ్యతీతో గుణాగ్రహః ॥

దీనినిబట్టి ఒక్కొక్కని అమోఘములైన శాపానుగ్రహము లను విరోధము లేకుండ ఫలింపజేయుట భగవంతుని కృత్యమనియు, వేనుడు శాపప్రకారము దుష్టుడగుటకై భగవంతుడే రూపాంతర ముతో వచ్చి అవైదికమైన ఆర్హతమతము నుపదేశించె ననియు స్పష్టము.

అర్హ్యాతమత మీవిధముగా నొకప్పుడు ప్రవృత్తమయినది.

మరియొకప్పుడు ఈఆర్హ్యాతమతప్రవృత్తి కలిగిన విధము శ్రీమద్భాగవతమం దిట్లు చెప్పబడినది—స్క—ః-అ-౬.

నాభిమహారాజు తన పత్నియగు మేరుదేవితో యజ్ఞపురుషుడగు భగవంతుని పుత్రునిగా పొందదలచి యాగవిధానమున ఆరాధించెను. ఆభగవంతుడు ప్రత్యక్షమై అట్లే వరమిచ్చి-"నాభేః ప్రియచికీర్షయా... మేరుదేవ్యాం... శుక్లయా తనునాఽవతతార" ఆదంపతులకు పుత్రుడై అవతరించెను. ఈతనికి ఋషభదేవు డని పేరు.

ఈఋషభదేవుని భార్య జయంతి. ఈదంపతులకు కలిగిన పుత్రులు నూర్గురు. అందరిలో పెద్దవాడు భరతవర్షమని దీనికి పేరు దెచ్చిన మహాయోగి భరతుడు .

ఋషభదేవుడు సర్వక్రతువులు చేసి 'స్వతనయం జ్యేష్ఠం పరమభాగవతం భగవజ్జనపరాయణం భరతం ధరణిపాలనాయాఽభిషిచ్యస్వయం ఆత్మ న్యారోపితాహవనీయః బ్రహ్మావర్తా త్ప్రవవ్రాజ ।'

పరమభాగవతు డగు భరతుని రాజ్యాభిషిక్తుని జేసి తాను అగ్నిని ఆత్మారోపణము చేసికొని సర్వసంగపరిత్యాగియై స్వదేశమగు బ్రహ్మావర్తమునుండి మౌనవ్రతముతో అవధూతవేషముతో వెడలిపోయెను.

"తస్య హ వా ఏవం ముక్తలింగస్య భగవత ఋషభస్య యోగమాయావాసనయా దేహ ఇమాం జగతీ మభిమానాభాసేన సంక్రమమాణః కోంకవేంకటకుటకాన్, దక్షిణకర్ణాటకాన్, దేశాన్ యదృచ్ఛయోపగతః కుటకాచలోపవనే ఆస్యకృతాఽశ్మకబలః ఉన్మాద ఇవ ముక్తమూర్ధజోఽసంవీత ఏవ విచచార. 7

ఆవెళ్ళుటలో ఋషభదేవుని దేహము యోగమాయావాసన చేత సంచరించుచు దక్షిణకర్ణాటకదేశములమీదుగా పోవుచు కుటకాచలముయొక్క ('నాగపురతః పూర్వతః నదీతటే కుటకాచలోఽస్తి' వంశీధరీయమ్) ఉపవనమందు ఆగెను ఏమియు భుజింపరాదు, మాటాడరాదు. అను అభిప్రాయాభాసముతో నోటియందు పాషాణముంచుకొని జుట్టు విరియబోసికొని దిగంబరత్వముతో ఉన్మత్తునివలె నుండెను.

యస్య కిలాఽనుచరిత ముపాకర్ణ్య కోంకవేంకటకుటకా నాం రాజాఽర్హన్నామాఽపశిక్ష్య కలా వధర్మే ఉత్కృష్యమాణే భవి తవ్యేన విమోహితః స్వధర్మపథ మకుతోభయ మపహాయ కుపథ పాషండ మసమంజసం నిజమనీషయా మన్దః స్సంప్రవర్త యిష్యతే. 9

ఋషభదేవుడు అవధూతవేషముతో అక్కడకు వెళ్ళి ననుటకు తార్కాణ మేమనగా— ఆశ్రిమాతీతమైన ఆఋషభదేవుని చర్యను ఆదేశాధిపతియగు 'అర్హ౯'అను రాజు ఆదేశవాసులవలన విని అధర్మ ప్రాబల్యముకల కలిలో లోకులు దురదృష్టముచేత స్వధర్మమును విడిచి ఋషభదేవుని చరమస్థితిరూపమైన ఆబాహ్యాచర్య శ్రేష్ఠ మని స్వబు ద్ధితో భావించి ఆరాజు వేదదూషకమై అయుక్తమైన పాషండమార్గ మును సర్వసాధారణముగా ప్రవర్తింపజేయును.

అనగా ముందు కలియుగములో జన్మింపబోవు అర్హాన్ అను రాజు లోకులవలన గ్రంథములవలన ఋషభదేవుని ఉత్కర్షము విని అట్లు ఆచరించిన మనముకూడ అట్టివార మగుదు మని తలచి ఆఋషభ దేవుని బాహ్యచేష్టలనే తానవలంబించి లోకులలో ప్రవర్తింపచేయుగ లడు. (వంశీ.)

ఋషభదేవుని అవతారలీలలయొక్క శ్రవణకీర్తనములచేతనే కలికాలప్రజలకు కృతార్థతకాని, ఆతని బాహ్యచేష్టానుకరణముచేత కృతార్థత కాదని భావము.

యేన హ వావ కలౌ మనుజాఽపసదా దేవమాయామో హితాః స్వవిధినియోగశౌచచారిత్రవిహీనా దేవహేలనా న్యప వ్రతాని నిజనిజేచ్ఛయా గృహ్ణానా అస్నానాచమనాశౌచకేశో ల్లుంచనాదీని కలినాఽధర్మబహులేన ఉపహతధియో బ్రహ్మబ్రా హ్మణయజ్ఞపురుషలోకవిదూషకాః ప్రాయేణ భవిష్యన్తి. 10

ఆరాజు ప్రవర్తకుడగుటచేత మనుజులలో కొందరు వేదోక్త శౌచాచారరహితులై దేవతాతిరస్కారరూపములై తమబుద్ధులకు తోచిన స్నానాచమనాదిశూన్యములైన పద్ధతుల నవలంబించి అధర్మ బహులమైన కలిచేత చెడగొట్టబడిన బుద్ధికలవారై వేదములను వేద ప్రవర్తకులను యజ్ఞపురుషుని దూషించు వారగుదురు.

తే చ హ్యార్వాక్తనయా నిజలోకయాత్రియాఽన్ధపరంపర యాఽఽశ్వస్తా స్తమ స్యంథే స్వయమేవ ప్రిపతిష్యన్తి ।

వారు వేదవిరుద్ధమైన నూతనపద్ధతిని అంధపరంపరగా నమ్మి ఉన్నతస్థితికి దూరమైపోదురు. అని.

ఇది కలియుగములోని ఆర్హతమతప్రివృత్తియొక్క పద్ధతి.

—• ఆర్హతమతసిద్ధాంతములు •—

ప్రిమాణవిషయమై బౌద్ధులకువలె ఆర్హతులకును ప్రిత్యక్షము, అనుమానము రెండే ప్రిమాణములు. వేదము ప్రిమాణము కాదు.

జీవాత్మవిషయమై దేహామే ఆత్మ యని ఇంద్రియములే ఆత్మ యని, ప్రాణమే ఆత్మయని, మనస్సే ఆత్మయని చెప్పిన చార్వాకుల వలెగాక, శూన్యమే ఆత్మ యని చెప్పు బౌద్ధులలోని మాధ్యమికులవలె గాక, క్షణికవిజ్ఞానమె ఆత్మ యని చెప్పు ఇతరబౌద్ధులవలెగాక, ఆర్హతులు—జీవాత్మ దేహాతిరిక్తమై చైతన్యస్వభావముకలిగి దేహముతో సమానపరిమాణము కలిగియుండె నని చెప్పుదురు.

పరమేశ్వరవిషయమై ప్రిజాపాలకుడే పరమేశ్వరు డని చెప్పు చార్వాకులవలె గాక, సుగతుడే పరమేశ్వరు డని చెప్పు బౌద్ధులవలెగాక, వీరు—అర్హన్ముని యే పరమేశ్వరుడు, సర్వజ్ఞుడు అని చెప్పుదురు.

మోక్షవిషయమై స్వాతంత్ర్యము మోక్షమని, మరణము మోక్ష మని చెప్పు చార్వాకులవలెగాక, ఆత్మోచ్ఛేదము మోక్ష మని చెప్పు శూన్యవాదిబౌద్ధులవలె గాక, నిర్మలజ్ఞానోదయము మోక్షమని చెప్పు ఇతరబౌద్ధులవలెగాక, వీరు-కర్మకృతమైన దేహముయొక్క ఆవరణము పోయినప్పుడు జీవునకు ఆకాశములో సతతము ఊర్ధ్వగమనమే మోక్ష మని చెప్పుదురు.

పదార్థవిషయమై ఆర్హతులది 'సప్తభంగీనయము' అను పేరు గల స్యాద్వాదము. అది యెట్లనగా—

1 సత్కార్యవాదులగు సాంఖ్యులు పదార్థములకు సర్వదా అస్తిత్వమునే చెప్పుదురు. 2 శూన్యవాదిబౌద్ధులు పదార్థములకు నాస్తిత్వమునే చెప్పుదురు. 3 అసత్కార్యవాదులగు నైయాయికాదులు

పదార్థములకు ఉత్పత్తిపూర్వము నాస్తిత్వము, ఉత్పత్త్యనంతరము అస్తిత్వము, అవి నశించినపుడు మరల నాస్తిత్వము ఈవిధముగా అస్తిత్వ నాస్తిత్వములు పదార్థములకు కాలభేదముచేత చెప్పుదురు.

4 వేదాంతులు పదార్థములకు అనిర్వచనీయత్వము చెప్పుదురు. 5 ఈ అనిర్వచనీయత్వము అస్తిత్వపక్షములో నున్నది. 6 నాస్తిత్వ పక్షములో నున్నది. 7 అస్తిత్వనాస్తిత్వపక్షములో నున్నది.

ఈవాదము లన్నియు పదార్థములయొక్క నిశ్చితస్వరూప మును చెప్పునట్టివే.

ఇక ఆర్హతులు ఈసప్తవాదముల నంగీకరించుచు 'స్యాత్' అను ఒక పదమును వానిలో చేర్చుచుందురు.

అది యెట్లనగా సాంఖ్యులు 'ఘటోఽస్తి' అని చెప్పినపుడు, 'అస్తి' అనుట నిజమే కాని అది నిశ్చితస్వరూపము కాదుకనుక 'స్యాదస్తి' (ఒకరకముగా ఉన్నది) అని చెప్పవలె నని స్యాద్వాదుల తాత్పర్యము. 'స్యాత్' అనునది అవ్యయము. 'కథంచిత్' అను శబ్దముతో సమానార్థకము.

ఒకరకముగా నున్నది అను మాటకు స్వస్వరూపముతో నున్నది. అన్యస్వరూపముతో లేదు. అని అర్థము.

ఈవిధముగా 'స్యా దస్తి 1, స్యా న్నాస్తి 2, స్యా దస్తి నాస్తి చ 3, స్యా దవక్తవ్యః 4, స్యా దస్తి చావక్తవ్యశ్చ 5, స్యాన్నాఽస్తి వక్తవ్యశ్చ 6, స్యాదస్తినాస్తి చావక్తవ్యశ్చ 7 అనునది స్యాద్వాదము.

ఏకత్వనిత్యత్వాదిధర్మములయందును ఇట్లే ఊహ్యము. (ఈవిష యములు సవ్యాఖ్య సర్వదర్శనసంగ్రహమునందు చూడనగును.)

—• ఆర్హతసిద్ధాంతములలోని దోషములు •—

బ్రహ్మసూత్రములు—'నైకస్మి న్నసంభవాత్' 2-2-33. 'ఏవం చాత్మాఽకార్త్స్న్యమ్' 34 'నచ పర్యాయా దప్యవిరోధో వికారా దిభ్యః' 35. 'అన్త్యావస్థితేశ్చ...' 36 అను సూత్రములు, తద్భాష్యము ఆదోషముల నుద్ఘాటించినవి.

'సర్వము అనిశ్చితస్వరూపము' అను ఆర్హతులు పర్వములో చేరిన సప్తభంగీనయము నిశ్చితస్వరూపమందు లేని సర్వము అనిశ్చిత

స్వరూపము అను ప్రతిజ్ఞకు భంగము. సప్తభంగీనయముకూడ అని శ్చితస్వరూప మనియే అందురా ? అనిశ్చితస్వరూప మగుటచేత అప్రమాణమయిన సప్తభంగీనయమునుబట్టి సర్వవస్తువులకు అనిశ్చితస్వరూపత్వసిద్ధి యెట్లు ?

జీవాత్మ దేహముతో సమానపరిమాణముకల దని చెప్పినయెడల మనుష్యదేహముతో సమానపరిమాణము కలిగియున్న జీవుడు కర్మవిశేషమునుబట్టి గజశరీరములో ప్రవేశించినపుడు ఆశరీరమునంతను వ్యాపించుట సంభవింపకపోవును. గజశరీరముతో సమానపరిమాణము కల జీవుడు కర్మవిశేషమునుబట్టి చిన్నపిపీలికాశరీరములో ప్రవేశింప వలసివచ్చినపుడు ఆచిన్నశరీరములో ప్రవేశము సంభవింపకపోవును.

అపౌరుషేయము, అనాదిసిద్ధము అగు వేదము ప్రమాణము కాక అర్హమునికల్పితమైన గ్రంథము ప్రమాణ మెట్లగును ?

పరమప్రమాణమైన వేదము—'యతో వా ఇమాని భూతాని జాయన్తే,' 'ద్యావాపృథివీ జనయన్ దేవ ఏకః.' అనుచు పరమేశ్వరుని బహువిధముల కీర్తించుచుండ అట్టి పరమేశ్వరుడు లేడని చెప్పుట యెట్లు సరిపడును ?

ఇత్యాదిదోషములు ఆర్హతసిద్ధాంతములపై జూపబడినవి.

—• చార్వాక— బౌద్ధ— ఆర్హత— మతములు

**నాస్తికమతములు •—**

**నాస్తి**కమతలక్షణ మిట్లు చెప్పబడినది—శుక్రనీతి. అ. 4.

'యుక్తి ర్బలీయసీ యత్ర సర్వం స్వాభావికం మతమ్ ।
కస్యాపి నేశ్వరః కర్తా న వేదో నాస్తికం మతమ్ ॥' 95

కేవలయుక్తియే ప్రబలప్రమాణమనుట, వేదమప్రమాణమనుట, విభిన్నమైన ప్రపంచపరిస్థితి స్వాభావికమనుట, దేనికిని ఈశ్వరుడు కర్త కాడనుట నాస్తికమతమునకు లక్షణము అని అర్థము. 'నాస్తికో వేదనిన్దకః' అని మనుస్మృతి.

మహాభారతవ్యాఖ్యాత నీలకంఠాచార్యు లిట్లు చెప్పెను—

తస్మై తర్కప్రధానాని వేదవిరోధీని లోకాయత-ఆర్హత- సౌగత-కాపాలికాది-శాస్త్రాణి (శాంతి-మోక్ష అ. 269)

ప్రత్యక్షమొక్కటే ప్రమాణ మను చార్వాకుని నాస్తికు డని ఆర్హతులును పాడియున్నారు—స్యాద్వాదమంజరీ. పు. 161.

'వినాఽనుమానేన పరాభిసన్ధి మసంవిదానస్యతు నాస్తికస్య। నసాంప్రతం వక్తు మపి క్వ చేష్టా క్వ దృష్టమాత్రంచ హాహా ప్రమాదః॥'

'నాస్తి పరలోకః పుణ్యం పాప మితి మతి రస్య...నాస్తికః తస్య నాస్తికస్య లౌకాయతికస్య।'

పరునితో మాటలాడువాడు ఆతని యభిప్రాయము తెలిసికొనకుండ మాటలాడలేడు; ప్రత్యక్ష మొక్కటే ప్రమాణ మనువాడు అప్రత్యక్షమైన పరుని అభిప్రాయమును తెలిసికొన లేడు; అనుమాన ప్రమాణ మొప్పనివాడు చేష్టనుబట్టి ఆతని యభిప్రాయము గ్రహింప లేడు. కనుక చార్వాకుడు మాటలాడుటకే వీలు లేదు. అని ఆశ్లోకమునకు అర్థము.

ఇట్లు చార్వాక- బౌద్ధ- ఆర్హత- మతస్థులకు వేదమునందు విశ్వాసములేశమాత్రము లేకుండుటవలన వీరు నాస్తికులని, అవైదిక మతస్థులని ప్రసిద్ధి.

ఈమతముల ఉద్భవమునుగూర్చి విష్ణుపురాణములో ఇట్లున్నది—

అం. 3. అ. 17.

'స్తోత్రస్య చావసానే తే దదృశుః పరమేశ్వరమ్।
శంఖచక్రగదాపాణిం గరుడస్థం సురా హరిమ్॥
త మూచుః సకలా దేవాః ప్రణిపాతపురస్సరమ్।
ప్రసీద నాథ దైత్యేభ్యః త్రాహి న శ్శరణార్థినః॥
స్వవర్ణధర్మాభిరతా వేదమార్గానుసారిణః।
న శక్యా స్తేఽరయో హన్తు మస్మాభి స్తపసా వృతాః॥
త ముపాయ మశేషాత్మ న్నస్మాకం దాతు మర్హసి।
యేన తా నసురాన్ హన్తుం భవేమ భగవన్ క్షమాః॥'

దైత్యులవలన బాధింపబడు దేవతలు భగవంతునిగూర్చి స్తోత్రము చేయగా గరుడారూఢుడై శ్రీహరి దర్శన మిచ్చెను. అప్పుడు దేవతలందరు వందనపూర్వకముగా ఇట్లు ప్రార్థించిరి—దేవదేవా! శరణా

ష్ఠులమైన మమ్ము దైత్యులనుండి కాపాడుము. స్వవర్ణధర్మాసక్తులు, వేదమార్గానువర్తులు, తపోనిష్ఠులు అగు దైత్యులు మాకు జయింప శక్యముకాకున్నారు. మేము వారిని ఏయుపాయమున జయింపగలుగుదుమో ఆయుపాయము ననుగ్రహింపుము. అని.

'ఇత్యుక్తో భగవాం స్తేభ్యో మాయామోహం శరీరతః ।
సముత్పాద్య దదౌ విష్ణుః ప్రాహ చేదం సురోత్తమాన్ ॥
మాయామోహోఽయ మఖిలాన్ దైత్యాం స్తాన్ మోహయిష్యతి ।
తతో వధ్యా భవిష్యన్తి వేదమార్గబహిష్కృతాః ॥
తద్గచ్ఛత న భీః కార్యా మాయామోహోఽయమగ్రతః ।
గచ్ఛ న్నద్యోపకారాయ భవతాం భవితా సురాః ॥'

అప్పుడు భగవంతుడు తన శరీరమునుండి ఒక పురుషుని ఆవిర్భవింపజేసి దేవతలకు ఇట్లు చెప్పెను—ఈమాయామోహుడు ఆదైత్యులందరిని వ్యామోహింపజేయును. దానినిబట్టి వారు వేదమార్గబహిష్కృతు లగుదురు. అప్పుడు వారిని సులభముగా మీరు జయింపగలుగుదురు. అని.

అంతట నర్మదాతీరమందు తపశ్చర్యయందున్న దైత్యులయొద్దకు వెళ్ళి.

'తతో దిగంబరో ముండో బర్హిపింఛధరో ద్విజ ।
మాయామోహోఽసురాన్ శ్లక్ష్ణ మిదం వచన మబ్రవీత్ ॥
హే దైత్యపతయో బ్రూత యదర్థం తప్యతే తపః ।
ఐహికార్థం చ పారత్ర్యం తపసః ఫల మిచ్ఛథ ॥'

దిగంబరుడయి నెమలిపింఛము ధరించి ముండితశిరస్కుడయియున్న మాయామోహుడు మృదుమధురముగా సంభాషించుచు ఇట్లు ప్రశ్నించెను—దైత్యపతులారా! మీరు చేయు తపస్సునకు ఫలము ఐహికమా? ఆముష్మికమా? అని. అది విని అసురు లిట్లనిరి—

'పారత్ర్యఫలలాభాయ తపశ్చర్యా మహామతే!
అస్మాభి రియ మారబ్ధా కిం వా తేఽత్ర వివక్షితమ్ ॥'

మహానుభావా! ఆముష్మికఫలప్రాప్తికే మేము తపశ్చర్య నారంభించితిమి. నీవు చెప్పునది యేమి ?

మాయామోహ ఉవాచ—

'కురుధ్వం మమ వాక్యాని యదిముక్తి మభీప్సథ ।
అర్హాధ్వ మేనం ధర్మం చ ముక్తిద్వార మసంవృతమ్ ॥
ధర్మో విముక్తే రర్హోఽయం నైతస్మా దపరో వరః ।
అత్రైవ సంస్థితాః స్వర్గం విముక్తిం వా గమిష్యథ ॥
అర్హాధ్వం ధర్మ మేతం చ సర్వే యూయం మహాబలాః ।
ఏవం ప్రకారై ర్బహుభి ర్యుక్తిదర్శనచర్చితైః ॥
మాయామోహేన తే దైత్యా వేదమార్గా దపాకృతాః ।'

వ్యాఖ్యా—ఏవంప్రకారై ర్వాక్యైః యుక్తిదర్శనం శుష్క తర్కవాదః, తేన చర్చితైః ।

మీరు ముక్తి నపేక్షించుపక్షములో నేను చెప్పు ధర్మమును ఆచరింపుడు; విముక్తికి ఇంతకంటె ఉత్తమధర్మము లేదు; ఇది స్వర్గమునకు మోక్షమునకు సాధనము; దీని నవలంబించుటకు మీరు అర్హులు. అని యిట్టి వాక్యములతో శుష్కతర్కప్రదర్శనముతో వారిని వేదమార్గము నుండి తొలగించెను.

'ధర్మాయైత దధర్మాయ సదేత న్న సదిత్యపి ।
విముక్తయే త్విదం నైత ద్విముక్తిం సంప్రయచ్ఛతి ॥
పరమార్థోఽయమత్యర్థం పరమార్థో న చాప్యయమ్ ।
కార్య మేత దకార్యం చ నైత దేవం స్ఫుటం త్విదమ్ ॥
దిగ్వాససా మయం ధర్మో ధర్మోఽయం బహువాససామ్ ।
ఇత్యనేకాన్తవాదం చ మాయామోహేన నైకధా ॥
తేన దర్శయతా దైత్యాః స్వధర్మం త్యాజితా ద్విజ ॥'

విష్ణుచిత్తీయమ్—ధర్మాయేత్యాదినైకధేత్యన్తం వికల్పోదాహరణసప్తకం । సప్తధా హి అనేకాన్తవాదినా మార్హతానాం సప్తభంగీ స్యాద్వాదః । స్యాదస్తి, స్యాన్నాస్తి, స్యాదస్తి చ నాస్తి చ, స్యా దనిర్వచనీయమ్, స్యాదస్తి చానిర్వచనీయమ్ । స్యాన్నాస్తి

చాఽనిర్వాచనీయమ్,స్యాదస్తి చ నాస్తి చాఽనిర్వాచనీయమ్ ఇతి...

'అర్హత్వైవం మహాధర్మం మాయామోహేన తే యతః ।
ప్రోక్తా స్త మాశ్రితా ధర్మ మార్హతా స్తేన తేఽభవన్ ॥
త్రయీధర్మసముత్సర్గం మాయామోహేన తేఽసురాః ।
కారితా స్తన్మయాహ్యాసం స్తతోఽన్యే తత్ప్రచోదితాః ॥
తై రప్యన్యే పరే తైశ్చ తై రప్యన్యే పరే చ తైః ।
అల్పై రహోభి స్సంత్యక్తా తై ర్దైత్యైః ప్రాయశ స్త్రయీ ॥'

ఆమాయా మోహుడు సప్తభంగీరూపమైన స్యాద్వాదము నుపదేశించి (ఇది వెనుక వివరింపబడినది.) ఆదైత్యులను స్వధర్మమునుండి తొలగించెను. మాయామోహునిచేత, నేచెప్పినమహాధర్మమునకు మీరు అర్హులు అనుచు 'అర్హత, అర్హత' అని బోధింపబడినవారు గనుక వారు ఆర్హతు లని చెప్పబడిరి. వారివలన కొందరు, వారివలన మరికొందరు ఆపద్ధతి నవలంబించి కొద్దిరోజుల కే వేదమార్గమును విడిచివేసినారు.

శ్రీధరీయమ్-తదేవ మార్హతమతేన దైత్యవిమోహన ముక్తమ్।

ఇట్లు ఆర్హతమతోపదేశముచేత దైత్యులను వ్యామోహింపజేసిన విధము చెప్పబడినది.

'పునశ్చ రక్తాంబరధృ గ్మాయామోహో జితేన్ద్రియః ।
అన్యానాహాఽసురాన్ గత్వా మృద్వల్పమధురాక్షరమ్ ॥
స్వర్గార్థం యది వో వాంఛా నిర్వాణార్థ మథాఽసురాః ।
తదలం పశుఘాతాది దుష్టధర్మై ర్నిబోధత ॥
విజ్ఞాన మయ మేవైత దశేష మవగచ్ఛత ।
బుధ్యధ్వం మే వచ స్సమ్య గ్బుధై రేవ మిహోదితమ్ ॥
జగదేత దనాధారం భ్రాన్తిజ్ఞానార్థతత్పరమ్ ॥
రాగాదిదుష్ట మత్యర్థం భ్రామ్యతే భవసంకటే ।
ఏవం బుధ్యత బుధ్యధ్వం బుధ్యతైవ మితీరయన్ ॥
మాయామోహ స్స దైతేయాన్ ధర్మ మత్యాజయ న్నిజం ।
నానాప్రకారవచనం స తేషాం యుక్తియోజనమ్ ॥
తథా తథా త్రయీధర్మం తత్యజు స్తే యథాయథా ।

తే౽ప్యన్యేషాం తథైవోచు రన్యై రన్యే తథోదితాః ॥
మైత్రేయ తత్యజు ర్ధర్మం శ్రుతిస్మృత్యుదితం పరమ్ ॥'

విష్ణుచిత్తీయమ్—విజ్ఞానమయమితి యోగాచారాణా మాత్మఖ్యాతిపక్షోక్తిః। జగదితి జగ దేత దనాధారమితి నిరధిష్ఠానమ్ భ్రాన్తిర్జ్ఞానార్థతత్పరమితి మాధ్యమికానాం శూన్యఖ్యాతిపక్షోక్తిః। ఏవమితి బుధ్యతే రావృత్తిః బౌద్ధత్వనిరుక్త్యర్థా।'

తరువాత మరికొంద రసురులకు మృదుమధురభాషణములతో రక్తాంబరధారియై జితేంద్రియుడై బౌద్ధమతోపదేశము చేసెను. విజ్ఞానవాదము, శూన్యవాదము వారికి బోధించెను. నేను చెప్పినది తెలిసికొనుడు అనుచు 'బుధ్యత, బుధ్యత' అని బోధింపబడినవారగుటచేత వీరు బౌద్ధు లని చెప్పబడిరి. ఆ అసురులు ఎట్లు చెప్పిన వేదధర్మమును విడిచివేయుదురో అట్లు మాయామోహుడు యుక్తులు చెప్పుచు బహుప్రకారముల బోధించెను. వారును వారివలన బోధింపబడినవారును శ్రుతిస్మృతిప్రోక్తధర్మములను విడిచివేసిరి.

'అన్యానప్యన్యపాషండప్రకారై ర్బహుభి ర్ద్విజ।
దైతేయా న్మోహయామాస మాయామోహో౽తిమోహకృత్ ॥
స్వల్పేనైవ హి కాలేన మాయామోహేన తే౽సురాః।
మోహితా స్తత్యజు స్సర్వాం త్రయీమార్గాశ్రితాం కథామ్ ॥
కేచి ద్వినిందాం వేదానాం దేవానా మపరే ద్విజ।
యజ్ఞకర్మకలాపస్య తథా౽న్యే చ ద్విజన్మనామ్ ॥'

మరికొంద రసురులను మరికొన్ని పాషండమార్గముల నుపదేశించి వ్యామోహింపజేసెను. అట్లు వారు మోహితులై వేదనిందను, దేవనిందను, యజ్ఞనిందను, వైదికనిందను చేయదొడగిరి.

'ఇత్థ మున్మార్గయాతేషు తేషు దైత్యేషు తే౽మరాః।
ఉద్యోగం పరమం కృత్వా యుద్ధాయ సముపస్థితాః ॥
తతో దైవాసురం యుద్ధం పునరేవాభవ ద్ద్విజ।
హతాశ్చ తే౽సురా దేవైః సన్మార్గపరిపన్థినః ॥
స్వధర్మకవచం తేషా మభూ ద్య త్ప్రథమం ద్విజ।
తేన రక్షా౽భవ త్పూర్వం నేశు ర్నష్టే చ తత్ర తే ॥'

ఈవిధముగా దైత్యులు అపమార్గమవలంబించినపుడు దేవతలు యుద్ధసన్నాహము చేసిరి. ఆదేవాసురసంగ్రామములో వేదమార్గ విరోధులగు దైత్యులు హతులైరి. పూర్వము ఆదైత్యులకు రక్షకమైన స్వధర్మకవచ ముండెడిదో అది పోవుటచేతనే వారు నశించినారు. అని.

దీని సారాంశ మేమనగా—

చార్వాక–బౌద్ధ–ఆర్హత–మతములు నాస్తికమతములనియు, వేదబాహ్యములనియు, అవి ఘాతుకస్వభావము గల దైత్యులను నిర్వీర్యులను చేసి తన్మూలమున లోకక్షేమము గలిగించుటకై దైత్యులలో భగవంతునిచేత ప్రవేశ పెట్టబడినవనియు, ఘాతుకస్వభావముకల ఆ అసురులు వేదధర్మాచరణమునకు అనర్హులును ఆఅవైదికధర్మాచరణముననే అర్హులును అని భగవంతుని తాత్పర్యమనియు, వేదోక్తమైన వర్ణాశ్రమధర్మమనబడు స్వధర్మమును అర్హులగు వారాచరించుట భగవత్సమ్మత మనియు, ఆవేదోక్తధర్మరక్షణమే భగవంతునకు ముఖ్య కర్తవ్యమనియు సారాంశము.

వెనుకజూపబడిన పద్మపురాణవచనములబట్టికూడ ఆర్హతమతము వేదవిరుద్ధమనియు, వేనుడు దుష్టుడు కావలసియున్న శాపమును సార్థకముచేయుటకై భగవంతుడు రూపాంతరముతో వేనునకు ఆర్హత మత ముపదేశించి వెళ్ళె ననియు స్పష్టము

వెనుకజూపబడిన శ్రీమద్భాగవతగ్రంథములోగూడ—కలిలో మనుష్యులు దేవమాయామోహితులై ఆర్హతమతానువర్తులై వేదాది దూషకు లగుదురని చెప్పినట్లు స్పష్టము.

వెనుక జూపబడిన కాశీఖండగ్రంథమునుబట్టి దివోదాసరాజ్యములో అధర్మవ్యాప్తి కలుగుటకై శ్రీహరి బుద్ధరూపముతో బౌద్ధ మత ముపదేశించి వెళ్ళినట్లు స్పష్టము.

## —• బుద్ధావతారము—ప్రయోజనము •—

భగవంతుని అవతారములలో బుద్ధావతార మొకటి. భగవంతుని అవతారములు ఆరు విధములని, అందుఆవేశావతార మొకటి యని, పరశురామ-బుద్ధులది ఆవేశావతారమని, దేవశత్రుకృతోపద్రవములనుండి లోకమును కాపాడుటే ఏయవతారమునకయినను ప్రయోజన మని

వేనుక శ్రీమద్భాగవతవచనోదాహరణములతో నిరూపింపబడినది. బుద్ధావతారము ధర్మప్రదర్శకమనికూడ చెప్పబడినది

ప్రవృత్తిధర్మమని, నివృత్తిధర్మమని, ధర్మము ద్వివిధము. గౌతమబుద్ధునిది నివృత్తిధర్మము. రోగ— జరా— మరణములను జూచి సంతప్తహృదయుడై సంసారమును రాజ్యమును త్యజించి గాఢవిరక్తితో అరణ్యావాసము చేసి ధ్యాననిష్ఠలో ఉత్తీర్ణత నొందినవాడు గౌతమబుద్ధుడు. ఇది అశ్వఘోషుని బుద్ధచరిత్రవలన తెలియుచున్నది. ఇక వాల్మీకిరామాయణోక్తప్రకారము—

"రక్షితా సర్వలోకస్య ధర్మస్య పరిరక్షితా ।
రక్షితా స్వస్య ధర్మస్య స్వజనస్య చ రక్షితా ॥
వేదవేదాంగతత్త్వజ్ఞో ధనుర్వేదే చ నిష్ఠితః ।

అని సర్వజ్ఞత్వాదిలక్షణములు కలిగి వేదోక్తవర్ణాశ్రమధర్మమును, జాతిధర్మమగు స్వధర్మమును అనగా ప్రవృత్తిధర్మమును అవలంబించి, ఆ ధర్మమార్గమును లోకులకు బోధించి లోకరక్షకుడైనట్టి శ్రీరామచంద్రభగవానుడు ఆవిర్భవించిన ఇక్ష్వాకువంశమందే గౌతమబుద్ధుడును ఆవిర్భవించెను. కాని వేద— శాస్త్ర— అనుసరణము ఆవశ్యకమని, తానుపదేశించినవారికి బోధించుట— ఈ గౌతమబుద్ధునియందు కనబడదు. తానెవ్వరికి బోధించెనో వారికి వేదధర్మమును త్యజింపుడని బోధించినట్లే కనబడుచున్నది. వైదికవిధానము నవలంబించి శక్తి నార్జించి హింసాకృత్యములతో లోకములను పీడించువారిని వ్యామోహింపజేయదలచి అట్లు బోధించెనని స్పష్టమగుచున్నది. ఈ దిగువ వచనములను చూడుడు:— ఆగ్నేయపురాణము— అ 16.

"పురా దేవాసురే యుద్ధే దైత్యైర్దేవాః పరాజితాః ।
రక్ష రక్షేతి శరణం వదన్తో జగ్మురీశ్వరమ్ ॥
మాయామోహస్వరూపోఽసౌ శుద్ధోదనసుతోఽభవత్ ।
మోహయామాస దైత్యాంస్తాంస్త్యాజితా వేదధర్మకమ్ ॥
తే చ బౌద్ధా బభూవుర్హి తేభ్యోఽన్యే వేదవర్జితాః ।
ఆర్హతః సోఽభవత్పశ్చాదార్హతానకరోత్పరాన్ ॥
ఏవం పాషండినో జాతా వేదధర్మవివర్జితాః ।"

స్కాన్దవైష్ణవఖండము— వాసుదేవమాహాత్మ్యము— అ 18.
"వైదికం విధి మాశ్రిత్య త్రిలోకీపరిపీడకాన్ ।
ఛలేన మోహయిష్యామి భూత్వా బుద్ధోఽసురా నహమ్ ॥"

దేవీభాగవతము— స్క 10. అ 5. (దశావతారస్తోత్రము)
"దుష్టయజ్ఞవిఘాతాయ పశుహింసానివృత్తయే ।
బౌద్ధరూపం దధౌ యోఽసౌ తస్మై దేవాయ తే నమః ॥"

వ్యాఖ్యా— దుష్టయజ్ఞాః= అవిధియజ్ఞాః;
"భూమే ర్భరావతరణాయ యదుష్వజన్మా, జాతః కరిష్యతి సురై రపి దుష్కరాణి । వాదై ర్విమోహయతి యజ్ఞకృతోఽతదర్హాన్, మ్లేచ్ఛాన్ కలౌ క్షితిభుజో న్యహనిష్యదన్తే ॥ (స్క 11 అ 4)
బుద్ధావతారమాహ- వాదై రితి, అతదర్హాన్. యజ్ఞానర్హాన్ దైత్యా న్విమోహయతి ॥

పద్మపురాణోత్తరఖండము— అ 72.
విష్ణుసహస్రనామకథనము—
"బుద్ధో ధ్యానజితాశేషదేవదేవీజగత్ప్రియః ।
నిరాయుధో జగజ్జైత్రః శ్రీధనో దుష్టమోహనః ॥
దైత్యవేదబహిష్కర్తా వేదార్థశ్రుతిగోపకః ।
శౌద్ధోదనిః... యథాతథ్యాగ్ర్యాఖిలక్రియః ॥
సర్వజ్ఞో నాస్త్యఽఖిలేష్టదః ।
చతుష్కోటిపృథక్తత్త్వప్రజ్ఞాపారమితేశ్వరః ॥
పాఖండవేదమార్గేశః పాఖండశ్రుతిగోపకః ।

శ్రీమద్భాగవతము— స్కం 1- అ 3.
"తతః కలౌ సంప్రవృత్తే సంమోహాయ సురద్విషామ్ ।
బుద్ధో నామ్నాఽజనసుతః కీకటేషు భవిష్యతి ॥"

ఈ వచనములనుబట్టిచూడ వైదికవిధానము నవలంబించి శక్తిని సంపాదించి దానితో లోకములకు పీడ గలిగించునట్టి అసురాంశములను వైదికమార్గమునకు అనధికారులని భావించి అవైదికమార్గములనే వారికి బోధించి అహింసాపద్ధతి వారిలో స్థాపించి లోకరక్షణము

చేయుచే బుద్ధావతారమునకు ప్రయోజన మని స్పష్టము. గౌతమ బుద్ధుని ఉపదేశపద్ధతినిగూర్చి నవీనుల అభిప్రాయములు విషయపరిజ్ఞానముకొరకు ప్రదర్శింపబడుచున్నవి—

భారతీయతత్త్వశాస్త్రము-అనువాదకుని భూమిక—

"బౌద్ధయుగభారతదేశచరిత్ర వెక్కు కారణములచే సంతోష విషాదసమ్మిశ్రితమైన దని చెప్పనగును. అది పుట్టినభూమిలో జచ్చి దేశాంతరముల జీవించి నిలిచినది. దీనికి కారణములను రాధాకృష్ణు డద్భుతముగా వివరించి సమన్వయింప యత్నించి సత్యమును మిక్కిలి నేర్పుతో బ్రకటించినాడు.

సంప్రదాయము ననుసరించి బౌద్ధమతము నాస్తికమతముగా బరిగణింపబడినది. కాని కొన్ని శతాబ్దములపర్యంతము అది భరత భూమిలో నఖండవిజయము నందినది. ఈ విజయమునకు బ్రధాన కారణము బుద్ధుని జగన్మహాసవ్యక్తిత్వమే. బుద్ధుడు సర్వభోగములు గలిగి సర్వసంగత్యాగ మొనర్చిన సంన్యాసిచక్రవర్తియై... ప్రజాకోటి హృదయముల నాకర్షించి జయించినాడు. కాని మూలములో నేదైనా లోపమున్నగాని పతనము సంభవింపదు.

బుద్ధుడు పారమార్థికసత్యమునుగూర్చి మౌనము వహించినాడు. ఆమౌనమున కర్థమేమి? దీనికి బ్రశ్నోత్తరమాలికారూపము నిచ్చి రాధాకృష్ణపండితుడు బుద్ధుని మౌనము గంభీరార్థసమన్విత మని మెప్పింప యత్నించి విఫలుడై చివరభాగములో దానే ఖండించినాడు.

బుద్ధుడు పరమసత్యము నెఱిగియు, దేశకాలపాత్రముల ననుసరించి దానినిగూర్చి చెప్పకుండుటే ప్రజల కెక్కు డుపయోగకర మని భావించినా డని రాధాకృష్ణపండితుని వాదమైయున్నది.

బుద్ధునివంటి మహాత్ముడు తనకు సత్యము తెలిసియు జెప్పజంకె ననుట సమంజసముగా లేదు... సత్యానుభూతిగల వ్యక్తి... కరుణారసపూర్ణుడైన వ్యక్తి ప్రజాభిప్రాయములకు వెఱచి మౌనము వహించినాడను భావము అర్థవంతముగ లేదు. మనకు దెలియని దానినిగూర్చి మనమేల ప్రసంగింపవలె నని యూరకుండె నేనియే

యాతని. మౌనభావ మనుట యుక్తముగా దోచును. సత్యమును గూర్చి పలికిన నపార్థమగు నని భయపడినచో బలుకకుండుటవలన నెక్కుడపార్థములు చేకెత్తినవి. బుద్ధుడు కేవలపరమార్థమును విడిచి నీత్యుపదేశముతో దృప్తిపొందుటచే బౌద్ధమతమునకు భారతదేశములో నామరూపములు లేకుండ బోయినది.

మఱియు భారతభూమిలో తత్త్వజిజ్ఞాసకు వేదప్రామాణ్యమే మూలాధారము. పరతత్త్వమునుగూర్చి యాతడు మౌనము వహించుటచే వేదప్రామాణ్యమునుగూర్చియు మౌనమువహింపక తప్పనిసరి యయ్యెను. ఏలన, వేదప్రామాణ్య మంగీకరించినచో పరబ్రహ్మతత్త్వము నంగీకరింపక తప్పనిసరి యగును.

మూడవది బుద్ధు నహింసాప్రచారము, దేశకాలపాత్రములతో నిమిత్తములేకుండ సర్వజనుల కహింసాధర్మ మాచరణసాధ్యమని తలచుట మానవ మానసతత్త్వానభిజ్ఞతనే సూచించును.

మఱియు ధర్మసంరక్షణార్థము హింస నంగీకరించిన శ్రుతిప్రమాణజ్ఞానానభిజ్ఞతయు నిట సూచితము.

వేదమతమైన మహర్షి మతము సర్వతోముఖసామరస్యసమన్వయ పరిపూర్ణత గలది. బుద్ధు నుపదేశ మేకదేశ మాత్రము, పాక్షికము, శ్రుతిప్రమాణవిరుద్ధము నగుటచే భారతదేశమున నిలిచి మనలేక పోయినది.

బౌద్ధమతములో ముఖ్యధర్మము లన్నియు భారతజాతిజీవితములో గలిసి సజీవములై నేటికి నిలిచియున్న వనువాదము రాజకీయప్రచారవాదమే యని స్పష్టమగును.

మఱియు బుద్ధునివంటి యెంతటి మహోజ్జ్వలత్యాగమూర్తి యైనను పరమార్థసిద్ధి లేకుండ జేయు నంతపరిశుద్ధధర్మోపదేశమైనను స్థిరమై నిలువజాలదని బౌద్ధమతపరిణామము వెల్లడించుచున్నది...... ధర్మార్థకామమోక్షచతుర్విధ పురుషార్థములలో ధర్మము మోక్షజ్ఞానములపై నాధారపడి తత్సాధనమైనప్పుడే ధర్మ మగును.

బుద్ధుని యుపదేశమునకు బ్రహ్మజ్ఞానముకాని, శ్రుతివాక్యము కాని యాధారములు కాకుండుటచే నది నిసర్గమతమని సంధించ దని నిస్సంశయముగా జెప్పనొప్పును. ఇది మాకు దోచిన యభిప్రాయము." (ద్వితీయభాగము.) అనువాదకులు శ్రీ బులుసు వేంకటేశ్వరులు. ఎం. ఏ. గారు.

ఇట్లు శిష్టరక్షణము చేయుటకేర్పడినట్టి భగవదవతారములలో ఆయుధములతో దుష్టశిక్షణ చేయునట్టి పరశురామాద్యవతారములవలె గాక, నిరాయుధుడై, దయామయమూర్తియై ప్రబోధముచేతనే దుష్టశిక్షణకార్యము నిర్వహించినట్టిది బుద్ధావతారము. కనుక వైదికమతస్థులకును, బుద్ధభగవానుడు వంద్యుడే. ఆమతముమాత్రము గ్రాహ్యము కాదు.

ఇంతవరకు ఆదిలో ప్రకటించిన వైదికమతప్రాశస్త్యమునకు ఉపోద్ఘాతకముగా నాస్తికమతనామాంతరముగల అవైదికమతముల ఉత్పత్తిప్రకారము, వానిసిద్ధాంతములు, అందలి దోషములు సంగ్రహముగా పరిచయమాత్రమునకు ప్రతిపాదింపబడినవి.

—. మతము అను మాటకు అర్థము. మత భేదప్రసక్తి కారణము .—

మతము అను మాటకు ఇష్టము అని అర్థము. వీనికి వానికి అని లేక సర్వులకు ఇష్ట మయినది-సుఖము, దుఃఖనివృత్తి. ఇది మత మని చెప్పబడును.

ఇందు భేదాభిప్రాయమునకు తావులేదుకనుక మత భేదమునకు ఏమి ప్రసక్తి ? అని ప్రశ్నింపవచ్చును.

ఫలరూపమైన సుఖము, దుఃఖనివృత్తి మత(ఇష్ట)మైనపుడు వాని సాధనములుకూడ మత(ఇష్ట)మయి తీరును.

కనుక ఇప్పుడు మతములో ఫలాంశ మొకటి, సాధనాంశ మొకటి ఉన్నదన్నమాట. అందు ఫలాంశము సర్వసమ్మతముగనే యున్నను, సాధనాంశములో సుఖమునకు సాధనమిది, దుఃఖనివృత్తికి సాధన మిది అని నిర్ణయించుటలో వారివారి బుద్ధివైచిత్ర్యమునుబట్టి, ప్రమాణభేదమునుబట్టి బహుమార్గము లేర్పడినవి. కనుక సుఖప్రాప్తికి

మార్గమును, దుఃఖనివృత్తికి మార్గమును అదికాదిదియని, ఇది కాదదియని భిన్నభిన్నముగా కల్పింపబూనుటే మతభేదప్రసక్తికి కారణమయినది.

సుఖప్రాప్తిని, దుఃఖనివృత్తిని కోరని మనుష్యుడుండడుకనుక ఏదియో యొకమతమునకు జెందక మనుష్యు డుండుట అసంభవమే. ఎన్నిమార్గ(మత)ము లేర్పడినను అనాదిసిద్ధము, చతుర్దశవిద్యాస్థాన సంస్తుతము, శ్రీరామ-శ్రీకృష్ణాది-భగవత్స్వరూప-సంస్థాపితము, యావద్భారతదేశవ్యాప్తము. యావదాస్తికసంప్రదాయానుగతము అయి కోణకోణములలోగూడ విరాజిల్లుచున్నది వైదికమార్గమే. బహువిధ నిర్ణయములు దూరదృష్టిగల వైదికమార్గము దుష్కరముగను, అట్టి నియమములను తొలగించి తాత్కాలికదృష్టితో ఏర్పడిన అవైదికమార్గము సుకరముగను సామాన్యజనులకు తోచుట సహజ మగుటచే కొందరకు అవైదికమార్గాభిమానము కలుగుట కవకాశ మేర్పడినది.

పూర్వోక్తప్రకారము భగవంతునిచె ప్రవర్తింపజేయబడినట్టి అవైదికమార్గముమాత్రము మంచిది కాదా? వైదికమార్గమొక్కటే మంచిదా? అని శంక కలుగవచ్చుచును. వైదికమార్గానధికారులకు అవైదికమార్గము మంచిదే; వైదికమార్గాధికారులకుమాత్రము వైదికమార్గమే మంచిది. అధికారిభేదమునుబట్టియేకదా మార్గభేదము. ఈ విషయము స్కాందపురాణాన్తర్గతమైన సూతసంహితలో ఇట్లు చెప్పబడియున్నది—

# మార్గప్రామాణ్యము

# (సర్వమతసామరస్యము.)

యజ్ఞవైభవఖండము—అ. 22.

అథాఽత స్సంప్రవక్ష్యామి మార్గప్రామాణ్యనిర్ణయమ్ ।
శ్రద్ధాయా సహితా యూయం శృణుధ్వం మునిపుంగవాః ॥
వేదాంశ్చ ధర్మశాస్త్రాణి పురాణం భారతం తథా ।

..........................................................

విష్ణ్వాగమాంస్తథా బ్రాహ్మ్యా బుద్ధార్హాద్యాగమానపి ॥

..........................................................

అనేకభేదభిన్నాని తథా శాస్త్రాంతరాణి తు ।
నిర్మమే శంకర స్సాక్షా త్సర్వజ్ఞ స్సంగ్రహేణ తు ॥

విద్యారణ్యవ్యాఖ్యా—

నిర్మమే శంకర ఇతి । శ్రుతిస్మృతీతిహాసపురాణాదీని వైదికాని శాస్త్రాణి శైవపాశుపతాద్యాగమాన్ బుద్ధార్హతాదిబహుభేద భిన్నాన్ వేదవిరుద్ధాంశ్చ సర్వజ్ఞ శ్శివ ఏవ నిర్మితవా నిత్యర్థః ।

అత స్సర్వజ్ఞేన శివేనైవ ప్రణీతత్వా దేషాం మధ్యే కస్యచి దప్యప్రామాణ్యం న యుక్త మితి భావః ।
'ప్రసాదా దేవ రుద్రస్య బ్రహ్మవిష్ణ్వాదయ స్సురాః ।
మునయశ్చ మనుష్యాశ్చ యథాభాగం ద్విజోత్తమాః ॥
తాన్యేవ విస్తరేణైవ సంగ్రహేణైవ వా పునః ।
కుర్వన్తి తాని మానాని కథితాని మనీషిభిః ॥
అధికారివిభేదేన ....................................

వ్యాఖ్యా—నను బ్రాహ్మవైష్ణవబుద్ధాద్యాగమేషు బ్రహ్మ విష్ణ్వాదితత్తదాగమప్రణేతారః, సాంఖ్యతర్కాదిశాస్త్రేషు కపిల కణాదజైమినిప్రభృతయో నిర్మాతారః ప్రసిద్ధాః । అత శ్శివస్యైవ నిర్మాణ మనుపపన్న మిత్యత ఆహ-ప్రసాదాదేవేతి । పరమేశ్వ రానుగ్రహాదేవ బ్రహ్మాదయః తన్నిర్మితా నాగమాన్ స్వవ్యవ హారసిద్ధయే పున స్సంగ్రహవిస్తారాభ్యాం కుర్వన్తీ త్యవిరోధః । యద్యప్యేవ మీశ్వరనిర్మితత్వా త్సర్వేషాం ప్రామాణ్యం, తథాపి పరస్పరవిరుద్ధార్థప్రతిపాదకత్వా దప్రామాణ్యమపి స్యాదిత్యత ఆహ—అధికారీతి ।

యథా 'ఉదితే జుహోతి, అనుదితే జుహోతి' ఇత్యాదివిరుద్ధార్థ ప్రతిపాదకానాం వాక్యానా మధికారిభేదా ద్విరోధాభావేన ప్రామాణ్య మేవ మతా ప్రీత్యర్థః ।
యేన యేన ప్రకారేణ జనై రేభి రుపాసితః ।
తత్తన్మార్గానుగుణ్యేన సాఫల్యత్వం వ్రజ్యత్యేతి సః ॥
తత్ప్రసాదా త్క్రమాన్మార్గా న్విశిష్టా నేతి మానవః

వ్యాఖ్యా—యేన యేనేతి। సాంసావిభాగ హోక్తేన యేన యేనోపాధినా పరమేశ్వర ఉపాస్యతే తత్తదాగమానుసారేణ తత్తదుపాధియుక్తః పరమేశ్వరో భవతీత్యర్థః ।

తత్ప్రసాదాదితి। తత్తదాగమప్రతిపాద్యతయాఽవస్థితస్య శివస్య ప్రసాదా దేవోత్తరోత్తరముత్కృష్టా న్మార్గాన్ సాధకో లభత ఇత్యర్థః ।

తత్రతత్ర స్థితో దేవః ప్రసాదం కురుతేఽస్య తు ।
సోపానక్రమతో హ్యేతే వేదమార్గస్య హేతవః ॥
వేదమార్గస్థితో దేవ స్సాక్షా న్ముక్తే స్తు కారణమ్ ।
తత్రాపి కర్మభాగస్థో జ్ఞానశ్రద్ధాప్రదో హరః ॥
జ్ఞానభాగస్థిత శ్శంభుః జ్ఞానద్వారేణ మోక్షదః ।

వ్యాఖ్యా- సోపానక్రమత ఇతి। తత్తదాగమేషు తత్తద్దేవతారూపో దేవః సోపానక్రమేణ వేదమార్గప్రాప్తౌ కారణం। స ఏవ వేదమార్గప్రతిపాదితస్సన్ముక్తిహేతు ర్భవతీత్యర్థః । కర్మభాగస్థ ఇతి। కర్మకాండస్థితో వివిదిషాప్రద ఇత్యర్థః ।

తస్మాన్మార్గా న్తరాణా న్తు ప్రామాణ్యం వేదవిత్తమాః ।
ముక్తే రన్యత్ర నాస్త్యేవ క్రమేణై వాఽత్ర మానతా ॥
అతో వేదాన్తమార్గస్థో మహాదేవోఽచిరేణ తు ।
ముక్తిం దదాతి నాన్యత్ర స్థిత స్సోఽపి క్రమేణ తు ॥
దదాతి పరమాం ముక్తి మిత్యేషా శాశ్వతీ శ్రుతిః ।

వ్యాఖ్యా- ముక్తే రన్యత్రేతి। ముక్తివ్యతిరిక్త ఏవ విషయే మార్గాన్తరస్య ప్రామాణ్యం, నతు ముక్తౌ। తత్రాపి పూర్వోక్త సోపానక్రమేణ వేదమార్గప్రాప్తిద్వారా ప్రామాణ్యం, నాన్యత్రేతి వేదాంతవాక్యప్రతిపాద్యతయా శివ స్సాక్షాన్ముక్తిప్రదః । ఆగమాన్తరే త్వవస్థితానాం న సాక్షాన్ముక్తిం దదాతి, కిన్తు ఉత్తరోత్తరవిశిష్టమార్గప్రాప్త్యేతి ।

"అతో వేదస్థితో మర్త్యో హ్యన్యమార్గం సమాశ్రయేత్ ।
వేదమార్గై కనిష్ఠానాం న కించిదపి దుర్లభమ్ ॥

అత్రైవ పరమా ముక్తిః శుక్త్యయ శ్చాత్ర పుష్కలాః ।
అతోఽధికారిభేదేన మార్గా మానం న సంశయః ॥

వ్యాఖ్యా— అతోఽధికారీతి । వేదమార్గాఽనధికృతాః బౌద్ధా ర్హతాద్యధికారివిశేషాః ప్రతి తత్తన్మార్గప్రామాణ్య మస్త్యే వేత్యర్థః ।

మార్గాణాం యే విరుద్ధాంశా వేదాన్తే చ విచక్షణాః ।
తే చ మందమతీనాం చ మహామోహావృతాత్మనామ్ ॥
వాంఛామాత్రానుగుణ్యేన ప్రవృత్తా న యథార్థతః ।
దర్శయిత్వా తృణం మర్త్యో ధావన్తీం గాం యథాఽగ్రహీత్ ॥
దర్శయిత్వా తథా క్షుద్ర మిష్టం పూర్వం మహేశ్వరః ।
పశ్చాత్పాకానుగుణ్యేన దదాతి జ్ఞాన ముత్తమమ్ ॥

వ్యాఖ్యా—...అనాదిమాయయా మోహితానా మత ఏవాల్ప బుద్ధీనాం వేదానధికృతానాం బౌద్ధాదీనాం ప్రథమత ఏవాఽత్యం తసూక్ష్మ పరశివస్వరూపగ్రహణసామర్థ్యాభావా ద్వేదవిరుద్ధ మపి ప్రతిబన్ధకపాపక్షయార్థం, తత్తల్లోకప్రాప్తిరూపఫలప్రదానేన వశీకరణార్థం చ ప్రథమ మీశ్వరే ణోపదిష్టం, న పరమార్థత ఇత్యర్థః। తత్ర దృష్టాన్తం దర్శయతి- దర్శయిత్వేతి ।

యథా గాం జిఘృక్షుః పురుషః ప్రథమం తృణాదికం దర్శ యిత్వా తాం గృహ్ణాతి, ఏవం పరమేశ్వరోఽపి తత్తన్మార్గానురూప మిష్టం ప్రాపయిత్వా వశీకృత్య తత్తన్మార్గోక్తజ్ఞానేన ప్రతిబంధక పాపక్షయే సతి తేషాం చిత్తపరిపాకానుసారేణ నిశ్శ్రేయససాధనం జ్ఞానమపి క్రమేణ ప్రయచ్ఛతీత్యర్థః ॥
తస్మా దుక్తేన మార్గేణ శివేన కథితా అమీ ।
మార్గా మానం నచాఽమానం మృషావాదీ కథం శివః ॥
తథాపి వేదో మార్గాణా ముత్తమ స్సర్వసాధకః ।
సర్వ ముక్తం సమాసేన మార్గప్రామాణ్యనిర్ణయమ్ ॥'

తాత్పర్యము—నానామార్గములకు ప్రామాణ్య మెట్లో చెప్ప బడుచున్నది వినుడు—శ్రుతి-స్మృతి-ఇతిహాస- పురాణాది- వైదికశాస్త్ర

ములను, శైవపాశుపతాద్యాగమములను, బుద్ధార్హతాదివేదవిరుద్ధ గ్రంథములను, సర్వజ్ఞుడగు పరమేశ్వరుడే నిర్మించెను. ఆయాగ్రంథ కారుల పేర్లు వేరుగా గనబడుచున్నను వారందరును పరమేశ్వరనిర్మిత గ్రంథములనే సమయమకాలములలో పరమేశ్వరానుగ్రహబలమున సం క్షేపించియు, విస్తరించియు రచించిరి. కనుక ఈశ్వరనిర్మితత్వమునకు భంగము లేదు. ఇక ఈశ్వరనిర్మితము లగుటచే మార్గము లన్నిటికి ప్రామాణ్యము సిద్ధించినను, ఆ మార్గములు పరస్పరవిరుద్ధములగుటచే అప్రామాణ్యముకూడ సిద్ధించు ననుటకు వీలులేదు. ఆ విరోధము అధి కారిభేదముచే పరిహృతము కనుక ప్రామాణ్యమే. ఏ యధికారి యేమార్గమున ఎట్టి స్వరూపముగా పరమేశ్వరుని ఉపాసించునో, ఆ మార్గమున కనుగుణమైన ఆస్వరూపమునే ఆయధికారిపట్ల పరమేశ్వ రుడు వహించియుండి ఉత్తమమైన ఉత్తరోత్తరమార్గములు ఆ సాధకు నకు ప్రాప్తించునట్లు అనుగ్రహించుచుండును.

ఆయామార్గములలో ఆయాదేవతారూపముగా కీర్తింపబడిన పరమేశ్వరుడు సోపానక్రమమున సాధకునకు వేదమార్గప్రాప్తికి కారణ మగును. ఆవేదములో కర్మమార్గస్థితుడైన పరమేశ్వరుడు జ్ఞానశ్రద్ధ ననుగ్రహించును. జ్ఞానమార్గస్థితుడైన పరమేశ్వరుడు జ్ఞానద్వారా మోక్ష (నిరతిశయనిత్యసుఖ) ము ననుగ్రహించును.

కనుక ముక్తియందు మార్గాంతరములకు ప్రామాణ్యము లేదు. ఇతరవిషయమందే ప్రామాణ్యము. ముక్తిలో పూర్వోక్తప్రకారము సోపానక్రమమున వేదమార్గప్రాప్తిద్వారా ప్రామాణ్యమే.

కనుక వేదమార్గస్థితుడైన మనుజుడు అన్యమార్గము నాశ్ర యింపరాదు. వేదమార్గైకనిష్ఠులకు దుర్లభమైన దేదియు లేదు. వేద మార్గమందే భుక్తిముక్తులు పుష్కలముగా నున్నవి. వేదమార్గానధికారు లగు బౌద్ధార్హతాదులనుగూర్చి రేయేఅ వైదికమార్గములకు ప్రామాణ్యము.

ఆయామార్గములలోని వేదవిరుద్ధాంశములు పరమార్థముగా ఉపదేశింపబడలేదు. మాయామోహితులు, అల్పబుద్ధులు అగు వేద మార్గానధికారులకు వేదైకవేద్యమైన పరమసూక్ష్మమైనట్టి పరమాత్మ

స్వరూపమును గ్రహింపగల సామర్థ్యము లేకుండుటనుబట్టి వారికి ప్రతిబంధకపాపక్షయార్థము ఆయా లోకప్రాప్తిఫలదానముచే వారి వశీకరణార్థము వేదవిరుద్ధముగూడ ప్రథమముగా పరమేశ్వరునిచే ఉపదేశింపబడినది.

ఒక గోవును పట్టుకొనదలచినవాడు దానికి ముందట తృణాదికమును ఆకర్షకముగా చూపి పట్టుకొనునట్లు పరమేశ్వరుడును ఆయా మార్గముల కనుగుణమైన ఫలమును సాధకులకు వాంఛానుగుణముగా ప్రాప్తింపజేసి వశపరచుకొని ఆయామార్గములలో చెప్పబడినవిధముగా కలుగు జ్ఞానముచేత ప్రతిబంధకపాపక్షయమయినతోడనే వారివారి చిత్తపరిపాకానుసారము క్రమముగా ముక్తిసాధనమైన జ్ఞానము ననుగ్రహించును.

ఇట్లు ఆయా అవైదికమార్గములు కూడ పరమేశ్వరనిర్మితములగుటచే అట్టి యధికారులపట్ల ఉపాయ ప్రధానములతో అయి క్రమముగా తుదకు వేదమార్గాభిరుచినే కలిగించి సార్థకము లగుచున్నవి. కావున అన్నిమార్గములలో వేదమార్గమే ఉత్తమోత్తమము, సర్వార్థసాధకము. ఇది మార్గప్రామాణ్యనిర్ణయము యొక్క సంగ్రహము. అని.

దీనిసారాంశ మీశ్లోకములో జెప్పబడినది—

'వేదమార్గజనితం హి వేదనం దోషహీన మతిశోభనం సదా ।
అన్యమార్గజనితం విచారతో వేదమార్గరుచికారణం క్రమాత్ ॥'
(సూతసంహిత)

ఈనిర్ణయప్రకారము వేదమార్గమునకు చెందిన వర్ణాశ్రమధర్మములును, అధికారిభేదమునుబట్టి భేదించినవే. ఏయధికారికి ఏధర్మము విధింపబడినదో అది యాతనికి స్వధర్మము, అన్యునకు విధింపబడినది యాతనికి పరధర్మము. ఎట్టిస్థితిలో నయినను స్వధర్మమే తరణోపాయమగును కాని, పరధర్మ మెంతమాత్రము కానేరదు. అని 'శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్ స్వనుష్ఠితాత్ । స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః' ఇత్యాదిగీతావచనములచే కృష్ణపరమాత్మ బోధించెను.

ఏమార్గమునకు చెందిన విధినిషేధముల నామార్గము నాశ్రయించినవాడు తప్పక పాటించుచు తనమార్గము విడిచి అన్యమార్గమున ప్రవేశింపక నిబంధనముల నతిక్రమింపక వర్తించినపుడే భగవత్కటాక్షపాత్రు డగు నని సారాంశము.

—• వైదికమతసిద్ధాంతములపై కొన్ని ఇతరుల ఆక్షేపములకు

స మా ధా న ము లు •—

సవ్యాఖ్య—శ్రీహర్షకృత'నైషధీయచరిత'—అనుసారము స 17

—• దేహాతిరిక్తాత్మనుగూర్చి ఆక్షేపము •—

పాపము చేసినవారికి నరకము వచ్చును" అనువారి నడుగవలసియున్నది— నేను, నాది అను వ్యవహారము దేహమునకు సంబంధించియే కనబడుచున్నపుడు దేహ మాత్మ యనవలయునా? దేహాతిరిక్తమాత్మ యనవలయునా ?

దేహ మాత్మయైనపుడు, అది నశించినపుడు ఆపాప మెట్లు మిగులును ? నరక మెట్లు వచ్చును ? దేహాతిరిక్తము ఆత్మ యనినపుడు అది నశింపనిదనినపుడు పాపముచేసినది దేహమైయుండ ఏమియు చేయక దేహముకంటె భిన్నమైయున్నట్టి ఆత్మకు పాపఫలానుభవ మెట్లు ! ఏనుక దేహాతిరిక్తము ఆత్మ యనుమాట యుక్తివిరుద్ధము.

'మృతః స్మరతి జన్మాని మృతే కర్మఫలోర్మయః ।
అన్యభుక్తై ర్మృతే తృప్తి రిత్యలం ధూర్తవార్తయా ॥'

మరణించినవాడు తనపూర్వజన్మవిషయములను స్మరించుననియు, మరణించినతరువాత పుణ్యాపాపఫలము లనుభవమునకు వచ్చుననియు, అన్యులు భుజించినదానిచే మరణించినవానికి తృప్తి'కలుగు ననియు చెప్పునట్టివి వంచకుల మాటలు. అని.

సమాధానము—

'యాచతః స్వగయాశ్రాద్ధం ప్రేతస్యావిశ్య కంచన ।
నానాదేశజనోపజ్ఞాః ప్రత్యేమి న కథాః కథమ్ ॥'

పాపవశమున మరణానంతరము పిశాచాదిజన్మ రాగా తన సంబంధినో మరియొకనినో సూక్ష్మరూపముతో ఆవేశించి 'నాదుర్గతి తొలగు,

టకు నాకు గయాశ్రాద్ధము చేయుము; తీర్థయాత్ర చేయుము; ప్రయాగలో మాఘస్నానము చేయుము; నాసద్గతికి ఇది చేయుము; అది చేయుము.' అనుచు పుణ్యవిశేషమును యాచించుచు అట్లుచేసిన నేను విడిచిపెట్టెద నని చెప్పునట్టి మృతులైనవారి మాటలను స్వయముగా గాని, అనేకదేశములలోని ప్రామాణికులవలనగాని వినియుండలేదా ?

అమృతప్రాణులు పూర్వజన్మవృత్తాంతము చెప్పుచుండుట, ఇంత సొత్తు ఇక్కడ భూమిలో దాచితిని చూడుడని చెప్పుచుండుట, అది యట్లే నిజమగుచుండుట, దేశాంతరకాలాంతరగాథలను జరిగినట్లు చెప్పుచుండుట, గయాశ్రాద్ధాదులు చేసినతరువాత ఆవ్యక్తిని విడిచి వేయుచుండుట, దానిచే సద్గతి కలిగినట్లు భావింపబడుచుండుట ఇత్యాది ప్రత్యక్షసిద్ధవిషయములు విశ్వసనీయములు కావా ?

దీనినిబట్టి తీర్థాదిప్రభావము, అన్యభుక్తముచే మృతప్రాణికి తృప్తి, దేహాంతరప్రాప్తి, పరలోకప్రాప్తి, పుణ్యాపాపమూలకస్వర్గనరకాదిప్రాప్తి ఇత్యాదులకు ప్రామాణ్యము సిద్ధించునది. దీనికంతకు దేహాత్మవాదము విరుద్ధము. కాబట్టి దేహాతిరిక్తమే ఆత్మ యనియు, దాని నాశ్రయించియున్నవి పుణ్యాపాపములనియు, వాని ననుభవింపక తప్పదనియు సమాధానము.

—• పరలోకమునుగూర్చి ఆక్షేపము •—

పరలోకము పరలోక మని చెప్పుచుందురు. పరలోకము చూచి వచ్చినవాడేడి ? అని.

సమాధానము—

'నీతానాం యమదూతేన నామభ్రాన్త్యే రుపాగతౌ ।
శ్రద్ధత్సే సంవదన్తి న పరలోకకథాం కథమ్ ॥'

యమధర్మరాజు యమదూతకు ఒకని పేరు చెప్పి ఆతని ప్రాణమును ఆకర్షించి తీసికొనిరమ్మని యాజ్ఞాపింప యమదూతలు భ్రాంతిచే ఆపేరుగల మరియొకనిని తీసికొనివెళ్ళుటలో స్థూలశరీరమునుండి సూక్ష్మశరీరమును విడదీసి తీసికొనిపెళ్ళినపుడు చిత్రగుప్తుడో యమధర్మరాజో 'నీకు చెప్పినది యీతనిగూర్చి కాదు; ఈతనిని యథాస్థాన

మున ప్రవేశపెట్టవలయును' అని యాదూతల కుపదేశించుటచే ఆసూక్ష్మ శరీరము మరల వచ్చి ఆ స్థూలశరీరములో ప్రవేశించినపుడు ఆతని సన్నిధానవర్తులు 'ఇంతవరకు ఏమి జరిగినది ? నీవెక్కడకు వెళ్ళినావు? ఏమి చూచినావు ?' అనుచు ఆవ్యక్తిని ప్రశ్నింప 'యమదూతలచే యమునియొద్దకు తీసికొనిపోబడితిని; ఆతని దయచేత ఆయుశ్శేషము వలన మరల నేను పంపివేయబడితిని.' అనిచెప్పుచు స్వర్గముయొక్క నరకముయొక్క పరిస్థితులు ఆర్ష గ్రంథములలో చెప్పబడినట్లే ఆవ్యక్తిచే కీర్తింపబడుచుండుట వినలేదా ? అది పరలోకాస్తిత్వములో ప్రమాణముకాదా ? కనుక ఇట్లు పరలోకము జూచివచ్చినవా డున్నాడని సమాధానము.

—• ఈ శ్రీహర్షోక్తికి నేటి ప్రత్యక్షనిదర్శనము •—
సంస్కృతపత్రిక—27-8-55.

"మధ్యమప్రదేశీయ రాయగఢమండలస్థిత సారంగగఢపత్రాలయాన్తర్గత ఉలఖరనివాసీ, ఆయుర్వేదికౌషధాలయప్రధానచికిత్సకః శ్రీవ్రజమోహనశర్మ వైద్యశాస్త్రీ లిఖతి—గతే 31-7-55 దినాంకే ప్రాతః సార్ధసప్తవాదనవేలాయామేకో వృద్ధ ఆగత్య మా మవదత్। యన్మే భాతృపుత్రస్య దశా పరమచిన్త్యా। అతః కృపయా తస్మై సత్వర మౌషధం దేహి। అహం తేన సహ తత్క్షణమేవ గతః రుగ్ణస్య పరీక్షామకరవం। తస్య నాడీ న చలతి స్మ। కఫావరుద్ధకంఠః కథంచిన్మధ్యేమధ్యే శ్వసతి స్మ। స్వేదేనార్ద్రం శరీరం శీతల మాసీత్।

అథాపి భగవన్తం ధన్వంతరిం సంస్మృత్య...లక్ష్మీవిలాస-శ్లేష్మాన్తక-రససిందూరాదిరసానాంమిశ్రణం ప్రదాయ అహం పరావృత్తః।

మధ్యాహ్నే స శరీర మత్యజత్। శ్మశానం స నీతః। భూమిఖననమప్యర్ధం సంవృత్తమ్। అథ స శవో యస్యాస్థరై కప్రహారపూర్వం మృతోహస్త ముత్థాపయాంచకార। ధావత ధావత ఇతి జనా అవదన్। సర్వైస్తన్ముఖా ద్వస్త్రం దూరీకృతం నిరీక్షితం చ...స శనై రవదత్—మమ మేరుదండం కాష్ఠదండేన పీడితం వర్తతే। నికటే తటాకం వీక్ష్యోక్తవాన్ కిమర్థ మహ మత్ర బద్ధ్వాఽఽనీతః? సత్వరం తద్రజ్జుబంధనాని శిథిలీకృతాని। అనేకేజనాః ప్రేతోఽయ మిత్యుక్త్వా

పలాయన మకుర్వన్। స గృహమానీతః। చికిత్సయా స్వస్థోఽధునా దుగ్ధం పిబతి। సర్వైర్జనైస్సహ లోకాన్తరవార్తామపి కరోతి।

మధ్యప్రదేశములోని ఉలఖరగ్రామనివాసి, ఆయుర్వేదౌషధాలయప్రధానచికిత్సకుడు అగు శ్రీవ్రజమోహనశర్మ యిట్లు ప్రకటించుచుండెను—31-7-1955 నాడు ప్రాతఃకాలము 7-30 గం. వేళ నొక వృద్ధుడు వచ్చి తనసోదరపుత్రుని స్థితి దుఃఖతరమైయున్నది, త్వరగా వచ్చి ఔషధ మివ్వవలసినదని కోరగా నేనాతనివెంట వెళ్ళి రోగిని పరీక్షించితిని; నాడి చలించుటలేదు; కఫము అధికముగా నున్నది; అయినను ధన్వంతరిభగవానుని ధ్యానించి మందిచ్చి యింటికి వచ్చితిని; మధ్యాహ్నమాతడు శరీరమువిడిచెను; శ్మశానమునకు దీసికొనిపోబడెను; భూమిఖననము సగమయినది; అట్టిస్థితిలో నప్పటికి ఒకటిన్నరజాము క్రిందట మృతుడైనవాడు హస్తమును కదిపెను. అతని ముఖమునుండి వస్త్రమును తొలగించి చూడగా నాతడు మెల్లన నిట్లనెను—నా వెన్నును కట్టిగుచ్చుకొనుచున్నది. అని. ఎదుట తటాకమునుచూచి నన్నిక్కడకు తీసికొనివచ్చినారేమి? అనిన వెంటనే వారు కట్లు విప్పివేసినారు. ఆతడు ఇంటికి తీసికొనిరాబడి చికిత్సచేత తేరుకొనుచు ప్రస్తుతము క్షీరపానముచేయుచున్నాడు. జనులకు లోకాన్తరగాథను చెప్పుచున్నాడు.

దీనినిబట్టి 'పరలోకము జూచి వచ్చినవాడేడి?' అనుమాటకు ఇడిగో అని సమాధానము.

మరియొకనిదర్శనము—సంస్కృతపత్రిక— 6-3-56.

—• యమదూతానాం భ్రాంతిః। •—

28 ఫరవర్యాం కానపురస్య రానీగంజే బదలూ—ఆభీరః క్షేత్రే కార్యం కుర్వన్ సహసా పతితో మృతః। గ్రామీణా యదా తస్య శవం శ్మశానాయ నయన్తిస్మ మధ్యేమార్గం జాగృతి మాప।

అయ ముక్తవాన్—యమదూతాః కల్లూచర్మకారమానేతు మాగతా భ్రాన్త్యా మాం నిన్యుః, యత స్స ఇవ అహమపి పంగుః।

జనాః కల్లూచర్మకారగృహం జగ్ముః। తత్ర తస్య శవో భూమౌ దృష్టః। అధార్మికాః కి మత్ర విశ్వాసం కరిష్యన్తి?

ది. 23-2-56న కాన్పూరుయొక్క రానీగంజ్‌లో బదలు అను ఒకగొల్ల పొలములో పనిజేయుచు హఠాత్తుగా పడిపోయి మరణించెను. అతని శవమును గ్రామస్థులు తీసికొని శ్మశానమునకు వెళ్ళుచున్నపుడు మధ్యమార్గములో ప్రాణము వచ్చినది. అప్పు డాతడిట్లు చెప్పెను— యమదూతలు కల్లూ అను చర్మకారుని తీసికొనివెళ్ళుటకు వచ్చి భ్రాంతిచే నన్ను దీసికొని వెళ్ళినారు. నేనును అతనివలె కుంటివాడనగుటచేత. అని. అది విని జనులు ఆచర్మకారుని యింటికి వెళ్ళి చూడగా నతని శవము గోచరించినది. అధార్మికులు దీనిని విశ్వసింతురా?

ఈనిదర్శనము 'సీతానాం యమదూతేన నామభ్రాన్తేః' అను శ్రీహర్ష మహాకవి యథార్థవాదిత్వమును చాటుచున్నది.

—• మన్వాదిస్మృతిధర్మములనుగూర్చి ఆక్షేపము •—

"ధర్మాధర్మౌ మను ర్జల్ప న్న శక్యార్జనవర్జనౌ ।
వ్యాజా న్మండలదండార్థీ శ్రద్ధదాయి ముధాஉబుధైః ॥"

బహువ్యయ— ప్రయాస— సాధ్యములు, ఎవ్వనికిని చేయుటకు శక్యముకానట్టివి అగు పనులు ధర్మమనుచు, అవశ్యకర్తవ్యములని విధించుచు; ఇంద్రియనిరోధమూలకములు, ఎవ్వనికిని మానుటకు శక్యముకానట్టివి అగు పనులు అధర్మమనుచు అకర్తవ్యము లని నిషేధించుచు మనుస్మృతిని నిర్మించిన స్వాయంభువమనువు తాను మన్వంతరాధిపతి యగుటచేతను, ఆదిరాజగుటచేతను ధర్మాధర్మశాసన వ్యాజమున ప్రజలను శిక్షించుచు తన్మూలమున ప్రజలనుండి సమృద్ధిగా ధనము రాబట్టుటకే ఆపని చేసినాడని చెప్పవలెను. అంతియకాని స్వర్గము, నరకము అను లోకాంతరము లున్నవని, ధర్మమార్గముచే స్వర్గప్రాప్తి యని, అధర్మమార్గముచే నరకప్రాప్తియని బోధించుటకు కాదు. ఆలోచన లేనివారు భ్రాంతిపడుచున్నారు.

"శ్రుతిస్మృత్యర్థబోధేషు హ్యైకమత్యం మహాధియామ్ ।
వ్యాఖ్యా బుద్ధిబలాపేక్షా సా నోపేక్ష్యా సుఖోన్ముఖైః ॥

శ్రుతిస్మృతులకు అర్థము చెప్పుటలో ఐకమత్యమనునది లేదు. వారివారి బుద్ధిబలముతో అది వ్యాఖ్యానము చేయబడినది. అట్టిది సర్వ

మప్రమాణము. సుఖపర్యవసాయి యగు వ్యాఖ్యానమే ఆదర ణీయము. అని.

—• సమాధానము •—

"వేదై స్తద్ద్వేషిభి స్తద్వత్ స్థిరం మతశతైః కృతమ్ ।
పరం క స్తే పరం వాచా లోకం లోకాయత త్యజేత్ ॥"

వేదములచేత స్థిరీకృతమై, వేదానుసారిస్మృతిపురాణాదులచేత అనంతమతములతో నేమి, మీమాంసాశాస్త్రములచేత, వాదప్రతి వాదప్రక్రియలతో నేమి ధ్రువపరుపబడియున్న పరలోకమును నిర్యు క్తికమైన నీమాటనే పట్టుకొని లేదనుకొనువా డెవ్వడు ?

యుక్తిప్రమాణానుభవములనుబట్టి అందరును పరలోకము నంగీ కరించియే యున్నారు.

"సమజ్ఞానాల్పభూయిష్ఠపాన్థవైమత్యే మేత్య యమ్ ।
లోకే ప్రియాసి పన్థానం పరలోకే న తం కుతః ॥"

లోకములో ఒక గమ్యస్థానమునకు మార్గము దెలిసికొనదలచి సమానబుద్ధికల బాటసారుల నడిగినపుడు కొంద రొకమార్గమును, మరి కొందరు మరియొకమార్గమును చెప్పినయెడల మార్గసందేహము రాగా కొద్దిమందిచెప్పిన మార్గమునుగాక చాలమందిచెప్పిన మార్గమును నీవే అనుసరించివెళ్ళుచున్నావా ? లేదా ?

అయిదుగురుచెప్పినదానికంటె ఏబదిమందిచెప్పినది ప్రమాణ మని నీవు భావించుచున్నావా ? లేదా ?

అట్లు పరలోకవిషయమైకూడ అల్పసంఖ్యాకులు చెప్పినది కాదని అత్యధికసంఖ్యాకులు చెప్పిన పరలోకమార్గమగు ధర్మమును ఏల నీవనుసరింపవు ?

"స్వకన్యా మన్యసా త్కర్తుం విశ్వానుమతిదృశ్వనః ।
లోకే పరత్ర లోకస్య కస్య న స్యా ద్దృఢం మనః ॥"

తన కన్యను ఒకానొకవరునకు సమర్పించి ఆతని యధీనము చేయుటకు శ్రుతిస్మృతిపురాణాది సర్వగ్రంథములును, సర్వజనులును అనుమతి నిచ్చుచున్నవిషయము జూచుచు స్వయముగా కూడ అట్లే చేయుచున్న యేమనుజునకు పరలోకమందు విశ్వాసము లేకుండును?

సర్వజనులును పరలోకబాధభీతిచేతనే తమతమ కన్యలను ఆయా వరులకు సమర్పించుచున్నారు. పరలోకమే లేనియెడల కన్యకలను అన్యులచేతిలో ఏల పెట్టుదురు ?

ఈ యాచారమును సమ్మతింపనివాడు లేడు. ఉన్నయెడల తన కన్యను తానే పరిగ్రహింపవలసియుండును.

కనుక సర్వసమ్మతమైనందున కన్యాదానము నంగీకరించినట్లే పరలోకమును అంగీకరింపుము.

"కస్మిన్నపి మతే సత్యే హాతా స్సర్వమతత్యజః ।
తద్భ్రష్ట్యా వ్యర్థతామాత్రి మనర్థ స్తు న ధర్మజః ॥"

ధర్మపరలోకాదిప్రతిపాదకము లగు బహుమతములలో ఏ యొక్కమత మయినను సత్యముగా నీచే అంగీకరింపబడనయెడల సర్వ మతములకు అసత్యత్వ మెట్లు నీవు చెప్పగలవు ?

వైదికమతము లన్నియు అసత్యమనువారు ఏయొక్కమతము నయినను పత్య మని యంగీకరింతురా ? లేదా ?

అంగీకరించినపక్షములో కన్యాదానాదిప్రతిపాదకమైనట్టి ఒక్క మతమును సత్యమని యంగీకరించినపుడు సర్వమప్రమాణ మనుమాట విరుద్ధమై వైదికసిద్ధాంతము నిర్దుష్టమనియే తేలును.

ఇక సత్యమని యేమతమును అంగీకరింపమందురా ? అప్పుడు నాస్తికమతముకూడ వానితోబాటు అసత్యమే అగునుగనుక అట్టి నాస్తికమతముచే వైదికమతనిరసనము సంభవింపనందున వైదికమతము నిర్దుష్టమే అగును.

వైదికసిద్ధాంతములైన మాతృగమననిషేధమ్ము, కన్యాదాన విధానము ఇత్యాద్యంశములను స్వయముగాకూడ పరిపాలించుచుండి ఆయంశములకు సత్యత్వ మంగీకరించుచుండి సర్వమతమసంగతమనుచు వైదికమతమును నిరసింపబూనుట అయుక్తము.

మీరంగీకరించెడి అంశములనుబట్టి విహితములైన వైదికమతమందలి ఇతరాంశములుకూడ సత్యము లనవలసినదే. వాని నుల్లంఘించుట పాపహేతు వని ఒప్పుకొనవలసినదే. పుత్రేష్ట్యాదివిధానములచేత ఒకానొకచోట పుత్రజన్మాదిఫలము కలుగనియెడల కర్తవైగుణ్యమున

నట్లు జరిగిన దనుకొనవలసినదే. ధర్మాచరణ మనర్థకర మెన్నడును కానేరదు. వైదికసిద్ధాంత మప్రమాణము కానేరదు.

"క్వాపి సర్వై రవైమత్యా త్ప్రతీత్యా దన్యథా క్వచిత్ ।
స్థాతవ్యం శ్రౌత ఏవ స్యా ద్ధర్మే శేషేఽపి తత్స్మృతేః ॥"

శ్రుతిస్మృతుల కర్థము చెప్పుటలో ఐకమత్యము లేదను నెపముతో వేదోక్తధర్మమును నిరసించుట తగదు. సర్వులకు సమ్మతము లైన అహింసా— కన్యాదానాదివేదోక్తధర్మములందే పాపభీతిచే మీరును నిలిచియున్నారు. మీరంగీకరించిన అవి వేదోక్తధర్మములే. వేదవిహితధర్మములలో గొన్నిటిని (కన్యాదానాదులు) మీరును అవలంబించుటచేతను, వేదనిషిద్ధములలో గొన్నిటిని (మాతృగమనాదులు) మీరును వర్జించుటచేతను అదృష్టాంతమున మిగిలిన విధినిషేధాంశములనుగూడ వేదోక్తములు గనుక మీరంగీకరింపవలసినదే. ఉల్లంఘించుట పాపహేతువే.

—• పరమేశ్వరునిగూర్చి ఆక్షేపము •—

"దేవ శ్చే దస్తి సర్వజ్ఞః కరుణాభా గవన్ధ్యవాక్ ।
తత్కిం వాగ్వ్యయమాత్రా న్నః కృతార్థయతి నార్థినః ॥"

సర్వజ్ఞుడు, సర్వసమర్థుడు, సత్య (అమోఘ) వచనుడు, సర్వవ్యాపకుడు, పరమకారుణికుడు అగు దేవుడుండుచో నిజమైనయెడల భుక్తిముక్తులకొరకు పరితపించుచున్న ప్రజలకు అభీష్టసిద్ధిని తన వాగ్వ్యాపారమాత్రమునచే కలుగజేసి కృతార్థుల నేల చేయడు ? దేవు డున్నయెడల కృతార్థులను చేసియుండును. కృతార్థులను చేయకుండుటచేత దేవుడు లేడు.

"భవినాం భావనా దుఃఖం స్వకర్మజ మపీశ్వరః ।
స్యాదకారణవైరీ నః కారణా దపరే పరే ॥"

"దేవుడు కర్మఫలదాత; దుఃఖహేతువయిన ప్రాణికర్మనుబట్టి వారికి దుఃఖమే కలుగుచున్నది" అను పక్షములో వారి కర్మనుబట్టి వచ్చు దుఃఖములో దేవుడు కర్మఫలదాత యనుపేరుతో నిమిత్తమగుచున్నందున సకారణవైరులవలెగాక దేవుడు నిష్కారణవైరి యగు

చున్నాడు. దయాళుత్వాదిగుణములు లేనివాడగుచున్నాడు. ఇట్లు చూడగా కర్మకే ప్రాధాన్యముకనుక దేవుడు లేడు. అని.

—• సమాధానము •—

"మానవాఽశక్యనిర్మాణా సూర్మ్యాద్యంకబిలా శిలా
న శ్రద్ధాపయతే ముగ్ధా స్తిక్షికాధ్వని వః కథమ్ ॥"

గండకీనదిలో సాలగ్రామశిలలు కూర్మ- వరాహ- నరసింహాది- వివిధాకృతులుగల బిలములు కలవై, మానవులకు అట్లు నిర్మింపశక్యము కానివై ప్రత్యక్షసిద్ధ మగుచున్నవి.

మానవులకు అశక్యనిర్మాణము కలిగి వివిధవిచిత్రాకృతిశోభిత ములై గండకీనదీసంభవము లగు ఆసాలగ్రామములు ఈశ్వరేచ్ఛా కృతములే అని వేదోక్తమైన ఈశ్వరసిద్ధాంతమందు మీకు విశ్వాసము కలుగనే లేదా ? చిత్రము!

ఆప్రత్యక్షసాలగ్రామములును ఈశ్వరు డున్నట్లు ధ్రువపరచుచు న్నవి. ప్రాణికర్మయే ప్రాణులసుఖదుఃఖములకు కారణమైయున్నను ఆకర్మ జడమగుటచే ఈప్రాణికి ఇప్పుడు ఇట్టిఫలమును ఈవిధముగా నీయవలయు నను జ్ఞానము లేనిదిగనుక లోకులకు అప్రత్యక్షమైన ఆకర్మమునుబట్టి యథాతథముగా ఫల మిచ్చుచు పరమేశ్వరు డున్నా డని స్వకర్మవిరుద్ధముగా పరమేశ్వరుడు ఫలమీయడని, తెలిసికొని వేద మతసిద్ధాంతము సత్యమని గ్రహింపుము. అని.

ఇట్లు ప్రత్యక్షసిద్ధము కానిది అప్రమాణమనువారి వాదములోని అంశములు ప్రత్యక్షసిద్ధము లనియే శ్రీహర్ష మహాకవి నైషధకావ్య ములో నిరూపించియుండె నని తెలిసికొనవలయును.

# వైదికమతసిద్ధాంతములు.

## 1 —• వేదము అపౌరుషేయము •—

'నేను ఈగ్రంథమును రచింపవలయును.' అను బుద్ధితో ప్రయత్న పూర్వకముగా పురుషకృతమైన గ్రంథము పౌరుషేయ మని, సకర్తృక మని చెప్పబడును.

అట్లు రచింపబడిన రామాయణ— మహాభారతాదిగ్రంథములు పౌరుషేయములు; సకర్తృకములు అట్లు రచింపబడని వేదము అపౌరుషేయము; అకర్తృకము; నిత్యము.

ఈవిషయము మంజూషలో చెప్పబడినది——

"అపౌరుషేయత్వం స్తు ఇదం మయా కర్తవ్యమితి బుద్ధిపూర్వకం యత్నేనాఽకరణాత్ ।"

ఇంకొకటి——ఒక అనుపూర్వీనియమములేక స్వేచ్ఛాకృతానుపూర్వీభేదముతో చెప్పబడిన గ్రంథము పౌరుషేయము. ఆనుపూర్వీభేద మెన్నడు లేక ఎప్పు డయినను ఏకవిధానుపూర్వితోడనే చెప్పబడు గ్రంథము అపౌరుషేయము. ఇట్టిది వేదమే.

ఈవిషయము సాంఖ్యతత్త్వకౌముదిలో చెప్పబడినది——

"నచాఽనుపూర్వీవిశేషస్య పురుషాధీనతయా పౌరుషేయత్వాపత్తి రితి వాచ్యం। సజాతీయోచ్చారణానపేక్షోచ్చారణవిషయత్వరూపపౌరుషేయత్వాభావాత్ ।

సర్గాద్యకాలే ఈశ్వరః పూర్వసర్గసిద్ధానుపూర్వీకం వేదం జ్ఞాత్వా తథైవాఽఽచఖ్యౌ; నతు విజాతీయానుపూర్వీకం, తాదృశవేదాధ్యయనస్యైవ అభ్యుదయనిశ్శ్రేయసహేతుత్వాత్ । అన్యథా తస్య వాగ్వజ్రతయాఽనర్థహేతుత్వాపత్తే రితి। మహాభారతాదౌ చ సజాతీయోచ్చారణానపేక్షోచ్చారణవిషయత్వాన్నాఽపౌరుషేయత్వాపత్తి రితి।"

ఈశ్వరుడు సృష్ట్యాదిని పూర్వసృష్టిలో ఎట్టివర్ణానుపూర్వికలిగి వేదమున్నదో అవర్ణానుపూర్విగనే వేదము నుపదేశించియుండెను. మార్పులేని అట్టి వేదముయొక్క అధ్యయనమే శ్రేయోదాయకము. స్వరవ్యత్యాసముగాని, వర్ణవ్యత్యాసముగాని వచ్చినయెడల ప్రమాదకరమని—'స వాగ్వజ్రో యజమానం హినస్తి' అను వేదవాక్యమే బోధించుచున్నది. కనుక వర్ణానుపూర్వీభేదము లేకుండ ఏకవిధముగనే ప్రతిసృష్ట్యాదిని వేదము ఈశ్వరునిచే ప్రసాదింపబడుచున్నందున వేదమ పౌరుషేయము. ఇతరగ్రంథములు పౌరుషేయములు. అనితాత్పర్యము.

ఇంకొకటి—ప్రమాణాంతర- గోచరములగు విషయములను వెల్లడించుటకై రచింపఁబడిన గ్రంథము పౌరుషేయము. ప్రమాణాంతర-అగోచరములగు విషయములను అనగా అలౌకికోపాయములను వెల్లడించు గ్రంథము అపౌరుషేయము; అది వేదమే.

ఇంకొకటి—ఏగ్రంథమందు గ్రంథకారుని నామము ఉల్లేఖింపబడియుండునో ఆగ్రంథము పౌరుషేయమనుట నిర్వివాదము. గ్రంథకారుని నామోల్లేఖనము లేకుండినను గ్రంథకారుడు మొదలుకొని గురుశిష్యపరంపరచేత అవిచ్ఛిన్నముగా ఏగ్రంథముయొక్క కర్త స్మరింపబడుచుండునో ఆగ్రంథముకూడ పౌరుషేయ మనుట నిర్వివాదమే. గ్రంథకారుని నామ ముల్లేఖింపబడియుండక పాఠసంప్రదాయము విచ్ఛిన్నమైనందున గ్రంథకర్త స్మరింపబడక ఏగ్రంథముండునో ఆగ్రంథము పౌరుషేయమనుట సందేహగ్రస్త మగును.

పాఠసంప్రదాయము అవిచ్ఛిన్నమైయుండి కర్త స్మరింపఁబడనపుడు దానికి కారణము కర్త లేకుండుటే యని చెప్పక తప్పదు. కనుక వేదమునకు అపౌరుషేయత్వము సిద్ధించినది.

(సర్వదర్శనసంగ్రహవ్యాఖ్య)

—• వేదమునకు కర్తలున్నట్లు కనబడు
వేదవాక్యములకు తాత్పర్యము •—

వేదము అపౌరుషేయము, అకర్తృకము, నిత్యము అను వాదమునకు బాధకముగా వేదోత్పత్తిని, వేదకర్తను చెప్పుచున్న వాక్యము లిట్లున్నవి—

1 'అస్య మహతో భూతస్య నిశ్శ్వసితమేతత్ యదృగ్వేదో యజుర్వేద స్సామవేదోఽథర్వాంగిరసః (బృ)

2 తస్మా ద్యజ్ఞా త్సర్వహుతః ఋచ స్సామాని జజ్ఞిరే। ఛన్దాంసి జజ్ఞిరే తస్మా ద్యజు స్తస్మా దజాయత। (తై)

3 ఇదం సర్వ మసృజత ఋచో యజూంషి సామాని। (బృ)

4 తేపానా త్త్రయో వేదా అజాయన్త।

5 ఋగ్వేద ఏవాఽగ్నే రజాయత। యజుర్వేదో వాయోః। సామవేద ఆదిత్యాత్। (ఐ. బ్రా)

6 అనన్తరం చ వక్త్రేభ్యో వేదా స్తస్య వినిర్గతాః .

7 యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై తంగ్ హ దేవమ్...శరణ మహం ప్రపద్యే ।

8 మన్త్రకృతో వృణీతే నమ ఋషిభ్యో మన్త్రకృద్భ్యః ॥'

ఈవాక్యములలో 1, 2, 3, 7 వాక్యములు పరమేశ్వరునివలన వేదము లావిర్భవించినట్లు చెప్పుచున్నవి. నాల్గవవాక్యము తపోవిశేషము వలన వేదత్రియము ఆవిర్భవించిన దని చెప్పుచున్నది. అయిదవవా వాక్యము అగ్నివలన ఋగ్వేదము, వాయువువలన యజుర్వేదము, ఆదిత్యునివలన సామవేదము ఆవిర్భవించినట్లు చెప్పుచున్నది.

ఆరవవాక్యము బ్రహ్మయొక్క చతుర్ముఖములవలన చతుర్వేద ములు ఆవిర్భవించిన వని చెప్పుచున్నది.

ఎనిమిదవవాక్యము ఋషులు మంత్రకర్త లని చెప్పుచున్నది.

ఇట్లు ఈవాక్యములు పరస్పరవిరుద్ధముగా కర్తను ప్రతిపాదిం చున్నవి.

విరుద్ధార్థబోధకము లగు ఈ వాక్యములనుబట్టికొని విశేషా కారముగా వేదమునకు కర్త యీతడని నిర్ణయించుట శక్యముకాదు.

ఇక సామాన్యాకారముగా వేదకర్త ఒకడున్నట్లు ఆ వాక్య ముల వలన తెలుచున్న దను మాటయైనను వేదమునకు కర్త లేనే లేడని చెప్పుచున్న— "న కశ్చి ద్వేదకర్తా చ" అను పరాశరస్మృతివచన మునకు విరుద్ధము.

మరియు వేదకర్త యొకడుండినపక్షములో ఆతనిచే రచింపబడ నప్పుడు వేదము లేకుండునుగనుక వేదముఅనిత్యమనవలసివచ్చును. ఇది వేదము నిత్య మని చెప్పుచున్న యీవాక్యములకు విరుద్ధము—

"అనాదినిధనా నిత్యా వా గుత్సృష్టా స్వయంభువా ।

వాచా విరూప నిత్యయా అతఏవ చ నిత్యత్వమ్ ॥"

కనుక ఈ శ్రుతిస్మృతి బ్రహ్మసూత్రములనుబట్టి వేదము నిత్య మనవలయును. అది నిత్యమనుటకు వేదమునకు కర్త లేడనవలయును. అట్లనినపుడు వేదకర్తను వేదోత్పత్తిని చెప్పు పై వాక్యములకు తాత్ప ర్యము వర్ణింపవలయును.

ఆ తాత్పర్యము— వేదాభివ్యక్తియేకాని, వేదోత్పత్తి కాదు. వేదాభివ్యంజకత్వమేకాని, వేదకర్తృత్వము కాదు. అని. ఈవిషయము స్పష్టముగా చెప్పబడినది చూడుడు—

పరాశరమాధవీయము—

"న కశ్చి ద్వేదకర్తా చ... ।"

వ్యా- స్మృతినిర్ణేతౄణాం మన్వాదీనాం స్మృతికర్తృత్వ దర్శనాత్ తథైవ శ్రుతినిర్ణేతౄణామపి వేదకర్తృత్వ మాశంక్య నిరాచష్టే- న కశ్చిదితి ।

న తావద్వ్యాసో వేదకర్తా, తస్య విభాగమాత్ర కారిత్వాత్। నాపి చతుర్ముఖః, ఈశ్వరేణ చతుర్ముఖాయ వేదప్రదానాత్। నాపి జగదీశ్వరః, తస్యవేదాభివ్యంజకత్వాత్ । తదుక్తం మత్స్యపురాణే—

"అస్య ధర్మస్య సర్వజ్ఞః కల్పాదౌ పరమేశ్వరః ।
వ్యంజకః కేవలం విప్రా నైవ కర్తా న సంశయః ॥
బ్రహ్మాణం మునయః పూర్వం సృష్ట్వా తస్మై మహేశ్వరః ।
దత్త్వా నఖిలా న్వేదా న్విప్రా ఆత్మని సుస్థితాన్ ॥
బ్రహ్మణా చోదితో విష్ణు ర్వ్యాసరూపీ ద్విజోత్తమాః ।
హితాయ సర్వభూతానాం వేదభేదాన్ కరోతి సః ॥

ఇతి । ఇతరేషా న్తు తత్కర్తృత్వం దూరాపాస్తమ్ । ఉపపత్తయస్తు వేదాఽపౌరుషేయత్వాధికరణే ద్రష్టవ్యాః ।

నను శాస్త్రయోనిత్వాధికరణే బ్రహ్మణః సర్వజ్ఞత్వ సర్వశక్తిత్వ దార్ఢ్యాయ వేదకర్తృత్వం వ్యాసేన సూత్రితమ్। నను తేనైవ దేవతాధికరణే వేదనిత్యత్వమపి— "అత ఏవ చ నిత్యత్వమ్" ఇతి సూత్రేణ ప్రదర్శితమ్। ఏవంతర్హి విరోధః పరిహర్తవ్యః ।

ఉచ్యతే— వర్ణానాం పదార్థతత్సంబన్ధానాం వాక్యానాం చ అనిత్యత్వం వైశేషికకాణాదాదయో వర్ణయన్తి। తాన్ ప్రతి మీమాంసకాః ప్రథమపాదే కాలాకాశాదీనామివ వర్ణానాం నిత్యత్వం వర్ణయామాసుః ।

వ్యవహారే భట్టనయ ఇత్యభ్యుపగతిం సూచయితుం దేవతాధికరణే తదేవ వ్యావహారికం నిత్యత్వం సూత్రితమ్। అతః కాళిదాసాదిగ్రంథేష్విద వేదేషు అర్థావబోధపూర్వికాయాః పదవిశేషావాపోద్వాపాభ్యాం ప్రవృత్తాయాః వాక్యరచనాయా అభావాత్ అపౌరుషేయత్వం యుక్తమ్।

బ్రహ్మవివర్తత్వం వియదాదేరివ వేదస్యాప్యస్తీతి మత్వా శాస్త్రయోనిత్వాధికరణే వేదకర్తృత్వం బ్రహ్మణో దర్శితమ్। అతఏవ భట్టపాదాః-సత్యపి పురుషసంబన్ధే స్వాతన్త్ర్యం నివారయామాసుః-

"యత్నతః ప్రతిషేధ్యా నః పురుషాణాం స్వతన్త్రతా" ఇతి। తస్మాత్ "స్వతన్త్రః కర్తా" ఇత్యనేన లక్షణేన లక్షితః కర్తా న కోఽపి వేదస్యాఽస్తి।"

తాత్పర్యము— స్మృతికర్తలున్నారు గాని, వేదకర్త యెవ్వడును లేడు. వ్యాసమహర్షి వేదకర్తకాడు, ఆమహర్షి వేదవిభాగమాత్రకారికనుక. చతుర్ముఖుడును వేదకర్త కాడు, ఈశ్వరునిచేత ఆ చతుర్ముఖునకు వేద మనుగ్రహింపబడినది కనుక. ఆ జగదీశ్వరుడును వేదకర్తకాడు, ఆతడు వేదమును అభివ్యక్తము చేసినవాడుగనుక.

ఈ విషయము మత్స్యపురాణమం దిట్లు చెప్పబడినది—

సర్వజ్ఞుడయిన పరమేశ్వరుడు కల్పాదియందు వేదమునకు అభివ్యంజకుడే కాని కర్త కాడు. నిస్సంశయము.

ఆ పరమేశ్వరుడు బ్రహ్మను సృష్టించి తనయందు సుస్థితములై యున్న వేదములను ఆబ్రహ్మకు అనుగ్రహించెను. బ్రహ్మచేత ప్రార్థింపబడిన శ్రీహరి వ్యాసావతారము ధరించి లోకహితమునకై వేదవిభాగము చేయుచుండెను. అని.

ఇట్లు వీరికే లేని కర్తృత్వము ఎవ్వరికో కలదని కల్పించువారి మాటలు త్రోసివేయబడినవి. ఈ సిద్ధాంతమునకు తగిన ఉపపత్తులన్నియు వేదాపౌరుషేయత్వాధికరణమ్ములో చూడవలయును.

అయితే "శాస్త్రయోనిత్వాత్" అను బ్రహ్మసూత్రములో వ్యాసమహర్షి బ్రహ్మస్వరూపమునకు వేదకర్తృత్వమును చెప్పి మరల

వేదనిత్యత్వమును "అత ఏవ చ నిత్యత్వమ్" అను సూత్రముచేత చెప్పియుండెను. ఈ విరోధమునకు పరిహార మెట్లో చెప్పుచున్నాము—

వర్ణములకు, వాక్యములకు, అనిత్యత్వమునే తార్కికులు వర్ణించియున్నారు. మీమాంసకులు కాల— ఆకాశాదులకువలె వర్ణములకు నిత్యత్వమునే వర్ణించియున్నారు. వ్యవహారదశలో మీమాంసక న్యాయమె వేదాంతసమ్మతమని సూచించుటకై "అత ఏవ చ నిత్యత్వమ్" అని వ్యావహారికనిత్యత్వము వేదమునకు చెప్పబడినది.

కాబట్టి ప్రమాణాంతరగోచర— పదార్థ— జ్ఞానమును పురస్కరించుకొని కొన్ని పదములు తీయుచు కొన్ని పదములు వేయుచు నడచిన కాళిదాసాది పౌరుషేయ గ్రంథములలోని వాక్యరచనవంటి రచన వేదమునందు లేనికారణమున వేదమునకు అపౌరుషేయత్వము యుక్తమే.

వేదాంతసమ్మతమైన వివర్తవాదములో ఆకాశాదులకువలె వేదమునకును బ్రహ్మకార్యత్వమె అను తాత్పర్యములో వేదకర్తృత్వము బ్రహ్మకు ప్రదర్శింపబడినది. మీమాంసకులుగూడ వేదరచనలో ఏపురుషునకును స్వాతంత్ర్యము (ఇష్టమువచ్చినట్లు పదములను మార్చుట చేర్చుట) లేదనియే గట్టిగా చెప్పుచున్నామనుచు పురుషసంబంధమున్నను స్వాతంత్ర్యమునే ముఖ్యముగా నిరాకరించియున్నారు.

కనుక "స్వతన్త్రః కర్తా" అను పాణినీయసూత్రప్రకారము స్వతంత్రు డనబడు వేదకర్త యెవ్వడును లేడు. అని. –

ఇది పరాశరమాధవీయములోని విషయము.

దీనినిబట్టి వేదోత్పత్తిని వేదకర్తలను చెప్పుచున్నట్లు కనబడిన వెనుకటి వాక్యములకు వేదాభివ్యక్తిని, వేదప్రవర్తకులను చెప్పుట యందే తాత్పర్య మని ధ్రువమయినది.

ఋషులు మంత్రకృత్తులను మాటపై చెప్పుకొనవలెను— శ్రుత ప్రకాశికా—

"మన్త్రకృత్త్వం నామ అనధీత్యైవ వేదానామస్ఖలితక్రమస్వర వర్ణతయా దర్శనమ్, తచ్చ తత్తన్మన్త్రస్మృతిపూర్వకం ప్రజా

పతిసా యథాపూర్వం సృష్టమై స్తత్తన్నామరూపభాగిభ్యః ప్రవాహా పరంపరయాఽఽగతైః వసిష్ఠాదిభిః క్రియతే ఇతి వేదనిత్యత్వమన్త్రికృత్త్వయోరవిరోధ ఇత్యర్థః ॥ ...ఉక్తం చ భగవతా వ్యాసేన—

"యుగాన్తేఽన్తర్హితాన్ వేదాన్ సేతిహాసాన్ మహర్షయః ।
లేభిరే తపసా పూర్వ మనుజ్ఞాతా స్స్వయంభువా ॥"

తాత్పర్యము— వేదాధ్యయనము చేయకయే వేదమంత్రముల యొక్క క్రమ- స్వర- వర్ణములను స్ఖాలిత్యము లేకుండ యథాతథముగా తపఃప్రభావమున దర్శించువారే ఋషులయందలి మంత్రకృత్త్వము కనుక వేదనిత్యత్వమునకు మంత్రకృత్త్వమునకు విరోధము లేదు. అని.

ఋక్సంహితాభాష్యము—

"అగ్నిం నవ మధుచ్ఛన్దా వైశ్వామిత్రః" ఇత్యనుక్రమణికాయా ముక్తత్వాత్ విశ్వామిత్రపుత్రో మధుచ్ఛందోనామకః తస్య సూక్తస్య ద్రష్టృత్వాత్తదీయఋషిః ।

'ఋషిగతౌ' ఇతిధాతుః । సర్వధాతుభ్య ఇన్, ఇగుపధాత్కిత్। వేదప్రాప్త్యర్థం తపోఽనుతిష్ఠతః పురుషాన్ స్వయంభూ ర్వేద పురుషః ప్రాపోన్నత్ ।

తథా చ శ్రూయతే— "అజాన్ హ వై పృశ్నీన్ తపస్యమానాన్ బ్రహ్మ స్వయంభ్వభ్యానర్ష త్తదృషయోఽభవన్" ఇతి। (తై. ఆ. అ2. ఖ 8.)

తథాఽతీన్ద్రియస్య వేదస్య పరమేశ్వరానుగ్రహేణ ప్రథమతో దర్శనాత్ ఋషిత్వ మిత్యభిప్రేత్య స్మర్యతే—

"యుగాన్తేఽన్తర్హితాన్ వేదాన్ సేతిహాసా న్మహర్షయః।
లేభిరే తపసా పూర్వ మనుజ్ఞాతా స్స్వయంభువా" ఇతి.

ఈ గ్రంథముచేత మంత్రద్రష్టలే ఋషులని, వేదప్రాప్తికై తపశ్చర్యలో నున్న మహాపురుషులకు స్వయంభువయిన వేదము ప్రాప్తించినదని, అతీంద్రియమైన వేదమును పరమేశ్వరానుగ్రహమున ప్రథమముగా దర్శించుటవలన ఋషిత్వమని, వేదములో ఏభాగమును నెవ్వరు దర్శించిరో వారు ఆ భాగమునకు సంబంధించిన సూక్తఋషులు, కాండ

ఋషులు ఇత్యాదివ్యవహారమునకు పాత్రు లయినారని స్పష్టీకరింప బడినది.

ఈ నిర్ణయమునుబట్టియే— "అప్యగ్రణీ ర్మన్త్రకృతా మృషీణామ్" అను కాళిదాసశ్లోకవ్యాఖ్యానములో "మన్త్రకృతాం మన్త్రద్రష్ట్రూణామ్" అని మల్లినాధసూరి వ్యాఖ్యానించెను.

ఇట్లుండగా ఏమియు పరిశీలింపక ఋషులు వేదములను వ్రాసి పెట్టినారని నిరాధారముగా కల్పించువారి మాటలు ఆస్తికత్వమునకు చెందినవి కావు.

—• తన్త్రవార్తికము- వేదాఽపౌరుషేయత్వసమర్థనము •—

"యా తద్బుహి రవస్థానా ద్వేదరూపం న దృశ్యతే ।
ఋక్సామాదిస్వరూపే తు దృష్టే భ్రాన్తి ర్నివర్తతే ॥
ఆదిమాత్ర మపి శ్రుత్వా వేదానాం పౌరుషేయతా ।
న శక్యాఽధ్యవసాతుం హి మనాగపి సచేతనైః ॥
దృష్టార్థవ్యవహారేషు వాక్యై ర్లోకానుసారిభిః ।
పదైశ్చ తద్విధై రేవ నరాః కావ్యాని కుర్వతే ॥
ప్రసిద్ధపదసంశ్లిష్టనియతస్వరకైః పదైః ।
లోకే ష్వప్రసిద్ధపూర్వైః ఋగ్వేదం కః కరిష్యతి ॥
అగ్ని మీళే పురోహితం యజ్ఞస్య దేవ మృత్విజమ్ ।
హోతారం రత్నధాతమ మిత్యేత న్నృవచః కథమ్ ॥
కి మాశ్రోచ్య క్వ వా దృష్టం వాక్ప్రతిచ్ఛన్న మీదృశమ్ ।
రచయేత్ పురుషో వాక్యం కిం చోద్దిశ్య ప్రయోజనమ్ ॥
అగ్నేః పురోహితత్వం చ క్వ దృష్టం యేన కీర్త్యతే ।
ఈళే శబ్దప్రయోగశ్చ క్వ దృష్టః స్తోత్రగోచరః ॥
దేవత్వం చాస్య యజ్ఞస్య విహితం క్వోప[illegible]తమ్ ।
హోతృత్వ మపి య త్తస్య దేవతాహ్వాన హేతుకమ్ ॥
రత్నధాయితమత్వం చ త న్నరైః జ్ఞాయతే కథమ్ ।
అవిజ్ఞాతగుణానాం చ కల్పతే స్తవనం కథమ్ ॥
స్వతన్త్ర వేద ఏవైత త్కేవలో వక్తుమర్హతి ।

ఇమే త్వేత్యయ ముష్యర్థః పురుషేణోచ్యతాం కథమ్ ॥
శాఖాచ్ఛేదోపయోగశ్చ పుంభి రుత్ప్రేక్ష్యతాం కుతః ।
ఏవ మూర్జే త్యయం మన్త్రః కేన శాఖానుమార్జనే ॥
వక్తుం శక్యో నియోక్తుం వా బుద్ధిపూర్వకకారిణా ।
వాయవఃస్థేత్యయం మన్త్రో వత్సాపాకరణం ప్రతి ॥
ఏకశో వినియోక్తవ్య ఇతి కః కథయిష్యతి ।

వాయుశబ్దేన బహువచనాన్తేన మాతు ర్వియోజ్యమాన ఏకైకో వత్సోఽభిధీయత ఇతి । నైతద్బుద్ధిపూర్వకారిణా చిన్తితుం శక్యమ్ ।
సామవేదే యదోగ్నా ఈ ప్రభృతీనాం ప్రయుజ్యతే ।
రూపం తత్రాపి పౌంస్న త్వే నాఽభిప్రాయోఽస్తి కశ్చన ॥

కో నామ బుద్ధిపూర్వకారీ పురుషోఽర్థాభిధాన పరాణా మృగతురాణాం లోకవ్యాకరణాది ష్వనవగతపూర్వామ్ అగ్నే ఇత్యస్య పరస్యాఽకార మోకారేణ ప్లుతేన వికుర్యాత్ ।
తథా వీతయ ఇత్యస్మి న్నికారస్యాపి విక్రియామ్ ।
తశబ్దస్య చ తోశబ్దం యేశబ్దస్య విరూపతామ్ ॥
కో మూఢో బుద్ధిపూర్వో వా నియమాత్కల్పయిష్యతి ।
తేన వేదస్వతన్త్రత్వం రూపా దేవాఽవగమ్యతే ॥
కించిదేవ తు తద్వాక్యం సదృశం లౌకికేన యత్ ।
తత్రాపి చ్ఛాన్దసీ ముద్రా దృశ్యతే సూక్ష్మదర్శిభిః ।

ఏవం చ యదాఽధ్యేతారోఽధ్యాపయితారః పార్శ్వస్థా వా వేద-పద-వాక్య-తదర్థ-రూపా ణ్యాలోచయన్తి తదా స్వసంవేద్య మేవాఽపౌరుషేయత్వమధ్యవస్యన్తి ॥"

**తాత్పర్యము-** వేదస్వరూపమును పరిశీలింపనంతవరకే లోకులకు పౌరుషేయత్వభ్రాంతి. వేదస్వరూపపరిశీలనము చేసినయెడల ఆభ్రాంతి తొలగిపోవును. వేద మంతయు నక్కరలేదు. మొదటి మంత్రములను పరీక్షించినను అది పౌరుషేయ మని బుద్ధిమంతులు పలుకలేరు. లోక ప్రసిద్ధములైన విషయములలో మనుష్యులు లోకానుగతములైన పదములతో వాక్యములతో కావ్యములను రచించుచున్నారు. లోకములో

అశ్రుతప్రాయములు, నియతస్వరములు అగు పదములతో 64 ప్రపా ఠకముల ఋగ్వేదమును ఏమానవుడు రచింపగలడు ?

'అగ్నిమీళే పురోహితమ్' అను మొదటి ఋక్కునే పరిశీలింపుడు. ఇది మనుష్యవాక్యమే అయినయెడల ఇట్టిదానిని లోకములో ఎక్కడ జూచి ఏ యభిప్రాయముతో ఏప్రయోజన ముపేక్షించి రచించెను ? అగ్నికి పురోహితత్వము ఎక్కడ దృష్టమైనది ? స్తుతిపరముగా ఈళే శబ్దప్రయోగము ఎక్కడ దృష్టమైనది ? అగ్నికి యజ్ఞదేవత్వము ఎక్కడ దృష్టమయినది ? అగ్ని దేవతల నాహ్వానించువాడు (హోతారమ్.) అని ఎట్లు తెలిసినది ? అగ్ని ప్రశస్తధనదాత (రత్నధాతమమ్) అని ఎట్లు తెలిసినది ? అజ్ఞాతగుణములతో అగ్నిని స్తుతించుట యెట్లు? దీని నంతను స్వతస్త్రమయిన వేద ఋక్కుచే చెప్పగలుగును.

యజుర్వేదమునకు మొదటి దయిన— "ఇషేత్వోర్జేత్వా" అను మంత్రమును పరిశీలింపుడు— ఇది మనుష్యవాక్య మెట్లగును ? ఇందు 'ఇషేత్వా' అను దానిని "శాఖా మాచ్ఛినత్తి" అని శాఖాచ్ఛేదన మందు వినియోగింపవలయును. అని చెప్పు బ్రాహ్మణవాక్యమును ఊహించినవా డెవడు ? అట్టి అట్టి మంత్రములకును ఆయా కర్మ విశేషములయందు వినియోగమును చెప్పునట్టి ఆయా బ్రాహ్మణవాక్య ములను రచించి విధించిన బుద్ధిమంతు డెవడు ?

సామవేదమునకు మొదటి దయిన "అగ్న ఆయాహి వీతయే" అను ఋక్కులోని అగ్నే అను సార్థకపదములోని అకారమునకు బదులు ప్లుతమైన ఓకారము పెట్టి ఓగ్నా ఈ అని లోకములో ఎక్కడను జూడ నట్టి ప్రయోగమును ఎవ్వడు చేయగలుగును ?

కనుక వేదస్వరూపమునుబట్టియే వేదము స్వతంత్రమని స్పష్ట మగుచున్నది. వేదములో లౌకికవాక్యములవంటి వాక్యములలో గూడ స్వరనియమమునుబట్టి వైలక్షణ్యము స్పష్టము.

ఇట్లు వేదములోని పదములయొక్క, వాక్యములయొక్క, పదార్థములయొక్క, స్వరూపమును పరిశీలనచేసినవారికి వేదాపౌరుషే యత్వము సత్యమని విదితమగును. అని.

ఈ తంత్రవార్త్తికగ్రంథసందర్భమునుబట్టి ఎక్కడనో కూర్చుండి యెవరెవరో వేదములను వ్రాసినారు అను వారిమాటలకు అర్థము లేదని, వేదస్వరూపపరిచయము, వేదార్థపరిజ్ఞానము లేని వారివే అట్టి మాటలని, అవి ఆస్తికాదరణీయములు కావని స్పష్టమయినది.

—• వేదముయొక్క స్వతఃప్రామాణ్యము అపౌరుషేయత్వాధీనము •—

వేదమునుగూర్చి పౌరుషేయ మని, అపౌరుషేయ మని రెండు వాదములు. పౌరుషేయత్వవాదములో గ్రంథకారుని ప్రామాణ్యముపై ఆధారపడి గ్రంథప్రామాణ్య ముండునుగనుక మానవులకు గోచరింపని అతీంద్రియపదార్థములను ప్రతిపాదించుచున్న వేదమునకు రాగద్వేషరహితుడు సర్వజ్ఞుడు అగు జగదీశ్వరుడే కర్త గనుక ఈశ్వరప్రామాణ్యాధీనమైనది వేదప్రామాణ్య మగుటచే వేదము పరతః ప్రమాణ మని చెప్పినవారు తార్కికులు. వేదము నిత్యము; అది యీశ్వరప్రణీతముగాక యీశ్వరప్రకాశితమై యున్నది; అందుచే నది యపౌరుషేయము, స్వతః ప్రమాణము నని చెప్పినవారుత్తరమీమాంసకులు. మొత్తముమీద వేదావిర్భావములో ఈశ్వరసంబంధము ఉభయవాదిసమ్మతము. ఆసంబంధము కర్తృత్వరూపమని, ప్రకాశకత్వరూపమని చెప్పుటలోమాత్రము తాత్పర్యభేదము కలదు. వేదావిర్భావమునుగూర్చి తెలిసికొనుటకు వేదవాక్యమె ఆధారముగనుగ ఏవేదవాక్యము ననుసరించి వారికి అట్టి తాత్పర్యభేదము కలిగినదో చెప్పుకొనవలసియున్నది. అదియే ఇచ్చట ప్రదర్శింపబడుచున్నది—

సవ్యాఖ్య, సర్వదర్శనసంగ్రహ, ఉపోద్ఘాతగ్రంథానుసారము—

"తస్య హ వా ఏతస్య మహతో భూతస్య నిశ్వసిత మేతత్-యదృగ్వేదో యజుర్వేద స్సామవేదః."

నిశ్వసితన్యాయమున పరమాత్మనుండి వేదము ఆవిర్భవించినదని ఈశ్రుతి చెప్పుచున్నది.

లోకములో నిశ్వాసము (నిట్టూర్పు) అనాయాసముగా (అప్రయత్నముగా) అబుద్ధిపురస్సరముగా కలుగుచుండుట అనుభవసిద్ధము.

వేదము, దృష్ట- అదృష్ట- స్థూల- సూక్ష్మ- చేతన- అచేతనాది సర్వపదార్థప్రకాశకము. ఇట్టి వేదమును అచింత్యశక్తులు గలవాడగుటచే పరమేశ్వరుడు రచించుటలో ప్రయత్నాభావమును చెప్పిన చెప్పవచ్చునుగాని అబుద్ధిపూర్వకత్వమునూత్రము చెప్పుటకు వీలులేదు. స్వతంత్రముగా వాక్యరచన చేయునపుడు బుద్ధిపూర్వకత్వము తప్పదు కనుక. ఇట్లు నిశ్శ్వసితన్యాయముచే తేలిన అబుద్ధిపూర్వకత్వము ఉపపన్నమగుటకై వేదము ఈశ్వరకృతము కాదు; ఈశ్వరప్రకాశితమే అని యంగీకరింపవలసియున్నది.

తార్కికులు, ఇతరగ్రంథముల యందెక్కడను అర్థబోధకవాక్యరచన అబుద్ధిపూర్వకముగ జరిగినట్లు కనబడకుండుటచే వేదమందు మాత్ర మెట్లుండు నని ఈశ్వరకృతవేదరచన బుద్ధిపూర్వకమె అనియు, బుద్ధిపూర్వకముగా చేయు పనిలో ప్రయత్నాభావము సంభవింపదు గనుక నిశ్శ్వసితములో గూడ స్వల్పప్రయత్నముండును గనుక నిశ్శ్వసితన్యాయమునకు అనాయాసమాత్రమందే అభిప్రాయమనియు చెప్పి వేదమునకు పౌరుషేయత్వమును వర్ణించినారు.

ఉత్తరమీమాంసకులు, నిద్రావస్థలోగూడ కలుగుచుండు నిశ్శ్వసితము అబుద్ధిపూర్వకమునను, అనాయాసముగను, సంభవించుట అనుభవసిద్ధ మగుటచేత శ్రుతిలోని నిశ్శ్వసితన్యాయమునకు అబుద్ధిపూర్వకత్వమందును తాత్పర్యమె అని చెప్పి అది సిద్ధించుటకై వేదము ఈశ్వరప్రకాశిత మనుచు అపౌరుషేయత్వమును, స్వతఃప్రామాణ్యమును వేదమునకు వర్ణించియున్నారు. వేదప్రామాణ్యమునుగూర్చి యిట్లు చెప్పబడినది—

సూతసంహితా—

"శ్రుతి స్సనాతనీ సాధ్వీ సర్వమానోత్తమోత్తమా ।
అతీన్ద్రియార్థవిజ్ఞానే మానం న శ్రుతిరేవ హి ॥
శ్రుత్యేకగమ్యే సూక్ష్మార్థే స తర్కః కిం కరిష్యతి ।
మానానుగ్రాహకో స్తర్కో న స్వతన్త్రః కదాచన ॥
శ్రుతి స్సనాతనీ శంభో రభివ్యక్తా న సంశయః ।

శంకరేణ ప్రణీతేతి ప్రవద న్త్యపరే జనాః ॥
యదా సా శంకరేణోక్తా తదాపి శ్రుతి రాస్తికాః ।
ప్రమాణం సురాత మాప్తతమ ఏవ మహేశ్వరః ॥
అతః పక్షద్వయేనాపి వేదో మానం న సంశయః ।
వేదోఽనాది శ్శివ స్తస్య వ్యంజకః పరమార్థతః ॥
అభివ్యక్తి మపేక్ష్యైవ ప్రణేతే త్యుచ్యతే శివః ।
తస్మా ద్వేదోపదిష్టార్థో యథార్థో నాఽత్ర సంశయః ॥"

వేదము సనాతనము; సర్వప్రమాణములలో ఉత్తమప్రమాణము; అతీంద్రియపదార్థములను తెలిసికొనుటకు వేదమే మనకు ప్రమాణము; వేదవేద్యమైన సూక్ష్మవిషయములో తర్కమేమి గ్రహింపజేయును ? ప్రమాణమునకు బలకరము తర్కమగును. పరమేశ్వరుని వలన అభివ్యక్తమైనది వేదము పరమేశ్వరప్రణీతమని కొందరందురు. అట్లయినను ఆప్తతముడగు పరమేశ్వరునిచే కృతమైనది సర్వోత్తమమే.

కనుక పక్షద్వయములోఁగూడ మనకు వేదము నిస్సంశయముగా ప్రమాణము. పరమార్థములో అనాదియైన వేదమునకు అభివ్యంజకుడు పరమేశ్వరుడు. వేదాభివ్యక్తికర్తయే వేదకర్త యని చెప్పబడుచుండును. కాబట్టి వేదోపదిష్టమైన దంతయు యథార్థము. అని.

ఇట్లు చూడగా ఈశ్వరునిబట్టియే వేదమునకు పౌరుషేయత్వము ను శాస్త్రకర్తలు వర్ణించియున్నారుకాని ఆధునికులవలె అన్యులెవ్వరో వ్రాసియున్నా రని చెప్పియుండలేదు. దానికి కారణము— వేదస్వరూపజ్ఞానము. వేదార్థపరిజ్ఞానము సమగ్రముగా వారికుండుటే. అవి లేకుండుటే ఆధునికుల అసంగతోక్తులకు కారణము.

ఆధునికోక్తు లిట్లున్నవి— మనస్సాత్యము అనుపుస్తకము— "వేదములలో నన్ని భాగములు ప్రమాణములు కావు. వేదములు దైవప్రోక్తములు గావు. ఋష్యాదులే చెప్పినవి. వేదము లనాదులు కావు. వేదములు దేవుడు చెప్పినవి గాని, పంపినవిగాని కావు."

ఈమాట లెట్టివో ఆస్తికపాఠకమహాశయులే నిర్ణయింపగలరు. ఎవ్వరికి తోఁచినట్లు వారనుచుందురు. కాని ప్రమాణబద్ధులైన ఆర్షసంప్ర

చాయానుయాయులై, తత్త్వజిజ్ఞాసువులై యుండు వైదికమతస్థులు అగమ్యగోచరములైన విషయములను అవ్యవస్థితములైన తమ యూహల నాధారపడిగాని, తోచినట్లు మాటలాడువారిమాటల నాధారపడిగాని ఇదమిత్థమని నిర్ణయింపబోరు. శాస్త్రముల నాధారపడి విద్వదుపదేశముల నాధారపడి నిర్ణయింపబోనుచుందురు

అశాస్త్రనిర్ణయములు, అవిద్వద్వ్యాఖ్యానవచనములు వేద ప్రామాణ్యమునుగూర్చి, వేదపౌరుషేయత్వ—అపౌరుషేయత్వము లనుగూర్చి ఎట్లున్నవో పాఠకలోకమునకు ఎదుట బెట్టబడినవి. తద్విరుద్ధములైన ఆధునికోక్తులును ప్రదర్శింపబడినవి. దేనిని ఆదరించుటో, దేనినినిరసించుటో పాఠకలోకమే తేల్చుకొనవలెను. విషయపరిజ్ఞానము కొరకుగ్రంథస్థమైన మరొకవిషయము చూపబడుచున్నది.

భారతీయతత్త్వశాస్త్రము—ఆంధ్రానువాదము—

"మంత్రములు కవుల సృష్టియై, బ్రాహ్మణములు పురోహితుల రచనలై, ఉపనిషత్తులు తత్త్వవేత్తల ధ్యానములైనవి. ఈమూడు నొకటి వెనుక నొకటి క్రమముగా రచింపబడినను బిమ్మట గలిసియే యున్నవి. ఉపనిషన్మతము వైదికదేవతార్చనవిధానపరిణతియే యైనను ఇంకొకవిధముగా జూచిన బ్రాహ్మణమతనిరాసరూప మని చెప్పవచ్చును." (భా. 1- పు 72)

అనువాదకులు శ్రీబులుసు వేంకటేశ్వరులు ఎం. ఏ. గారివచనము-

"రాధాకృష్ణపండితుడు ముఖ్యముగా పాశ్చాత్యసభ్యప్రపంచము నెదుట బెట్టుటకై చారిత్రకపద్ధతి ననుసరించి వేదములను, తదంతర్గత మంత్రబ్రాహ్మణోపనిషత్తులను, వాని కాలభేదములను నవీనదృష్టితో వివరించినాడు. ఇది పాశ్చాత్యు లంగీకరించిన పద్ధతి. వేదవేదాంగములను, వాని యర్థనిర్ణయములను నేటి ప్రకృతిశాస్త్రదృష్టితో బరిశోధించి ప్రకటించిన పాశ్చాత్యపండితుల భావముల నీతడు తన సమీక్షకాధారములుగా గైకొని తన నిర్ణయములను ప్రకటించినాడు.

ఈ భాగమునకు సంబంధించినంతలో మనము సంప్రదాయ సిద్ధములగు నభిప్రాయములను గమనింతము— సంహితాబ్రాహ్మణో

పనిషత్సమేతములై అవిభాజ్య మగు నేకరూపము గలవే వేదములు. ఇవన్నియు నేక కాలమునకు జెందిన వనియే ప్రాచీనుల విశ్వాసము. ఉపనిషత్తులలోని భావములు కాలాంతరమున బరిణతి జెందినవి కావ నియు, కర్మ- జ్ఞాన- కాండ లొకే వ్యక్తియొక్క రెండు నేత్రముల వలె నొకే వేదమునందలి ప్రకరణభేదములుమాత్రమే యనియు సంప్రదాయవాదము.

ఇక వేదముల కాలమును నిర్ణయించు చర్చ వ్యర్థమైనది. మహ ర్షులు తాము ద్రష్టల మని చెప్పుకొనిరి. వారుచూచి వినక పూర్వ మెంతకాలమునుండి వేదము లదృష్టములై యశ్రుతములై యున్నవో నిర్ణయించుట కాధారములు లేవు. వినిన మంత్రద్రష్టల కాలనిర్ణయ ములకును ఆధారము లూహానిర్మితములే. సృష్ట్యారంభమున దత్పూర్వ మున వేదము లున్నవో లేవో నిర్ణయించుటకు వలయు నానాటి గుర్తు లను బరిశీలించు శక్తిగల పరిశోధకు లెవ్వరును బుట్టియుండలేదు.

అందుచే మను—వ్యాసాదులు చెప్పిన రీతిగా వేదము లపౌరుషే యము లనియు, ననాద్యనంతములనియు పాశ్చాత్యులు నమ్మలే కున్నను మనము నమ్మినచో ఘోరప్రమాదము కాజాలదు. అట్లు నమ్మకపోవుట గొప్ప లోపమే. (అనువాదకునిభూమిక. పు 7-8)

పాఠకలోక మీవిషయము నవధరింపవలయును.

మొదట 'వేదస్వరూపము' అనుచోట ప్రదర్శింపబడిన డాక్టరు టీబో తీర్పునుగూడ పాఠకలోక మనుసంధింపవలయును.

—• వైదికమతసిద్ధాంతము— మన్వాదిస్మృతులు వేదమూలకములు •—

ఋషిప్రణీతములై ధర్మశాస్త్రము లను పేరు గలిగియున్న స్మృతులు, ఆ యాదేశకాలపరిస్థితులకు తగినట్లు ఆ యా వ్యక్తులచే రచింపబడినవని కొందరి యభిప్రాయము.

స్మృతులు వేదమూలకము లని స్మృతికర్తలు చెప్పుచుండ ఇత రులు అవి దేశకాలపరిస్థితిమూలకము లని చెప్పబూనుట యుక్తము కాదు. దీనికి నిదర్శనములు చూడుడు—— మనుస్మృతి——

"యః కశ్చిత్కస్యచిద్ధర్మో మనునా పరికీర్తితః ।
స సర్వోఽభిహితో వేదే సర్వజ్ఞానమయో హి సః ॥"

కాళిదాసమహాకవి—

"శ్రుతే రివార్థం స్మృతి రన్వగచ్ఛత్ ।"

భర్తృహరి వాక్యపదీయము— బ్రహ్మకాండము—

"స్మృతయో బహురూపాశ్చ దృష్టాఽదృష్టప్రయోజనాః ।
త మేవాశ్రిత్య లింగేభ్యో వేదవిద్భిః ప్రకల్పితాః ॥"

భావప్రదీపవ్యాఖ్యా—... స్మృతయో లింగేభ్యః తత్తదర్థబోధకమన్త్రాదిభ్యః తం వేద మేవాశ్రిత్య వేదవిద్భిః ప్రకల్పితాః రచితా ఇత్యర్థః ।"

ఈప్రమాణము లన్నియు స్మృతులు వేదమూలకము లనియే చెప్పుచు శ్రుత్యర్థమును అనుగమించునట్టిది స్మృతి యని, వేదవిదులచేత తత్తన్మంత్రార్థమునుబట్టియే స్మృతులు రచింపబడినవని స్పష్టీకరించుచున్నవి.

పై వాక్యపదీయశ్లోకమునకు వ్యాఖ్యానశేషము—

"స్మృతయో బహురూపాశ్చేతి" స్మృతీనాం పంచవిధత్వముక్తం భవిష్యపురాణే—

"దృష్టార్థా తు స్మృతిః కాచి దదృష్టార్థా తథాఽపరా ।
దృష్టాఽదృష్టార్థరూపాఽన్యా న్యాయమూలా తథా పరా ॥
అనువాదస్మృతి స్త్వన్యా శిష్టై ర్దృష్టా తు పంచమీ ।
షడ్గుణస్య ప్రయోజ్యస్య ప్రయోగః కార్యగౌరవాత్ ॥
సామాదీనా ముపాయానాం యోగో వ్యాససమాసతః ।
అధ్యక్షాణాం చ నిక్షేపః కంటకానాం నిరూపణమ్ ॥
దృష్టార్థేయం స్మృతిః ప్రోక్తా ఋషిభి ర్గరుడాత్మజ ।
సన్ధ్యోపాస్యా సదా కార్యా శునో మాంసం న భక్షయేత్ ॥
అదృష్టార్థా స్మృతిః ప్రోక్తా ఋషిభిః జ్ఞానకోవిదైః ।
పాలాశం ధారయే ద్దండ ముభయార్థాం విదు ర్బుధాః ॥
న్యాయమూలా వికల్ప స్స్యా ద్యవహోమశ్రుతా యథా ।

శ్రితౌ దృష్టం యథా కార్యం స్మృతౌ తత్తాదృశం యది ॥
అనూక్తవాదినీ సా తు పారివ్రిజ్యం యథా గృహాత్ ।

వ్యాఖ్యా— షడ్గుణాః సన్ధి- విగ్రిహ- యాన- ఆసన- ద్వైధీభావ- సమాశ్రియాః । సామాదీనాం కార్యగౌరవా ద్వ్యాస సమాసాభ్యాం యోగః ప్రయోగః కర్తవ్య ఇత్యర్థః । జపహోమ శ్రుతావితి । సూర్యోదయావధి సావిత్రీజపోఽనుదితహోమవిషయః। అనూక్తవాదినీ అనూదితవాదినీ। యథా— "యదివేతరథా బ్రహ్మచర్యాదేవ ప్రివ్రిజేత్ గృహా ద్వా వనా ద్వా" ఇత్యనయా అనూదితం "బ్రాహ్మణః ప్రివ్రిజే ద్గృహాత్" ఇతి మనుస్మృతి ర్వదతి।"

తాత్పర్యము— భవిష్యపురాణములో స్మృతులు పంచవిధములని చెప్పబడినది. దృష్టార్థస్మృతి, అదృష్టార్థస్మృతి, దృష్టాదృష్టార్థస్మృతి, న్యాయమూలస్మృతి, అనువాదస్మృతి, అని. అందు రాజకీయములైన సంధివిగ్రిహాదులను, సామదానాదులను ప్రియోగించుటనుగూర్చి నిరూపించునట్టిది దృష్టార్థస్మృతి.

సంధ్యోపాసనావిధానము, మాంసభక్షణనిషేధము ఇత్యాదులను బోధించునట్టిది అదృష్టార్థస్మృతి. పలాశదండధారణము ఇత్యాదులను బోధించునట్టిది దృష్టాదృష్టార్థస్మృతి. జప- హోమాదిక్రియలకు వికల్పవిధులలో వ్యవస్థ చేయునట్టిది న్యాయమూలస్మృతి. శ్రుత్యుక్తవిషయమునే అనువాదము చేయునట్టిది అనువాదస్మృతి. అని.

ఇట్లు స్మృతులకు వేదమూలకప్రామాణ్యము ప్రకటింపబడినది. ధర్మాధర్మగ్రింథమం దీవిషయ మిట్లు వివరింపబడినది—

"తాసాం స్మృతీనాం హి దృష్టార్థత్వ మదృష్టార్థత్వముభయార్థత్వం చేతి। త్రతదృష్టార్థానాం దృష్టార్థత్వాదేవ ప్రామాణ్య మితరయోస్త్వదృష్టార్థత్వాద్వేదమూలక మితి శాబరమతమ్ ।

వార్తికకారాస్తు భట్టపాదాః సర్వాసాం వేదమూలకత్వమేవ మన్యన్తే । యుక్తంచైతత్— యథైవాఽదృష్టార్థే కర్తుః ఫలం తథైవ దృష్టార్థేపి కర్తుః ఫలేన భావ్యం । నహి ప్రిపానభానిర్మాణాదౌ కర్తుః కిమపి ఫలం న స్యాచ్చే త్ప్రవృత్తి ర్ఘటతే। అతస్తస్య

నియమాపూర్వద్వారా కించి దదృష్టఫలం కల్పనీయ మవశ్యమేవ।
తచ్చ శాస్త్రైకసమయగమ్య మితి తతాప్యలౌకిక ప్రమాణ
గమ్యత్వ మవశ్యమేవ కల్పనీయ మతీన్ద్రియార్థత్వాత్। తచ్చ
ప్రమాణం న వేదాతిరిక్తమితి వేదమూలకత్వమేవ సర్వాసాం
స్మృతీనా మభ్యుపగన్తవ్య మకామేనాపి।"

అదృష్టార్థకస్మృతులుమాత్రమే వేదమూలకములని, దృష్టార్థకములు వేదమూలకములు కావని చెప్పరాదు. ధర్మశాలా— పానీయశాలాదినిర్మాణము దృష్టార్థక మయియున్నది. ఇట్టివానివలన కర్తకు ఫలము లేకున్న ప్రవృత్తి సంభవింపదు. కావున్ని వానివలన నియమాపూర్వ మేర్పడి అదృష్టఫలము కలుగునని చెప్పక తప్పదు. అది శాస్త్రైకగమ్యమగుటచే వేదప్రమాణమూలక మనక తీరదు. కనుక సర్వస్మృతులకును వేదమూలకత్వ మంగీకరింపవలసినదే. అని.

ఇక్కడ బహువిచారణ 'ధర్మాధర్మ'మందు చేయబడినది. ఆవిశేషము లాగ్రంథమునుండి తెలిసికొనవలయును.

శుక్రనీతి—
"వర్ణాది ధర్మస్మరణం యత్ర వేదాఽవిరోధకమ్।
కీర్తనం చాఽర్థ శాస్త్రాణాం స్మృతి స్సా చ ప్రకీర్తితా॥

ఈవాక్యముకూడ పై విషయమునే చెప్పుచున్నది.

ఇతిహాస—పురాణములుగూడ వేదార్థవ్యాఖ్యానపరములే.
"వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే।
వేదః ప్రాచేతసా దాసీ త్సాక్షా ద్రామాయణాత్మనా॥
"భారతం పంచమో వేదః" "సర్వశ్రుతిసమూహోఽయమ్॥"
"పురాణం నష్టశాఖస్య వేదార్థస్యోపబృంహణమ్।
కథారూపేణ మహతా పురుషార్థప్రవర్తకమ్॥"

అను వచనములు పైవిషయమును స్పష్టపరచుచున్నవి.

**ఇట్లు స్మృతి-ఇతిహాస-పురాణాదిబహువిధవాఙ్మయముచే సంస్తుతింపబడు వేదముయొక్క మహిమ అనితరసాధారణము.**

—• వైదిక—అవైదిక-గ్రంథకారవిభాగము. •—

సర్వసిద్ధాంతసంగ్రహము—

అక్షపాదః కణాదశ్చ కపిలో జైమిని స్తథా ।
వ్యాసః పతంజలి శ్చైతే వైదికాః సూత్రకారకాః ॥
బృహస్పత్యార్హతౌ బుద్ధో వేదమార్గవిరోధినః ।
ఏతేఽధికారితాం వీక్ష్య సర్వే శాస్త్రప్రవర్తకాః ॥
వేదాఽప్రామాణ్యసిద్ధాన్తా బౌద్ధలోకాయతాఽర్హతాః ।
యుక్త్యా నిరసనీయా స్తే వేదప్రామాణ్యవాదిభిః ."

గౌతమ—కణాద—కపిల—జైమిని—వ్యాస— పతంజలి— నామక ఋషులు ఆర్గురును వైదిక-సూత్ర-కర్తలు; వీరివే వైదికదర్శనములు. బృహస్పతి—బుద్ధ—అర్హత లు వేదమార్గవిరుద్ధములును, వేదాప్రామాణ్యపూర్వకములును అగు సిద్ధాంతములతో తమచే నుపదేశింపబడువారి అర్హత ననుసరించి శాస్త్రకర్త లయినారు. వీరివే అవైదికదర్శనములు. ఇవి వేదప్రామాణ్యవాదులకు నిరసనీయములు. అని తాత్పర్యము.

—• ఋ షు లు చూ పి న మా ర్గ భే ద ము ల కు
మనుజుల మతిభేదములే కారణము •—

న్యాయదర్శన, యోగదర్శన, సాంఖ్యదర్శన, మీమాంసాదర్శన, వేదాంతదర్శనాదులలో ఋషులు సృష్ట్యాదులనుగూర్చి భిన్న భిన్న మార్గముల నుపదేశించిరి. వారు సర్వజ్ఞులై యుండి వేదము పరమప్రమాణమని భావించియుండి ఏకముఖముగా బోధింపకపోవుట వారు భ్రాంతులై కాదు. బహిర్విషయోన్ముఖుల మనస్సులకు పరమపురుషార్థమందు సుకరముగా ప్రవేశము కలుగదని వారియెడల నాస్తిక్యనివారణతాత్పర్యముతో అధికారిభేదదృష్టితో అట్లుపదేశించినారు.

ఆభిన్నమార్గములచే పరమేశ్వరప్రాప్తి కలుగదని భావింపరాదు. తదనుసారమున గలుగు అంతఃకరణశుద్ధినిబట్టి అది క్రమప్రాప్తమగును. ఈవిషయ మిట్లు చెప్పబడినది చూడుడు—

మధుసూదనీ—మహిమ్నస్తవవ్యాఖ్యా—

"సర్వేషాం చ ప్రస్థానకర్తౄణాం మునీనాం వివర్తవాదపర్యవసానేనాఽద్వితీయే పరమేశ్వర ఏవ వేదాన్తప్రతిపాద్యే తాత్ప

ర్యమ్। న హి తే మునయో భ్రాన్తాః సర్వజ్ఞత్వాత్తేషాం। కిన్తు బహిర్విషయప్రవణానామాపాతతః పరమపురుషార్థే ప్రవేశో న భవతీతి నాస్తిక్యనివారణాయ తైః ప్రకారభేదాః ప్రదర్శితాః। నచ పర్యవసానేపి పరమేశ్వరాఽప్రాప్తిః। అన్తఃకరణశుద్ధివశేన పశ్చాదృజుమార్గాశ్రయణాత్।

వాక్యపదీయవ్యాఖ్యా-భావప్రదీపః—

ఇదమత్ర తత్త్వమ్—కణాదాదయో హి మాయికత్వేన మిథ్యాభూతత్వేన బ్రహ్మరూపత్వేన చ జ్ఞాత మపి ప్రపంచం బోధనీయశిష్యాఽధికారానుసారేణ తదీయమాయికత్వాద్యపలప్య బ్రహ్మరూపత్వేన జ్ఞాతపరమాణ్వాదిభ్యః సృష్టి మాహుః। యథాహుః 'న బుద్ధిభేదం జనయే దజ్ఞానాం కర్మసంగినామ్' ఇతి। అతో న ఋషీణాం పరస్పరం మతభేద ఇతి।"

అనగా కణాదాదిఋషులు ప్రపంచము మాయికమని, మిథ్యాభూతమని, బ్రహ్మరూపమని తెలిసియుండియు బోధింపవలసిన శిష్యుల అధికారము ననుసరించి ఆమాయికత్వాదిలక్షణములను వెల్లడింపక బ్రహ్మరూపముగా అవగతమైనట్టి పరమాణ్వాదులనుండి ప్రపంచసృష్టిని చెప్పియున్నారు. కనుకనే అజ్ఞులబుద్ధి కనుకూలమైన పద్ధతినే బోధింపవలె నని గీత ప్రతిపాదించినది. అందుచేత ఋషులలో పరస్పరము మతభేదము లేదు. అని తాత్పర్యము.

'అధికారివిభేదేన మార్గా మానం న సంశయః।'

అని సూతసంహిత ప్రబోధించుచునే యున్నది. కనుక ఋషులకు భ్రాంతినో అజ్ఞతనో కల్పించుట ఆస్తికత్వమునకు చెందిన పని కాదు.

—• "ఋషులు భంగు తాగి యేవో వ్రాసినారు" అను మనస్సాక్ష్యపుస్తకముయొక్క పరామర్శము •—

"మనస్సాక్ష్యము" అను పుస్తకమొకటి కలదు. ఇది సర్వజ్ఞకుమారయాచేంద్రభూపాలవిరచితము. అని యున్నది. అందులోని మాట లిట్లున్నవి—

"వేదములలో నన్ని భాగములు ప్రమాణములు కావు. ఆవేద ములలో ప్రత్యక్షమునకు విరోధముగా చెప్పియుండునవి కొద్దిగా వ్రాసెదను—

1 చంద్రసూర్యాదులు భూగోళమువంటి వని నళికాయంత్రముల చేత దెలియవచ్చుచుండగా నవి వేదాదులలో దేవతలనియు,

2 భూచ్ఛాయవలన జంద్రునికి, చంద్రచ్ఛాయవలన సూర్యునికి కలుగు చంద్రసూర్యగ్రహణములు రాహువుగ్రసించుటచే గలుగు చున్నవనియు,

3 నళికాయంత్రమువలన సూర్యునికి చలనములేక భూమి తిరు గుటవలన నుదయాస్తమయములు కలిగినట్లు తోచుచుండ సూర్యు నికి రథము, గుఱ్ఱము, సారథియు నున్నట్లు తైత్తిరీయమందు చెప్పబడియున్నది. కదలనివానికి ఇవి యెట్లు సంభవించును. ఇట్లు చెప్పే అలాటి భాగములు వేదములలో నెట్లు నమ్మవచ్చును ?

4 ఆనైమిశారణ్యము చలిదేశము. ఆక్కడి ఋషులు భంగు తాగి యేదో అభిప్రాయములు తోచి చెప్పియుండవచ్చును."

ఇది 'మనస్సాక్ష్య' కర్తల మనస్సాక్ష్యముపై ఆధారపడిన వ్రాత. వారి మనస్సునకు అట్లనిపించిన దన్నమాట. అట్లనిపించుటకు వారి వైదికవిద్యాభ్యాసపాటవ మంతటి దన్నమాట. కనుకనే వారి మనస్సునకు "వేదములో అన్నిభాగములు ప్రమాణములుకావు" అనిపించినది.

నిజమునకు మనస్సు ప్రమాణానుసారి కావలయును గాని ప్రమాణము కానేరదు. చక్షుస్సు ననుసరింపని వీరిమనస్సాక్షి, రూప మును తెలుపగలదా ? కావున వీరి మనస్సాక్ష్యము అప్రమాణము, ప్రమాణవిరుద్ధము నయియున్నది.

"వేదములలో ఋషులు తమకు దోచినట్లు చెప్పియుండవచ్చును" అనుమాట, వేద మపౌరుషేయ మని వెనుక నిరూపింపబడినదానికి విరుద్ధము. "వేదములో ప్రత్యక్షమునకు విరోధముగా చెప్పబడినవి" అనుమాట, ప్రమాణాంతర- అగోచర- విషయబోధకము వేద మని

వెనుకనిరూపింపబడినదానికి విరుద్ధము. దీని నిటుండనిచ్చి వారివాద మును బరిశీలింతము—

1 యంత్రములచేత గోళములుగా దెలియవచ్చు చంద్ర-సూర్యాదులు వేదములో దేవత లనుట ప్రత్యక్షవిరోధము. అట.

అయితే ప్రత్యక్షములైన దేహములకు సంబంధించి అప్రత్యక్షములగు జీవులున్నట్లు, ప్రత్యక్షమగు గోళములకు సంబంధించి అప్రత్యక్షములగు దేవతాస్వరూపము లుండుట కథ్యంతరమేమి? ఆవిషయను బోధించు వేదభాగమునకు అప్రామాణ్య మేమి? కనుక నిది అయుక్తము.

మనసాన్స్తిక్యకర్తలు జీవాత్మను ఒప్పుకొని యిట్లు చెప్పిరి—

"గీతలలో— 'నైనం ఛిన్దన్తి శస్త్రాణి' అనియు, అచ్ఛేద్యము, అదాహ్యము అనియు జీవాత్మస్వరూపము చెప్పబడియున్నది."

(పు. 28) అని.

దీనినిబట్టి వీరిది దేహాత్మవాదము కాదని, ప్రత్యక్షైకప్రమాణవాదము కాదని స్పష్టమగుచున్నది.

ఇట్టివారు చంద్రసూర్యాదులు దేవత లనుట ప్రత్యక్షవిరోధము అనుట స్వవచనవ్యాఘాతము. అప్రత్యక్షమైన జీవాత్మ నంగీకరించిన వీరు అప్రత్యక్షమైన దేవతాస్వరూపమును అంగీకరింపకపోవుటేమి? కనుక నిది అయుక్తము.

2 చంద్రగ్రహణము భూచ్ఛాయవలన, సూర్యగ్రహణము చంద్రచ్ఛాయవలన గలుగుచుండ రాహువు గ్రసించుటచే నవి కలుగుచున్న వనుట ప్రత్యక్షవిరోధమట!

దీనికి 'పురాణవర్మ' గ్రంథములో యుక్తివిశారద, పండిత, కాలూ రామశాస్త్రిగారిచే హిందీలో వ్రాయబడియున్న విషయమునే సమాధానముగా ప్రదర్శించుచున్నాము—

పురాణవర్మ- చంద్రార్కగ్రసము—

గణితమునుబట్టి, యంత్రములనుబట్టి చూడగా భూచ్ఛాయచేత చంద్రగ్రహణము, చంద్రచ్ఛాయచేత సూర్యగ్రహణము కలుగుచున్నట్లు స్పష్టమగుచుండ స్మృతిపురాణములలో రాహుగ్రస్తమని

చెప్పబడుట విరుద్ధ మనువాదమునకు సమాధానము చెప్పబడు చున్నది—

కేశవదైవజ్ఞవిరచిత 'వివాహబృందావన'గ్రంథములో 'రాహు సత్తాధ్యాయము'లో సమన్వయమార్గ మిట్లు చూపబడినది—

"సోఽన్ధకారచరతాం వహన్ మహిచ్ఛాయయా విశతి సోమ మండలమ్। దీపితాఽపరదళేన్దుమండలచ్ఛాయయా సహ చ సూర్యమండలమ్।

వ్యాఖ్యా—స రాహుః అంధకారే చరతీతి అంధకారచరః, తస్య భావ స్తథా। భూచ్ఛాయా కిలాఽన్ధకారరూపిణీ, సోప్యన్ధ కారచరః। అతస్తత్సాహిత్యేన చన్ద్రమండలం విశతి। ఆచ్ఛాద యతీత్యర్థః। దీపితమపరదల ముపరిస్థితదలం యస్య తచ్చ తదిన్దు మండలం చ తస్య ఛాయా, తయా।

దర్శే కిల చన్ద్ర స్యోర్ధ్వదలం ప్రకాశం అతోఽన్ధకారరూపస్య చంద్రమండలాఽధోభాగస్య ఛాయయాసహ సోప్యన్ధకారరూపః సూర్యమండలం ప్రవిశ్య ఛాదయతీతి। అనేన గోలగణితస్య స్మృత్యాదీనాం చ విరోధః పరిహృతః। తథా చోక్తం గోలాధ్యాయే—

'రాహుః కుభామండలగ శ్శశాంకం శశాంకగ శ్ఛాదయ తీన బింబమ్' ఇతి 'రాహోః స్థానవశేన కేతుస్థితిః।'

తాత్పర్యము— చంద్రునియందు భూచ్ఛాయ పడినపుడు ఆఛాయ అంధకారరూపముగనుక అంధకారచారి యగు రాహువు దాని నాధారముచేసికొని చంద్రుని ఆచ్ఛాదించును. అంధకారరూప మైన చంద్రమండలచ్ఛాయ సూర్యుని యందుపడినపుడు ఆఛాయ నాధారము చేసికొని సూర్యమండలమును రాహువు ఆచ్ఛాదించును.

కనుక ఛాయానిమిత్తమున గ్రహణ మనువాదమునకును, రాహునిమిత్తమున గ్రహణ మనువాదమునకును విరోధ మేమియు లేదు. భూచ్ఛాయాగతుడై చంద్రుని, చంద్రచ్ఛాయాగతుడై సూర్యుని, రాహువు ఆచ్ఛాదించుచుండెనని గోలగణితములోకూడ చెప్పబడినది. స్థానవిశేషమున రాహువునకే కేతుస్థితి. అని.

ఈగ్రంథసందర్భమునుబట్టి మనస్సాక్ష్యములోని రెండవవిషయము నిరస్తము.

3 సూర్యునకు చలనములేక భూమియే తిరుగుచున్నట్లు యంత్రమువలన తోచుచుండ కదలని సూర్యునకు రథాశ్వసారథు లున్నట్లు వేదములో చెప్పుట యెట్లు సరిపడును? అట!

దీనికని పురాణవర్మలోని విషయమే సమాధానముగా ప్రదర్శింపబడుచున్నది.

పురాణవర్మ—భూభ్రమణవిచారము—

భూభ్రమణవాదులు ఇట్లనుచున్నారు—భూమియొక్క పరిధి (చుట్టుకొలత) 25వేల మైళ్ళు. ఈభూమి అతివేగముగా బంతివలె కుమ్మరిసారెవలె తిరుగుచున్నది. 25వేల మైళ్ళపరిధికల భూమి 24 గంటలలో ఒకచుట్టు తిరుగుచున్నది. ఈతిరుగుట తూర్పుదిక్కువైపు జరుగుచుచున్నది. అని.

ఈభూభ్రమణవాదముపై అనివార్యములైన దోషము లిట్లు ప్రదర్శింపబడియున్నవి—

వరాహమిహిరుడు—

"భ్రమతి భ్రమిస్థితేవ క్షితిరిత్యపరే వదన్తి నోడుగణః।
యద్యేవం శ్యేనాద్యా న ఖాత్పునస్స్వనిలయ ముపేయుః॥
అన్యచ్చ భవే ద్దుఃఖమే రహ్నిభ్రమరంహసా ధ్వజాదీనామ్।
నిత్యం పశ్చాత్ప్రేరణ మథాల్పగా స్యా త్కథం భ్రమతి॥
శి. వృ. గ్ర.

యదిచ భ్రమతి క్ష్మా తదా స్వకులాయం కథమాప్నుయుఃఖగాః।
ఇషవోఽభినభస్సముజ్ఝితా నిపతన్తస్స్యురపాంపతే ర్దిశిః॥
పూర్వాభిముఖే భ్రమే భువో వరుణాశాభిముఖో వ్రజేద్ఘనః।
అథ మన్దగమాత్తదా భవే త్కథమేకేన దివా పరిభ్రమః॥"

ఈశ్లోకములలో చెప్పబడిన దోషము లయిదు.

1 తూర్పుదిక్కుగా గలుగు భూభ్రమణవేగమువలన పశ్చిమదిక్కుగా సతతము పెనుగాలి వీచుచుండవలెను.

2 ఆ పెనుగాలినిబట్టి పతాకలు ఎప్పుడు బశ్చిమదిక్కు గానే యెగురుచుండవలెను.

3 మేఘసంచారముకూడ ఎప్పుడు బశ్చిమదిక్కు న కే ఉండవలెను.

4 ఆకాశముమీదికి వేసిన బాణము ఎప్పుడు బడినను పశ్చిమము న కే పడవలెను.

5 ప్రాతఃకాలము తమగూళ్ళను విడిచి వెళ్ళినపక్షులు ఆకాశ మునుండి తమగూళ్ళకు తిరిగి చేరలేకపోవలెను.

వివరణము—ఆకాశమందు వస్తుసంచలనమువలన వాయువు పుట్టుచుండుట సహజము. పంకా ఎంతవేగముగా తిరుగునో అంతగాలి పుట్టుచున్నది. మోటారు, రైలు తూర్పుదిక్కుగా వెళ్ళునపుడు పుట్టినవాయువు పశ్చిమముగా వీచుచుండుట స్పష్టము. అట్లే భూభ్రమణవేగమునగూడ వెనుకకుగాలి వీచుచుండవలెను.

ఆవేగము 25వేల మైళ్ళు పరిధిగల భూమి 24 గంటలలో ఒక సారి తిరుగునపుడు గంటకు 1041 మైళ్ళు. నిమిషమునకు 17 మైళ్ళు తిరిగెడి వేగమగుటచేతను, భూమండలము విస్తృత మగుటచేతను, ఆకాశమందు పశ్చిమాభిముఖముగా తీవ్రవేగముగల వాయువు పుట్టి తీరవలయును. అట్లు లేదు

ఆ వాయువేగమున లోకములోని పతాకలన్నియు పశ్చిమాభి ముఖముగనే యెగురుచుండవలయును. అట్లు లేదు.

ఆవాయువేగమున మేఘసంచారము సర్వదా పశ్చిమాభిముఖ ముగనే ఉండవలయు. తూర్పుగా సంచార ముండకూడదు. అట్లు లేదు.

ఆకాశముమీదికి వేసిన బాణము 15 సెకన్లకు తిరిగివచ్చి భూమి మీదబడునపుడు ఆ 15 సెకన్లలో 4 మైళ్లకు పైగా భూమి తూర్పు వైపు భ్రమణముచేయుటనుబట్టి ఆబాణము ఆదూరములో వెను కకే పడవలయును. అట్లు లేదు.

ఒక పావురము తనగూటిని విడిచి ఆకాశముమీది కెగిరి వెంటనే మూడునిమిషములకే తనగూటికై వచ్చినను ఆ మూడునిమిషము లకు భూమి 51 మైళ్ళు భ్రమణముచేయుటనుబట్టి ఆపావురము

ఎంతయెగిరినను ఆగూటిని పట్టుకొనలేకపోవలయును. అట్లు లేదు.
కనుక భూభ్రమణవాదము యుక్తము కాదు.

భూభ్రమణవాదు లొకమాట చెప్పుదురు— భూవాయువొకటి కలదు. అది పతాకా- మేఘ- బాణ- పక్షి- ప్రభృతులను తూర్పునకు ఆకర్షించుటనుబట్టి పూర్వోక్తదోషప్రసక్తి యుండదు. అని.

ఈమాటకూడ అయుక్తమే. వారన్నట్టి భూవాయువు, భూమితో సంబంధించియున్నట్టియు సంబంధింపకున్నట్టియు పదార్థములన్నిటిని తూర్పునకు ఆకర్షించు పక్షములో పొగ, పతాక, మేఘము, మొదలగువానికి పశ్చిమముగా సంచారము సంభవించు టెట్లు?

తూర్పుగా పదార్థముల నాకర్షించు భూవాయుప్రభావము నలుదిక్కులకు సమానవేగముతో సంచరించు విమానముపై కనబడుట లేదు. అట్టిది యెగిరెడి పక్షులయందు · ప్రసరించి వానిని గూళ్ళకు చేర్చు నను టెట్లు?

కనుక భూభ్రమణవాద మయుక్తమే.

మరియు, నక్షత్రములను పరిశీలించుటకై యేర్పడినట్టి దుర్భిణీయంత్రము భూమియొక్క అచలత్వమును సిద్ధింపజేయుచున్నది. ధ్రువతారను దుర్భిణీయంత్రముతో ఎంతకాలము చూచినను అది స్థిరముగనే కనబడుచున్నది. భూభ్రమణమే నిజమైనయెడల ఆ ధ్రువతార స్థిరత్వము లేక పూర్వపశ్చిమములలో ఎప్పుడైనను కనబడితీరును. అట్లు లేనందున ధ్రువతార, భూమి, రెండును స్థిరములే అని దుర్భిణీయంత్రమూలమున అనుభవసిద్ధము గూడ నగుచున్నది. అని.

ఇది "పురాణవర్మ" గ్రంథస్థభూభ్రమణవిచారమందలి సారాంశము.

మరియు, శ్రీ అనంతుని సీతారామసిద్ధాంతిగారిచే రచింపబడి, బ్రహ్మాండప్రకరణము, పురాణసిద్ధాంతసామరస్యప్రకరణము, భూభ్రమణభ్రాంతినిరసన ప్రకరణము. అను ప్రకరణత్రయముతో గూడిన "జ్యోతిస్సిద్ధాంత తత్త్వప్రదీపిక" యందు 172 పేజీలలో చర్చింపబడియున్న 'భూభ్రమణభ్రాంతినిరసన ప్రకరణము' లోని కొన్నివిషయములు దిజ్మాత్రముగా ప్రదర్శింపబడుచున్నవి—

—• జ్యోతిస్సిద్ధాంత తత్త్వప్రదీపిక-భూభ్రమణభ్రాంతినిరసనము •—

"కూలం ప్రత్యాగచ్ఛ న్నౌస్థః స్థిరభూమిజాన్ ప్రతీపగమాన్ ।
మనుతే యథా తథోర్వీభ్రమణాత్తారాగ్రహం సదాప్యచలమ్ ॥
చలమివ మన్యత ఇతి చే దథఃపతేయు ర్నగాదయ స్సర్వే । కుపరి
భ్రమవేగవశాన్న పతన్త్యపి చేద్భ్రమాడయ సర్వే ॥ తద్వేగజనిత
వాతై ర్న కథం ప్రత్యగ్గతాగాస్స్యుః ॥" (దైవజ్ఞవిలాసము.)
"భూగోళవేగజనితేన సమీరణేన కేత్వాదయోప్యపరదిగ్గతయ
స్సదా స్యుః । ప్రాసాదభూధరశిరాంస్యపి సంపతన్తి తస్మా
ద్భ్రమత్యుడుగణ స్త్వచలాఽచలైవ ।" (శ్రీపతిసిద్ధాంతము.)

భూమి ప్రాగభిముఖమై తిరుగుచున్నచో భూమియందుండు వృక్ష, పతాకముల యొక్క కొసలెప్పుడు పశ్చిమదిక్కునకు వంగియుండవలసివచ్చును. ధూపరాగముకూడ సర్వదా పశ్చిమమునకే గాలిచే లాగబడిపోవుచుండవలెను. మనకది నలుదిక్కులకు పోవుచున్నట్లగపడుచున్నది. అందుచే భూమిస్థిరముగనున్నదనియు, గ్రహనక్షత్రపంజరమే తిరుగుచున్నదనియు నెరుంగవలయును. మరియు నొకపట్టణము నుండి ఆకాశమునకు బోయినవిమానములు, భూమి ప్రాగ్దిశకు గంటకు 1042 మైళ్లదూరము పోవుటచే స్వస్థానముల నొందకపోవలసివచ్చును. భూమి స్థిరమైయున్నదిగనుక స్వస్థానము నొందుచున్నవి.

ఒకవేళ, పక్షులు, ఆకాశవిమానములు భూవేగమున గలిగిన పవరుచే లాగబడి భూమితిరుగుచుండు తూర్పుదిక్కునకే వెడలుచున్నవి గనుక స్వస్థానమును పొందుచున్నవందురా ?

అటులయిన నతివేగముగ ప్రవహించుచున్న ప్రవాహమున జిక్కి ప్రవాహవేగాక్రాంతుడయి ప్రవాహముతోబాటు కొట్టుకొనిపోవు మనుజునివలె ఆకాశమునకు వెళ్ళిన పక్షులు, విమానములు, గూడ భూవేగముచే గలిగిన పవరుచే లాగబడి స్వేచ్ఛగా నలుదిక్కుల సంచరింపజాలక భూమితోబాటు తూర్పునకే యెప్పుడు సంచరింపవలసివచ్చును. నలుదిక్కుల స్వేచ్ఛగా నవి తిరుగుచున్నట్లు మనము చూచుచున్నాము.

"పూర్వాభిముఖే భ్రమే భువో వరుణాశాభిముఖో వ్రజే ద్ఘనః।
అథ మన్దగమా త్తథా భనే త్కథ మేకేన దివా పరిభ్రమః॥"
(శ్రీపతీయసిద్ధాంతము.)

"కించాఽంబుదా అపి న భూరి పయోముచస్స్యుః।
దేశస్య పూర్వగమనేన చిరాయ హన్త॥" (లల్లాచార్యసిద్ధాంతము.)

ఒకవేళ భూమి పూర్వాభిముఖమై వెళ్లుచు తిరుగుచున్నది. అందుచేత మేఘాదులు నలుదిక్కులకు సంచరింప వచ్చునందురా? అట్లయిన 60 ఘటికలకాలములో భూమియొక్క ఆత్మప్రదక్షిణముచేయుట తటస్థింపనందున మనకు 60 ఘటికలకాలములో అహోరాత్రములు గాకపోవును. అందుచే భూమితిరుగదని తెలియుచున్నది. మరియు భూమి తిరుగుచున్నదనుపక్షమున ఒకదినము పూర్తిముసురు పట్టినపుడు భూగోళముచుట్టు ముసురుపట్టినట్లుండవలయును. మనయనుభవమున మనముందు గ్రామమున ముసురువానయుండగా మనగ్రామమునకు తూర్పునగాని, పశ్చిమమునగాని, 5, 6 యోజనములదూరములో నుండు గ్రామమున ముసురు లేనట్లు, మేఘములుకూడ లేనట్లు, గోచరించుచున్నది. కనుక భూమితిరుగుటలేదని యెఱుంగవలయును.

మరియు భూమినుండి విమానములో ఆకాశమునకు వెళ్లిచూచినచో భూమితిరుగుచున్నదో లేదో విశదముగా తెలియును. నాలుగు విమానములను ఆకాశమునకు ఒకదానివెనుక నొకదానిని విడిచినపుడు మొదటివిమానమునుండి కొంతదూరము పోయినపిదప భూమివంక జూడవలయును. అపుడు తిరుగుచుండు క్రిందివిమానములు నలుదిక్కుల దిరుగుచున్నట్లును, స్థిరముగనుండు భూమి స్థిరముగనే యున్నట్లును కనబడును.

గ్రహనక్షత్రభ్రమణము—సిద్ధాంతశిరోమణి—

"భూమే ర్బహి ర్ద్వాదశయోజనాని భూవాయురత్రాంబుదవిద్యుదాద్యమ్। తదూర్ధ్వగో యః ప్రవహ స్స నిత్యం ప్రత్యగ్గతి స్తస్య తు మధ్యసంస్థం। నక్షత్రకక్షా ఖచరై స్సమేతో యస్మా దత స్తేన సమాహతోఽయం। భపంజరః ఖేచరచక్రయుక్తో భ్రమత్యజస్రం ప్రవహానిలేన।

ఆవహ మను భూవాయువు భూమినుండి 12 యోజనముల దూరము పైకి సంచరించుచుండును. ఈ 12 యోజనముల దూరము లోనే మేఘములు, మెరుపులు ఉండును.

ఆ 12 యోజనముల కుపరిభాగమున ప్రవహవాయువు మధ్యగతి కలదై యెప్పుడు పశ్చిమమునకు వెళ్ళుచు నక్షత్రగ్రహ కక్ష్యతోగూడిన భపంజరమును ప్రేరేపించుటచే నది పశ్చిమముగా ఎల్లపుడు తిరుగుచుండును. అందుచేత గ్రహనక్షత్రములు తిరుగుచున్న వనుటయే పరమసిద్ధాంతము.

భూభ్రమణ మగుచున్నచో భూగ్రహనక్షత్రాంతర యోజనములు నియతి లేని వయి యుండవలసివచ్చును. అని.

"కించైవం చే ద్ద్యుసదాం నియతం ధిష్ణ్యాన్తరాగమో న స్యాత్ ।"

అనుచు దైవజ్ఞవిలాసములో చెప్పబడినది.

1 భూమి స్థిరముగా నున్నదికనుకనే గ్రహములకు దక్షిణోత్తర చారములు సరిపోవుచున్నవి.

2 భూమి తిరుగుచున్న దను పక్షమున కుజ-గురు-శనులకు దక్షిణోత్తరగోళసంచారములు కుదరకపోవుట.

3 భూభ్రమణమే సత్యమైనచో అశ్విన్యాదినక్షత్రములయొక్క ఉదయాస్తమయములు, నతోన్నతాంశలు, నియతి దప్పియుండ వలసివచ్చును.

4 భూభ్రమణ మగుచున్నపక్షమున నక్షత్రాకారములు మార్పు నొంది యుండవలసివచ్చుట.

5 భూభ్రమణ, సూర్యభ్రమణ మతములలో దేనియందు గురుత్వ మగపడుచున్నది ?

6 భూభ్రమణమతతత్త్వజ్ఞులలో నొకరగు మైనంపాటి నృసింహాము బి. ఏ. గారు తమ భౌతికశాస్త్రములో సూర్యభ్రమణమే నిజమని వ్రాసియున్నారు. 243 పుటలో భూవాయునిర్ణయావసరమున భూభ్రమణమయినచో భూవాయువులు ప్రత్యక్షవిరుద్ధముగా నగుపడును. కాన భూభ్రమణ మసత్యమని వ్రాయబడియున్నది

7 భూభ్రమణ మయినచో భూధ్రువుల కుండు అంతరము యొక్క మైళ్ళు మిక్కిలి న్యూనాధికములు కావలసివచ్చుట.

8 రామచంద్రసుబ్బాజీబాబుగారు మహారాష్ట్రభాషలో వ్రాసిన 'సిద్ధాంతశిరోమణి పత్రికాశిక'లో భూభ్రమణ మగుచున్నదా ? సూర్య భ్రమణమగుచున్నదా ? అను విషయమును చర్చించి భూభ్రమణ మసత్యమని నిరూపించినారు.

9 సూర్యాదిగ్రహనక్షత్రభ్రమణము దెలుపు ప్రమాణములు.

10 ఖురాణ్ పరీక్షలో సూర్యభ్రమణప్రమాణము, భూస్థిరత్వ ప్రమాణము.

11 బైబుల్‌లో సూర్యభ్రమణప్రమాణము—'యహోషవా, సూర్యుడా ! నీవు గబియోనులో నిలుపుము. చంద్రుడా ? అయ్యలోనులోయలో నిలుపుము ' అని యెహోవాకు ప్రార్థన చేసెను. జనులు తమ శత్రువులమీద పగ దీర్చుకొనువరకు సూర్యుడు నిలిచెను. చంద్రుడాగెను. సూర్యు డాకాశమధ్యమున నిలిచి ఇంచుమించు ఒకనాడెల్ల అస్తమింప త్వరపడలేదు...' అని వ్రాయబడినది.

(తెలుగు బైబుల్)

ఇత్యాదివిషయములు గ్రంథకర్తచే చర్చాపూర్వకముగా నిరూపింపబడినవి. ఇతోధికముగా దెలిసికొనదలచినవారు ఆగ్రంథమునే చూడవలయును.

ఇది 'జ్యోతిస్సిద్ధాన్త తత్త్వప్రదీపిక'లోని భూభ్రమణభ్రాంతి నిరసనప్రకరణమందలి సారాంశము.

ఇట్లు భ్రాంతిసిద్ధమైన భూభ్రమణవాదమును బట్టుకొని 'మన స్వాస్థ్య' కర్తలు, భంగు తాగి ఋషు లేదో వ్రాసినా రందురే ! పై పరిశీలనమునుబట్టి శాస్త్రకర్తలగు ఋషులు భంగుతాగినవారని తేలినదా ? ఆహా ! శాంతం పాపమ్; ఋషులను వేదములను దూషించుట, లోకులకు శ్రేయస్కరము కాదని, ఆస్తికత్వలక్షణము కాదని మనవిచేయుచు దీని నింతటితో విడుచుచున్నాము.

# వైదికమతసిద్ధాంతము.

ఉత్పత్తి - వినాశములు దేహముల కేగాని జీవులకుగాదు, దేహమే జీవుడని దేహోత్పత్తియే జీవోత్పత్తి యని, దేహనాశమే జీవనాశమని, దేహమూలకమైన కర్మ దేహనాశముతో నశించునని, కొందరు భావించుచున్నారు.

ఈ విషయమై మహాభారత మిట్లు చెప్పుచున్నది—

"యథా శ్రుతి రియం బ్రహ్మన్ జీవః కిల సనాతనః।
శరీర మధ్రువం లోకే సర్వేషాం ప్రాణినా మిహ ॥
వధ్యమానే శరీరే తు దేహనాశో భవ త్యుత ।
న సంక్రమతేఽన్యత్ర కర్మబద్ధనిబన్ధనః ॥
న జీవనాశోఽస్తి హి దేహభేదే
మిథ్యైత దాహు ర్మ్రియతీతి మూఢాః ।
జీవస్తు దేహాన్తరితః ప్రయాతి
దశార్థతై వాఽస్య శరీరభేదః ॥
అన్యో హి నాశ్నాతి కృతం హి కర్మ
మనుష్యలోకే మనుజస్య కశ్చిత్ ।
య త్తేన కించి ద్ధి కృతం హి కర్త్ర
త దశ్నుతే నాస్తి కృతస్య నాశః ॥" (వనపర్వ- అ 209)

అనగా శ్రుతి యిట్లు చెప్పుచున్నది- జీవస్వరూపము నిత్యము. శరీర మనిత్యము; శరీరనాశము సంభవించినప్పుడు జీవుడు నశింపక తన కర్మబంధమునుబట్టి శరీరాంతరమందు సంక్రమించుచుండును. నశింపనట్టి జీవునకు నాశ మున్నదని మూఢులు దుర్వాదము చేయుచుందురు. మరణమునుబట్టి ఒక శరీరవియోగము, మరియొక శరీరయోగము. ఇట్లు జరుగుచుండును.

మనుష్యదేహముతో తాను చేసిన కర్మను అన్యుడు కాక తానే అనుభవించుచుండును. చేసిన కర్మ అనుభవించినగాని నశింపదు. అని తాత్పర్యము.

మరియు 'జాతో దేవదత్తః,మృతో దేవదత్తః' ఇత్యాదివ్యవహారము దేహోత్పత్తినాశములకు సంబంధించినదే.

"జీవాపేతం వా వ కిలేదం మ్రియతే న జీవో మ్రియతే"

అనుశ్రుతి జీవవియుక్తమునకే మరణము, జీవునకు మరణము కాదు. అని యుద్ఘోషించుచున్నది.

ఈ విషయము భగవద్గీతలోగూడ నీదిగువశ్లోకములచేత విశదీకరింపబడినది—

"నత్వేవాహం జాతు నాసం న త్వం నేమే జనాధిపాః ।
నచైవ న భవిష్యామ స్సర్వే వయ మతః పరమ్ ॥
దేహినో ఽస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా ।
తథా దేహాన్తరప్రాప్తి ర్ధీర స్తత్ర న ముహ్యతి ॥
వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరో ఽపరాణి ।
తథా శరీరాణి విహాయ జీర్ణా న్యన్యాని సంయాతి నవాని దేహీ॥"

ఇందు ప్రథమశ్లోకముచే, జీవులకు త్రికాలస్థాయిత్వరూపమైన నిత్యత్వము చెప్పబడినది. ద్వితీయశ్లోకముచే, కౌమార, యౌవన, జరావస్థలు ఒకే దేహమునకు వచ్చుచు పోవుచునున్నట్లు, అనేక దేహములు ఒకే దేహికి (జీవునకు) వచ్చుచు పోవుచు నుండు నని చెప్పబడినది.

తృతీయశ్లోకముచే, వెనుకటి వస్త్రములను విడిచి నూతన వస్త్రములను ధరించుచున్నట్లు జీవుడు వెనుకటి శరీరములను విడిచి నూతనశరీరములను గ్రహించుచుండు నని చెప్పబడినది.

ఈపూర్వోక్తగ్రంథసందర్భముచేత దేహాత్మవాది—చార్వాకమతము, శూన్యాత్మవాది- బౌద్ధమతము, క్షణికవిజ్ఞానాత్మవాది- బౌద్ధమతము నిరస్తమైనది.

## —• జీ వ ని రూ ప ణ ము •—

ఇంకను శాంతిపర్వములో భృగు-భరద్వాజసంవాదములో జీవనిరూపణప్రస్తావములో నిట్లున్నది—

"మాంసశోణితసంఘాతే మేదస్స్నాయ్వస్థిసంచయే ।
భిద్యమానే శరీరే తు జీవో నైవోపలభ్యతే ॥" (అ. 187)

"వ్యా. నైవోపలభ్యతే వ్రీహితండులవత్"

రక్తమాంసాస్థిమయమైన శరీరమును చీల్చిచూచినపుడు ధాన్యపు గింజలో బియ్యపుగింజవలె జీవుడు కనబడుట లేదు. ఇత్యాద్యాక్షేపములు చూపి సమాధాన మిట్లు చెప్పబడినది—

'సమిధా ముపయోగాన్తే యథాఽగ్ని ర్నోపలభ్యతే ।
ఆకాశానుగతత్వా ద్ధి దుర్గ్రాహ్యో హి నిరాశ్రయః ॥
తథా శరీరసంత్యాగే జీవో హ్యాకాశవత్ స్థితః ।
న గృహ్యతే తు సూక్ష్మత్వా ద్యథా జ్యోతి ర్న సంశయః ॥'

వ్యాఖ్యా—సమిధామితి । దగ్ధేననాగ్నివత్ సన్నేవాత్మా దేహనాశే సతి సౌక్ష్మ్యా న్నోపలభ్యత ఇత్యర్థః। ఆకాశవత్ సర్వగతో నిత్యశ్చ । జ్యోతిః అరణిస్థోఽగ్నిః । నచ తత్రాసన్నేవ అగ్ని ర్మథనా దుత్పద్యత ఇతి వాచ్యమ్, అసత్త్వావిశేషేణ సర్వత స్సర్వోత్పత్తిప్రసంగాత్ । తస్మాత్తిలేషు తైలమివ అరణ్యాదిష్వగ్నిః సన్నేవ యత్నేనాఽభివ్యజ్యతే । నచ ప్రాగ్యత్నా ద్దృశ్యతే సూక్ష్మత్వా దిత్యర్థః"

కట్టెల నాశ్రయించి ప్రజ్వలించిన అగ్ని ఆకట్టెలు దగ్ధమైన తరువాతగూడ సూక్ష్మముగా నుండి నిరాశ్రయమగుటచే గోచరింపకున్నట్లు శరీరమందు జీవుడు ప్రకాశించి దానిని విడిచినపుడు అప్రత్యక్షస్వరూపమగుటచే గోచరించుటలేదు. అరణి అగ్నిని (మథించునపుడు అడుగున నున్న కర్ర)యందు అగ్ని సూక్ష్మమై యున్నట్లు దేహమందు జీవుడు సూక్ష్మమై యుండెను. అరణియందు లేని అగ్ని మథించుటచే బుట్టుచున్నదని భావింపరాదు. లేనిది పుట్టుచున్న వస్తువులో సర్వము సర్వత్ర పుట్టుచునే యుండవలయును. అగ్నినిమిత్తము అరణినే అపేక్షింపవలసిన పని యేమున్నది ? కనుక తిలలయందు తైలమువలె అగ్ని అరణి యందున్నది ? ఆ అగ్ని అరణని చీల్చి చూచిన గోచరింపనిదై మథింపగా గోచరించుచున్నది. అట్లే శరీమందు జీవుడును సూక్ష్మరూపముగా నుండి శరీరమును ఛేదించి చూచువానికి గోచరింపక జ్ఞానమార్గమున ప్రయత్నించినవానికే గోచరించును. అని భావము.

జీవాత్మనుగూర్చి యీ అగ్నిదృష్టాంతమే మను-బృహస్పతి-సంవాదములోఁగూడ నిట్లు చెప్పబడినది.—

"యథా చ కశ్చిత్పరశుం గృహీత్వా
ధూమం న పశ్యే జ్జ్వలనం చ కాష్ఠే।
తద్వచ్ఛరీరోదరపాణిపాదం
ఛిత్వా న పశ్యన్తి తతో య దన్యత్॥
తాన్యేవ కాష్ఠాని యథా విమథ్య ధూమం చ పశ్యేజ్జ్వలనం చ యోగాత్। తద్వత్స బుద్ధిః సమ మిన్ద్రియాత్మా బుద్ధిం పరం పశ్యతి తం స్వభావమ్॥" (శాన్తి. అ202)

వ్యాఖ్యా— ఉపాస్యవధేయయో ర్జీవజ్ఞానయో రదృశ్యత్వం సదృష్టాన్త మాహ ద్వాభ్యాం-యథా చేతి। గృహీత్వా వ్యాపార యిత్వా। యోగాత్ ఉపాయాత్। పశ్యామీత్యనుభవ న్నిన్ద్రియాత్మా జీవః సుబుద్ధిః పరంబుద్ధిం చ సమ మేక కాలం పశ్యతీత్యర్థః॥"

కట్టెలను ఛేదించువానికి అదృశ్యమై యందున్న అగ్ని యెట్లు గోచరింపదో అట్లే శరీరమును ఛేదించి చూచువానికి అదృశ్యమై యందున్న జీవాత్మ గోచరింపదు ఉపాయమును ఉపయోగించినప్పుడు అగ్ని గోచరించినట్లు జ్ఞానసాధనమై జీవాత్మ గోచరించును. అని భావము.

—• జీవ- ప్రాణ- పరస్పర సంబంధము •—

"ప్రాణాన్ ధారయ త్యగ్నిః స ఏవ ఉపధార్యతామ్।
వాయుసన్ధారణో హ్యగ్ని ర్నశ్య త్యుచ్ఛ్వాసనిగ్రహాత్॥"

వ్యాఖ్యా— అగ్ని ర్విజ్ఞానం, స ఏవ విజ్ఞానమయో జీవః వాయు స్తైవ సన్ధారణ మవస్థానం యస్యనశ్యతి అదర్శనం గచ్ఛతి ఉచ్ఛ్వాసస్యవాయో ర్నిగ్రహాత్॥"

"తస్మి న్నష్టే శరీరాగ్నౌ తతో దేహ మచేతనమ్।
పతితం యాతి భూమిత్వ మయనం తస్య హి క్షితిః॥
జంగమానాం హి సర్వేషాం స్థావరాణాం తథైవ చ॥"(శాన్తి.అ187)

వ్యాఖ్యా- అయనం లయస్థానమ్।"

ప్రాణధారణకు మూలమే జీవుడు. ప్రాణవాయువుచేతనే జీవుని నిలకడ. కనుకనే ఉచ్ఛ్వాసవాయువునకు నిరోధ మేర్పడినపుడు జీవు డదృశ్యమైపోవును. జీవుడు వెడలిపోయినపుడు దేహ మచేతనమై పడిపోయి పృథివితో ఐక్యమొందును. పార్థివదేహమునకు లయస్థానము పృథివి యగుటే దానికి కారణము. స్థావరములకుగాని, జంగమములకు గాని యిదియే పద్ధతి. అని భావము

—• దేహేంద్రియమనస్సులు పంచభూతాత్మకములు-చైతన్యము వాని ధర్మము కాదు. అను విషయము •—

"న పఞ్చ సాధారణ మత్ర కించి చ్ఛరీర మేకో వహతేఽన్తరాత్మా। సవేత్తి గన్ధాం శ్చ రసాన్ శ్రుతీశ్చ స్పర్శం చ రూపం చ గుణాంశ్చ యేఽస్య ॥

వ్యాఖ్యా—న పఞ్చేతి । యథా శ్రోత్రాదీనాం శబ్దాదిగ్రాహకత్వేన గ్రాహ్యసజాతీయగుణాశ్రయత్వేన ఆకాశాదిరూపత్వమేవం మనోఽపి సర్వగుణగ్రాహకత్వాత్సర్వగుణాశ్రయత్వేన పాంచభౌతికమ్ । అతః త న్న కించిత్ భూతేభ్యోఽన్య త్తత్త్వాన్తరం, పఞ్చసాధారణత్వాత్ । అత స్త న్న శరీరనిర్వాహకం, కిన్తు ఏకః అన్తరాత్మైవ శరీరం స్థూలసూక్ష్మభేదేన ద్వివిధం వహతి చాలయతి ।"

తాత్పర్యము—దేహము పాంచభౌతికము, జడము, ఇంద్రియములును అట్టివే. ఏమనగా పృథివీ-జల-తేజో-వాయు-ఆకాశము లను పంచభూతములలో ఏయే భూతముయొక్క గుణమును ఏయే యింద్రియము గ్రహించుచున్నదో ఆయాయింద్రియము ఆయాభూతముయొక్క అంశ మనక తప్పదు. మనస్సు పంచభూతముల గుణములను గ్రహించుచుండుటచే పాంచభౌతిక మనవలసినదే. కనుక పంచభూతములకు జెందిన కేవలమనస్సుకూడ శరీరనిర్వాహకము కాదు. ఇక అంతరాత్మ యనబడు జీవాత్మయే చైతన్యధర్మము కలదై సర్వవిషయములను గ్రహించుచు స్థూలసూక్ష్మదేహములను నడిపించుచున్నది. అని.

"పఞ్చాత్మకే పఞ్చగుణప్రదర్శీ స సర్వగాత్రానుగతోఽన్తరాత్మా।

స వేత్తి దుఃఖాని సుఖాని చాత్ర తద్విప్రయోగాత్తు న వేత్తి దేహః॥"
(శాన్తి. అ187)

వ్యాఖ్యా— పఞ్చాత్మకే ఇతి। పంచభూతాత్మకే శరీరే పఞ్చ గుణా యస్మిన్ తత్తథా। మనః। తస్య ద్రష్టా—మమ మనః ఖిన్న మిత్యనుభవాత్। స ఏవ మనోద్వారా సర్వగాత్రానుగతః। వ్యతిరేకమాహ- తద్విప్రయోగాత్......"

తాత్పర్యము— పాంచభౌతికమైన దేహమందు పాంచభౌతికమైన మనస్సునకు ద్రష్టయైన అంతరాత్మ మనస్సంబంధముతో సర్వ శరీరవ్యాప్తితో సుఖదుఃఖములను తెలిసికొనుచుండెను. ఆజీవుని వియోగ మేర్పడినపుడు దేహము తెలిసికొనలేకున్నది. అని.

ఇంద్రియములయొక్క ప్రకాశమునుగూర్చి యిట్లుచెప్పబడినది.

"యథా ప్రదీప్తః పురతః ప్రదీపః ప్రకాశ మన్యస్య కరోతి దీప్యన్। తథేహ పఞ్చేన్ద్రియదీపవృక్షా జ్ఞానప్రదీప్తాః పరవన్త ఏవ॥"

వ్యాఖ్యా— యథేతి, యథా వృక్షాగ్రస్థో దీపః భూయాంసం విషయమవభాసయతి, న తథా వృక్షమూలస్థః। ఏవం పఞ్చేన్ద్రియరూపాశ్చైతన్యప్రదీపయుక్తాః వృక్షాఇవాऽప్రకాశాః జ్ఞానదీపేన ప్రదీప్తాః పరవన్తః। చిత్ప్రకాశాధీనతయా ప్రకాశకృతః। న స్వత ఇత్యర్థః। తథా చ శ్రుతయః— "యేన వాగభ్యుద్యతే, "యేన చక్షూంషి పశ్యన్తి" 'యేనాహుర్మనో మతమ్"ఇత్యాద్యాః॥'

వృక్షమూలమందుగాక వృక్షాగ్రమందు ప్రదీపింపజేయబడిన దీపము తాను ప్రకాశించుచు ఇతరమును ప్రకాశింపజేయును. అట్లే దేహమున కుపరిభాగమందైన జ్ఞానేంద్రియపంచకము ఆత్మచైతన్యముచే ప్రదీప్తమై ప్రకాశించుచు సర్వవిషయములను ప్రకాశింపజేయుచున్నది. అంతియకాని జ్ఞానేంద్రియములకు స్వతఃప్రకాశము లేదు. ఈవిషయమును శ్రుతులే చెప్పుచున్నవి. అని తాత్పర్యము.

"యథా చ రాజ్ఞో బహవో హ్యమాత్యాః పృథ క్ప్రమాణం ప్రవదన్తి యుక్తాః। తద్వ చ్ఛరీరేషు భవన్తి పఞ్చ జ్ఞానైకదేశః పరమ స్స తేభ్యః।" (శాన్తి. అ. 202)

వ్యాఖ్యా—తేభ్యః ఇన్ద్రియేభ్యః స జ్ఞానరూపః పరమః ।

ఒకప్రభువు ననుబంధించియున్న అమాత్యులు వేఱువేఱుగా తెలిపినది ప్రమాణమే అగునట్లు ఆయా శరీరములలో జీవాత్మ నను బంధించియున్న జ్ఞానేంద్రియములు వేఱువేఱుగా తెలిపిన విషయ ములును ప్రమాణములే అగుచున్నవి. ఇంద్రియవర్గమునకు అట్టి సామ ర్థ్యము గలుగజేసిన చైతన్యస్వభావము కల ఆత్మ ఉత్తమమైనది. అని భావము.

"యథా సమీపే జ్వలతోఽనలస్య సంతాపజం రూప ముపైతి కశ్చిత్ । నచాఽపరం రూపగుణం బిభర్తి తథైవ తద్దృశ్యేతి రూప మస్య ॥"

వ్యాఖ్యా— రూపం పైంగల్యాదికం కశ్చిత్ అయఃపిండాదిః తథాపి స వస్తువృత్త్యా దగ్ధృత్వ పింగలత్వాఖ్య మపరం రూపం గుణం వా యథా న బిభర్తి తథైవ తత్ । అస్యాత్మనః రూపం చైతన్యం దేహే దృశ్యతే। నతు దేహో వస్తుత శ్చేతనః।

అయఃపిండము అగ్నితప్తమైయున్నప్పుడు అగ్నిగతమైన పింగల వర్ణము, దగ్ధృత్వము, అయఃపిండమున గోచరించును. ఆల గుణములు వస్తుతః అయఃపిండమందు లేవు. అట్లే జీవాత్మవ్యాప్తికల దేహమందు జీవాత్మగతచైతన్యము గోచరించుచున్నది. వస్తుతః దేహము చైత న్యము కలది కాదు. అని భావము.

ఈ గ్రంథసందర్భమునుబట్టి చైతన్యము దేహధర్మ మనువాదము, ఇంద్రియధర్మమనువాదము, మనోధర్మ మనువాదము, ప్రతిహాత మైనవి. పంచభూతములలో ఏయొక్కభూతము చైతన్యధర్మము కలది కానపుడు పాంచభౌతికములైన దేహముగాని, యింద్రియ ములుకాని, మనస్సుకాని, చైతన్యధర్మము కలిగి యెట్లుండును? ప్రత్యేకధర్మము కాకున్నను పంచభూతసముదాయరూపమగు దేహ మందు చైతన్య ముండవచ్చు నందురా! అది యచేతనసముదాయమై యుండ దానికి చైతన్య మెట్లు!

ఒకవేళ అంగీకరించినను చైతన్యము శరీరధర్మమయినపుడు మృతశరీరమందు ఆచైతన్య మేమయిపోయినది? కనుకనే.

'శరీరస్య న చైతన్యం మృతేషు వ్యభిచారతః।'

అని చెప్పబడినది. ఈ కారణములనుబట్టి నేటి 'నాస్తికత్వము' అను పుస్తకములో 'మానవుడు అంటే భౌతికకళేబరమే కాదు; చైతన్యంతో కూడిన స్వేచ్ఛావ్యక్తిత్వం అని అర్థం చెప్పడానికనే జీవాత్మ అనుదానిని ఆస్తికులు ప్రతిపాదిస్తారు వారు అనునట్లు భౌతికశరీరాన్ని విడిచిపోగలుగునట్టి జీవాత్మ లేదు" (పు. 192) "జీవుడు అబద్ధం" (పు. 196)

ఇత్యాదిప్రసంగము, యుక్తి- ప్రమాణ- అనుభవ-విరుద్ధ మగుటచేత త్రోసివేయబడినది.

—• దేహమునువిడిచి జీవునితోబాటు వెడలిపోవు వర్గము •—

"శ్రోత్రాదియుక్త స్సమనా స్సబుద్ధిః లింగా త్తథా గచ్ఛతి లింగ మన్యత్। ఉత్పత్తివృద్ధివ్యయసన్నిపాతై ర్న యుజ్యతేఽసౌ పరమ శ్శరీరీ।

"అనేన లింగేన తు లింగ మన్య ద్గచ్ఛ త్యదృష్టః ఫలసన్నియోగాత్।"

వ్యాఖ్యా— సమానః సబుద్ధిః మనోబుద్ధియుక్తః శ్రోత్రాదిభి ర్దశభి రిన్ద్రియైః పఞ్చభిః ప్రాణైశ్చ సహితః సప్తదశాత్మా లింగాత్ స్థూలదేహాత్ లింగం తదేవ దేహాన్తరమ్। సన్నిపాతో మరణం। ఫలనిస్న యోగాత్ సుఖదుఃఖప్రదకర్మసంబన్ధాత్। అనేన లింగేన శవీభూతేన। అదృష్టః అలక్షితః॥"

అయమర్థః— స్థూలదేహనాశేపి కర్మణాఽవబద్ధం సప్తదశాత్మకం లింగం న నశ్యతి, కిన్తు దేహాన్తరం ప్రవిశతి, తృణజలాయుకాన్యాయేన। తథా చ శ్రుతిః— "త ముత్క్రామన్తం ప్రాణోఽనూత్క్రామతి। ప్రాణ మనూత్క్రామన్తం సర్వే ప్రాణా అనూత్క్రామన్తి" ఇతి. "తం విద్యాకర్మణీ సమన్వారభేతే పూర్వప్రజ్ఞా చ" ఇతి. "తద్యథా తృణజలాయుకా తృణస్యాన్తం గత్వాఽన్యమాక్రమ మాక్రమ్యాత్మాన ముపసంహరతి" ఇతి.

అనగా జ్ఞానేంద్రియములు 5, కర్మేంద్రియములు 5, ప్రాణములు 5, మనసు 1. బుద్ధి 1. ఇవి 17 జీవునకు సూక్ష్మశరీరము. ఇట్టి సూక్ష్మశరీరముతోగూడి జీవాత్మ ఒకస్థూలదేహమును విడిచి మరియొకస్థూలదేహమున బ్రవేశించుచుండును. అట్టిజీవుడు ఉత్పత్తి, వృద్ధి, వ్యయము, మరణము, అనునవి లేకుండి సుఖదుఃఖప్రదమయిన తన కర్మబంధమునుబట్టి ఇంద్రియములకు గోచరింపకుండ ఒకదేహము నుండి మరియొక దేహమునకు సంచారము చేయుచుండును.

ఫలితార్థము— స్థూలదేహము నశించినను కర్మనిబద్ధమయిన సూక్ష్మశరీరము మోక్షపర్యంతము నశింపక దేహాంతరములయందు బ్రవేశించుచుండును. ఆయా పూర్వజన్మములయందు ఆర్జింపబడిన కర్మ, విద్య, ప్రజ్ఞ, ఆజీవు ననువర్తించుచునే యుండును. ఈ విషయమును శ్రుతియే యుద్ఘోషించుచున్నది, అని భావము. ఈ చెప్పబడిన సూక్ష్మ శరీరము అపంచీకృత పంచభూత నిర్మితమని, దృశ్యముకాని దని, జీవుని సుఖదుఃఖభోగమునకు ఆధారమైన దని చెప్పబడినది— 'పంచప్రాణ మనోబుద్ధిదశేన్ద్రియసమన్వితమ్। అపంచీకృతభూతోత్థం సూక్ష్మాంగం భోగసాధనమ్॥ అని.

ఈ యింద్రియప్రాణాదివర్గముతో గలిసి జీవుడు ప్రవేశించు జంగమస్థావరరూపము లగు స్థూలశరీరము లన్నియు పాంచభౌతికములే అనియు, పంచభూతములయొక్క కార్యములు ఆ శరీరముల యందు గనబడుచున్నవనియు, భృగు- భరద్వాజ- సంవాదములో ఇట్లు చెప్పబడినది—

"చేష్టా వాయుః ఖ మాకాశ మూష్మాఽగ్ని స్సలిలం ద్రవః।
పృథివీ చాఽత్ర సంఘాతః శరీరం పాంచభౌతికమ్।
ఇత్యేతైః పంచభి ర్భూతై ర్యుక్తం స్థావరజంగమమ్"(శాన్తి.అ184)

వ్యాఖ్యా— ఖం సుషిరమ్, అత్ర శరీరే, ద్రవో లోహితాది సంఘాతః కఠినం మాంసాస్థ్యాది॥"

శరీరమందు గోచరించు గమనాది చేష్ట వాయువునకు జెందినది. రంధ్రములు ఆకాశమునకు జెందినవి. వేడి అగ్నికి జెందినది. రక్తము

మొదలగు ద్రవపదార్థము జలమునకు జెందినది కఠినమైన మాంసా స్థ్యాదికము పృథివికి జెందినది. ఇట్లు పంచభూతములతో గూడి స్థావర జంగమ శరీము లున్నవి అని.

ఇంద్రియములు పంచభూతములకు జెందినట్టివే అను విషయము ఇదివరలోనే నిరూపింపబడినది.

—• వృక్షాదులును ప్రాణులే అను విషయము •—

ఇప్పుడిక్కడ విచారణీయాంశ మొకటి యున్నది. ప్రపంచము లోని పదార్థములకు జంగమ స్థావరములని చరాచరము లని విభాగ మున్నది. గమనాదిక్రియ కలవి మొదటి తరగతికి జెందును. అది లేనట్టివి రెండవతరగతికి జెందును. అందు కృమి- కీట- పశు- పక్షి- మనుష్యాదులు మొదటితరగతిలో జేరును. వృక్షలతాదులు, పాషాణా దులు రెండవతరగతిలో జేరును.

ఇది యిట్లుండ చేతనాచేతనము లని మరియొక విభాగ మున్నది. చేతనము లనగా ప్రాణులు. అచేతనములనగా అప్రాణులు. పైజెప్ప బడిన మొదటితరగతి కృమికీటాదులు ప్రాణు లనుటలో సంశయము లేదు. ఇక రెండవతరగతిలోని పాషాణాదులు వృద్ధిక్షయములు లేనట్టివి గనుక అప్రాణు లనవచ్చును. మిగిలిన రెండవతరగతి వృక్షలతాదులు ప్రాణులగునా ? అప్రాణు లగునా ? వృద్ధిక్షయములు కనబడుచున్నం దున అప్రాణు లనుట యుక్తముగా లేదు. ప్రాణులే అందుమా ! ప్రాణులలో జీవసంబంధము తప్పదు. ఆజీవుడు పూర్వోక్తప్రకారము సూక్ష్మశరీరముతో ఇంద్రియవర్గమును కలియకట్టుకొనియే సంబంధిం చును. వృక్షలతాదులలో త్వక్- చక్షు- శ్రోత్ర- జిహ్వా- ఘ్రాణా దీంద్రియవ్యాపారము ఏమియు గనబడదు. ఇట్టి స్థితిలో వృక్షలతా దులు జీవసంబంధము గల ప్రాణు లనుట యెట్లు ? అనునది విచారణీ యాంశము.

ఈ విషయమై శాన్తిపర్వములో భృగు- భరద్వాజ- సంవాద ములో చర్చించి వృక్షలతాదులు పాంచభౌతికములు. అవి చేతనములే.

అనగా ప్రాణులే. వానికిని ఇంద్రియవ్యాపార మున్నది. అని యిట్లు నిరూపింపబడినది.

"ఘనానా మపి వృక్షాణా మాకాశోఽస్తి న సంశయః ।
తేషాం పుష్పఫలవ్యక్తి ర్నిత్యం సముపపద్యతే ॥" (అ. 184)

వ్యాఖ్యా— వృక్షాణా మభౌతికత్వాఽనిన్ద్రియత్వాదికం పరిహరం శ్చేతనత్వ ముపపాదయతి- ఘనానా మిత్యాదిభి ర్నవభిః ।"

వృక్షశరీరములయందు, పంచభూతములు ఇంద్రియములు లేవనుశంకను పరిహరించుచు వృక్షములు చేతనములే అని తొమ్మిది శ్లోకములచే నుపపాదింపబడుచున్నది.

కేవల కఠినములై రంధ్రరహితములై యున్న వృక్షములకు పుష్పములు ఫలములు పుట్టుచునే యున్నవి. ఆ పుష్పఫలాభివ్యక్తికి దగిన యవకాశమే ఆకాశధాతువు. సంశయము లేదు.

"ఊష్మతో మ్లాయతే వర్ణం త్వ క్ఫలం పుష్ప మేవ చ ।
మ్లాయతే శీర్యతే చాపి స్పర్శ స్తేనాఽత్ర విద్యతే ॥"

వ్యాఖ్యా— శీర్యతే ఇత్యనేన వజ్రమణేరపి మత్కుణశోణిత స్పర్శాత్ శీర్యమాణస్య చేతనత్వం వ్యాఖ్యాతమ్ । ఏవ మేకదేశే కంపాదిదర్శనాత్ గోరివ భూమేరపి తద్ద్రష్టవ్యమ్ ॥"

వృక్షములకు ఉష్ణతచేత వర్ణము, త్వక్కు, పుష్పము, ఫలము వాడిపోవుచున్నవి. విడిపోవుటకూడ సంభవించుచున్నది, దీనినిబట్టి స్పర్శలక్షణముగల త్వగింద్రియమున్నట్లు స్పష్టమగుటచేత వృక్షములు చేతనములే. ఇచ్చట 'శీర్యతే' అని స్పర్శమూలమున విడిపోవుట అను లక్షణమునుబట్టి చేతనత్వము చెప్పబడుటచేత మత్కుణ (నల్లి) రక్త స్పర్శచేత విడిపోవునట్టి వజ్రమణికిగూడ చేతనత్వము చెప్పబడినట్ల యినది. అట్లే గోవుమొదలైన చేతనములకే శరీరములో కించిద్భాగ మగు తోకయందో చెవియందో కంపము గలుగుట స్వభావమైనందున కించిద్భాగములో గలుగు భూకంపమునుబట్టి భూమికూడ చేతన మని తెలిసికొనవలయును.

"వాయ్వగ్న్యశనినిర్ఘోషైః ఫలం పుష్పం విశీర్యతే।
శ్రోత్రేణ గృహ్యతే శబ్ద స్తస్మా చ్ఛృణ్వన్తి పాదపాః ॥"

వాయువుయొక్క, అగ్నియొక్క, అశని (పిడుగు) యొక్క ధ్వనులచేత ఫలములు, పుష్పములు, రాలిపోవుచుండును. ఆ శబ్దగ్రహణ శక్తి, శ్రోత్రేంద్రియమునకే కలదు. కనుక వృక్షములకు శ్రోత్రేన్ద్రియ వ్యాపార మున్నది,

'వల్లీ వేష్టయతే వృక్షం సర్వత శ్చైవ గచ్ఛతి।
న హ్యదృష్టే శ్చ మార్గోఽస్తి తస్మా త్పశ్యన్తి పాదపాః ॥"

లత వృక్షమును చుట్టుకొనును. నలువైపులకు బోవుచుండును. అట్టి పద్ధతి దృష్టిలేకున్న సంభవింపదు. కనుక వృక్షములకును చక్షురింద్రియవ్యాపార మున్నది.

"పుణ్యాపుణ్యై స్తథా గన్ధై ర్ధూపై శ్చ వివిధై రపి।
అరోగాః పుష్పితా స్సన్తి తస్మా జ్జిఘ్రన్తి పాదపాః ॥"

వృక్షములకు అనేకవిధములైన సుగన్ధదుర్గన్ధదోహదముల ద్వారా రోగనివృత్తి, అనేకవిధములైన అట్టి ధూపములద్వారా పుష్పోత్పత్తి, కలుగుచున్నది. అందుచే ఘ్రాణేంద్రియవ్యాపారము వృక్షములకు గలదు.

"పాదైః స్సలిలపానాశ్చ వ్యాధీనాం చాపి దర్శనాత్।
వ్యాధిప్రతిక్రియత్వాచ్చ విద్యతే రసనం ద్రుమే ॥
వక్త్రేణోత్పలనాలేన యథోర్ధ్వం జల మాదదేత్।
తథా పవనసంయుక్తః పాదైః పిబతి పాదపః ॥"

వ్యాఖ్యా— నాలేన నలికయా। ఏతేన క్షురాదిపాయిభిః పాదైరపి చేతనత్వం వ్యాఖ్యాతమ్।"

రంధ్రముగల కలువకాడనుండి నోటితో జలమును పీల్చినట్లు వాయుసంయుక్తమై వృక్షము వేళ్ళతో జలమును పీల్చుచున్నది. వేళ్ళతో జలమును పీల్చుచుండుటనుబట్టియు, తన్మూలకముగా వ్యాధులు సంభవించుచుండుటను బట్టియు, వానికి ప్రతిక్రియలచే నివృత్తి కలుగుచుండుటను బట్టియు, రసనేంద్రియవ్యాపారము వృక్షములకు గలదు.

ఇచ్చట జలమును పీల్చుటనుబట్టి వృక్షములకు చేతనత్వము చెప్పబడుటచే పాలు మొదలగువానిని పీల్చునట్టి పాదరసము మొదలగు వానికి చేతనత్వము చెప్పబడినట్లయినది.

"సుఖదుఃఖయోశ్చ గ్రహణా చ్ఛిన్నస్య చ విరోహణాత్ ।
జీవం పశ్యామి వృక్షాణా మచైతన్యం న విద్యతే ॥"

వృక్షములకు సుఖదుఃఖానుభవ ముండుటనుబట్టియు, ఛిన్నమైనను మొలకలెత్తుచుండుటనుబట్టియు, వృక్షములలో జీవుడు గోచరించుచుండెను. అవి యచేతనములు కావు.

"తేన తజ్జల మాదత్తం జరయ త్యగ్నిమారుతౌ ।
ఆహారపరిణామాచ్చ స్నేహో వృద్ధిశ్చ జాయతే ॥

వ్యాఖ్యా- తేన వృక్షేణ, జరయతి జరయతః ।"

అవృక్షము పీల్చిన జలమును అగ్నియు, వాయువును జీర్ణము చేయుచున్నవి ఆ జలరూపమైన ఆహారముయొక్క సక్రమపరిణామమునుబట్టియే వృక్షములకు స్నేహగుణము, వృద్ధి కలుగుచున్నది. ఇట్లు పంచభూతసంబంధముకూడ వృక్షముల కున్నది. అని నిరూపింపబడినది. మనుస్మృతిలోగూడ వృక్షలతాదిసృష్టిని చెప్పి యిట్లు చెప్పబడినది.

"తమసా బహురూపేణ వేష్టితాః కర్మహేతునా ।
అన్త స్సంజ్ఞా భవన్త్యేతే సుఖదుఃఖసమన్వితాః ॥"

వ్యాఖ్యా— ఏతే వృక్షాదయ స్తమోగుణేన విచిత్రదుఃఖఫలేన అధర్మకర్మహేతుకేన వ్యాప్తా అన్తశ్చైతన్యా భవన్తి...త్రిగుణారబ్ధత్వేపి చైషాం తమోగుణబాహుల్యా త్తథా వ్యపదేశః । అత ఏవ సుఖదుఃఖసమన్వితాః సత్త్వస్యాపి భావాత్ కదాచి త్సుఖలేశోపి జలధరజనితజలసంపర్కా దేషాం జాయతే ।"

ఈవృక్షాదులు పాపకర్మమూలకము, విచిత్రదుఃఖకారకము అగు తమోగుణప్రాబల్యము కలిగియుండి అంతర్గతజ్ఞానము కలవై సుఖదుఃఖములకు పాలగుచున్నవి. అని.

ఛాందోగ్యోపనిషత్తు- అ. 6, 11.

"స ఏష (వృక్షః) జీవేనాత్మనాఽనుప్రభూతః పేపీయమానో మోదమాన స్తిష్ఠతి' భాష్యమ్—వృక్షస్య రసస్రవణశోషణాది లింగా జ్జీవవత్త్వమ్। దృష్టాన్తశ్రుతే శ్చ చేతనావన్తః స్థావరా ఇతి। బౌద్ధకాణాద మత మచేతనాః స్థావరా ఇత్యేత దసార మితి దర్శితం భవతి।"

దీనినిబట్టి వృక్షములు జీవాత్మ కలవని ఉపనిషత్తు ప్రతిపాదించు చున్నదనివృక్షములచేతనములను బౌద్ధాదిమతము నిస్సారమని స్పష్టము.

ఈమహాభారత-మనుస్మృతి-గ్రంథసందర్భమునుబట్టి ఉపనిషత్తును జంగమస్థావరాత్మకమైన ప్రపంచములో జంగమశరీరములవలె స్థావర శరీరములగు వృక్షాదులును ప్రాణులే అని సిద్ధాంతితమైనది. ఆజంగమ స్థావరశరీరములు పాంచభౌతికములని, అందు జీవులకు సంయోగవియో గములు సుఖదుఃఖప్రద-కర్మానుబంధ-పురస్కృతము లని, ఆయాశరీర ములయందు గోచరించు చైతన్యము జీవాత్మదే అని, శరీరము నశించి నను జీవుడు నశింపడని, కర్మానుగుణముగా శరీరాంతరసంచారము చేయుచుండునని కూడ సిద్ధాంతితమైనది.

ఇప్పు డిక్కడ విచారణీయాంశ మొకటి యున్నది-ఒక్కొక్కశరీరమును ఒక్కొక్కజీవుడు ఆశ్రయించి సుఖదుఃఖములను అనుభవించుచుండు ననుట యుక్తమే. ఆశరీరచ్ఛేదమైనపుడు ఆజీవునకు మరణము అనగా ఆశరీరముతో వియోగము కలుగు ననుటయు యుక్తమే. కాని మర ణించుటకై యొక శరీరము ఖండితమైనపుడు మరణము లేకుండుట, ఎన్ని ఖండము లయినవో అన్ని జీవు లేర్పడుట యెట్లు సంభవించును? అట్టిది దితియొక్క గర్భము విషయమై జరిగినట్లు శ్రీమద్భాగవతములో ఈవిధముగా చెప్పబడినది.

లబ్ధ్వా తదన్తరం శక్రో నిద్రాపహృతచేతసః।
దితేః ప్రవిష్ట ఉదరం యోగేశో యోగమాయయా।
చకర్త సప్తధా గర్భం వజ్రేణ కనకప్రభమ్।

రుదన్తం సప్తధైకైకం మా రోదీ రితి తాన్ పునః ॥
సజూ రిన్ద్రేణ పంచాశద్దేవా స్తే మరుతోఽభవన్ ।" (స్క-6. అ18)

దితి, ఇంద్రుని సంహరింపగల పుత్రుడు కలుగుటకై భగవంతునా రాధించుచు సంవత్సరవ్రత మవలంబించినదుపుచు గర్భవతియై యున్నది. ఆమె తన వ్రతనియమమునకు లోపము గలుగునట్లు ఒకనాడు సంధ్యా కాలమందు నిద్రించుచుండ ఇంద్రుడు యోగశక్తితో దితి గర్భగోళ మున ప్రవేశించి ఆ గర్భమును సప్తఖండములు చేసి అవి రోదనము చేయుచుండగా వానితో 'మారోదీః' అనుచు మరల నొక్కొక్కదానిని సప్తఖండములుగా జేసెను. అట్లు ఏర్పడిన ఆ 49 స్వరూపములు ఇంద్రు నకు వశవర్తులై ఇంద్రునితోగూడ 50 మందియై మరుత్తు లనబడు దేవ తలై యుండిరి. అని. ఇది యెటు లుపపన్న మగును ?

ఇంకొకటి— గాంధారీగర్భమునుండి లోహపిండమువలె కఠిన మైన మాంసపేశి పుట్టుట, దానిని పారవేయబోవునపుడు వ్యాస మహర్షి ప్రత్యక్షమై ఆపి ఆ మాంసపేశిని శీతోదకముతో తడుపుట, ఆపై శతధా విభాగము చేయుట, ఘృతకుంభములలో నుంచి కాపా డుట, తన్మూలమున దుర్యోధనాదుల నూర్గురి జన్మము లేర్పడుట జరిగినదని మహాభారత మాదిపర్వములో చెప్పబడినది. ఇదియు నెటు లుపపన్న మగును ?

గర్భస్థపిండమును ఏకజీవు డాశ్రయించియుండునా ? అనేక జీవు లాశ్రయించియుందురా ? అనునది విచారణీయము. ఈ విష యము శ్రీమద్భాగవతవ్యాఖ్యానమయిన వంశీధరీయములో చర్చించి సమాధానము చెప్పబడియున్నది—

—• దితియొక్క గర్భస్థపిండము ఖండింపబడినపుడు అది మరణింపకుండుటకును, ఎన్నిఖండములో అన్ని జీవులగుటకును ఉపపత్తి •—

"న మమార దితే ర్గర్భః శ్రీనివాసాఽనుకంపయా ।
బహుధా కులిశక్షుణ్ణో ద్రౌణ్యస్త్రేణ యథా భవాన్ ॥"

అశ్వత్థామాస్త్రప్రయోగమున పరీక్షిత్తు మరణింపనట్లే ఖండ

ఖండములైన తిదిగిర్భము మరణింపకుండుటకు భగవదనుగ్రహమే కారణము అనేకజీవవిషయము—

"వంశీధరీయము— "అత్రాల్పకాల ఏవ బహుపుణ్యపాప భోగినో జీవస్య యోగినో వా కాయవ్యూహ ఇవ ఏకస్య జీవస్య ఊనపంచాశత్కాయవ్యాపకత్వ మితి కేచిత్ ।

భావిదృష్ట్యా ప్రథమ మేవైకస్మిన్ దేహే ప్రవిష్టానా మేకోన పంచాశజ్జీవానా మింద్రకృతదేహవిభాగేన ఏకైకదేహప్రాప్తి రిత్యపరే.

ఇన్ద్రకృతఖండేషు అన్యేషా మపి అష్టచత్వారింశజ్జీవానాం తత్క్షణ ఏవ ప్రవేశః । యథా లతాగుల్మానాం కేషాంచిత్ ఖండ ఖండీకృత్యైవ భూమా వారోపితానాం పృథక్పృథక్ప్రరోహోద్గమ దర్శనాత్ పృథక్పృథక్ జీవస్య ప్రవేశోఽనుమీయతే ఇత్యన్యే చ ప్రాహుః ।

అయమేవ న్యాయో దుర్యోధనాదిజన్మన్యపి వర్ణితో మహా భారత ఆదిపర్వణి ॥"

యోగి యోగప్రభావమునుబట్టి యేకకాలమందు అనేకశరీర యోగము కలిగించుకొని కొన్నిశరీరములతో విషయానుభవము, కొన్నిశరీరములతో తపశ్చర్య కావించి తుదకు సూర్యుడు, తనకిరణముల నుపసంహరించినట్లు ఆ శరీరముల నుపసంహరించును. ఈ విషయము వేదాంత దర్శనమందున్నది—

"ఆత్మనో వై శరీరాణి బహూని భరతర్షభ ।
యోగీ కుర్యా ద్బలం ప్రాప్య తైశ్చ సర్వై ర్మహీం చరేత్ ॥
ప్రాప్నుయా ద్విషయాన్ కైశ్చిత్ కైశ్చి దుగ్రం తప శ్చరేత్ ।
సంక్షిపేచ్చ పున స్తాని సూర్యో రశ్మిగణా నివ ॥"

దీనికి కాయవ్యూహ మని పేరు. కాయవ్యూహమందు యోగి యొక్క ఏకజీవునకే వ్యాపకత్వ ముండును.

## —॰ కాయవ్యూహపద్ధతి ॰—

ఈ విషయము వేదాంతదర్శనమందు ఇట్లు నిరూపింపబడినది— "ప్రదీపవ దావేశ స్తథాహి దర్శయతి" (బ్ర. సూ. 4-4-15)

రత్నప్రభా— 'స ఏకధా త్రిధా పంచధా' ఇత్యాదిశ్రుత్యా విదుష ఏవానేకధా భావ ఉక్తః। విద్వాంస్తు న దేహః, నాపి చిన్మాత్రః, కిన్తు లింగోపహితాత్మా। నచ తస్య లింగభేదం వినాఽనేకత్వం సంభవతి। అతః శ్రుతిబలా దేకస్యైవాఽనాదిలింగస్యాఽనేకదేహేషు ప్రవేశేన భేద ఏష్టవ్యః। యద్యపి మూలప్రదీపస్య వర్త్యన్తరేషూత్పన్నదీపానాం చాఽత్యన్తభేదోఽస్తి, లింగస్య తు దేహభేదకృతో భేదో న స్వతః। స్వతో లింగభేదే తదుపహితజీవభేదాత్ అనుసన్ధానాఽనుపపత్తేః। ఆగన్తుకాఽనేకలింగసృష్టౌ అసత్కార్యవాదాపాతాచ్చ। తథాపి ప్రదీపత్వజాత్యైక్యేన వ్యక్త్యైక్యారోపాత్ దృష్టాన్తదార్ష్టాన్తికయో స్సామ్యం ద్రష్టవ్యమ్।

తథాచ యథా ప్రదీపోఽనేకవర్తిషు ప్రవిశతి, ఏవం విద్యాయోగబలా ద్విద్వల్లింగస్య వ్యాపిత్వా దనేకదేహేషు యుగవదావేశ ఇతి సూత్రార్థః॥''

తాత్పర్యము— శ్రుతిలో అనేకదేహధారణము జ్ఞానికి చెప్పబడినది. జ్ఞానియనగా దేహము కాదు. చిన్మాత్రమును గాదు. లింగశరీరముతోగూడియున్న ఆత్మ. అట్టివానికి లింగశరీరభేదము లేనిదే అనేకత్వ మసంభవము. అందుచే అనాదిసిద్ధమైన ఆ లింగశరీరమునకే సృష్టములైన అనేకదేహములయందు ప్రవేశమని, ఆ దేహభేదమును బట్టియే ఆ లింగశరీరమునకు భేదవ్యవహారముకాని స్వతః భేదము లేదని యొప్పుకొనవలెను. స్వతఃభేదము నొప్పినయెడల జీవభేద మేర్పడును. దేహాంతరగతవిషయమునకు అనుసంధానము లేకపోవును. కాబట్టి అనేకవత్తులయం దొక దీపము ప్రవేశించునట్లు విద్యాయోగబలమున జ్ఞానియొక్క లింగశరీరమొక్కటే అనేకదేహవ్యాపకత్వము నేకకాలమందు పొందును. అని.

ఈ కాయవ్యూహన్యాయమున అల్పకాలమందే బహుపుణ్యాపాపభోగము ననుభవింపగల యేకజీవునకు 49 దేహములయందు వ్యాపకత్వ ముండవచ్చును. ఇది యొక పద్ధతి

భవితవ్యబలమున నొకదేహమందు మొదటనే ప్రవేశించియున్న 49 జీవులకు ఇంద్రికృతదేహవిభాగముచేత ఏకైకదేహప్రాప్తి సంభవమే. ఇదియొక పద్ధతి.

ఇంద్రికృతఖండములయందు తత్క్షణమే యితరజీవులు 48 మందికి ప్రవేశము కలుగుట సంభవము. లతాగుల్మములలో గొన్నిటిని ఖండఖండములు చేసి పాతినపుడు దేని కదే మొలక లెత్తుచుండుట ప్రత్యక్షము. అట్లు అసలు జీవుడు కాక యితరజీవులు ఆయా ఉపాధులలో ప్రవేశించుట ఉపపన్నమే. ఇది యొక పద్ధతి.

ఈ న్యాయము దుర్యోధనాదిజన్మలయందును భారతములో ప్రతిపాదింపబడినది. అని భావము.

ఈ దుర్యోధనాదుల జన్మమునుగూర్చి చెప్పుటలో ఏకకాలమందట్టి జన్మములు మనుష్యులయందు అపూర్వ మని అది మహర్షి ప్రసాద మూలక మని చెప్పబడినది—

"కథితో ధార్తరాష్ట్రాణా మార్ష స్సంభవ ఉత్తమః ।
అమనుష్యో మనుష్యాణాం భవతా బ్రహ్మవాదినా ॥

వ్యాఖ్యా-ఆర్షః=ఋషిప్రసాదహేతుకః; అమనుష్యో=మనుష్యే ష్వదృష్టః; యుగప ద్బహూనాం జననాత్ ॥"

దీని నిటుంచి నిర్జీవవాదులగు నాస్తికుల వైఖరి బరిశీలింపవలెను-

—॰ నాస్తికత్వ పుస్తక పరామర్శము, జీవునిగూర్చి యాక్షేపములకు సమాధానము.॰—

"ప్రాణులయందు గల చైతన్యమునకునూ, మరణమునకునూ జీవుడే కారణమని అంటారు. ఇట్టి అనుమానమునకు చాల అభ్యంతరాలు కనబడుచున్నవి.

1. ప్రతిచేతనవ్యక్తియందును జీవుడు కలదా ? ఉన్నచో ఒకటా అనేకములా ?

2. చెట్లుకూడ ప్రాణములు గలవే గదా, వానియందుగూడ జీవుడు కలదా ? చెరకు, గులాబి, కంద, పసుపు మొదలగు చెట్లను తునకలుచేసి పీటిని మరల ప్రత్యేక మొక్కలుగా పెంచునప్పుడు తల్లిమొక్కయొక్క జీవుడు భాగింపబడుచున్నదా; లేక

క్రొత్తజీవుళ్ళు తునకలలో బ్రవేశించుచున్నవా ?

3. చైతన్యం కల వృక్షజంతుజాతులయందే జీవుడు కలడా. లేక యీ విధంగా చైతన్యంకనబడని రాళ్ళు మొదలగు పదార్థముల యందుకూడ జీవుడు అవ్యక్తమై యున్నదా ?

4 జీవు డున్నదని నిరూపించుటకు ప్రయత్నించు సిద్ధాంతము నందు ఈ విధమైన అభిప్రాయభేదాలు చాల గలవు. ఈ సిద్ధాంతాలేవీ నిర్ధారణకు నిలువలేక పోవుటయే ఈ అభిప్రాయభేదాలకు కారణం

5. చైతన్యమంటే ఏమిటో; చావుపుట్టుకలంటే ఏమిటో; ప్రపంచమందు ఇన్ని రకాల మనుష్యులు, చెట్లు, జంతువులు, వస్తువులు, ఎట్లు కలుగుచున్నవో; చేతనాచేతనపదార్థాలకు గల పరస్పరసంబధ మేమిటో నిర్ధారణపూర్వకంగా తెలియనిరోజుల్లో ఈ సమస్యలు పరిష్కరించడానికి ఊహింపబడ్డదే జీవుడు గలదను సిద్ధాంతం. యథార్థాన్నిమాత్రం పరిశీలిస్తే జీవు డనునది అబద్ధం అని బయట పడుతున్నాది ॥" (పు83-85.)

ఈ 5 అంశములలో మొదటి 3 అంశములును శంకలుగానున్నవి. మొదటి శంకకు సమాధానము— ప్రతిచేతనవ్యక్తియందును ఒక్కొక్క జీవు డుండితీరెను. జీవుడు లేనిది చేతసమే కాదు. అని.

రెండవ శంకకు సమాధానము— ఆయా చెట్ల తునకలలో తల్లి మొక్కలోని జీవుడు తునకలై చేరలేదు. క్రొత్తజీవులే చేరినారు. తునకలగుట జడలక్షణమె కాని జీవలక్షణము కాదు. అని.

మూడవశంకకు సమాధానము— చైతన్య మస్పష్టమైయున్న వజ్రమణి, భూమి, పాదరసము, మొదలగువానియందును పూర్వోక్త ప్రకారము జీవస్థితి అస్పష్టముగా నున్నది. అని

నాలుగవవిషయము— జీవుడున్నదని నిరూపించు సిద్ధాంతములో అభిప్రాయభేదాలు చాల గలవట, సిద్ధాంతా లేవీ నిర్ధారణకు నిలువ లేకపోవుటయే అభిప్రాయభేదాలకు కారణ మట!

సిద్ధాంత మనుట, నిర్ధారణకు నిలువనిదనుట విరుద్ధము. నిర్ధారణకు నిలుచునదే సిద్ధాంతము. నిలువనిది సిద్ధాంతమే కాదు. యుక్తి-అనుభవ- ప్రమాణాధారము గల వైదికసిద్ధాంతమేమి, నిర్ధారణకు నిలువలేకపోవుటేమి ?

సిద్ధాంతములు నిర్ధారణకు నిలువలేకపోవుటే అభిప్రాయ భేదములకు కారణమందురా? నిలువలేకపోవుట కారణమా ? సిద్ధాంతపరిజ్ఞానము లేకపోవుట కారణమా ? ప్రమాణమునకు కట్టుపడక స్వేచ్ఛగా భావించువానికి అభిప్రాయము లనంతముగా గలుగుట కభ్యంతర మేమి ? ఆ యభిప్రాయములు అప్రకంప్యములైన ఆర్షసిద్ధాంతములను కదపులేనా ?

పోనిండు, నిర్జీవవాదులలో అభిప్రాయభేదములు లేవా ? చూడుడు— చైతన్యము శరీరమందున్నదా ? ఇంద్రియములయం దున్నదా ? ప్రాణములయం దున్నదా ? మనస్సునం దున్నదా ? బుద్ధి (క్షణికవిజ్ఞానము) యందున్నదా ? శరీరమందైనను ప్రతిభాగ మందున్నదా ? సముదాయ మందున్నదా ? సముదాయమందున్న పక్షములో వృక్షములపైనయుమై తునకలయందుండమ గనుక గులాబి మొదలగువాని తునక లెట్లు మొలచును ? ప్రతిభాగమందుండి మొలచు చున్న యెడల ఇతరవృక్షముల తునకలుగూడ మొలవకపోవుటేమి ?

చైతన్య మింద్రియములయం దున్నయెడల ఇంద్రియసముదాయమందున్నదా ? ప్రతీంద్రియమందున్నదా ? ప్రతీంద్రియమం దున్నయెడల బహునాయకమై స్థితిగతులకు విరోధ మేర్పడదా ? సముదాయమం దున్నయెడల కొన్నియింద్రియములు లోపించినపోట ఆ సముదాయము లేనందున ఆ చైతన్య మెట్లుండును ?

ఇంతకును నాశరీరము, నాయింద్రియములు, నాప్రాణము, నామనస్సు, నాబుద్ధి అనియున్న లోకప్రసిద్ధానుభవములో శరీర ఇంద్రియప్రాణ మనోబుద్ధులకు వేరుగా 'నా' అనబడునదేది ? ఇత్యాద్యభిప్రాయభేదము లున్నవికద! ఈ భేదములకు నిర్జీవవాదు లన్నట్లే నాస్తికత్వవాదము నిర్ధారణకు నిలువలేకపోవుటే కారణమని జీవవాదు లనుట కభ్యంతరమేమి ? కనుక నిది నిస్సారము.

అయిదవ విషయము- చైతన్యమంటే ఏమిటో; చావు పుట్టుక లంటే ఏమిటో, ప్రపంచమందు ఇన్నిరకాల మనుష్యులు, చెట్లు, ఎట్లు కలుగుచున్నవో నిర్ధారణపూర్వకంగా తెలియని రోజుల్లో ఊహింపబడ్డదే జీవుడు గలదను సిద్ధాంతమట! యథార్థాన్ని పరిశీలిస్తే జీవుడనునది అబద్ధంఅని బయటపడుతున్నదట!

ఆహా ! ఏమియు తెలియనివారిది జీవవాదమని, సర్వము తెలిసినవారిది నిర్జీవవాదమని దీని సారాంశము.

ఈ మాటలను జూడగా, ఏమియు తెలియనప్పుడు సర్వము తెలియు నను అహంకారము, విద్వజ్జనసమక్షమున జిజ్ఞాసతో గ్రహించినకొలది మన కేమియు తెలియ దనిపించి ఆ యహంకార ముడుగుట, లక్షణ మని చెప్పిన భర్తృహరిసుభాషితశ్లోకము జ్ఞప్తికి వచ్చుచున్నది—

"యదా కించిద్జ్ఞోఽహం ద్విప ఇవ మదాన్ధ స్సమభవమ్
తదా సర్వజ్ఞోస్మీత్యభవ దవలిప్తం మమ మనః ।
యదా కించి త్కించి ద్బుధజనసకాశా దవగతమ్
తదా మూర్ఖోఽస్మీతి జ్వర ఇవ మదో మే వ్యపగతః ॥"

—• శాంతిపర్వము- నాస్తికవాదఖండనము •—

ఇంకొకటి— అవిద్యావిశేషమూలకము నిర్జీవవాదము. విద్యావిశేషమూలకము జీవాత్మసిద్ధాంతము. జీవాత్మసిద్ధాంత మెరుగనివారిదే నిర్జీవవాదముకాని, నిర్జీవవాద మెరుగనివారిది జీవాత్మసిద్ధాంతము కాదు.

కనుకనే మహాభారతములో పాషండమతఖండనప్రస్తావములో- 'నాన్యో జీవ శ్శరీరస్య నాస్తికానాం మతే స్థితః' అని, శరీరముకంటె వేరుగా జీవుడు నాస్తికమతములో లేడని చెప్పి తత్ఖండనము ఇట్లు చేయబడినది—

"ప్రేతీభూతేఽత్యయశ్చైవ దేవతాద్యుపయాచనమ్ ।
మృతే కర్మనివృత్తిశ్చ ప్రమాణ మితి నిశ్చయః ॥" (శాన్తి. అ218)

వ్యాఖ్యా- ఏతద్దూషయతి- ప్రేతీతి। ప్రేతీభూతే దేహే చైతన్యాత్యయో దేహాతిరిక్తాత్మాస్తిత్వే ప్రమాణ మిత్యధ్యాహృత్య యోజ్యం। యది దేహశ్చేతన స్స్యాత్తర్హి మృతేపి దేహే చైతన్య ముపలభ్యేత, అతో న దేహధర్మశ్చైతన్య మిత్యర్థః।

తథా శీతజ్వరనివృత్త్యర్థం మన్త్రప్రతిపాద్యా దేవతా లోకాయతికేన ప్రార్థ్యతే। సాచేన ద్భూతమయీ స్యాత్తర్హి ఘటాదివ దృశ్యేత। సూక్ష్మశరీరస్య లోకాన్తరసంచారక్షమస్యాఽస్వీకారాత్।"

ఆదిపదాద్భూతావేశోపి గ్రాహ్యః। యస్మిన్ శరీరే భూతాన్తర మావిశతి తదా తద్దేహపీడయా ముఖ్యో దేహపతి ర్న బాధ్యతే, కిన్తు ఆవిష్ట ఏవ। తదానీం తస్యైవ దేహాభిమానాత్। తదపగమే తు ముఖ్య ఏవ బాధ్యతే। అతో న దేహ ఆత్మా దృష్ట విరోధా దిత్యర్థః।"

మృతే కర్మనివృత్తిః కృతనాశః। చాత్ ఉత్పత్తౌ అకృతాభ్యాగమశ్చ దోష ఇత్యర్థః।

దేహాత్మవాదము దుష్టము. మృతశరీరమందు చైతన్యము కనబడకుండుటే దేహముకంటె వేరుగా జీవుడుండె ననుటకును, చైతన్యము దేహధర్మము కాదనుటకును ప్రమాణము. ఇంకొకటి, శీతజ్వరనివృత్తికై మంత్రప్రతిపాద్యదేవతను నాస్తికుడును ప్రార్థించును. ఆదేవత స్థూల శరీరాత్మకమె అయినయెడల కనబడితీరవలెను. లోకాంతరసంచారక్షమమగు సూక్ష్మశరీరము నంగీకరింపనివాడు నిర్జీవవాది. అతడాదేవతా శరీర మెట్టిదనును? కనుక దోషము.

ఇంకొకటి— భూతావేశ మున్నది. ఏవ్యక్తి శరీరమందు భూత మావేశించుచున్నదో ఆవ్యక్తికి అప్పుడు ఆ శరీరమునకు గలిగించు బాధచేత బాధ కలుగుటలేదు. ఆవేశించినభూతమునకే ఆబాధ కలుగు చున్నది. అప్పు డాభూతమునకు కలిగినట్టి ఆ శరీరాభిమానమే ఆబాధకు కారణము. ఆ భూతావేశము తొలగినతోడనే, కలిగించు బాధ ఆ వ్యక్తికే అంటుచున్నది. ఇది ప్రత్యక్షసిద్ధము. జీవుని నిరసించు దేహాత్మ వాదములో ఇది సరిపడదుకనుక దోషము.

ఇంకొకటి— తన యుత్పత్తి, తన భోగములు తనకర్మనుబట్టి కాక నిర్హేతుకముగా గలుగుననుట, తాను చేసిన శుభాశుభకర్మలు ఫలమీయకయే మరణముతో నశించుననుట, విరుద్ధమగుటచే నిర్జీవ వాదము దుష్టము. అని. ఇది దేహాత్మవాదఖండన సారాంశము.

—• బౌద్ధమతఖండన ప్రస్తావము •—

సౌగతులు (బౌద్ధులు) చార్వాకులవలెగాక రూప- విజ్ఞాన- వేదనా- సంజ్ఞా- సంస్కార- నామక పంచస్కంధాత్మకమై, ఆధ్యాత్మికమై, ఐహికాముష్మికవ్యవహారాస్పదమైనట్టి యొక స్వరూపము నంగీకరించుచున్నారు. స్థూలశరీరము ఆ స్కంధపంచకమునకును, దానికి మూలమైన చిత్తమునకును ఆశ్రియమైయున్న దని చెప్పుచున్నారు. కాని క్షణికవిజ్ఞానవాదులయిన వీరును స్థిరమైన ఆత్మ నంగీకరింపరు. (నీలకంఠీయము.)

ఇక్కడ మూర్తపదార్థముల సంతతికి రూపస్కంధమని పేరు. జ్ఞానసంతతికి విజ్ఞానస్కంధమని పేరు. సుఖదుఃఖాత్మకము, అపేక్షాత్మకము నగు బుద్ధిసంతతికి వేదనాస్కంధమని పేరు. నామసంతతికి సంజ్ఞాస్కంధమని పేరు. వాసనాసంతతికి సంస్కారస్కంధ మని పేరు.

ఇది యీ శ్లోకములలో చెప్పబడినది—

"సమూహాః స్కన్ధశబ్దార్థ స్తత్త్సంతతివాచకః ।
జ్ఞానసన్తతిరేవాత్ర విజ్ఞానస్కన్ధ ఉచ్యతే ॥
సంస్కారస్కన్ధ ఇత్యుక్తో వాసనానా న్తు సంహతిః ।
సుఖదుఃఖాత్మికా బుద్ధి స్తథాఽపేక్షాత్మికా చ సా ॥
వేదనాస్కన్ధ ఇత్యుక్తః సంజ్ఞాస్కన్ధ స్తు నామ యత్ ।
రూపస్కన్ధో భవత్యత్ర మూర్తిభూతస్య సంహతిః ॥"

(సర్వసిద్ధాంతసంగ్రహము.)

కొందరు సౌగతులు అవిద్యాదికము పునర్జన్మములో కారణ మని చెప్పుచున్నారు. అది ఈ భారతశ్లోకములలో చెప్పబడుచున్నది—

"అవిద్యాం క్షేత్ర మాహు ర్హి కర్మబీజం తథా కృతమ్ ।
తృష్ణా సంజననం స్నేహ ఏష తేషాం పునర్భవః ॥

వ్యాఖ్యా- అవిద్యాం క్షేత్రం। పూర్వకృతం కర్మ బీజం, తృష్ణా స్నేహోత్రింద్ర జలరూపా, ఏషు ప్రికారక స్తేషా మవిద్యాదీనాం పునర్భవః పునరుత్పత్తి ప్రికారః ।"

"తస్మిన్ గూఢే చ దగ్ధే చ భిన్నే మరణధర్మిణి ।
అన్యోన్యస్మా జ్జాయతే దేహః స్త మాహు స్సత్త్వసంక్షయమ్ ॥

వ్యాఖ్యా- తస్మిన్ అవిద్యాదికలాపే గూఢే సుప్తిప్రలయయోః సంస్కారాత్మనా స్థితే నిమిత్తభూతేసతి। ఏకస్మిన్ మరణధర్మిణి దేహే, భిన్నే వినష్టేపి, అన్యోన్యస్మాత్ । తత ఏవాఽవిద్యాదేః దేహోఽన్యో జాయతే। తస్మిన్ జ్ఞానేన దగ్ధే చ సతి దేహనాశాత్ సత్త్వసంక్షయం మోక్ష మాహుః । సత్త్వస్య ధీధాతోః సంక్షయః సమ్యగైశ్వర్యం నిర్విషయప్రవాహిత్వం కైవల్య మిత్యాహుః ।"

అనగా, క్షేత్రమువంటి అవిద్య, బీజమువంటి పురాకృతకర్మ, జలమువంటి తృష్ణ, యీ మూడింటిని బట్టి పురర్జన్మ కలుగుచున్నది. ఆ అవిద్యాదికము సుషుప్తియందుగాని, ప్రళయములోగాని సంస్కారరూపమున నిమిత్తమైయుండుటను బట్టి యొక దేహము నష్టమైనను మరియొక దేహము ఆ అవిద్యాదికమునుబట్టి ఉత్పన్న మగును. ఆ అవిద్యాదికము జ్ఞానదగ్ధమైనపుడు దేహము లేకుండ మోక్షము కలుగును. బుద్ధి విషయసంబంధము లేకుండ ప్రవహించుటే మోక్షము. అని.

ఈ విషయముపై దోషములు చెప్పబడుచున్నవి—

"యదా స్వరూపత శ్చాఽన్యో జాతిత శ్శుభతోఽర్థతః ।
కథ మస్మిన్ స ఇత్యేవం సర్వం వా స్యా దసంహితమ్ ॥

వ్యాఖ్యా-స్వరూపతోఽన్యత్వం-ముక్తావపి క్షణికానాం విజ్ఞానాదీనాం। యదా చ జాతితః ఆలయవిజ్ఞానం బాహ్య విజ్ఞానమితి, తేషా మన్యత్వం। యదా చ శుభతః శుభాఽశుభతః పుణ్యపాపతః, అర్థతః బన్ధమోక్షతః విజ్ఞానానాం పృథక్త్వం తదా బాహ్యే కథం సోఽయమితి ప్రత్యభిజ్ఞానం। ప్రాగ్దృష్టస్య ఘటస్యేవ వార్తమానికా దన్యత్వాత్ ।

ఏవమ్ అసంహితమ్, అనభిసంహితం భోగమోక్షాది కథం వా

స్యాత్ । అన్యో ముముక్షు రన్య స్సాధనావిష్టోఽన్యో ముక్త ఇత్యాపత్తేః ।

"ఏవం సతి చ కా ప్రీతి ర్దానవిద్యావ్రతపోజపైః ।
యదన్యాచరితం కర్మ సర్వ మన్యః ప్రపద్యతే ॥"

వ్యాఖ్యా—ఏవంచ సతి దానాద్యప్యనర్థకం ఫలభోగకాలే దాతు రభావా దిత్యాహ- ఏవమితి । అన్యేన విజ్ఞానేనాఽఽచరితమన్య ద్విజ్ఞానాన్తరం ప్రతిపవర్త్తతే । ఫలం దాతుం గచ్ఛతి ।

"అపి హ్యాయ మిహైవాఽన్యైః ప్రకృతై ర్దుఃఖితో భవేత్ ।
సుఖితో దుఃఖితో వాపి దృశ్యాదృశ్యవినిర్ణయః ॥"

వ్యాఖ్యా- ఇష్టాపత్తి మాశఙ్క్యాహ- అపీతి । అన్యత్వావిశేషా చ్చైత్రపుత్ర్యై రపి మైత్రి స్సుఖీ భవే దిత్యర్థః । దృశ్యః స్పష్టః ।

"తథా హి ముసలై ర్హత్వా స్థిరం తత్పున ర్భవేత్ ।
పృథక్ జ్ఞానం య దన్యచ్చ యేనైత న్నోపపద్యతే ॥"

వ్యాఖ్యా- చైత్రజ్ఞానాత్ మైత్రజ్ఞానం పృథక్ విసదృశం । యేన వైజాత్యేన ఏతత్పూర్వశ్లోకోక్తం దూషణం నోపపద్యతే । అతశ్చైత్రజ్ఞానధారైవ సజాతీయా వివక్షితేతిచే త్తర్హి ఉత్పద్యమానస్య సదృశజ్ఞానస్య కి ముపాదానమ్ ?

న తావ త్పూర్వజ్ఞానం । తస్య క్షణికత్వేన ఉత్తరోత్పాదే వ్యాపారాయోగాత్ । తస్మాచ్ఛేత్ ముసలై ర్హతా చ్ఛరీరా దపి అన్య చ్ఛరీరం పున ర్భవేత్ ।

"ఋతు సంవత్సరో తిష్యః శీతోష్ణౌ ప్రియాప్రియే ।
యథాఽతీతాని పశ్యన్తి తాదృశ స్సత్త్వసంతయః ॥"

వ్యాఖ్యా—కించ ఋత్వాదివ జ్జాతోపి మోక్షః పునఃపున రాగత్య నివర్తేత । జ్ఞానధారాయా ఆనన్త్యా దిత్యాహ- ఋత్వితి । తిష్యః కలిరితి యుగానా ముపలక్షణమ్ ।

బహుదోషగ్రస్తత్వాత్ క్షణికవిజ్ఞానవాదోఽనుపపన్న ఇత్యర్థః ।"

తాత్పర్యము— ముక్తిలోగూడ క్షణికములైన విజ్ఞానముల యొక్క పరంపర నంగీకరించి ఏ విజ్ఞానమున కావిజ్ఞానము భిన్నరూప

మనుట, ఆలయవిజ్ఞాన మొకటి, బాహ్యావిజ్ఞాన మొకటి యనుభేదము నొప్పుట, పుణ్యాపాపములనుబట్టి, బంధమోక్షములనుబట్టి కూడ ఆ క్షణికవిజ్ఞానములకు భేద మంగీకరించుట యెప్పుడు వచ్చినదో అప్పుడు అనంతవిజ్ఞానములలో ఈ బాహ్యాస్వరూపము ఈ విజ్ఞానమునకు జెందిన దని నిర్ధారణ యెట్లు? ఈ పుణ్యాపాపము లీవిజ్ఞానమునకే చెందిన వని, బంధము గల యీ విజ్ఞానమునకే మోక్షమని నిర్ధారణ యెట్లు? ముముక్షువు ఒక విజ్ఞానము కాగా మోక్షసాధన మవలంబించినది మరియొకవిజ్ఞానమై ముక్తి యింకొక విజ్ఞానమునకు సంభవింపవలసి వచ్చుచున్నది.

ఇట్టి స్థితిలో దానము, విద్య, తపస్సు అనువాని ప్రయోజన మేమున్నది ? దానఫల మనుభవించుకాలమునకు దాతయైన ఆ విజ్ఞానము లేకయే పోవును. విద్యాఫల మనుభవించు కాలమునకు విద్వత్తు కల ఆ విజ్ఞానము లేకయేపోవును. తపఃఫల మనుభవించుకాలమునకు తపస్సుకల ఆ విజ్ఞానము లేకపోవును. ఒక విజ్ఞానముచే ఆచరింపబడినది మరియొక విజ్ఞానమునకు ఫల మిచ్చుచుండును.

దాని కంగీకరించు పక్షములో చైత్రుడనువాడు చేసిన పుణ్యాపాపములచేత మైత్రుడనువానికి సుఖదుఃఖములు కలుగవలసివచ్చును. అట్లు కలుగకుండుట స్పష్టమే, దీనినిబట్టి ఒక విజ్ఞానము చేసినది మరియొక విజ్ఞానమునకు ఫలమిచ్చును. అను అస్పష్టవిషయమును నిర్ణయించుట బాధితమైనది.

ఇక చైత్రమైత్రదృష్టాంతములో చైత్రుని విజ్ఞానధారకంటె మైత్రుని విజ్ఞానధార విజాతీయమని, ఆకారణమున చైత్రునిది మైత్రునకంటదని, చైత్రునియందున్న విజ్ఞానధార సజాతీయమని, అందుచే ఆ విజ్ఞానధారలో నొక విజ్ఞానమది మరియొక విజ్ఞానమునకు ఫలమీయ వచ్చును గనుక దోషము లేదని చెప్పుదురేమో, అట్లయిన ఒక విజ్ఞానము పోయి సజాతీయమైన మరియొక విజ్ఞానము కదా పుట్టుచుండును.

అపుట్టెడి సజాతీయ విజ్ఞానము దేనినుండి పుట్టుచున్నది? దానికి పూర్వ మైన విజ్ఞానము నుండియా? ఆ విజ్ఞానము క్షణికమాయె, ఏక్షణమున కాక్షణమే నశించునట్టిదాయె. అదియే లేనప్పుడు ఉత్తరక్షణమున బుట్టు విజ్ఞానమునకు కారణ మెట్లగును? ఆ విజ్ఞాననాశనమే ఉత్తరమందు పుట్టు విజ్ఞానమునకు కారణ మందురా? అట్లయిన ఏ ప్రహారముల చేతనో హతమైన శరీరమునుండి మరియొక శరీరము పుట్టవద్దా? మరియు వారన్నట్లు మోక్షము వచ్చినను విజ్ఞానధార అనంత మనుట చేత అనంతమైన కాలములో ఋతువులు, సంవత్సరములు, యుగ ములు, శీతోష్ణములు, సుఖదుఃఖములు, వచ్చుచు పోవుచు మరల వచ్చుచు నున్నట్లు ఆవచ్చిన మోక్షముకూడ మరల పోవచ్చును.

ఇట్టి బహుదోషములు క్షణికవిజ్ఞానవాదములో నున్నందున ఆవాద మనుపపన్నము. అని.

"ఇతి సమ్యాఙ్మనస్యేతే బహవ స్సన్తి హేతవః ।
ఏత దస్తీదమస్తీతి న కించి త్ప్రతిదృశ్యతే ॥"

వ్యాఖ్యా— మనఃప్రభవే ష్వనేకేషు తర్కేషు యుక్త్యాఽన్యత రోపి నిర్ధారయితుం న శక్యత ఇత్యర్థః ।

"తేషాం విమృశతా మేవ తత్తత్సమభిధావతామ్ ।
క్వచి న్నివిశతే బుద్ధి స్తత్ర జీర్యతి వృక్షవత్ ॥
ఏవ మర్థై రనర్థై శ్చ దుఃఖితా స్సర్వజన్తవః ।
ఆగమై రపకృష్యన్తే హస్తిపై ర్హస్తినో యథా ॥ (శాన్తి. అ218)

వ్యాఖ్యా— నిర్ణాయకం మానమాహ- ఏవమితి ।"

మనస్సు నాధారము చేసికొని బహువిధములైన వితర్కములు కలుగుచుండును. అందు ఏ యొక్కటియు యుక్తిచేత నిదియే యని నిర్ధారణచేయుటకు శక్యము కాదు అట్లు వితర్కించుచుండువారి బుద్ధి దేనియందో అభినివేశము వహించి దానిలో జీర్ణించిపోవును. నిర్ణయ జనకమైన ప్రమాణము వేదమే. అర్థానర్థములకు పాలయి దుఃఖితు లగుచుండు లోకులను సక్రమమార్గమున మత్తేభములను మావటివాడు వలె నడిపించునట్టిది ఆవేదమే. అని భావము.

ఇది విజ్ఞానాత్మవాదిబౌద్ధమతఖండనసారాంశము.

దీనినిబట్టి నేటి నాస్తికత్వగ్రంథకర్త వ్రాసినట్లు కాక నాస్తిక వాదవైఖరి, దానియందలి అనుపపత్తులు, బాగుగా తెలిసియున్న కాలమునందే సర్వజ్ఞుడగు వేదవ్యాసమహర్షి, సర్వేశ్వరుడగు కృష్ణభగవానుడు, భారత- భగవద్గీతా- గ్రంథరూపమున సిద్ధాంతముచేసి యుంచినది జీవాత్మవాదమని దెలిసికొనవలెను.

బౌద్ధుల విజ్ఞానాత్మవాదము మహాభారతములో నిరసింపబడియె యున్నందున, "బుద్ధుని స్మరణయే లేనట్టి మహాభారతము గౌతమ బుద్ధునకు పూర్వమే రచింపబడిన దని బుద్ధుని స్మరణ కలిగియున్న రామాయణము మహాభారతరచనానంతరము గౌతమబుద్ధుని యనంతరము రచింపబడియుండు" నని చెప్పువారి మాటలు నిస్సారము లని గ్రహింపవలెను రామాయణ మహాభారతములలో స్మరింపబడిన బుద్ధుడు గౌతమబుద్ధుడు కాడని, వెనుక నిరూపింపబడిన విషయము మరువవలదు.

జీవునిగూర్చి చెప్పబడిన సిద్ధాంతసారాంశము—

జంగమస్థావరస్వరూపములు పాంచభౌతికములై జీవుల శరీరములై యున్నవి. శరీరము లనగా—"శరీరత్వం న జాతు స్యాత్ భోగాధిష్ఠానతాం వినా" అన్నట్లు జీవుల సుఖదుఃఖభోగస్థానములు. జీవుడనగా దేహము కాదు. చిన్మాత్రిమును గాదు. లింగశరీర మను నామాంతరము కల సూక్ష్మశరీరముతో గలిసియున్న ఆత్మ సూక్ష్మశరీర మనగా 'పంచప్రాణ- మనో- బుద్ధి- దశేంద్రియ- సమన్వితమై అపంచీకృతభూతనిర్మితమై, అదృశ్యమై, పుణ్యాపాపవాసనాధారమై, అనాదిసిద్ధమై మోక్షపర్యంతస్థాయియై యుండునది.

ఇట్టి సూక్ష్మశరీరముతో గలిసియున్న ఆత్మయే జీవుడు. ఇట్టి జీవునకు ఆయా స్థూలశరీరములతో సంయోగవియోగములు కల్గుచుండును ఉత్పత్తివినాశములు స్థూలశరీరములకే కలుగుచుండును. స్థూలశరీరనాశముతో జీవునకు నాశము లేదు. జీవుడు తాను చేసిన పుణ్యాపాపముల ఫల మనుభవింపనిదే ఆ పుణ్యాపాపకర్మలు నశింపవు. తా

ననుభవించు సుఖదుఃఖములు తన పుణ్యాపాపఫలములే కాన, మరి యొకటి కాదు. అని.

జీవునకు సంభవించు ఆకలి, దప్పిక, ప్రాణధర్మములును, శోకము, మోహము, మనోధర్మములును, జర. మరణము, శరీరధర్మములును అయియున్నవి

మానవుడు చేయునవి పాపకార్యములో, పుణ్యకార్యములో అగును. ఆ పాపపుణ్యములు జన్మాంతర మందయినను అనుభవించి తీరవలసినవే.

—, ఈ జన్మములోని పాపపుణ్యములను జన్మాంతరములో
జీవు డనుభవించుటను గూర్చి శంకా
సమాధానములు- స్వప్నపరిస్థితి.—

శ్రీమద్భాగవతములో ప్రాచీనబర్హి- నారద- సంవాదములో ప్రాచీనబర్హి శంక యిట్లున్నది—

"కర్మా ణ్యారభతే యేన పుమా నిహ విహాయ తమ్।
అముత్రాఽన్యేన దేహేన జుష్టాని స యదశ్నుతే॥
ఇతి వేదవిదాం వాదః శ్రూయతే తత్ర తత్ర హ।
కర్మ చ క్రియతే ప్రోక్తం పరోక్షం న ప్రకాశతే॥" (స్క-4 అ29)

శ్రీధరీయమ్— సంశయ మాహ-ద్వాభ్యామ్। కర్మాణి యేన దేహేన కరోతి త మత్రైవ విహాయాఽముత్ర లోకాన్తరే కర్మోపస్థాపితేనాఽన్యేన దేహేన జుష్టాని ఉపభుక్తాని (స్వర్గనరకాదీని) జీవోఽశ్నుతే ప్రాప్నోతి। ఇతి వాదః శ్రూయతే— "ప్రాప్య పుణ్యకృతాంల్లోకాన్" ఇతి. "శరీరజైః కర్మదోషై ర్యాతి స్థావరతాం నరః" ఇతి। ఏతచ్చ కర్తృభోక్తృదేహభేదేన కృతనాశ- అకృతాభ్యాగమ- ప్రసంగాన్న సంగచ్ఛత ఇతి భావః।

సంశయాన్తరమాహ- ప్రోక్తం వేదోక్తం కర్మ యత్క్రియతే జనైః తచ్చాఽనన్తర క్షణ ఏవ పరోక్ష మదృశ్యం సన్న ప్రకాశతే। అతః కర్మణో నష్టత్వా త్తద్భోగోపి దుర్ఘట ఇతి భావః।"

**తాత్పర్యము—** మనుజుడు పుణ్యపాపము లేదేహముతో జేయునో ఆదేహ మిక్కడ విడిచి లోకాంతరములో తన కర్మానుగుణ

ముగా ప్రాప్తించిన దేహాంతరముతో స్వర్గనరకాదుల ననుభవించు నని వేదవేత్తలు చెప్పుచున్నారు.

పుణ్యపాపకర్తృత్వ మేదేహముతోడనో ఆ దేహముతోడనే ఫలభోక్తృత్వ మనుట యుక్తము. ఒక దేహముతో కర్తృత్వము మఱియొకదేహముతో భోక్తృత్వము అనుట యుక్తమా ? అని యొక సంశయము.

మరియు వేదోక్తకర్మను జనులు చేయుదురు ఆకర్మ ఉత్తర క్షణమందే నష్టమగును. కర్మ నష్టమయినపుడు దాని ఫలము ననుభవించు ననుట యెట్లు ? ఇది రెండవ సంశయము. అని.

దీనిలో మొదటిసంశయమునకు నారదమహర్షి యుత్తరము—

"యేనైవారభతే కర్మ తేనైవాఽముత్ర తత్పుమాన్ ।
భుఙ్క్తే హ్యవ్యవధానేన లింగేన మనసా స్వయమ్ ॥"

శ్రీధరీయమ్- ప్రథమ స్యోత్తరం యేనైవేతి । అవ్యవధానేన కర్తృభోక్తృదేహవిచ్ఛేదం వినా । స్థూలదేహనాశేఽపి మనఃప్రధానస్య లింగదేహస్యాఽనాశాత్ నోక్తదోషప్రసంగ ఇత్యర్థః ।

నాశము స్థూలదేహమునకే కాని, సూక్ష్మదేహమునకు లేదు కనుక మనఃప్రధానమైయున్న ఆసూక్ష్మదేహముతోడనే జీవుని కర్తృత్వ మయినను భోక్తృత్వమయినను సంబంధించియున్నందున కర్తృ- భోక్తృ- దేహభేద మను దోషము లేదు.

లింగ(సూక్ష్మ)దేహవిశిష్టమునకే భోక్తృత్వ మనుటకు నిదర్శనము-

"శయాన మిమ ముత్సృజ్య శ్వసన్తం పురుషో యథా ।
కర్మాఽఽత్మ న్యాహితం భుఙ్క్తే తాదృశే నేతరేణ వా ॥"

శ్రీధరీయమ్— లింగదేహవిశిష్టస్య భోక్తృత్వం స్వప్నదృష్టాన్తేన స్పష్టయతి-శయాన మిమం జాగ్రద్దేహం శ్వసన్తం జీవన్తముత్సృజ్య తదభిమానం త్యక్త్వా, ఆత్మని మనసి, సంస్కారరూపేణ ఆహితం కర్మ యథా భుఙ్క్తే, తాదృశేన శయానదేహసదృశేన కర్మోపస్థాపితేన దేహేన అన్యేనవా పశ్వాదిదేహేన। తథా లోకాన్తరేఽపీతి భావః ।

శయనించియున్న మనుజుడు స్వప్నావస్థలో స్థూలదేహసంబంధము విడిచి, అనగా ఈ స్థూలదేహమందభిమానము లేకుండ మనస్సున సంస్కారరూపముగా నున్న కర్మను, కర్మోపస్థాపితమైన యీ స్థూలదేహసమానదేహముతోడనో లేక పశ్వాదిదేహముతోడనో యెటు లనుభవించుచుండెనో అటులే లోకాన్తరమందు అనుభవించును

"మమైతే మనసా యద్య దసా వహ మితి బ్రువన్ ।
గృహ్ణీయా త్తత్పుమాన్ రాద్ధం కర్మ యేన పున ర్భవః ॥"

శ్రీధరీయమ్— నను భవతునామ లింగవిశిష్టస్య అనేన దృష్టాన్తేన భోక్తృత్వం, కర్తృత్వం తు దానప్రతిగ్రహాదిషు స్థూలదేహవిశిష్టస్యైవ దృశ్యతే। తత్రాహ— మమైతే పుత్రాదయోఽసా వహం బ్రాహ్మణ ఇతి బ్రువన్ మనసా యద్య ద్దేహం గృహ్ణీయాత్ తత్ తతో దేహాత్ రాద్ధం సిద్ధం కర్మ పుమాన్ గృహ్ణీయాత్। యేన కర్మణా ఏవ మహంకారగృహీతేన పునర్భవో భవతి, అన్యథా జన్మానుపపత్తేః ॥

తతోఽభిమన్తు ర్మనోవిశిష్టస్యైవ కర్తృత్వ మభిమానవిషయస్య తు దేహస్య పుత్రాదిదేహవద్ద్వారమాత్రత్వ మితి భావః ।"

అయితే లింగదేహవిశిష్టమునకే భోక్తృత్వ మని స్వప్నదృష్టాన్తము ధ్రువపరచుచున్నది నిజమే. కర్తృత్వముమాత్రము దానప్రతిగ్రహాదులలో స్థూలదేహవిశిష్టమునకే కనబడుచున్నదే. కర్తృ-భోక్తృ-దేహభేదము తప్పలేదే అని ప్రశ్నింతు వేమో వినుము—

మనుజులకు స్థూలదేహమందు అహమభిమానము, దేహసంబంధులగు పుత్రాదులయందు మమాభిమానము. స్పష్టము. అట్లు అభిమానించున దేదియో దానిని బట్టి సిద్ధించిన కర్మయే పునర్జన్మకు కారణ మగుచున్నది. ఇచ్చట అభిమానింపబడునది స్థూలదేహము. అభిమానించునది మనోవిశిష్టస్వరూపము. ఈ యభిమానించుస్వరూపమునకు చెందినదే కర్తృత్వము కాని, అభిమానింపబడు దేహమునకు చెందినది కర్తృత్వము కాదు. ఈ దేహముమాత్రము పుత్రాదిదేహములవలెనే కర్తృత్వమునకు ద్వారభూతమై యుండును. కనుక స్థూలదేహము

ద్వారా సూక్ష్మదేహవిశిష్టమునకే కర్తృత్వము, భోక్తృత్వము అని తెలిసికొనవలయును. దీనిచే మొదటి సంశయమునకు సమాధానము చెప్పబడినది.

రెండవ సంశయమునకు సమాధానము—

"యథాఽనుమీయతే చిత్త ముభయై రిన్ద్రియేహితైః ।
ఏవం ప్రాగ్దేహజం కర్మ లక్ష్యతే చిత్తవృత్తిభిః ।"

శ్రీధరీయమ్— యదుక్తం కర్మణో నష్టత్వా న్నాఽముత్ర భోగఇతి, తత్రాహ— యథేతి । ఉభయైః జ్ఞానకర్మరూపై రిన్ద్రియాణా మీహితైః కదాచిత్కర్మప్రవృత్తిభిః చిత్త మనుమీయతే సత్యపి సర్వేన్ద్రియవిషయసంబన్ధే యుగపజ్జ్ఞానానుత్పత్తేః । తదుక్త మక్షపాదేన— "యుగపత్ జ్ఞానానుత్పత్తి ర్మనసో లింగమ్" ఇతి । ఏవం చిత్తవృత్తిభిరపి పూర్వదేహజం కర్మ లక్ష్యతే । తాసామపి యుగపదనుత్పత్తేః"

చేసిన కర్మ వెంటనే నశించునుగనుక లోకాంతరములో అనుభవించు ననుట సరిపడ దను ప్రశ్నకు సమాధానము వినుము—

ఇంద్రియము లున్నవి. ఆ యింద్రియము లన్నిటికిని ఏక కాలమందు ఆ యావిషయములతో సంబంధము కలిగియుండును. కాని యావద్విషయజ్ఞానములు యావదింద్రియములకు ఏక కాలమందు కలుగుటలేదు. ఒక యింద్రియనిమిత్తమైన జ్ఞాన మొక క్షణమందు, మరియొక యింద్రియనిమిత్తమైన జ్ఞానము మరియొకక్షణమందు కలుగుచున్నది. దీనినిబట్టి ఆయా యింద్రియములు స్వతః విషయగ్రహణము చేయలేనివని, యేయింద్రియమునకు మనస్సంయోగ ముండునో ఆ యింద్రియమే అప్పు డావిషయమును గ్రహింపగలుగుచుండు నని, సర్వేంద్రియములకు ఆ మనస్సంయోగము ఏకక్షణముందుండ దని యూహింపబడుచున్నది. ఇంద్రియజ్ఞానములనుబట్టి చిత్త మూహింపబడుచున్నట్లు చిత్తవృత్తులనుబట్టి పూర్వజన్మకర్మ ఊహింపబడుచున్నది.

అది యెట్లనగా, చిత్త మున్నది. చిత్తవృత్తులన్నియు నేక కాలమందే యుద్భవించుట లేదు. ఒకక్షణ మందొక విధమైన చిత్తవృత్తి

మరొకక్షణమందు మరొకవిధమైన చిత్తవృత్తి కలుగుచున్నది. దీనికి కారణము పూర్వదేహకృతకర్మ యని, ఆ కర్మవిశేషమునుబట్టి ఆ క్షణమందు ఆ చిత్తవృత్తి శుభాత్మకమో, అశుభాత్మకమో కలుగుచున్నదని, కర్మప్రేరణ లేనిదే చిత్తవృత్తులు స్వతః కలుగనేరవని భావింపవలయును.

కాబట్టి చేసిన కర్మ నష్టమయినను దాని సంస్కారము తద్రూపముగా అంతఃకరణగతమై యున్నదని స్పష్టము.

కర్మ సంస్కారముగా అన్తఃకరణమం దుండితీరిన దను విషయము మఱియొక విధముగా గూడ నిరూపింపబడుచున్నది—

"నానుభూతం క్వచాఽనేన దేహేనాఽదృష్ట మశ్రుతమ్ ।
కదాచి దుపలభ్యేత యద్రూపం యాదృ గాత్మని ॥"

శ్రీధరీయమ్— ఇతోపి కర్మ లక్ష్యత ఇత్యాహ- నానుభూత మితి ద్వాభ్యామ్। అనేన వర్తమానేన దేహేన। క్వచ కుత్రచిదపి యన్నానుభూత మననుభూత మనుపభుక్త మదృష్టంచాఽశ్రుతం చయద్రూపం యదాత్మకం యాదృక్ యత్ప్రకారంచతత్కదాచిత్ స్వప్నమనోరథాదిషు ఆత్మని మనసి ఉపలభ్యేత।

"తేనాఽస్య తాదృశం రాజన్ లింగినో దేహసంభవమ్ ।
శ్రద్ధత్స్వాఽననుభూతోఽర్థో న మనః స్ప్రష్టు మర్హతి ॥"

శ్రీధరీయమ్— తేన హేతునాఽస్య లింగినో వాసనాశ్రయస్య జీవస్య తాదృశం తదనుభవాదియుక్తం పూర్వదేహ సంభవం శ్రద్ధత్స్వ నిశ్చయేన మన్యస్వ। నహ్యననుభూతోఽర్థః మనః స్ప్రష్టుం మనసి స్ఫురితు మర్హతి ॥"

వర్తమానదేహముచేత నెన్నడును అనుభూతముకానట్టియు, దృష్టముకానట్టియు, శ్రుతముకానట్టియు, విషయములు స్వప్నమందును మనోరథాదులయందును మనస్సున స్ఫురించుచున్నవి. ఆ కారణముచేత కర్మవాసనాశ్రయలింగదేహవిశిష్టమైయున్న జీవునకు ఆ

యపూర్వవిషయములయొక్క అనుభవాదులను గలిగించిన పూర్వ దేహముల సంభంధము అవశ్య మంగీకరింపవలసియున్నది. అత్యంతము అననుభూతమైన విషయము మనస్సులో ఎన్నడును స్ఫురింపదని తెలిసికొనుము. ఏ యపూర్వవిషయము స్ఫురించుచున్నదో దాని సంస్కారముండితీరినది. అట్టి సంస్కారమునకు మూలమైన అనుభవాదికమును ఎప్పుడో ఉండితీరినదని నిర్ణయము.

ఇంకొకటి. బాల్యావస్థలో దృష్టము, శ్రుతము, అయిన విషయములు వార్ధకావస్థలో స్ఫురించుచున్నవి. అవస్థాభేదమేకాని మనో భేదము లేకుండుట దానికి కారణము. అట్లే పూర్వాపూర్వదేహములకు సంబంధించిన విషయములు ఈ దేహగతమైన మనస్సులో స్ఫురించుచున్నందున దేహభేదమాత్రమేకాని మనోభేదము లేదని, యావద్దేహగతమై యున్న మనస్సు ఒక్కటే యని తెలిసికొనవలయును.

"మన ఏవ మనుష్యస్య పూర్వరూపాణి శంసతి ।
భవిష్యతశ్చ భద్రం తే తథైవ న భవిష్యతః ॥"

శ్రీధరీయమ్— కించ మనోవృత్త్యైవ పూర్వాపరాణి శుభాశుభనిమిత్తాని శరీరాణి జ్ఞాయన్త ఇత్యాహ- మనఏవేతి। భద్రం తే ఇతి। సమ్యగవధానార్థ మాశిషాభినన్దతి।

భవిష్యత ఉద్భవం ప్రాప్స్యతః న భవిష్యతః నీచత్వం ప్రాప్స్యతోపి భావీని రూపాణి శంసతి మనఏవౌదార్యకార్పణ్యాదివృత్తిభిః పూర్వమప్యేవమేవాసీ త్పశ్చా దప్యేవమేవ భవిష్యతీతి తత్తద్భావిరూపాణి జ్ఞాపయతీత్యర్థః।"

మనుష్యుని మనోవృత్తులనుబట్టి శుభాశుభనిమిత్తములైన అతని పూర్వజన్మశరీరములును, ఉత్తరజన్మశరీరములును ఇట్టివని తెలియబడుచుండును. ఔదార్యము, కార్పణ్యము, ఉగ్రత్వము, శాన్తత్వము, మూఢత్వము, జ్ఞానము, వైరాగ్యము లక్షణముగా గల ఆయా మనోవృత్తులమూలమున పూర్వజన్మమందును ఈతడు ఇట్టివాడే అయియుండె ననియు, ఉత్తరజన్మమందు ఇట్టివాడే అగుననియు అతని

యౌన్నత్యమో నైచ్యమో తెలియబడుచుండును. ఆయా మనో వృత్తులు వారివారి శుభాశుభకర్మనిమిత్తములే కాకుండినచో నందరి మనోవృత్తు లేకవిధముగనే యెందుకుండవు ?

"అదృష్ట మశ్రుతం చాత్ర క్వచి న్మనసి దృశ్యతే ।
యథాతథాఽనుమన్తవ్యం దేశకాలక్రియాశ్రయమ్ ॥"

శ్రీధరీయమ్— నను కదాచి ద్దర్శనానర్హమపి స్వప్నే ప్రతీయతే, యథా పర్వతాగ్రే సముద్రః, దివా నక్షత్రాణి, స్వశిరశ్ఛేద ఇత్యాది। తత్రాహ- అదృష్టమితి। అన్యదేశాశ్రయం సముద్రాదికం పర్వతాగ్రే, నిశాశ్రయం నక్షత్రాదికం దివా, అభ్యంగాదిక్రియాశ్రయం స్వశిరశ్ఛేదనాది నిద్రాదిదోషేణ హి తథా ప్రతీయతే ఇత్యనుమన్తవ్యం। పరస్యాపి తదనుపపత్తే స్తుల్యత్వా దితి భావః ।"

అయితే, యెన్నడో అనుభూతమయినదే మనస్సులో స్ఫురించును. ఎన్నడును అనుభూతము కానిది స్ఫురింపదు. అనికదా పూర్వము చెప్పబడినది. ఎప్పుడును దర్శనార్హము కానట్టి అప్రసిద్ధ విషయములు ఒకానొకప్పుడు స్వప్నములో స్ఫురించుచుండును. అవి పర్వతాగ్రమందు సముద్రము, దివాభాగమందు నక్షత్రములు, స్వశిరశ్ఛేదము ఇత్యాదులు. ఇవి యెట్లు సరిపడును ? అని యడిగెదవేమో వినుము—

ఒకప్రదేశమందు సముద్రము ప్రసిద్ధమే. ఒకకాలములో (రాత్రి) నక్షత్రములు. ప్రసిద్ధములే అట్టివి పర్వతాగ్రమందున్నట్లు, దివాభాగ మందున్నట్లు స్ఫురించుటలో నిద్ర, ధాతువైషమ్యము అను దోషములే కారణము. అని భావింపవలెను.

ఇంకొకటి. సముద్రాన్తర్గతమై మైనాకపర్వతమున్నదని మైనాకమున కుపరిభాగమున సముద్రమున్నదని వాల్మీకిరామాయణమందు చెప్పబడియున్నది. కనుక పర్వతాగ్రమందు సముద్రము ప్రసిద్ధమే అని చెప్పవచ్చును. సర్వగ్రాససూర్యగ్రహణసమయమున దివాభాగ

మందును నక్షత్రదర్శనమగునుగనుక అదియును ప్రసిద్ధమే యని చెప్పవచ్చును. (వంశీధరీయమ్)

ఇక స్వశిరశ్ఛేదనవిషయ మున్నది.

"తైలమర్దనోత్తరం శయనే స్వశిరశ్ఛేదరూపదుస్స్వప్నోపినాసంభవ ఇత్యుక్తం చికిత్సాశాస్త్రే। యద్వా "ధాతువైషమ్యాదోషేణ శిరశ్ఛేదోపి దృశ్యతే స్వప్నే। ఇత్యపి తత్రైవ" (వంశీధరీయం.)

అభ్యంగకాలమున తైలమర్దనముచేసికొనిన వెంటనే స్నానము చేయకుండ నిద్రపోయినవానికి స్వశిరశ్ఛేదరూపమైన దుస్స్వప్నము సంభవింపవచ్చును.

ధాతువైషమ్యదోషముచేత స్వప్నమందు స్వశిరశ్ఛేదముకూడ దృష్టమగును. అని చికిత్సాశాస్త్రమందు చెప్పబడినది.

ఇట్లు ఒకవిధముగా ప్రసిద్ధమై యున్న విషయమే స్వప్నములో నిద్రాదోషమున మరియొకవిధముగాగూడ స్ఫురింపవచ్చునని భావింపవలెను.

'సర్వే క్రమానురోధేన మనసీన్ద్రియగోచరాః ।
ఆయాన్తి వర్గశో యాన్తి సర్వే సమనసో జనాః ॥"

శ్రీధరీయమ్— నను దరిద్రః క్వచిదాత్మానం మహారాజం పశ్యతి, రాజా చరం క మాత్మానం పశ్యతి। తత్కథ మసంభావితం సంగచ్ఛేత। తత్రాహ- సర్వ ఇతి। ఆయాన్తి భోగ్యత్వేన ప్రాప్నువన్తి। యాన్తిచ భోగానన్తరం। యది చ కశ్చిదమనాభవేత్తర్హి ఏవం న స్యాత్। న త్వేతదస్తీత్యాహ—

సర్వే సమనస ఇతి। సర్వేషాం సమనస్కత్వాత్ మనసి చ సర్వార్థానాం క్రమేణ ప్రవేశాత్ నాఽత్యన్తాదృష్టచరః కస్యాపి కశ్చి దర్థోఽస్తీత్యర్థః।"

అయితే దరిద్రుడు స్వప్నములో తన్ను మహారాజనుకొనును. మహారాజు తన్ను దరిద్రుడనుకొనును. అసంభావిత మయిన యిట్టి విషయ మెట్లు సరిపడును? అని యడిగెదవేమో వినుము:—

మనస్సులేని మనుజుడు లేడు. దృష్టములైనట్టియు, శ్రుతములైనట్టియు సర్వవిషయములయొక్క వాసనలు మనోగతములై యున్నవి.

ఆ విషయవాసనలచేత నాయావిషయములు క్రమముగా అనుభవము నకు వచ్చుచుండును. అనుభవానంతరము పోవుచుండును. ఏజీవు డయినను ఒక్కసూక్ష్మశరీరముతోడనే అనంతస్థూలశరీరములయందు కాలక్రమమున ప్రవేశించి సర్వవిషయములను అనుభవించుచు వచ్చు చున్నవాడే. కాబట్టి మనస్సులో స్ఫురించిన దేదియును అసంభావి తము కాదు. కనుక 'అననుభూతమైన విషయము మనస్సున స్ఫురిం పదు' అనియే నిర్ధారితము అని.

ఇది నారదమహర్షి ప్రాచీనబర్హికి బోధించిన విషయము. దీని సారాంశము— లింగదేహవిశిష్టమైన జీవునకే కర్తృత్వభోక్తృత్వము లనియు, స్థూలదేహము ఆజీవుని అహమభిమానమునకు విషయమై జీవుని కర్తృత్వాదులకు సాధన మగుచుండుననియు, ఆ లింగదేహము చిరస్థాయియై అనేకజన్మములలోని స్థూలశరీరములలో ప్రవేశించు చుండుననియు, లింగదేహములో ప్రధానమైన మనస్సునందు ఆయా జన్మములలో కనికని చేసియున్న యావద్విషయముల వాసనలు స్థిర పడియుండి అప్పుడప్పుడు స్వప్నాదులలో ఆ విషయస్ఫూర్తిని కలిగిం చుచుండుననియు, ఎన్నడును అననుభూతము కానిది మనస్సులో స్ఫురిం పదనియు, స్ఫురించిన విషయమెల్ల యేజన్మమందో అనుభూతమే యని భావింపవలసినదే యనియు, మనుజుల యోగ్య- అయోగ్య మనోవృత్తులే వారివారి పుణ్యపాపములకు సూచకము లనియు, జన్మ పరంపర తప్పనిదే యనియు, ఈ జన్మములోని పాపపుణ్యములు జన్మాం తరములో అనుభమునకు వచ్చుననియు, వైదికసిద్ధాంతము నిరాక్షేప మనియు సారాంశము.

—• వైదికసిద్ధాంతములో సృష్టిస్థితిలయములకు ప్రాణికర్మ కారణ మన్నపుడు సృష్టి ముందా ? కర్మ ముందా ? అను ప్రశ్నకు సమాధానము—

వేదాంతదర్శనము దీవిషయ మిట్లున్నది—

"న కర్మాఽవిభాగా దితిచేన్నాఽనాదిత్వాత్ ।" (బ్ర.సూ.2-1-35)

భాష్యమ్—'సదేవ సోమ్యేద మగ్ర ఆసీ దేక మేవాద్వితీయమ్' ఇతి ప్రాక్సృష్టే రవిభాగావధారణా న్నాస్తి కర్మ। యదపేక్ష్య విషమా సృష్టి స్స్యాత్। సృష్ట్యుత్తరకాలం హి శరీరాదివిభాగాపేక్షం కర్మ, కర్మాపేక్షశ్చ శరీరాదివిభాగ ఇతీతరేతరాశ్రయత్వం ప్రసజ్యేత। అతో విభాగా దూర్ధ్వం కర్మాపేక్ష ఈశ్వరః ప్రవర్తతాం నామ। ప్రాగ్విభాగా ద్వైచిత్ర్యనిమిత్తస్య కర్మణోఽభావా త్తుల్యైవాద్యా సృష్టిః ప్రాప్నోతీతి చేత్।

నైష దోషః- అనాదిత్వా త్సంసారస్య। భవే దేష దోషో యద్యాదిమా న్సంసార స్స్యాత్। అనాదౌ తు సంసారే బీజాంకురవత్ హేతుహేతుమద్భావేన కర్మణ స్సర్గవైషమ్యస్య చ ప్రవృత్తి ర్న విరుధ్యతే।"

సృష్టికి పూర్వము పరమాత్మమాత్రమే యున్నది. అని నిర్ధారిత మైనందున యీ విషమసృష్టికి నిమిత్తమైనట్టి కర్మ సృష్టికి బూర్వము లేదు సృష్ట్యుత్తరమందు సంభవించు కర్మ ఆసృష్టికి కారణమనుపక్షములో సృష్టిలేనిదే కర్మ లేదు. కర్మ లేనిదే సృష్టి లేదుకనుక నది యసంగతము. కాబట్టి ప్రథమసృష్ట్యనంతరము సంభవించు ప్రాణి కర్మనుబట్టి తదనంతరసృష్టి విషమముగా నేర్పడవచ్చునుగాని, ప్రథమ సృష్టి విషమముగా నుండుటకు వీలులేదు. అది సమానరూపముగనే యుండెనని చెప్పవలయును. అట్లు చెప్పినయెడల సమానరూపమై యున్న ఆసృష్టిలో విషమకర్మోత్పత్తికి సంభవము లేనందున అనంతర సృష్టి యేదైనను ఈపశు- పక్షి- నర- వానరాది- రూపమున విషమ ముగా నుండక సమానరూపముగనే యుండవలసివచ్చుచున్నది. కనుక కర్మ సృష్టికారణ మనుమాట దోషగ్రస్తము. అనిభావింపరాదు.

సృష్టికి ఆది యొకటి యున్నపుడు ఈ దోషము తటస్థించును. ఈ సంసార మనాది. అనాదియైన సంసారములో, ఇప్పుడు గోచరించు వివిధములైన అంకురములకు బూర్వము బీజములు, ఆ బీజములకు బూర్వము అంకురములు, వానికి బూర్వము బీజములు పరంపరగా కారణములై యున్నట్లు ఈ సృష్టికి బూర్వము కర్మ, దానికి పూర్వము

సృష్టి, దానికి పూర్వము కర్మ పరంపరగా కారణమైయున్నది. కనుక సృష్టివైషమ్యమునకు విరోధము లేదు.

"ఉపపద్యతే చాప్యుపలభ్యతే చ" (బ్రి.సూ. 36)

భాష్యం - ఉపపద్యతే చ సంసారస్యాఽనాదిత్వం. ఆదిమత్త్వే హి సంసారస్యాఽకస్మా దుద్భూతేః ముక్తానా మపి పునస్సంసారోద్భూతిప్రసఙ్గః । అకృతాభ్యాగమప్రసఙ్గః । సుఖదుఃఖాదివైషమ్యస్య నిర్నిమిత్తత్వాత్। నచేశ్వరో వైషమ్యహేతురిత్యుక్తం, నచాఽవిద్యా కేవలా వైషమ్యస్య కారణమ్। ఏకరూపత్వాత్। రాగాదిక్లేశవాసనాక్షిప్తకర్మాపేక్షా త్వవిద్యా వైషమ్యకరీ స్యాత్। నచ కర్మాఽన్తరేణ శరీరం సంభవతి, నచ శరీరమన్తరేణ కర్మ సంభవతీతి ఇతరేతరాశ్రయత్వప్రసంగః। అనాదిత్వే తు బీజాంకురన్యాయేనోపపత్తే ర్న కశ్చిద్దోషో భవతి। ఉపలభ్యతే చ సంసారస్యాఽనాదిత్వం శ్రుతిస్మృత్యోః। శ్రుతౌ తావత్- 'అనేన జీవేనాత్మనా" ఇతి సర్గప్రముఖే శారీర మాత్మానం జీవశబ్దేన ప్రాణధారణనిమిత్తేనాఽభిలప న్ననాది స్సంసార ఇతి దర్శయతి...... "సూర్యాచంద్రమసౌ ధాతా యథాపూర్వ మకల్పయత్" ఇతి చ మన్త్రవర్ణః పూర్వకల్పసద్భావం దర్శయతి।

స్మృతావ ప్యనాదిత్వం సంసారస్యోపలభ్యతే-"న రూపమస్యేహ తథోపలభ్యతే నాన్తో నచాది ర్న చ సంప్రతిష్ఠా" పురాణేచాఽతీతానా మనాగతానాం చ కల్పానాం న పరిమాణ మస్తీతి స్థాపితమ్ ।"

సంసారమునకు అనాదిత్వమే ఉపపన్న మగుచున్నది. ఆది యున్నయెడల నిర్హేతుకసృష్టి నంగీకరింపవలసివచ్చును. అప్పుడు ముక్తులకును నిర్హేతుకసృష్టినిబట్టి జన్మ తప్పకపోవును. అప్పుడు జన్మరాహిత్యమునకై చెప్పబడిన జ్ఞాన- కర్మ- కాండలు వ్యర్థమైపోవును. సంసారుల సుఖదుఃఖాదివైషమ్యము నిర్హేతుకమని చెప్పవలసివచ్చును. సృష్టివైషమ్యకారణము ఈశ్వరుడు కాడు; ఏకరూపమైన కేవలమువిద్యయును గాదు; రాగద్వేషమోహవాసనలనుబట్టి భావింపబడు ధర్మ- అధర్మ- మిశ్ర- కర్మల సహకారము గల అవిద్య కారణము. అందుచే నట్టి కర్మకు అనాదిప్రవాహ మంగీకరింపక తప్పదు.

ఇంకొకటి. సృష్టికి ఆది నంగీకరించినయెడల ప్రథమశరీరమున కుత్పత్తి కారణము లేదుగనుక సంభవింపదు. ప్రథమశరీరోత్పత్తికి పూర్వము కర్మ లేనందున కర్మను కారణ మనుటకు వీలులేదు. కాబట్టి కర్మ- శరీరములకు అనాదిత్వమును వాదులందరు నంగీకరింపవలసినదే.

సంసారానాదిత్వము శ్రుతిస్మృతులలో చెప్పబడియే యున్నది. సూర్యచంద్రాదిప్రపంచసృష్టి యథాపూర్వముగ జరిగిన దను శ్రుతి వాక్యము, 'నాన్తో న చాదిః' అనుగీతావాక్యము, అతీతానాగత కల్పములకు పరిమితి లేదని చెప్పు పురాణవాక్యములు సంసారమున కనాదిత్వమునే స్పష్టీకరించుచున్నవి. ఉపపత్తిసహితమైన శ్రుత్యాది ప్రమాణబలమున కర్మ, సృష్టి అనాదిప్రవాహముగా ప్రాప్తించు చున్నవని సమాధానము

—• మనుజుడు చేసిన కర్మవలన గలుగు విశేషములు •—

వేదాంతదర్శనములో నిట్లు చెప్పబడినది—

"కర్మాణి విహితనిషిద్ధత్వాకారేణాఽపూర్వం క్రియాత్వేన సంస్కారం చ జనయన్తి। తతాఽపూర్వా త్ఫలం భుఙ్క్తే. సంస్కారభావి తత్వా త్పున స్తజ్జాతీయాని కరోతి... సంస్కారవశాదేవ పుణ్యం పాపం వా రోచతే। అతోఽభిరుచిలింగా త్పుణ్యాపుణ్యసంస్కారోఽనుమేయః। స ఏవ స్వభావః, ప్రకృతిః, వాసనా ఇతి చ గీయతే।" (రత్నప్రభా—1-3-30)

చేయబడు కర్మలు విహితములని, నిషిద్ధములని రెండు విధ ములు. కర్మగతములైన ఆ విహితత్వ- నిషిద్ధత్వ- ధర్మములనుబట్టి అపూర్వ మనబడు పుణ్యాపాపము లేర్పడుచుండును. ఆ కర్మగతమైన క్రియాత్వధర్మమునుబట్టి సంస్కార మేర్పడుచుండును.

ఆ పుణ్యాపాపములనుబట్టి తత్ఫల మనుభవించుచుండును. ఆ సంస్కారమునుబట్టి ఆ రకమైన కర్మవే చేయుచుండును. ఏవ్యక్తికయి నను పుణ్యకర్మయందో పాపకర్మయందో కలిగెడి అభిరుచికి వెనుకటి పుణ్యాపాపకర్మ సంస్కారమే కారణము. వారి వారి అభిరుచివిశేష మునుబట్టి అట్టి సంస్కారవిశేష మూహ్యమగుచుండును. సంస్కారము, స్వభావము, ప్రకృతి, వాసన అనునవి సమానార్థములు.

"తేషాం యే యాని కర్మాణి ప్రాక్సృష్ట్యాం ప్రతిపేదిరే।
తాన్యేవ తే ప్రపద్యన్తే సృజ్యమానాః పునః పునః॥"

అను మనుస్మృతివచనము, పూర్వజన్మములో ఎవ్వరెట్టి కర్మలను చేసియుండిరో వారు పునర్జన్మములో అట్టికర్మలను చేయువారగుచుందు రని బోధించుచున్నది. అని.

లోకములో ఆయావ్యక్తుల ప్రవర్తనను చూచి వాని పూర్వజన్మసంస్కార మట్టి దని "స్వభావో దురతిక్రమః' అని 'బుద్ధిః కర్మానుసారిణీ" అని చెప్పుకొనుట సుప్రసిద్ధ మగుటకు ఈశాస్త్రసిద్ధ యమే మూలము.

అనివార్యముగా గనబడుచేష్టలను చూచి అది వానిస్వభావ మని ఇది వీనికి స్వభావ మని లోక మనుకొను మాటలనుబట్టికూడ శాస్త్రోక్తమైన కర్మస్వభావమే స్వభావశబ్దార్థమని స్పష్టము.

పర్యవసానములో మనుజుడు చేయు పుణ్యాపాపకర్మకు గల శక్తులు రెండు. సుఖదుఃఖఫలమనుభవింపజేయు శక్తియొకటి. అట్టి కర్మయందే మరల ప్రవర్తింపజేయు (అభిలాషనుపుట్టించు) శక్తియొకటి. ఇందుఫలానుభవజనకశక్తి అనిసార్యము. పునఃప్రవృత్తిజనకశక్తి పురుషప్రయత్ననివార్యము అగుచుండును. ఈ విశేషము ముందు వివరింపబడును.

—• మనుజుని పుణ్యాపాపకర్మకు ఆగామి—సంచిత-
ప్రారబ్ధవిభాగము దైవశబ్దార్థము •—

పూర్వజన్మములలో మనుష్యుడై పుట్టి చేసిన పుణ్యాపాపకర్మకే ముందెప్పుడో ఫలమిచ్చు పరిస్థితిలో సంచిత మని పేరు. ఇప్పుడు మనుష్యుడై యుండి చేయునట్టిదై యికముందు సంచితములోనికి చేరునట్టిదై యున్న స్థితిలో ఆగామి యని పేరు.

వర్తమాన శరీరముద్వారా ఫల మిచ్చుటకు ప్రారంభించిన స్థితిలో ప్రారబ్ధ మని పేరు. ఈ ప్రారబ్ధకర్మకే దైవ మని నామాంతరము

"దైవాధీనం జగత్సర్వం మన్త్రాధీనం తు దైవతమ్" ఇత్యాది స్థలములలో దైవ- దైవత- శబ్దములు దేవతాపరములుగా వాడబడి

క్వాచిత్కముగా నున్నను "దైవం దిష్టం భాగధేయం భాగ్యం స్త్రీ నియతి ర్విధిః" అను అమరకోశమునుబట్టి కర్మవిశేషము దైవశబ్దార్థ మనుట నిర్వివాదము. కనుక ప్రారబ్ధకర్మకే దైవమనికూడ పేరు. కనుకనే—

"దైవం పూర్వకృతం కర్మ కథ్యతే నేతర త్పునః" అనియు, "దైవ మాత్మకృతం విద్యా త్కర్మ యత్పౌర్వదైహికమ్" అనియు, స్పష్టముగా చెప్పబడినది. దృష్టము కానిది కనుక అదృష్ట మనియు, పురాకృతమనియు దీనికే నామాంతరములు.

—• ప్రారబ్ధ మనబడు దైవముయొక్క ప్రభావము. •—

"సుఖదుఃఖవిపర్యాసే యదా సముపపద్యతే । వనపర్వ- అ209
నైనం ప్రజ్ఞా సునీతం వా త్రాయతే నైవ పౌరుషమ్ ॥
యోఽయ మిచ్ఛే ద్యథాకామం తం తం కామం స ఆప్నుయాత్ ।
యది స్యా దపరాధీనం పౌరుషస్య క్రియాఫలమ్ ॥
సంయతా శ్చాపి దక్షాశ్చ మతిమంతశ్చ మానవాః ।
దృశ్యన్తే నిష్ఫలాః సన్తః ప్రహీణాః సర్వకర్మభిః ॥
ప్రహీణాః శాస్త్రా అపి ।
భూతానా మపరః కశ్చి ద్ధింసాయాం సతతోత్థితః ॥
వంచనాయాం చ లోకస్య స సుఖేనైవ యుజ్యతే ।
అచేష్ట మపి చాసీనం శ్రీః కంచి దుపతిష్ఠతి ॥
కశ్చి త్కర్మాణి కుర్వన్ హి న ప్రాప్య మధిగచ్ఛతి ।
దేవా నిష్ట్వా తప స్తప్త్వా కృపణైః పుత్రగృద్ధిభిః ॥
దశమాసధృతా గర్భే జాయన్తే కులపాంసనాః ।
అపరే ధనధాన్యైశ్చ భోగైశ్చ పితృసంచితైః ॥
విపులై రభిజాయన్తే లబ్ధా స్తైరేవ మంగళైః ।
న దేవజా మనుష్యాణాం వ్యాధయో ద్విజసత్తమ ॥
కర్మజా హి మనుష్యాణాం రోగా నాస్త్యత్ర సంశయః ।
యేషాం మస్తి చ భోక్తవ్యం గ్రహణీరోగపీడితాః ॥
న శక్నువన్తి తే భోక్తుం చేష్టితం పూర్వకర్మణః ।"

సుఖదుఃఖవ్యత్యాసము వచ్చినపుడు దానిని ప్రజ్ఞకాని, నీతికాని, పౌరుషముకాని తొలగించి కాపాడజాలదు.

పురుషప్రయత్నము పరాధీనత లేకుండ స్వతంత్రముగా ఫల మీయగలిగినయెడల తాను కోరినదాని నెల్ల ప్రతివ్యక్తియు పొంద లేకుండుటేమి ?

ఏకీభావము వహించి సమర్థులై మతిమంతులై యావచ్ఛక్తి కార్యసిద్ధికై పాటుపడిన మానవులు వ్యర్థులై కనబడుచున్నారు.

లోకములో పరులను హింసించుచుండియు సుఖముగా జీవించువాడొకడు, వంచన చేయుచుండియు సుఖముగా జీవించువాడొకడు.

ఒకడు నిర్వ్యాపారముగా గూర్చుండినను సంపదలు చేరుచుండును. మరియొకడు ఎంత పాటుపడినను లాభములేకపోవుచుండును.

కొందరు పుత్రసంతానాపేక్షతో దేవతల నారాధించి తపములు చేసి గర్భవతులై పదిమాసములు మోసి కనుటలో కులపాంసనులు పుట్టుదురు. ఆ మంగళకార్యములనే చేసి మరికొందరు కనుటలో మాతాపితృకల్పితభోగములతో విస్తృతములైన ధనధాన్యములతో తులతూగు గుణవంతులు పుట్టుదురు. మనుష్యులకు దైహికములైన వ్యాధులు నిస్సంశయముగా కర్మజన్యములే.

తినుటకు సమృద్ధిగా నుండియు వ్యాధిగ్రస్తులై తినలేకుండుట పురాకృత ప్రభావమే.

ఎట్టివాడును తన జీవితము తన వశములో నున్నదనుకొనుటకు ఎంతమాత్రము వీలులేదు. ఏమనగా- తన కిష్టముకాక పరిహరింపబడు జరామరణాదులు తనకు ఘటించుచునే యున్నవి. అందుచే ప్రారబ్ధ వశమై జీవిత మున్నది.

"న మ్రియేయు ర్న జీర్యేయు స్సర్వే స్యు స్సర్వకామకాః।
నాప్రియం ప్రతి పశ్యేయు ర్వృద్ధిశ్చ యది నో భవేత్ ॥
ఉపర్యుపరి లోకస్య సర్వో గన్తుం సమీహతే।
యతతే చ యథాశక్తి న చ తద్వర్తతే తథా ॥"

ప్రారబ్ధ మనబడు విధి లేనియెడల నెవ్వరును జరామరణము లకును, కష్టములకును పాలుకాకూడదు. సర్వాభీష్టములు సర్వులకు సిద్ధించి తీరవలెను. లోకములో నొకనిపయి నొక డుండగోరి యావచ్ఛక్తి ప్రయత్నించుచున్నాడు. కాని ఆ కోరిక సిద్ధించుటలేదు. ఇదంతయు ప్రారబ్ధ మనబడు దైవముయొక్క ప్రభావము. దీని కొక నిదర్శనము— అంగబలము, అర్థబలము అత్యధికముగా గలిగి తమ పురుషకారముచే శతృక్షయము జేయుదు మని యుద్ధమునకు సిద్ధపడి కాలుదువ్విన కర్ణదుర్యోధనాదులు, సైంధవసంరక్షణప్రయత్న మెంత తాము చేసినను అది నిరర్థకమగుటను జూచి చింతించునపుడు ఇదంతయు ద్రోణుని పక్షపాతఫలితమని దుర్యోధను డాడిన మాటపై కర్ణు డేమనెనో చూడుడు—

"ఆచార్యం మా విగర్హస్వ శక్త్యాఽసౌ యుధ్యతే ద్విజః ।
యథాబలం యథోత్సాహం త్యక్త్వా జీవిత మాత్మనః ॥
అజయ్యాన్ పాండవా న్మన్యే ద్రోణే నాస్త్రవిదా మృధే ।
యతో నోయుధ్యమానానాం పరం శక్త్యా సుయోధన ॥
సైన్ధవో నిహతో యుద్ధే దైవ మత్ర పరం స్మృతమ్ ।
సతతం చేష్టమానానాం నికృత్యా విక్రమేణ చ ॥
హత్వాఽస్మాకం పౌరుషం వై దైవం పశ్చా త్కరోతి చ ।
నికృత్యా వంచితాః పార్థాః విషయోగైశ్చ భారత ॥
దగ్ధా జతుగృహే చాపి ద్యూతేన చ పరాజితాః ।
రాజనీతిం వ్యపాశ్రిత్య ప్రహితాశ్చైవ కాననమ్ ॥
యత్నేన చ కృతం తత్తద్దైవేన వినిపాతితం ।

సుయోధనా ! ద్రోణాచార్యుని నీవు గర్హింపకుము, ఆతడు యావచ్ఛక్తివినియోగించి ప్రాణము లొడ్డి యుద్ధము చేయుచున్నాడు. పాండవులాతనికి జయింపశక్యము కానివారనియే నాకుతోచుచున్నది. ఆతని మాటకేమి? మనమాటజెప్పుము, మనమందరము గలిసి సైంధవుని కాపాడగలిగినామా? ఎప్పటికప్పుడు మనము కపటముతోడను, పరాక్రమముతోడను ఎంతపాటుపడిసను సాధింపగలిగినామా? మన పౌరు

షమును దైవమనబడు మనదురదృష్టము దిగద్రొక్కుచున్నది, మనము పాండవులనుకపటోపాయమున వంచించినను, విషప్రయోగము చేసినను, లక్కయింట బెట్టి దగ్ధముచేసినను, ద్యూతమున నోడించినను, రాజ నీతితో నరణ్యముల పాలుచేసినను ఇట్టియెన్ని ప్రయత్నముల నయినను దైవమనబడు మనదురదృష్టమే అణచివేసినది. అని.

ఇప్పుడు 'దైవమనియేమున్నది.? పురుషప్రయత్నమున కసాధ్యమేమున్నది ? పనికాకుండుట పురుషప్రయత్నలోపముచేతనే' అను కొనుప్రబుద్ధులు ఈ కర్ణవాక్యములను మనస్సులో బెట్టుకొనవలయును. సన్ధినిమిత్తము కురుసభకు వెళ్లునపుడు కృష్ణభగవానుడు పార్థునితో నేమిచెప్పెనో చూడుడు—(ఉద్యో అ79)

''సర్వం త్విదం మమాయత్తం భీభత్సో కర్మణో ర్ద్వయోః''

వ్యా॥ ద్వయోః కర్మణోః శమయుద్ధయోః మధ్యే ఇద మనామయం సర్వం కృత్స్నం మమ దూతస్య ఆయత్త మధీనమ్''

''క్షేత్రం హి రసవ చ్ఛుద్ధం కర్మణైవోపపాదితమ్ ।
ఋతే వర్షా న్న కౌన్తేయ జాతు నిర్వర్తయే త్ఫలమ్''

వ్యా॥ తథాపి దైవానుకూల్య మత్రాపేక్షిత మిత్యాహ- క్షేత్రమితి, కర్మణా కర్షణేన వాప్యాది జలదానేన చ శుద్ధం భూదోషహీనం రసవత్ ఆర్ద్రం చ ఉపపాదితం కృతం తత్కదాచిత్ వర్షం వినాపి ఫలప్రదం న భవేత్ ।

"తత్ర వై పౌరుషం బ్రూయు రాసేకం యత్ర కారితమ్ ।
తత్ర చాపిధ్రువం పశ్యే చ్ఛోషణం దైవకారితమ్ ॥"

వ్యా॥ అత్ర కేవలం పౌరుషస్యైవ శ్రైష్ఠ్యం దృష్ట మిత్యాహ-తత్రేతి। ఏతదపి దైవాధీన మేవేత్యాహ-తత్రచాపీతి। శోషణం వాప్యాదేః సర్వథా వృష్ట్యభావే యథా న ఫలనిష్పత్తిః తద్వద్దైవాభావేపీత్యర్థః।

"తదిదం నిశ్చితం బుద్ధ్వా పూర్వైరపి మహాత్మభిః।
దైవంచ మానుషే చైవ సంయుక్తం లోకకారణమ్ ॥"

వ్యా॥ సంయుక్తమాహితం లోకకారణం లోకహితసాధనం ।

"అహం హి తత్కరిష్యామి పరం పురుషకారతః ।
దైవ న్తు న మయా శక్యం కర్మ కర్తుం కథం చన ॥

వ్యా॥ దైవం కర్మ ప్రాక్తనం కర్మ కర్తు మన్యథాకర్తుమ్ ।

పార్థా! శాంతి యుద్ధము ఈ రెండింటిలో నిరపాయ పరిస్థితి యేదో అది దూతనయి వెళ్లుచున్న నాపై నాధారపడియున్నది. అయినను దైవానుకూల్య మావశ్యకము సుక్షేత్రమును దున్ని నూతినీరుతోడి తడిపి చక్కబరచినను వర్షాభావములో నది ఫలప్రదము కాదు. అక్కడ నూతులు త్రవ్వి నీరు పెట్టి తడుపుటలో పురుషప్రయత్నముకం౦ వేరేమున్న దనిపించును. కాని ఆనూతులలో నీరు హరించిపోవుట దైవకృతమే. సర్వాత్మనా వర్షాభావములో సస్యములు ఫలింపనట్లు దైవానుకూల్యాభావములో పురుషప్రయత్నములు ఫలింపవు.

కనుకనే పూర్వులగు మహాత్ములు లోకహితము దైవ—పురుష కారములు రెంటిపై నాధారపడియున్నదని నిశ్చయించిరి. నేనిప్పుడు పురుకారముతో జేయవలసిన దానిని పూర్తిగా జేయుదును. దైవమును మార్చుట నాకు శక్యము కాదు. అని.

ఈ శ్రీకృష్ణభగవానుని వచనములనుబట్టికూడ దైవ మెంత లని వార్యమైనదో తెలిసికొనవలయును.

—• పురుషకారమునకు ఆవశ్యకత •—

అదృష్ట మని, అపూర్వ మని, ప్రారబ్ధ మని చెప్పబడు దైవము తన కెట్టి ఫలమిచ్చుట కన్ముఖమై యున్నదో దెలియకుండును గనుక తన కిష్టమైన సుఖప్రాప్తి - దుఃఖనివృత్తులకు పురుషకార మవసరము. ఆ పురుషకారము సఫలమైనపుడు దైవముయొక్క అనుకూల్యము, విఫలమైనపుడు ప్రాతికూల్యము తెలిసికొనవలయును.

ఆదైవము శుభఫల మిచ్చునట్టిదే అయియున్నను పురుషప్రయత్నముతో మిళితము కాకుండ ఫల మియజాలదు. పురుషప్రయత్నము ఎంతటి దయినను దైవానుకూల్యము లేనిదే ఫలింపనేరదు. ఈవిషయమే

"కృతః పురుషకార స్తు దైవ మేవానువర్తతే ।
న దైవ మకృతే కించి త్కస్యచి ద్దాతు మర్హతి ॥"

అని ఆనుశాసనికపర్వములో చెప్పబడినది.

"యథా బీజం వినా క్షేత్ర ముప్తం భవతి నిష్ఫలమ్ ।
తథా పురుషకారేణ వినా దైవం న సిధ్యతి ॥
క్షేత్రం పురుషకారస్తు దైవం బీజ ముదాహృతమ్ ।
క్షేత్రబీజసమాయోగా త్తత సస్యం సమృధ్యతే ॥"

(అనుశా- అ౨)

క్షేత్రమందు నాటబడని బీజము నిష్ఫలమై క్షేత్రసంయుక్తమైన బీజము ఫలప్రదమై యున్నట్లు బీజమువంటి దైవము క్షేత్రమువంటి పురుషకారము నాశ్రయించియే ఫలప్రద మగును. అని చెప్పబడినది.

ఇంకొకటి, శుభఫల మిచ్చునట్టి బీజప్రాయమైయున్న దైవము పురుషకారప్రాబల్యముచేత వాయువుచేత అగ్నివలె ప్రవర్ధమానమగునని, పురుషకారహీనతచేత తైలక్షయముచేత దీపమువలె క్షీణించునని చెప్పబడినది—

"యథాగ్నిః పవనోద్ధూత స్సుసూక్ష్మోపి మహాన్ భవేత్ ।
తథా కర్మ సమాయుక్తం దైవం సాధు వివర్ధతే ॥
యథా తైలక్షయా ద్దీపః ప్రమ్లాని ముపగచ్ఛతి ।
తథా కర్మక్షయా ద్దైవం ప్రమ్లాని ముపగచ్ఛతి ॥" అని.

ఇంకొకటి పురుషకారము శాస్త్రీయమని, అశాస్త్రీయ మని రెండువిధములు అశాస్త్రీయము అనర్థహేతువు. శాస్త్రీయము పరమార్థహేతువు.

అంతు దైవ మనబడు పూర్వజన్మగతపురుషకారమును, వర్తమానజన్మగతపురుషకారమును ఒండొంటి నెదుర్కొని యేది ప్రబలమో అది దుర్బలమైనదానిని అణచివేయును.

శాస్త్రీయమైన పురుషకారములోగూడ అనర్థప్రాప్తి గోచరించినయెడల అనర్థకారియైన తన పూర్వపురుషకారము ప్రబలమై యున్నదని తెలిసికొనవలయును.

అశుభమైన తన ప్రాచీనపురుషకారమగు దైవమును శాంతింప జేయుటకు దగిన శుభాచరణరూపపురుషకారమును పూనికతో చేయు చుండవలయును.

ప్రాచీనమైన పురుషకారదోషము నవీనపురుషకారగుణముచేత శాంతించు ననుటకు వెనుకటి భోజనగురుత్వముచే గలిగిన అజీర్ణ దోషము ఇప్పటి లంఘనగుణముచే శాంతించుచుండుటే నిదర్శనము.

అది, సచ్ఛాస్త్ర- సత్సంగ- సదాచారములకు జెందిన పురుష కారమైనపుడే యథోక్తఫల మీయగలుగును.

పురుషకారముయొక్క స్వరూప మిదియే. ఈ విధముగా వ్యవ హరించు మనుజుని ప్రయత్నము సఫలమే. నిష్ఫలము కాదు.

ఈ విషయ మంతయు యోగవాసిష్టములోని యీ శ్లోకము లలో నున్నది—

"ఉచ్ఛాస్త్రం శాస్త్రితం చేతి ద్వివిధం పౌరుషం స్మృతమ్ ।
తత్రోచ్ఛాస్త్ర మనర్థాయ పరమార్థాయ శాస్త్రితమ్ ॥
ద్వౌ హుడా వివ యుధ్యేతే పురుషార్థౌ సమాఽసమౌ ।
ప్రాక్తన శ్చైహికశ్చైవ శామ్యత్యత్రాల్పవీర్యవాన్ ॥
అనర్థః ప్రాప్యతే యత్ర శాస్త్రితా దపి పౌరుషాత్ ।
అనర్థకర్తృ బలవ త్తత్ర జ్ఞేయం స్వపౌరుషమ్ ॥
తావ త్తావ త్ప్రయత్నేన యతితవ్యం సుపౌరుషమ్ ।
ప్రాక్తనం పౌరుషం యావ దశుభం శామ్యతి స్వయమ్ ॥
దోషశ్శామ్య త్యసన్దేహం ప్రాక్తనోఽద్యతనై ర్గుణైః ।
దృష్టాన్తోఽత్ర హ్యస్తనస్య దోషస్యాద్యగుణైః క్షయః ॥
సచ సచ్ఛాస్త్రసత్సంగసదాచారై ర్నిజం ఫలమ్ ।
దదాతీతి స్వభావోఽయ మన్యథా నార్థసిద్ధయే ॥
స్వరూపం పౌరుషస్యైత దేవం వ్యవహర న్నరః ।
యాతి నిష్ఫలయత్నత్వం న కదాచన కశ్చన ॥" అని. (స. 45)

దైవము, పురుషకారము అను రెంటిని ఆధారపడియే కార్య సిద్ధికాని కేవలదైవముచేగాని, కేవలపురుషకారముచేగాని కార్యసిద్ధి

కానేరదనియు, కార్యసిద్ధి దైవముచేతనే యనికొందరు, స్వభావము చేతనే యనికొందరు, కాలముచేత నని కొందరు, పురుషకారము చేతనే యని కొందరు చెప్పుచుందురు కాని బుద్ధిమంతులు దైవ- పురుష కార- స్వభావ- కాలములసంయోగమునబట్టియే కార్యసిద్ధి యని చెప్పుచున్నారనియు యాజ్ఞవల్క్యస్మృతిలో చెప్పబడినది—

'దైవే పురుషకారే చ కర్మసిద్ధి ర్వ్యవస్థితా ।
తత్ర దైవ మభివ్యక్తం పౌరుషం పౌర్వదైహికమ్ ॥
కేచి ద్దైవా త్స్వభావాద్వా కాలా త్పురుషకారతః ।
సంయోగే కేచి దిచ్ఛన్తి ఫలం కుశలబుద్ధయః ॥"

ఇంకొకటి- శ్రీకృష్ణుడు పాండవుల కిట్లుపదేశించెను—

లోకస్య నాన్యతో వృత్తిః పాండవాఽన్యత్ర కర్మణః ।
ఏవం బుద్ధిః ప్రివర్తేత ఫలం స్యా దుభయాన్వయే॥'

వ్యా॥ కర్మణోఽన్యత్ర పౌరుషం వినా, అన్యతః ఏకస్మాద్దైవాదేవ వృత్తి ర్జీవికా నాస్తి । ఏవం బుద్ధిః ప్రివర్తేత పురుషకారం కుర్యాత్। తథా సతి ఉభయాన్వయే దైవపౌరుషయోస్సంబన్ధే ఫలం భవతి. నాన్యతరత ఇత్యర్థః ।

"య ఏవం కృతబుద్ధి స్స కర్మ స్వేవ ప్రివర్తతే ।
నాఽసిద్ధౌ వ్యథతే తస్య న సిద్ధౌ హర్ష మశ్నుతే ॥"

వ్యా॥ యథా కర్షకః కర్మ కృత్వా దైవానుకూల్యా త్ఫలం లబ్ధ్వాపి న హృష్యతి అనాకస్మికత్వా త్ఫలస్య దైవప్రాతికూల్యా ద్ఫలాభావే పి న వ్యథతే అనుచితస్యాఽకరణాత్ । తద్వ దత్రాపి జ్ఞేయ మిత్యర్థః ॥"

పురుషప్రియత్నములేకుండ నొక్క దైవముచేతనే జీవనము సంభవింపదు. అని తెలిసికొని పురుషప్రయత్నము చేయవలెను. అప్పుడు దైవపురుషకారముల సంబంధముతో ఫలము కలుగును. ఏకైకము నుండి కలుగనేరదు.

కర్షకుడు పురుషప్రియత్నముచేసి దైవానుకూల్యమున ఫలమును పొందినపుడు ఆతని కది యాకస్మికముగా వచ్చినదికానందున ఆఫల మాతని కాశ్చర్య మనిపింపదు. అది దైవప్రాతికూల్యము

పకపోయినను అనుచితకార్యము చేయనివాడుగనుక నాతనికి ఖేదము ననిపింపదు.

"ఫలం స్యా దుభయాన్వయే" అనుదాని వివరణము—

ఒకప్పుడు దైవము ప్రధానము, పౌరుష మప్రధానము అయి యుండును. ఎట్లన, ప్రధానమగు దైవమువలన నిధి ప్రాప్తించుట. అప్పుడు దానిని తీసికొనుట, రక్షించుకొనుట, వినియోగించుకొనుట అప్రధానమైన పురుషప్రయత్న మగును.

ఒకప్పుడు పౌరుషము ప్రధానము, దైవ మప్రధానము అయి యుండును. మహాప్రాసాదాదినిర్మాణము. అక్కడ అప్రధానముగానైనను దైవమే లేకుండినను ప్రతికూలమైయుండినను ప్రాసాద నిర్మాణమే సంభవింపదు. సంభవించినను ఏ భూచ్ఛిద్రాదులచేతనో విఘ్నమేర్పడును. ఒకప్పుడు రెండును ప్రధానములే అయి యుండును. అదియెట్లన, తాననుకొనినట్లు రాజ్యరూపఫలము సిద్ధించును, అక్కడ దైవము ప్రధానమైయున్నది

ఆ ఫలము తన పౌరుషశైథిల్యముచేత పౌరుషాతిశయముగల వానిచే నాక్రమింపబడును. పౌరుషశైథిల్యకాలములో దైవప్రాతికూల్యమును భావింపరాదు- ప్రత్యక్షముగా పౌరుషశైథిల్యము గోచరించుచున్నది గనుక. కాబట్టి 'ఫలం స్యా దుభయాన్వయే' అని చెప్పబడినది. (అర్జున మిశ్రీయము.)

మరియు, పూర్వజన్మములోని తన పురుషకారరూప కర్మకే దైవమని, యీ జన్మములో జేయు కర్మకు పురుషకారమని పేరనియు, ఆ రెంటిలో బలాబలములను బట్టి దుర్బలమైన దైవము ప్రబలమైన పురుషకారముచే ప్రతిహత మగుననియు, ప్రబలమైన దైవముచే దుర్బలమైన పురుషకారము ప్రతిహతమగుననియు చరకసంహితలో జెప్పబడినది—

"దైవ మాత్మకృతం విద్యా త్కర్మ యత్పౌర్వదైహికమ్ ।
స్మృతః పురుషకారస్తు క్రియతే యదిహాఽపరమ్ ॥
బలాబల విశేషోఽస్తి తయోరపి చ కర్మణోః ।

దైవం పురుషకారేణ దుర్బలం హ్యుపహన్యతే ।
దైవేన చైవై తత్కర్మ విశిష్టే నోపహన్యతే ॥" అని.

ఇంకొకటి- ధర్మజునకు మార్కండేయమహర్షి యుపదేశ మిట్లున్నది—

"కించి ద్దైవా ద్ధఠా త్కించి త్కించిదేవ స్వకర్మభిః ।
ప్రాప్నువన్తి నరా రాజన్ మా తేఽస్త్వన్యా విచారణా ॥"

వ్యా॥ దైవాత్ మూఢోన్మత్తజడభరతాభి ర్యల్లభ్యతే తద్దైవాదేవ। హఠాత్ యోగసిద్ధైః విశ్వామిత్రాదిభిః । ఇతరై స్స్వకర్మభిః। అన్యా తేషామన్యతమా ఏకైవ కాచిత్ స్థితి రస్తీతి విచారణా తవ మాస్తు ॥"

మూఢులకు ఉన్మత్తులకు జడభరతాదులకు లబ్ధ మేదో అది దైవముచేతనే లబ్ధము. యోగసిద్ధులగు విశ్వామిత్రాదులకు హఠము చేత లబ్ధము. ఇతరులకు పురుషకారముచేత లబ్ధము. ఇట్లున్నందున సర్వులకును పై మూడింటిలో నేయొకదానిచేతనో ఫలప్రాప్తి యగు నని భావింపరాదు.

"అభ్యుత్థానేన దైవస్య సమారబ్ధేన కర్మణా ।
విధినా కర్మణా చైవ స్వర్గమార్గ మవాప్నుయాత్ ॥"

వ్యా॥ నను కృషిపర్జన్యన్యాయేన దైవాపేక్షా కర్మసిద్ధిః, న కర్మాపేక్షం దైవమితి ప్రత్యక్షం । తత్కథం విపరీత ముచ్యతే ఇత్యాశంక్యాహ- అభీతి । దైవస్య ప్రాక్కర్మణః అభ్యుత్థానం వ్యాపారః ద్వివిధః । సంచితరూపేణా వస్థాన మేకః, భోగార్థం సమారంభో ద్వితీయః ।

తత్ర సమారబ్ధేన ఉత్థానేన తదనుకూలేన కర్మణా చ ఐహికం ఫల మాప్నుయాత్ । విధినా శాస్త్రేణ, కర్మణా చ తదనుసారిణా స్వర్గమార్గ మవాప్నుయాత్ । దైవాధీనో భోగః, కర్మాధీన స్సంచయ ఇతి నిష్కర్షః ''॥

లోకములో కృషికి వర్షాపేక్ష కలదు. వర్షమునకు కృషియొక్క అపేక్ష లేదు. అట్లే పురుషకారమునకు దైవాపేక్షకాని, దైవమునకు

పురుషకారాపేక్ష యేమున్నది ? అందువేమో వినుము— దైవ మన బడు ప్రాక్కర్మకు వ్యాపారము ద్వివిధము సంచితరూపముగా నుండు టొకటి, భోగార్థమై ప్రవర్తించుటొకటి. అందు సంచితరూప స్థితి పురుషకారాధీనము. భోగము దైవాధీనమే.

భోగార్థము ప్రవర్తించు దైవమునకు సరిపడు పని జేసి మను జుడు ఐహికఫలము నొందును. శాస్త్రమునకు సరిపడు పనిజేసి స్వర్గము నొందును. । అని. ఇంకొకటి— కర్షకుడు భూమిని దున్ని విత్తనము పెట్టును. అది పురుషకార మనబడును. సస్యానుకూలముగ వర్షించుట దైవ మనబడును. వర్షము లేకున్నను నూతులు త్రవ్వి నీరుతోడి పెట్టుట పురుషకార మనబడును. ఆ నూతులలో నీరింకిపోవుట, జల ధార లంతరించుట దైవ మనబడును. దైవ- పురుషకార- విభాగ మిట్లు గ్రహింపవలయును. దైవదుస్థితికంటెను పురుషకారదుస్థితి అధికహానికరము—

"న తథా మానుషే లోకే భయ మస్తి శుభాశుభే ।
యథా త్రిదశలోకే హి భయ మన్యేన జాయతే ॥" (అనుశా-౬౮)

వ్యా॥ దైవదౌస్థ్యే ఐహికీ హానిః సుసహా । పురుషకారదౌస్థ్యేతు పర లోకహాని ర్దురన్తేత్యర్థః । అన్యేన, పాపేన ।

దైవ (అదృష్ట) లోపముచే గలిగెడి ఐహికహాని సహింప దగియే యుండును. పురుషకారలోపముచే గలిగెడి పరలోకహాని దురన్తమైనది. అని చెప్పబడినది.

ఆస్తికుల ప్రవర్తన, ఆముష్మికదృష్టి ప్రధానమైయుండుటకు ఇదియే కారణము.

—• కర్మసిద్ధాంతములో పూర్వజన్మసంస్కారము దుష్కార్య ప్రవర్తకమగుచుండ సత్కార్యప్రవృత్తి రూపమైన పురుష కారము సంభవించునా? అనుప్రశ్నకుసమాధానము•—

దైవమనబడు ప్రారబ్ధకర్మలో రెండంశము లున్నవి. ఒకటి అపూర్వమను నామాంతరము కల పుణ్యాపాప రూపమైన యంశము. మరియొకట ప్రకృతి, స్వభావము, వాసన, అనునామాంతరములు

కల సంస్కార రూపమైన యంశము. ఎట్టికర్మసంస్కార మట్టి కర్మనే ఆచరింపజేయుచుండును గనుక సంస్కారాంశమునకు ఆచరణాంశమని కూడ పేరు. సుఖదుఃఖఫల మిచ్చెడి పుణ్యాపాపరూపాంశమునకు ఫలాంశ మనికూడ పేరు.

ఫలాంశము మాట నటుండనిచ్చి సంస్కారాంశమును పరిశీలించినచో అనాదియైన సంసారములో పూర్వజన్మసంస్కారము లేనట్టి మనుష్యుడే ఉండడు. అది దుస్సంస్కారమై యున్నపుడు ఈ జన్మలో దుష్కార్యములనే ఆచరింపజేయుచుండును. అట్టి స్థితిలో సత్కర్మాచరణరూపమైన పురుషకారము సంభవించు టెట్లు ?

"ప్రకృతిం యాన్తి భూతాని, బుద్ధిః కర్మానుసారిణీ" అను వచనములు పై విషయమును ధ్రువపరచుచునే యున్నవి.

ఇట్లుండ "సత్యం వద" "ధర్మం చర" "న పరదారాన్ గచ్ఛేత్" "నాఽనృతం వదేత్" ఇత్యాది శాస్త్రీయవిధినిషేధములు, లౌకికశిక్షా పద్ధతులు అక్రమములే కావలసివచ్చుచున్నవి. ప్రాచీనదుస్సంస్కార మనివార్యమైయుండ నిప్పుడు పురుషకార మనబడు సత్ప్రవర్తన యెట్లు సంభవించును ?

పురుషకారమూలమున మనుజునకు అభివృద్ధి కలుగు నని చెప్పు ప్రమాణవచనములకు సమన్వయ మెట్లు ? అను ప్రశ్నకు సమాధాన మిట్లు చెప్పబడినది—

మనుజుని పూర్వజన్మసంస్కార మేది కలదో అది ఆచేయు పనుల యందు రాగమును, అనగా అభిరుచిని పుట్టించును. ఆ రాగముచేత మనుజుడు నిషిద్ధకార్యములయందు ప్రవర్తించుచుండును. అట్లే అది శాస్త్రవిహితములైన కార్యములయందు ద్వేషమును పుట్టించును. ఆ ద్వేషముచేత మనుజుడు ఆ సత్కార్యములనుండి నివర్తించుచుండును. ఇట్లు రాగద్వేషద్వారా ప్రవృత్తినివృత్తులు కలుగునే కాని రాగద్వేషములు లేకుండ కేవలసంస్కారముచే నవి కల్గునేరవు.

ఆరాగ మెట్లు కలుగు ననగా— 'ఈపని మనకు సుఖహేతువు' అను జ్ఞానమునుబట్టియే కాక దానికితోడుగా 'ఈపని మనకు గొప్ప

అనర్థహేతువు' అను జ్ఞానము లేకుండుటకూడ తటస్థించుటనుబట్టి కలుగును.

ఇక ద్వేష మెట్లు కలుగు ననగా 'ఈవని మనకు అనర్థహేతువు' అనుజ్ఞానమును బట్టియేకాక, దానికి తోడుగా 'ఈపని మనకు గొప్ప అభ్యుదయహేతువు' అను జ్ఞానము లేకుండుటకూడ తటస్థించుటనుబట్టి కలుగును.

ఇట్టి స్థితిలో నిషిద్ధకార్యములు గొప్ప అనర్థహేతువులని శాస్త్రము తెలిపినపుడు, కేవలము సుఖకరమను జ్ఞానమున్నంతమాత్రమున విషమిశ్రిత మధురపదార్థమందువలె రాగము పుట్టజాలదు.

ఇట్లే విహితకార్యములు గొప్ప అభ్యుదయహేతువు లని శాస్త్రము తెలిపినపుడు కేవలము దుఃఖకర మను జ్ఞానమున్నంత మాత్రమున పథ్యాన్నభోజనమందువలె ద్వేషము పుట్టజాలదు.

ఇట్లు శాస్త్రజ్ఞానము చేయదగిన పనులయందు ప్రవృత్తిని, చేయరాని పనులనుండి నివృత్తిని అప్రతిబంధముగా గలిగించునుగనుక శాస్త్రీయవివేకవిజ్ఞానముల ప్రాబల్యముచేత స్వాభావికములైన రాగద్వేషములు ప్రతిహతము లగుటనుబట్టి పూర్వజన్మసంస్కారము మనుజుని అపమార్గమందు ప్రవర్తింపజేయనేరదు. కనుకనే—

"ఇన్ద్రియ స్యేన్ద్రియస్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ।
తయో ర్న వశ మాగచ్ఛే త్తౌ హ్యస్య పరిపన్థినౌ ॥
తస్మా చ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ ॥"

అను భగవద్గీతావచనము, మనుజుడు రాగద్వేషవశుడై వ్యవహరింపక శాస్త్రవశుడై వ్యవహరింపవలెనని బోధించుచున్నది. కాబట్టి శాస్త్రీయవిధినిషేధములును, లౌకికశిక్షాపద్ధతులును అక్రమములు కావు సక్రమములే. ప్రాచీనదుస్సంస్కార మనివార్యము కాదు. పైవిధముగా నివార్యమే కర్మసిద్ధాంతములో పురుషకారమూలమున మనుజునకు అభివృద్ధి యని చెప్పు ప్రమాణములకు సమన్వయపద్ధతి యిదియే. (గీతావ్యాఖ్య— మధుసూదనీ)

అయితే రాగద్వేషవశుడుగాక శాస్త్రవశుడై శాస్త్రీయపురుష కారమందు మనుజుడు ప్రవర్తింపవలె ననుట యెట్లు సరిపడును ? ప్రాచీనసంస్కారము ప్రతిబంధకమైయుండ శాస్త్రమందుగాని, శాస్త్రీయ పురుషకారమందుగాని ప్రవృత్తియే అసంభవము. అని ప్రశ్నింతు వేమో వినుడు—

ఆ సంస్కారము అదృష్టరూపముగా నున్నది. అదృష్టము దృష్ట సామగ్రిని పురస్కరించుకొనకుండ నెన్నడును ప్రతిబంధకము కానేరదు. దృష్టసామగ్రి ఆ యదృష్టరూపసంస్కారమునకు అనుగుణమైనది కాన పుడు ఆ సంస్కారము ప్రతిబంధకము కానేరదు.

అయితే అదృష్టమునకు దృష్టసామగ్రి యొక్క అపేక్ష అవసర మైనట్లు దృష్టసామగ్రికిగూడ అదృష్టముయొక్క అపేక్ష అవసరమే అగును. దృష్టము, అదృష్టము రెండును కార్యసిద్ధికి హేతువులు గనుక.

ఇట్టి స్థితిలో శాస్త్రప్రవృత్తి యనబడు దృష్టమునకు అదృష్టా పేక్ష తప్పని దగుటచే ప్రాచీన సంస్కారాధీనత్వమే మరల వచ్చిపడిన దని శంకింపవచ్చును. ఇది శాస్త్రప్రవృత్తికి, ప్రతికూలసంస్కారమే తప్ప అనుకూలసంస్కారము లేదను పక్షములో సంభవించును. కాని యనాదిగా వచ్చు జన్మపరంపరలో పశుపక్ష్యాదులకంటె విలక్షణమైన మనుష్యజన్మ ప్రాప్తించుటకును మంచిచెడ్డలను గుర్తింపగల విద్యా భ్యాసాది మనుష్యలక్షణములు కలిగియుండుటకును, తగిన పూర్వసం స్కారము లేదనుటకు వీలు లేదు. కాబట్టి బ్రాహ్మణాదివర్ణములలో జన్మించినపుడు శాస్త్రప్రవృత్తి కనుకూలసంస్కార ముండుటచేతనే అట్టి జన్మ వచ్చినదని తెలిసికొనవలయును.

అట్లు నిగూఢమై యున్న అనుకూలసంస్కారమునకు విధి- నిషేధ- మోక్ష- పరమైన శాస్త్రము ఉద్బోధకమై సార్థక మగుచుం డును. దృష్టకారణమునుబట్టియే అదృష్టమయిన సంస్కార ముద్బుద్ధ మగుననుటకు, లోకములో కామినీదర్శనమునుబట్టి కామసంస్కార ముద్బుద్ధమగుచుండుటే నిదర్శనము. ఇట్లుండుటచే మంచిపని చెడ్డ దనుబుద్ధి, చెడ్డపని మంచిదను బుద్ధి అనగా రాగద్వేషాత్మకబుద్ధి

'కర్మానుసారిణీ' పూర్వకర్మసంస్కారమూలమున గలుగుచుండును. ఆ రాగద్వేషములకు వశముకాక మనుజుడు శాస్త్రవశుడై యున్నపుడు శాస్త్రీయవివేకవిజ్ఞానప్రాబల్యమున ఆ రాగద్వేషములు ప్రతిహతము లగును. అదియే అభివృద్ధికరమైన పురుషకారము. పురుషకారముచే ప్రాచీన దుస్సంస్కారమును క్షీణింపజేయవలయు నని సారాంశము

ఈ విషయము యోగవాసిష్ఠమందును చెప్పబడినది—

"ప్రాక్తనం వాసనాజాలం నియోజయతి మాం యథా ।
మునే తథైవ తిష్ఠామి కృపణః కిం కరోమ్యహమ్ ॥

వసిష్ఠః—

వాసనౌఘేన శుద్ధేన తత్ర చే దద్య నీయతే ।
తత్క్రమేణ శుభేనైవ పదం ప్రాప్స్యసి శాశ్వతమ్ ॥
అథచే దశుభో భావ స్త్వాం యోజయతి సంకటే ।
ప్రాక్తన స్తదసౌ యత్నాత్ జేతవ్యో భవతా బలాత్ ॥"

అనగా పూర్వజన్మవాసనలు నన్నెట్లు ప్రేరేపించుచున్నవో అట్లే ప్రవర్తించుచున్నాను. నేనేమిచేయగలను ? అను శ్రీరామ వాక్యముపై వసిష్ఠమహర్షి యిట్లు చెప్పెను—

నీవు శుభవాసనలచే నిప్పుడు ప్రేరేపింపబడుచున్న పక్షములో సన్మార్గముననే క్రమముగా శాశ్వతపదమును పొందగలవు.

ఇక ప్రాచీనమైన అశుభవాసన, నిన్నిపుడు అపమార్గమందు ప్రేరణ చేయుచున్నపక్షములో గట్టి ప్రయత్నము చేసి నీవు ఆ యశుభ వాసనలను జయింపవలయును. అని.

దీనిచేగూడ ప్రాచీనదుర్వాసనలు పురుషప్రయత్నముచేత క్షీణించు నని స్పష్టమైనది.

అట్టి పురుషప్రయత్నము చేయక దుర్వాసనానుగుణముగా సంచరించుట మనుజునకు నేరము గనుకనే లౌకికశిక్షాపద్ధతులును, శాస్త్రీయ విధినిషేధములును ఆవశ్యకము లయినవి.

—• ప్రారబ్ధకర్మకు చెందిన దుర్వాసనాంశమువలె పాపాంశముకూడ పురుషప్రయత్నముచే ప్రతిహతమగునా? అను ప్రశ్నకు సమాధానము •—

"అనారబ్ధకార్యే ఏవ తు పూర్వే తదవధేః" (బ్ర. సూ 4-1-15)
"భోగేన త్వితరే క్షపయిత్వా సంపద్యతే" (బ్ర. సూ. 4-1-19)

భాష్యమ్— అనారబ్ధకార్యయోః పుణ్యపాపయో ర్విద్యా సామర్థ్యాత్ క్షయ ఉక్తః। ఇతరే త్వారబ్ధకార్యే పుణ్యాపాపే ఉపభోగేన క్షపయిత్వా బ్రహ్మ సంపద్యతే।"

ఈ బ్రహ్మసూత్రభాష్యములు, జ్ఞానికయినను ఆగామిసంచితములే నశించును. ప్రారబ్ధము నశింపదు. ప్రారబ్ధానుభవమయిన వెంటనే ముక్తి. అని బోధించుచున్నందున ప్రారబ్ధకర్మకు చెందిన పాపాంశము పురుషప్రయత్నముచే నశింపక అనుభవముచేతనే నశించు నని సిద్ధాంతము.

ఈ విషయమే "ప్రారబ్ధకర్మణాం భోగా దేవ క్షయః" "అవశ్య మనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభమ్" "నాభుక్తం క్షీయతే కర్మ" "ప్రారబ్ధజా మధికసంపద మాపదం వా భుంజాన ఏవ పురుషః పరిశుద్ధి మేతి।"

ఇత్యాదివచనములచే జెప్పబడుచున్నది. దీనినిబట్టి ప్రారబ్ధమనబడు దైవమునకు, ఫలానుభవాంశములో పురుషకారముకంటె ప్రాబల్య మనియు, వాసనారూపమైన ఆచరణాంశములో మాత్రము దైవముకంటె పురుషకారమునకే ప్రాబల్యమనియు స్పష్ట మయినది.

—• ప్రారబ్ధ మనుభవింపక తప్పనపుడు శాంతి- జప- దాన- హోమాదులు సార్థకములా? నిరర్థకములా? అను విషయమునుగూర్చి నిర్ణయము •—

పరాశరమాధవీయములోని విషయ మిట్లున్నది—

సంచితవిషయమై ప్రాయశ్చిత్తములు చెప్పబడినవి. ప్రారబ్ధవిషయమై ప్రాయశ్చిత్త మున్నదా? లేదా? అనునది విచారణీయము— కొంద రున్నదనుచు—

"పూర్వజన్మకృతం పాపం వ్యాధిరూపేణ బాధతే।
తచ్ఛాన్తి రౌషధై ర్దానై ర్జపహోమాఽర్చనాదిభిః ॥"

అనువచనము నుదాహరించుచున్నారు. కర్మకు కర్మత్వదశ, ఫలత్వదశ, అను రెండింటిలో కర్మత్వదశలో ప్రాయశ్చిత్తముకాని, ఫలత్వదశలో ప్రాయశ్చిత్తము ప్రసిద్ధము కాదందురా ? ప్రాయశ్చిత్తము శాస్త్రైకగోచరము, ఆ శాస్త్రము— 'తచ్ఛాన్తి రౌషధై ర్దానైః..." అని చెప్పుచు ఫలరూపమునకుగూడ ప్రాయశ్చిత్తమును చెప్పుచున్నందున ప్రారబ్ధమునకును ప్రాయశ్చిత్త మున్నది. అని వారు ప్రతిపాదించుచున్నారు.

మరి కొంద రిట్లనుచున్నారు—

ప్రారబ్ధకర్మఫలము ప్రాయశ్చిత్తముచే నివర్తించు నను పక్షములో కునఖిత్వాదికము (పుప్పిగోళ్లు) కూడ నివర్తింపవలయును. అట్లు గోచరించుటలేదు. కనుకనే ప్రారబ్ధభిన్నములైన పుణ్యాపాపములకు నివృత్తి యని, ప్రారబ్ధమునకు నివృత్తిలేదని బ్రహ్మసూత్రములలో వ్యాసభగవానుడు చెప్పియుండెను.

అయితే—'తచ్ఛాన్తి రౌషధై ర్దానైః" ఇత్యాది వచనము మాట యేమందురా? ఇది ప్రాయశ్చిత్తవిధాయకము కాదు. ప్రాయశ్చిత్తప్రకరణములో నిది పఠితముకాక, చికిత్సాప్రకరణములో పఠితమై యున్నది. అందుచేత చికిత్స, రోగనివృత్తికి సాధమైనట్లు దానాదులుకూడ సాధనము.

చికిత్సవలె దాన- జప- హోమాదులును ప్రాయశ్చిత్తరూపముగాక అవి రోగనివర్తకమైనట్టి యొక ప్రబలమైన సుకృతమును పుట్టించును.

ఆసుకృతము ప్రారబ్ధకర్మఫలమును ప్రతిబంధించి తాను ఫలమిచ్చును. ప్రతిబంధింపబడిన ఆఫలశేషము స్వప్నాదులలోగాని, జన్మాంతరమందుగాని అనుభవింపబడును.

ఈ విషయము ఉపపురాణములో పరాశరమహర్షి చేత విశదీకరింపబడియున్నది.—

శరీరారంభకం కర్మ యోగినోఽయోగినోఽపి చ।
వినా ఫలోపభోగేన నైవ నశ్య త్యసంశయః॥

వర్తమానశరీరమునకు ఆరంభకమైనట్టి ప్రారబ్ధ కర్మ యోగి కయినను ఫల మనుభవింపనిదే నశింపదు.

"వర్తమానశరీరేణ సంపన్నం కర్మ దేహినః।
ఇహ చాముత్ర చాజ్ఞస్య దదాతి స్వఫలం శుక॥

వర్తమానశరీరముచే జేయబడు కర్మ అజ్ఞానికి యిహ మందును ఫల మిచ్చుచుండును.

"ఇహైవ ఫలదం కర్మ ప్రారబ్ధం ప్రతిబధ్య చ।
ఫలం దదాతి స్వప్నే వా జాగ్రత్కాలేఽథవాఽనఘ।

ఇప్పుడు చేయబడి యిహమందు ఫలమిచ్చునట్టి కర్మప్రారబ్ధ మును ప్రతిబంధించి జాగ్రదవస్థలోగాని, స్వప్నావస్థలోగాని తన ఫల మిచ్చుచుండును.

"నివృత్తప్రతిబద్ధ స్తు ప్రారబ్ధం కర్మ సత్తమ।
నిరుద్ధాంశఫలం స్వప్నే దదాతి స్థిర ముత్తమమ్॥

ప్రతిబంధింపబడి నివర్తించియున్న ప్రారబ్ధముయొక్క ఆశే షము స్వప్నమం దాఫల మిచ్చుచుండును.

"నిరుద్ధాంశసమో భోగో యథోద్భూతశ్చ జాగ్రతి।
తథా నిరుద్ధం తేనైవ సహ కర్మ దదాతి వై॥

జాగ్రదవస్థలో ఎట్టి ఫల మిచ్చుచున్న ప్రారబ్ధాంశము ప్రతిబంధిం పబడినదో అట్టి ఫలమునే అది యిచ్చుచుండును.

"ఏవం నిరుద్ధభాగం తు స్వప్నే జాగ్రతి వా ఫలమ్।
ఆరబ్ధస్యానుగుణ్యేన భుఙ్క్తే దేహీ న సంశయః॥

ఈ విధముగా నిప్పుడు చేసిన కర్మచేత ప్రస్తుతము ప్రతిబంధిం బడు భాగముయొక్క ఫలమును జాగ్రత్తునందో స్వప్నమందో ప్రార బ్ధానుగుణముగా మనుజు డనుభవించును.

"అత్యుత్కటై రిహాత్యైస్తు పుణ్యపాపై శ్శరీరభృత్ ।
ప్రారబ్ధం కర్మ విచ్ఛిద్య భుఙ్క్తేతత్తత్ఫలం బుధ ॥

ఇప్పు డీదేహముతో జేయబడు అత్యుత్కట పుణ్యపాపములే ప్రారబ్ధమును ప్రతిబంధించి తమ ఫల మనుభవింపజేయ గలుగును.

"ప్రారబ్ధశేషం విచ్ఛిన్నం పునర్దేహాన్తరేణ తు ।
భుఙ్క్తే దేహీ న నో భుఙ్క్తే తల్లంఘయతి కః పుమాన్

ప్రతిబద్ధమైన ఆప్రారబ్ధశేషమును దేహాంతరముతో నయినను అనుభవించును. దాని ననుభవింపని మనుజు డెవ్వడు?

అవశ్య మనుభోక్తవ్యం ప్రారబ్ధస్య ఫలం జనైః ।
దేహేనాఽనేన వాఽన్యేన యుగపద్వా క్రమేణ వా ॥

మనుజులు ప్రారబ్ధఫలమును ఈదేహముతోగాని దేహాంతరముతో గాని, యుగపత్తుగా గాని, క్రమముగా గాని అవశ్య మనుభవింప వలసినదే.

"శ్వసూకరఖరోష్ట్రాదివిరుద్ధై ర్వ్యగ్రహై రసి ।
భోక్తాఽస్యైవ ఫలస్యేహ శుక కర్మాణి చ క్రమాత్ ॥
కారణాని భవన్తీహ చక్రవ త్పరివర్తతే ।
ఆరభన్తే క్రమేణైవ తేషాం నాశస్తు భోగతః ॥

శునకసూకరాదిజన్మము లెత్తికూడ ఈప్రారబ్ధకర్మఫలమను భవించుచుండును. చేయబడుకర్మలు ఆయాజన్మలకు కారణములై యుండి క్రమముగా ప్రారబ్ధరూపమును పొంది సంసారచక్రమునకు మూలము లగుచున్నవి. అనుభవమూలముననే ఆ ప్రారబ్ధకర్మకు నాశము.

"సంచితేషు సమస్తేషు ప్రబలం కర్మ దేహినః ।
ఫల మారభతే దేహ మపి తత్సాధనం బుధ ॥

మనుజుని నానావిధసంచితకర్మలో ప్రబలమైన కర్మ ఫల మిచ్చుట కారంభించును. ఆ ఫలానుభవమున కనుగుణమైన దేహము దానికి సాధనమైయుండును. ఈ వచనములు పరాశరమహర్షివి.

అయితే ఇప్పుడు చేయు పురుషకారరూపమైన ప్రబలకర్మచేత ప్రారబ్ధఫలమునకు ప్రతిబంధము నొప్పినయెడల ప్రారబ్ధమూలకములైన కునఖిత్వాదులు (పుప్పిగోళ్ళు) కూడ నివృత్తములు కావలసియుండు నందురా ? నివృత్తములే అగును.

ఎక్కడ నివృత్తములు కాకుండునో, అక్కడ పురుషకారము యొక్క దౌర్బల్యము నూహింపవలయును.

ప్రబలములైన వర- శాపములచేత జన్మలే మారిపోవుచున్నట్లు గ్రంథనిదర్శనము లున్నవి. స్కాందపురాణములో వ్యాఘ్రి యొకటి యీశ్వరవరముచేత గణేశత్వమును పొందె నని చెప్పబడినది మహాభారతములో ఇంద్రపదవిని పొందుటకు సిద్ధమైయున్న నహుషునకు అగస్త్యశాపమున అజగరత్వము ప్రాప్తించె నని చెప్పబడినది.

ప్రారబ్ధాధీనమై ప్రాప్తించిన దేహములే ప్రబలమైన నిమిత్తమునుబట్టి అట్లన్యథాభావమును పొందినపుడు కునఖిత్వాదుల కన్యథాభావములో సందేహమా ?

కనుక రోగశాంత్యాది ప్రతిపాదకశాస్త్రములన్నియు ప్రారబ్ధభోగమునకు అవిరుద్ధముగనే సఫలము లగును.

"తచ్ఛాన్తి రౌషధై ర్దానై ర్జపహోమార్చనాదిభిః" అని చెప్పబడిన ఔషధములు ఆయుర్వేదప్రసిద్ధములై రోగనివారకములై యున్నవి. దానములు బోధాయనకల్ప బ్రహ్మాండపురాణాదుల యందు చెప్పబడియున్నవి జపము శౌనకాదిప్రోక్త 'ఋగ్విధానా' దులయందు చెప్పబడినది అర్చనాదులు శైవ- వైష్ణవాగమప్రసిద్ధములు. ఆదిశబ్దముచేత అర్ఘ్య- ధ్యాన- యోగ- ప్రాణాయామాద్యుపాయములు వ్యాధినివర్తకము లని తెలిసికొనవలయును.

ఉక్తజపాదులు చేసినను కొన్నిచోట్ల ఫలము కనబడకుండుటచే విశ్వాసము లేదందురా ? అట్లయిన ఔషధములయందును ఫలము కనబడకుండుట సమానమే.

ప్రయోగింపబడు ఔషధములయందు ఏవైకల్యముచేతనో రోగప్రాబల్యముచేతనో ఔషధప్రయోగము చిరకాలాపేక్షిత మగునం

దు రేని జపాద్యనుష్ఠానమును అట్లే, అనిష్టములైన ప్రారబ్ధకర్మఫలము లన్నిటియందును వ్యాధిప్రతీకారన్యాయమే ఆశ్రయణీయము.

ఇట్లు "తచ్ఛాన్తిః" అనువాక్యమునుబట్టి జపాదులకు ప్రాయశ్చిత్తత్వము నంగీకరించి ప్రారబ్ధకర్మకే నివృత్తి నంగీకరించువారి పక్షమందును, ప్రాయశ్చిత్తత్వ మంగీకరింపక జపాదులకు ప్రారబ్ధకర్మఫల ప్రతిబంధకత్వమే అంగీకరించువారిపక్షమందును శాస్త్రోక్త- జప- దాన- హోమ- అర్చనాదులు అవశ్యాశ్రయణీయములే అగును.

అనుభవింపక తప్పదనిపించు ప్రారబ్ధకర్మఫలము పట్లనే పురుషకారరూప జపాదులు సార్థకము లగుచున్నపుడు ఫలారంభము కాకున్న ఆగామి-సంచిత- కర్మలపట్ల పురుషకార మనబడు ప్రాయశ్చిత్తానుష్ఠానము సార్థక మనుటలో సందేహమా ? అని.

ఇదంతయు పరాశరమాధవీయములోని విషయము.

దీనినిబట్టి ప్రారబ్ధకర్మఫలము ఎప్పుడయినను ఏవిధముననో అనుభవింపకతప్పనిదే అనియు, శాస్త్రీయపురుషకారబలముచేత దానిని కాలాంతరమునకు త్రోసివేయవచ్చుననియు, ఇట్లు శాస్త్రోక్తవిధులకును పురుషకారమునకును సార్థక్యము సిద్ధించుచున్నదనియు స్పష్టమయినది.

—• ప్రారబ్ధరూపమైన జాతకఫలము వివాహాదిసుముహూర్త బలమున మార్పు జెందునా? అనుప్రశ్నకుసమాధానము •— 'వివాహబృందావన' వ్యాఖ్యానములో నిట్లున్నది—

దైవ మనబడు ప్రారబ్ధకర్మయొక్క ఫలము అవశ్యంభావియైన అశుభఫలమై యన్నపుడు శుభగ్రహనక్షత్రాదులు శుభఫల మిచ్చుననుట యెట్లు సరిపడును? అని శంకింతువా ? వినుము—

ఆ దైవమయినను దేశ-కాల- వశముననే ఫల మిచ్చును. దుష్టసహాయముతోడనే దుష్టుడు దుఃఖకారి యగుచుండును. కనుకనే రంధ్రాన్వేషణము చేయుచుండును. అట్లే పురాకృతదుష్కర్మకూడ కాలదోషసహాయము జూచుకొని ఫలించుచుండును గనుక వివాహాది సుముహూర్తప్రాప్తిరూపమైన పురుషప్రయత్నముచేత ఆ దుష్కర్మ ఫలమును నివర్తింపజేయవలయును.

"సర్పవహ్నివిషకంటకాదికం యేన దైవశరణోపి మానవః ।
దూరత స్త్యజతి పౌరుషం సదా తేన నః స్ఫురతి దైవతోఽధికమ్॥
పౌరుషేణ హ్యదయేప్సితాం గతిం ప్రాప్నువన్తి పురుషా స్సుమేధసః॥

మానవులు దుఃఖకరములైన సర్ప- విష- కంటకాదులను తమ పురుషప్రయత్నముచేత దూరముగా తొలగించుచునే యున్నారు. కాబట్టి పురుషప్రయత్నము చాల ముఖ్యము. బుద్ధిమంతు లభీష్టసిద్ధిని పురుషప్రయత్నముచేతనే పొందుచున్నారు. కనుకనే నారదవచనము—

"సర్వాశ్రమాణా మాధేయం గృహస్థాశ్రమ ముత్తమమ్ ।
యత స్తదపి యోషాయాం శీలవత్యాం స్థితం తతః ॥
తస్యా స్సచ్ఛీలలబ్ధి స్తు స లగ్నవశతః ఖలు ।
పితామహోక్తాం సంవీక్ష్య లగ్నశుద్ధిం ప్రచక్ష్మహే ॥

సర్వాశ్రమములలో గృహస్థాశ్రమ ముత్తమ మనియు, ఆ గృహస్థాశ్రమము శీలవతియైన స్త్రీని ఆధారపడియున్నదనియు, ఆమె కాసౌశీల్యము శుభలగ్నము నాధారపడియున్నదనియు, కనుక లగ్నశుద్ధి చెప్పబడుచున్నదనియు తెలుపుచున్నది. కనుక గోచారాదులచేత తెలియబడు అశుభదైవఫలమును శుభప్రయత్నముచేత నివర్తింపజేయుచుండవలెను. ఈ విషయ మిట్లు చెప్పబడినది—

"తన్నిరూప్య శకునేన దుఃఖదం వంచయన్తి నియతం సముద్యతమ్।
పౌరుషేణ పురుషా స్సుమేధస స్సంశ్రయన్తి పున రాత్మనో హితమ్ ॥" అని.

అయితే యెవ్వని కేది ప్రాప్తవ్యమో అది ప్రాప్తించిතීరును. దానిని పరిహరించుట యెవ్వనికిని శక్యము కాదు. అనుచు—

"యేన తు యత్ప్రాప్తవ్యం తస్య విధానం సురేశసచివోపి ।
య స్సాతాన్నియతిజ్ఞ స్సోపి న శక్తోఽన్యథాకర్తుమ్ ॥

అనియు, దైవాయత్తమై ప్రాప్తించుఫలము జన్మలగ్నమును బట్టి ప్రశ్నలగ్నమునుబట్టి వివాహాదిలగ్నమునుబట్టి యెట్టి ఫలమై యుండునో తెలిసికొనుటకై లగ్నఫలములు చెప్పబడుచున్నవి. అనుచు-

"తద్విఘ్నోపాయం లగ్నవిధానేన సంప్రవక్ష్యామి ।
జన్మ న్యథవా ప్రశ్నే తత్సదృశఫలం వివాహేపి ॥"

అనియు, అల్పపుణ్యులకు ఆయా వివాహాదిశుభకార్యములు శుభలగ్నమందు సంభవింపవు. అనుచు—

"వరణప్రదాన పరిణయ శచీప్రపూజాఽభిషేకకరణాని ।
సుశుభే తిథౌ చ లగ్నే న భవన్తి కిలాఽల్పపుణ్యానామ్ ॥"

అనియు చెప్పు శౌనకవాక్యములకు తాత్పర్య మేమందురా ? వినుడు—

దైవమనునది దృఢకర్మరూపము, అదృఢకర్మరూపము అని ద్వివిధము. అందు దృఢకర్మరూపమైనది గ్రహశాంత్యాదిరూపపురుష ప్రయత్నముచేగూడ దృఢమూలమైయున్నందున ప్రచండవాయ్వాఘాతముచేగూడ పెకలింపబడని వృక్షమువలె నపరిహార్యమే యగును.

అదృఢకర్మరూపమైనది శిథిలమూలమైన వృక్షమువలె పురుష ప్రయత్ననివార్య మగును. ప్రయత్నము లేనప్పుడు అదియును ఫల మిచ్చుచుండును.

చికిత్సాశాస్త్రమందు "పూర్వజన్మకృతం పాపం వ్యాధిరూపేణ బాధతే" అని సామాన్యముగా సర్వవ్యాధులును కర్మజన్యములే అయియున్నను సాధ్యములు, అసాధ్యములు అని వ్యాధులు ద్వివిధము లని చెప్పబడినది.

కష్టసాధ్యము, సుఖసాధ్యము అని ద్వివిధమైయున్న సాధ్యము కూడ అసాధ్యముగా పరిణమించునని- "సాధ్యోఽసాధ్యత్వ మాయాతి సాధ్య శ్చాక్రియ తాం తథా । ఘ్నన్తి ప్రాణా నసాధ్యాస్తు నరాణా మక్రియావతామ్" అని సాధ్యవ్యాధియే ఉపేక్షించిన అసాధ్యమై ప్రాణహానిని చేయు నని చెప్పబడినది.

దీనినిబట్టి అసాధ్యవ్యాధులు దృఢకర్మమూలకములు, సాధ్య వ్యాధులు అదృఢకర్మమూలకములు అని స్పష్టము.

ఇట్లు దైవ మనబడు ప్రారబ్ధమునకు ద్వైవిధ్య మున్నందున ఏది దృఢకర్మమూలమున ప్రాప్తవ్యమో అది ప్రాప్తించితీరును;

ఎంతటివానికిని అది పరిహరింప శక్యము కాదని, అదృఢకర్మమూలకము పరిహరింప శక్యమే అని తాత్పర్యము.

ఎవ్వని వివాహాది కాలమునకు గురుచంద్రాదుల దోషము దృష్ట మగునో ఆతని దైవవిపాకము అశుభఫలప్రదమని గ్రహించవలెనని తాత్పర్యము.

కనుకనే—"ఏవం బుద్ధ్వా మతిమా న్స్వవిష్యఫల మాదిశే త్సము ద్వాహే" అని చెప్పబడినది.

కనుక ధర్మ మనబడు గ్రహశాంతిరూప పురుషప్రయత్నము చేత నట్టి దోషము నివారిత మగును. 'ధర్మేణ పాప మపనుదతి" అనికదా శ్రుతి.

శుభముహూర్తముచేత అశుభదైవఫలము నివర్తించును. శుభ దైవఫలము ప్రవృద్ధ మగును. శౌనకోక్తి యిట్లున్నది—

'సుపరీక్షితం విలగ్నం ధర్మార్థసుఖాయ భవతి దంపత్యోః। అపరీక్షితం విలగ్నం న హి దేయం పండితేన దైవవిదా। అయ శోఽంబునిధౌ మజ్జతి శాస్త్ర మవిజ్ఞాయ యో దద్యాత్॥' అని.

దీనిచేత ధర్మార్థసుఖ సిద్ధికై లగ్నపరీక్ష ముఖ్య మని స్పష్ట మయినది.

బృహస్పతికూడ శుభాశుభ భేదమున కాలము ద్వివిధమై యున్న దని నిర్దుష్టకాలమందు సుముహూర్తము నాశ్రయించినవారికి అది శుభప్రదమగు నని దుష్టకాలము హానికర మగునని చెప్పియుండెను.

కనుక శుభ కాల బలమున పూర్వకర్మమూలక మయిన అశు భము కూడ నివర్తించు నని సిద్ధాంతము.

ఇదంతయు వివాహబృందావనవ్యాఖ్యావిషయము. ముహూర్త చింతామణి' పీయూషధారావ్యాఖ్యలో నిట్లున్నది—

"నను జన్మకాలీనఖేచరావేదితశుభాశుభం దురతిక్రమ మితి వివాహలగ్నానర్థక్య మితి చేన్న,

జ్యౌతిష స్మృత్యావేదితదశుభసమయారబ్ధ విధి జన్య-అపూర్వ జనిత శుభఫలేన జన్మాన్తరీయ దురదృష్టధ్వంసో భవతీ త్యేవ మర్థతయా సార్థక్యాత్

అత ఏవాహ సత్యాచార్యః—
"శుభక్షణక్రియారంభజనితాఽపూర్వసంభవాః ।
సంపద స్సర్వలోకానాం జ్యోతి స్తత్ప్రయోజనమ్ ॥" ఇతి.

అనగా, జాతకప్రకారము ఫల మవశ్యంభావియైయుండ వివాహ శుభలగ్నమున, కేమి ప్రయోజనము ? అని శంకింపరాదు. జ్యోతిశ్శాస్త్రముచే తెలుపబడిన శుభముహూర్తమందు చేసిన విధానమువలన కలుగు పుణ్యఫలముచేత జన్మాంతరీయదురదృష్టము నివర్తించును గనుక సుముహూర్తము సార్థకమే అని భావము.

ఇట్లు దైవ పురుషకారస్వరూపము, కార్యసిద్ధికి దైవ- పురుషకార- ఉభయానుకూల్యము, దైవ పురుషకార బలాబలములు, కర్మసిద్ధాంతములో శాస్త్రీయ పురుషకార ప్రాముఖ్యము, జప- దాన- హోమాదుల సార్థక్యము, జాతక-ముహూర్తభాగముల సాఫల్యము ప్రమాణోపపత్తులతో నిరూపింపబడినవి.

దీనిచేత 'ప్రతిదానిని దైవము దైవమని దైవముతో ముడిపెట్టువారు ఛాందసులని. వారిది మూఢవిశ్వాసమని చెప్పువారి మాటలు, కేవల పురుషప్రయత్నముచేతనే కార్యసిద్ధి యనువారి మాటలు, జాతకభాగము నిష్ఫలమైన పక్షములో ముహూర్తభాగము నిష్ఫలము. ముహూర్తభాగము నిష్ఫలమైన పక్షములో జాతకభాగము నిష్ఫలము. ఇట్లు జాతకముహూర్తభాగము లొకదానిచే నొకటి ప్రతిహతము లగుచున్నవి' అను వారిమాటలు పరాస్తమయినవి.

నేటికిని ప్రజలలో సర్వసాధారణముగా గనబడుచున్న జాతకముహూర్త పరిశీలనము. దాన- హోమ- జపాది- విధానము, అని వార్ధ్యదుఃఖ- రోగములపట్ల ప్రారబ్ధమనియే సమాధానముపడుట, పురుషప్రయత్న మఖండముగా జేసి విఫలమనోరథుడై మన దురదృష్టమని సమాధానము చెప్పుకొనుట. నిర్వ్యాపారముగా గూర్చుండిన వానికి ఏనిధియో ప్రాప్తింప నది దైవాయత్తమని ఆత డదృష్టవంతుడని చెప్పుకొనుట మొదలగు విషయములన్నియు శాస్త్రసిద్ధాంత మూలకములె కాని, మూఢవిశ్వాసములు కావని బుద్ధిమంతులు

తెలిసికొని ప్రజాసామాన్యములో వైదికసిద్ధాంతము లెట్లు పాతు కొని యున్నవో వానిని పెకలింప నెట్టి ప్రయత్నములు జరుగు చున్నవో గ్రహింపవలయును.

—• కర్మ సిద్ధాంతములో ప్రాణికర్మ నపేక్షించి భగవంతుడు సృష్ట్యాదులను చేయుచున్న యెడల పరాపేక్షకల భగవం తుడు స్వతంత్రు డెట్లగును? అను ప్రశ్నకు సమాధానము—

భగవంతుడు స్వతంత్రుడని చెప్పుటే కాదు. దయానిధి యని కూడ చెప్పవలయును కదా! సృష్టి జూడగా పశు పక్షి నర వానర శునక సూకరాది రూపమున బహువిధమై బహుదుఃఖ వ్యాకులమై సుఖదుఃఖ ప్రభేదములతో నొప్పుచున్నది. స్వతంత్రుడై ఇట్టి సృష్టిని చేసినవాడు దయానిధి యెట్లగును ? స్వతంత్రుడు కాడం దుమా ? అత డీశ్వరు డెట్లగును ? ఇక ప్రాణికర్మనిమిత్తమున నట్లు సృష్టింపవలసియుండి సృష్టించిన భగవంతుడు దయానిధి యగుట కభ్యం తర మేమందుమా ? అట్లయిన ప్రాణికర్మసాపేక్షకుడైన భగవం తునకు స్వాతంత్ర్యము లేకపోవుచున్నది. కనుక నిది యెట్లు సరి పడును ? అనునది ప్రశ్న.

దీనికి వేదాంత దర్శనములో సమాధాన మిట్లున్నది—

“న చ సహాయాపేక్షస్య కర్తుః కర్తృత్వం నివర్తతే । భవతి హ్యేధో దకాద్యపేక్షస్యాపి పక్తుః పక్తృత్వమ్ ॥” (సూత్రభాష్యమ్)

“స్వాతన్త్ర్యం నామ న స్వాన్యానపేక్షత్వమ్। ఈశ్వరస్యాపి ప్రాణికర్మాపేక్షత్వేనాఽస్వాతన్త్ర్యప్రసంగాత్ । కిన్తు, స్వేతర కారక ప్రయోక్తృత్వే సతి కారకాఽప్రేర్యత్వం స్వాతన్త్ర్యమ్॥” (రత్నప్రభా.)

అనగా “స్వతన్త్రః కర్తా” అను నిర్వచనమును బట్టి స్వాతం త్ర్యమే కర్తృత్వము. అట్టి కర్తృత్వము సహాయాపేక్షను బట్టి పోదు. ఉదక- కాష్ఠాది సహాయాపేక్షకల పాకకర్తకు కర్తృత్వము పోవు చున్నదా ? కనుక కర్తృత్వమనబడు స్వాతంత్ర్యము అన్యానపేక్ష త్వమే యని చెప్పరాదు.

మఱేమి నెప్పవలెననగా— సాధనములచే తాను ప్రవర్తింప జేయబడకుండి తానే యితరసాధనములను ప్రవర్తింప జేయుట స్వాతంత్ర్య మని చెప్పఁబడెను. ఇప్పుడు ప్రాణికర్మ నపేక్షించి సృష్టించు భగవంతుడు, జడమైన ప్రాణికర్మను సుఖదుఃఖరూపమున ప్రవర్తింపజేయువాడును, ఆప్రాణికర్మచే తాను ప్రవర్తింపజేయ బడని వాడును అయి యున్నందున స్వతంత్రుడే. ప్రాణికర్మాను గుణముగా సృష్టించువాడే, దయానిధియే. కనుకనే- "పుణ్యః పుణ్యేన కర్మణా భవతి। పాపః పాపేన" అని శ్రుతి యుద్ఘోషించుచున్నది.

"ఏష హ్యేవ సాధు కర్మ కారయతి। ఏషహ్యేవాఽసాధుకర్మ కారయతి" అనుటనుబట్టి మంచిపనిగాని చెడ్డపనిగాని యీశ్వర ప్రేరితుడై చేయు మనుజునియందు తప్పేమున్నది? అని శంకింపరాదు. అశుభాశుభ కర్మఫలము ననుభవించుచున్నవాడు మనుజుడే అగుటచే కర్తృత్వము మనుజునిదే అయి యున్నది. కర్తయైయున్న మనుజునకు కారయిత యీశ్వరుడగును. "కర్తా శాస్త్రార్థవత్త్వాత్" ఇత్యాది బ్రహ్మసూత్రములు జీవుని కర్తృత్వమును నిరూపించుచున్నవి. గోమయచూర్ణము ఇకురసాది సంబంధముచే తత్తద్రస యుక్తమగునట్లు జీవాంతఃకరణము ఈశ్వరానుగ్రహముచే ధర్మానుగతము, కామాదికముచే నధర్మానుగతము నగుచుండును. కనుకనే భగవద్గీతలో

"ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి।
భ్రామయన్ సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా॥
తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత।
తత్ప్రసాదా త్పరాం శాన్తిం మత్సంస్థా మధిగచ్ఛసి॥

అనుచు సర్వభూతాన్తర్యామిని ప్రశంసించి తదనుగ్రహ ఫలము శాంత్యాదిక మని బోధింపబడినది.

"అథ కేన ప్రయుక్తోఽయం పాపం చరతి పూరుషః।
అనిచ్ఛన్నపి వార్ష్ణేయ బలాదివ నియోజితః॥"

అను ప్రశ్నకు సమాధానము— "కామ ఏష క్రోధ ఏషః ఇత్యాది వాక్యములచే కామక్రోధలోభములే పురుషుని పాపమందు

ప్రవర్తింపజేయుచున్నవని చెప్పబడినది. ఈశ్వరుడు ప్రవర్తింపజేయు చున్నాడని చెప్పబడలేదు.

దీనిని బట్టి పాపము జేయుట మనుజుని తప్పే. కారయిత యీశ్వరుడను మాటకు, సాత్త్విక, రాజస, తామస, రూపములైన సర్వప్రవృత్తులు నీశ్వరాయత్తములనియు, నీశ్వరుడు సాధారణ కారణమై యుండెననియు, మధురమైయున్న జలము, చెరకు, చింత, నిమ్మ, మొదలగు చెట్లకు సాధారణ కారణమైయున్నను వానివాని యౌపాధిక భేదమునుబట్టి ఆ మాధుర్యమొకచోట నభివ్యక్తము, నొక చోట నభిభూతము నగుచున్నను ఆ వైషమ్యము జలకృతము కానట్లు ఆయా జీవుల అంతఃకరణభేదములకు చెందిన వారివారి ప్రవృత్తుల లోని వైషమ్యము ఈశ్వరకృతము కాదని, జలమువలె సాధారణ కారణమగుటే దానికి హేతువని తాత్పర్యము దెలిసికొనవలెను.
(మహాభారత—నీలకంఠీయము.)

ఇచ్చట ప్రాణికర్మచేతనే సుఖదుఃఖాదివైచిత్ర్యము సిద్ధించు నపుడు ఈశ్వరునితో నేమిపని ? అనుమాట, బీజములచేతనే అంకుర విశేషములు సిద్ధించుచుండ వర్షముతో నేమిపని ? అను మాటవంటిది. ఆయా సస్యములకు విశేషహేతువు లాయా బీజములు. సాధారణ హేతువు వర్షము. విశేషహేతువులు సాధారణహేతువు నపేక్షింపక కార్యకారులు కానేరవు.

అట్లే పుణ్యాపుణ్యరూప ప్రాణి కర్మ విశేషహేతువు. ఈశ్వ రుడు సాధారణహేతువు. విశేషహేతువునకు సాధారణహేతు వవస రమే కనుక నీశ్వరునితో పనియున్నదని తెలిసికొనవలయును.

బౌద్ధులలోని వైభాషికులు, ఈశ్వరుని నిరాకరించుచు ఇట్లనిరి- ఈశ్వరుడు స్వతంత్రుడే అయినయెడల బ్రహ్మహత్య చేసినవానికి స్వర్గమును, యజ్ఞము చేసినవానికి నరకమును ఇవ్వవలయును.

కర్మానుగుణముగా ఫల మిచ్చునందురా ? అట్లు ఫలమందరును ఇచ్చువారే కనుక జనులందరును ఈశ్వరులే అగుదురు. ఇచ్చుటలో స్వాతంత్ర్యము లేనివాడు ఈశ్వరు డెట్లగును ? అని. ఈవిషయ మీ శ్లోకములలో నున్నది—

"వరప్రదానే శక్తశ్చే ద్బ్రహ్మహత్యాదికారిణే ।
స్వర్గం దద్యా త్స్వతన్త్రి స్స్యా న్నరకం సోమయాజినే ॥
కర్మానుగుణదాతాచే దీశ స్స్యా దఖిలో జనః ।
దానే స్వాతంత్ర్యహీన స్సన్ సర్వేశః కథ ముచ్యతే ॥"
(సర్వసిద్ధాంత సంగ్రహః)

ఈ మాటలు, ప్రాణికర్మను బట్టియే జీవులకు ఫలమిచ్చునట్టి యీశ్వరుడు అస్వతంత్రుడగును కాని స్వతంత్రుడు కానేరడు. అను ఊహాపై బయలుదేరినవి. 'స్వతన్త్రఃకర్తా" అని స్వతంత్రునకే కర్త యనిపేరు. ఇట్టి స్థితిలో పాకకర్త, స్వతంత్రుడు కావలెను కదా, ఆతనికి జలకాష్ఠాదుల సహాయము మపేక్షితము. సహాయాపేక్షకలవాడు అస్వతంత్రుడే అయినచో అన్యసహాయముతో పాకము చేయువానిని పాకకర్త యనుటకు వీలులేకపోవును. కనుక వెనుక చెప్పినట్లు సహాయాపేక్షను బట్టి స్వాతంత్ర్యము లోపించపదని చెప్పవలెను. అందుచేత ప్రాణికర్మసహాయముతో ఫలమిచ్చు ఈశ్వరునకును స్వాతంత్ర్య భంగము లేదని గ్రహింపవలెను. మరియు, జీవులు కాని జీవకర్మలు కాని, ప్రకృతి కాని, పరమాణువులు కాని జీవులకు సుఖదుఃఖఫలము లిచ్చుటలో అసమర్థములు. జీవులు సమర్థులన్నచో, సుఖమునే కోరు జీవులు అప్రార్థితములై వచ్చు దుఃఖములను పోగొట్టుకొనలేకున్నారేమి ?

ఇక జీవకర్మలు కాని, ప్రకృతి కాని, పరమాణువులు కాని, కాలము కాని అచేతనము లగుటచే ఫల మర్పింపజాలవు. కనుక ఫలదాత పరమేశ్వరుడే. ఆతడు సర్వజ్ఞుడు. ఈవిషయ మీ శ్లోకములలో నున్నది—

"జీవా వా జీవకర్మాణి ప్రకృతిః పరమాణవః ।
నేశతే హ్యత్ర జీవానాం తత్తత్కర్మఫలార్పణే ॥
జీవాః కర్మఫలావాప్తౌ శక్తాశ్చే త్స్వసుఖే రతాః ।
అప్రార్థితాని దుఃఖాని వారయన్తు ప్రయత్నతః ॥

"అశక్తా న్యత్రి కర్మాణి జీవానాం స్వఫలార్పణే ।
అచేతనత్వా దగతేః స్వర్గాదిఫలభూమిషు ॥
నాచేతనత్వా త్ప్రికృతేః ఫలదాతృత్వసంభవః ।
అచేతనాః ఫలం దాతు మశక్తాః పరమాణవః ॥
కాలో వ్యచేతన స్తేషాం న హి కర్మఫలప్రిదః ।
అతోఽన్యః ఫలదో లోకే భవ త్యేభ్యో విలక్షణః ॥
సతు ప్రాణివిశేషాంశ్చ దేశా నపి తదాశ్రియాన్ ।
జానన్ సర్వజ్ఞ ఏవేష్టో నాస్యే బౌద్ధాదిసమ్మతాః ॥
(సర్వసిద్ధాంతసంగ్రిహము)

దీనిచేత "దేవుడు లేడు" అనుఆధునికనాస్తికత్వవాదియొక్క ఊహాగానము నిరస్తము.

— మానవుల వలన పూజల నీశ్వరు డపేక్షించునా ?
అపేక్షించిన వా డీశ్వరు డగునా ?
అపేక్షింపనియెడల పూజ లెందుకు ?
అను ప్రిశ్నకు సమాధానము.—

ఈవిషయము శ్రీమద్భాగవతములో నిట్లు చెప్పబడినది—

"నైవాత్మనః ప్రిభు రయం నిజలాభపూర్ణో
మానం జనా దవిదుషః కరుణో వృణీతే ।
యద్య జ్జనో భగవతే విదధీత మానం
త చ్చాత్మనే ప్రితిముఖస్య యథా ముఖశ్రీః । (స్క 7. అ 9.)

జగత్ప్రిభువైన యీశ్వరుడు సర్వపరిపూర్ణు డగుటచేతల్పులైన జనుల పూజలను స్వార్థమై యపేక్షించువాడు కాడు. తన్ను పూజించు వారియందలి దయచే వారి మేలుకొరకే వారి పూజ నపేక్షించుచుండును. తనకు వారు చేసిన పూజలో వారికి మేలెట్లనగా, ప్రధనాదికముచేత భగవంతునకు జేసిన యేపూజయైనను పూజించినవానికి జెందునట్టిదే. దర్పణములోని తన ముఖ ప్రితిబింబమునకు బింబమైన తన ముఖమందుబెట్టినఅలంకారమే చెందును. అట్లే ప్రితిబింబమైన జీవునికి బింబమైన భగవంతునియందు పూజారూపమున సమర్పించినదంతయు

చెందుచుండును. కనుక మానవులు చేయునట్టి యీశ్వరారాధనము మానవులమేలుకొఱకే, యీశ్వరునిమేలునకయి కాదు, అని భావము.

ఇప్పుడు పైప్రశ్నలలో—మానవపూజల నీశ్వరుడపేక్షించునా? అనుదానికి మానవులమేలుకే అపేక్షించు నని సమాధానము. అపేక్షించినవా డీశ్వరుడగునా? అనుదానికి స్వార్థ మపేక్షింపక పరార్థమే అపేక్షించినవా డగుటచే నీశ్వరు డగునని సమాధానము. అపేక్షింపని యెడల పూజ లెందుకు? అనుదానికి స్వార్థ మపేక్షింపకుండుటే కాని పరార్థ మపేక్షింపకుండుట లేనందున మానవశ్రేయస్సునకై యీశ్వర పూజలు ఆవశ్యకములే అని సమాధానము స్పష్టమైనది.

విగ్రహారాధనపై యాక్షేపములు ముందు నిరసింపబడును.

—గర్భవాసము మొదలు తన జీవితాంతము, అవశుడగు
మనుజునిఅసమర్థత, 'ఈశ స్సర్వత్రరక్షకః'అను సిద్ధాంతము—
మహాభారతము శాంతిపర్వతము— అ 331.

సంగత్యా జఠరే న్యస్తం రేతోబిన్దు మచేతనమ్।
కేన యత్నేన జీవన్తం గర్భం త్వ మిహ పశ్యసి ॥

దేహధారణ ః. త్యాశ్చర్యము— సాంగత్యముచేత స్త్రీగర్భగోళమున బ్రవేశించినట్టి చైతన్యరహితమైన రేతోబిందువు యేప్రయత్నముచేత గర్భమై దేహ- ఇంద్రియ- జీవ- విశిష్టమై యున్నదనుకొనుచున్నావు?

"అన్నపానాని జీర్యంతే యత్ర భక్ష్యాశ్చ భక్షితాః ।
తస్మిన్నేవోదరే గర్భః కిం నాన్నమివ జీర్యతే ॥

ఏజఠరమందలి అన్నపానములును, భక్షించిన భక్ష్యములును జీర్ణించి పోవుచున్నవో ఆజఠరమందే ఆగర్భము జీర్ణించిపోక సురక్షితముగా నెట్లున్నది ?

"గర్భే మూత్రపురీషాణాం స్వభావనియతా గతిః ।
ధారణే వా విసర్గే వా న కర్తా విద్యతేఽవశః ॥

గర్భమందలి మూత్రపురీషములగతి నియతమైనస్వభావము కలిగి యున్నది. దానికి వ్యతిరేకముగా వానిని విసర్జించుటలో గాని,

విసర్జింపకుండుటలోగాని, మనుజున కసమర్థతయే. అట్టి స్థితిలో గర్భమును ధారణజేయు సమర్థత యెక్కడిది ?

—ఆది పురాణము— భగవంతుని పోషణచాతుర్యము—

'అహో ! పోషణచాతుర్యం హారే రద్భుతకర్మణః ।
గర్భే నానా హ్యస్త్రినాడీ ప్రాప్తైనైవ రసేన భృత్ ॥
మాతు ర్జగ్ధాన్నపానోత్థై ర్బాల్యే స్తన్యైశ్చ పోషణమ్ ।
శక్తి ర్న చాలనేఽఙ్గానాం పార్శ్వస్యా పరివర్తనే ॥
దష్ట శ్శయ్యాస్థితైః కీటై ర్మలాక్త శ్శయిత స్సుఖమ్ ।
దివానిశం సమీపేఽస్య వర్తతే హితకృ ద్ధరిః ॥
ఇన్ద్రియాణాం పరావృత్త్యా నైవ జానాతి మూఢధీః ।
తం వినా పోషకః కోఽన్యో ధాతా పాలయితా ప్రభుః ॥' (అ7)

అహో! అద్భుతశక్తికల భగవంతుని పోషణచాతుర్యము ! గర్భస్థ శిశువునకును తల్లికిని సంధింపబడిన నాడీవిశేషముచేత తల్లి యన్నరసమునుబట్టియే గర్భస్థశిశువును పోషించుచుండెను.

"నాభ్యాం హ్యస్య నాడీ ప్రసక్తా, నాడ్యాం చాపరా అపరా చాస్య మాతుః ప్రసక్తా హృదయే మాతృహృదయం హ్యస్య తా మపరా మభిసంప్లవతే (వ్యాప్నోతి) సిరాభిస్స్యన్దమానాభిః।

స తస్య రసో బలవర్ణకర స్సంపద్యతే। స చ సర్వరసవానాహారః। స్త్రియా హ్యాపన్నగర్భాయా స్త్రిధా రసః ప్రతిపద్యతే సర్వశరీరపుష్టయే, స్తన్యాయ, గర్భవృద్ధయే చ। స తేనాహారేణోపష్టబ్ధో వర్తయ త్యన్తర్గతః।' (చరకసంహితా-శారీర. అ8)

గర్భస్థశిశువుయొక్క నాభియందొక నాడి యేర్పడును. ఆనాడియందు అపరనాడి యేర్పడును. ఆఅపరనాడి తల్లిహృదయముతో సంబంధించియుండును. తల్లి హృదయము అన్నరసమును స్రవించు సిరములతో ఆఅపరనాడిని వ్యాపించును. ఆయన్నరసమే గర్భమునకు బలకర మగుచుండును. గర్భవతి తీసికొనిన ఆహారముయొక్క రసము ఆమె శరీరపుష్టికి, స్తన్యమునకు గర్భవృద్ధికి నుపయోగించుచుండును—అనిచరకములో చెప్పబడినట్లు మాతృభుక్తాన్నరసముచేతనే చిత్రముగా

గర్భస్థుని బోషించుచుండెను జన్మించిన తరువాత స్తన్య మేర్పరచి మాతృస్తన్యమూలమున బోషించుచుండెను. శిశువు అవయవములను కదిల్చుటకుగాని, ఎత్తిగిలుటకుగాని, శక్తి లేకుండి శయ్యాగతములైన కీటములచే దష్టుడగుచుండి మలలిప్తదేహముతో శయనించియుండ హితకారి యగు భగవంతుడే దివానిశము లా శిశుసమీపవర్తియై రక్షించుచుండెను తన యింద్రియములు విషయ పరాధీనము లగుటచే మూఢుడై మనుజుడు తెలిసికొనజాలకున్నాడు గాని సర్వావస్థలయందును పోషకుడుగాని, పాలకుడుగాని భగవంతుడు కాక మరెవ్వరు?

వేదాంతపంచదశిలో నిట్లు చెప్పబడినది—

"ఏతస్మాత్కిమివేన్ద్రజాల మపరం యద్గర్భవాసస్థితం
రేత శ్చేతతి హస్తమస్తకపదప్రోద్భూతనానాఙ్కురమ్ ॥
పర్యాయేణ శిశుత్వయౌవనజరావేషై రనేకై ర్వృతమ్
పశ్య త్యత్తి శృణోతి జిఘ్రతి తథా గచ్ఛ త్యథాఽఽగచ్ఛతి ॥"

ఇంతకంటె నింద్రజాల మేమున్నది? గర్భగతమైన రేతస్సు చేతనమగుచున్నది. కర- చరణ- శిరో- గ్రీవాదిబహువిధావయవవిశిష్టమగుచున్నది. ఒకప్పుడు శిశుత్వము, ఒకప్పుడు యౌవనము, ఒకప్పుడు వార్ధకము అను అనేకవేషములను వహించుచున్నది; చూచుచున్నది; తినుచున్నది; వినుచున్నది; ఆఘ్రాణించుచున్నది; సంచరించుచున్నది. ఇంత యింద్రజాలము నడిపించు ఐంద్రజాలికు డీశ్వరుడు గాక మరెవ్వరు?

ఇంకొకటి, మనుజుడు నిద్రించే గాఢసుషుప్తిలో నున్నపుడు ఇంద్రియములు, మనస్సు, బుద్ధి వ్యాపారరహితములై లీనములై యుండును. ఆ నిద్రవదలినగాని మరల నింద్రియవ్యాపారము కలుగదు. ఇంద్రియవ్యాపారమునుబట్టియేకాని విషయజ్ఞానము జీవునకు గలుగదు. అట్టి స్థితిలో గాఢనిద్రలో నున్నవానిని లేపుటకై పిలుచుచుందురు. ఆపిలుపు, ఆజీవున కప్పుడు శ్రవణేంద్రియవ్యాపార ముండినగాని వినబడదు. నిద్రలో నట్టి శ్రవణేంద్రియవ్యాపార ముండదు. అది లేకుండియు పిలుపునుబట్టి యెట్లు లేవగలుగుచుండెను? అప్పు

డాజీవు డాశబ్దమును తన శ్రివణేంద్రియముతో గ్రిహించి కాదు. ఇంద్రియములు లీనమైయుండెను గనుక. ఇక నప్పు డాశబ్దమును విని జీవుని నిద్రినుండి మేల్కొలుపుచున్నది పరమాత్మయే యని తెలిసి కొనవలయును.

'పశ్య త్యచక్షు స్స శృణో త్యకర్ణః' అని యింద్రియ ద్వారా కాక స్వయముగా గ్రిహించు శక్తి పరమాత్మది కనుక నది యుపపన్న మగుచున్నది. ఈవిషయ మిట్లు చెప్పబడినది—

శ్రీమద్భాగవతము- స్క 12. అ6.

"యత్తల్లింగం భగవతో బ్రిహ్మణః పరమాత్మనః ।
శృణోతి య ఇమం స్ఫోటం సుప్తశ్రోత్రే చ శూన్యదృక్ ॥"

శ్రీధరీయమ్— కోఽసౌ పరమాత్మా, తమాహ- శృణోతీతి। ఇమం స్ఫోటమ్ అవ్యక్త మోంకారం । నను జీవ ఏవ తం శ్రుణోతు, నేత్యాహ- సుప్తశ్రోత్రే కర్ణపిధానాదినా అవృత్తికేపి శ్రోత్రే సతి । జీవస్తు కరణాధీనజ్ఞానత్వాన్న తదా శ్రోతా । తదుపలబ్ధిస్తు తస్య పరమాత్మద్వారికైవేతి భావః ।

ఈశ్వరస్తు నైవం, యత శ్శూన్యదృక్ । శూన్యేపీన్ద్రియవర్గే దృక్ జ్ఞానం యస్య । తథాహి—సుప్తో యదా శబ్దం శ్రుత్వా ప్రిబుధ్యతే న తదా జీవః శ్రోతా- లీనేన్ద్రియత్వాత్ । అతో య స్తదా శబ్దం శ్రుత్వా జీవం ప్రిబోధయతి స యథా పరమాత్మైవ తద్వత్ ।

దీనినిబట్టికూడ మనుజుని అసమర్థత, ఈశ్వరుని రక్షకత స్పష్టము. కనుకనే భగవద్గీతలో—

"సర్వస్య చాహం హృది సంనివిష్టో మత్త స్స్మృతి ర్జ్ఞాన మపోహనం చ ।" (అ15. శ్లో15)

అని చెప్పబడినది. ఇంకొకటి—

వైశ్వానరసంజ్ఞకల జఠరాగ్నిరూపమున ప్రాణుల దేహము నాశ్రియించియుండి ప్రాణాపానసంబంధమున ప్రాణులు తినెడి

యాహారమును నేనే జీర్ణింపచేయుచున్నా నని పరమాత్మ గీతలో నిట్లు చెప్పెను.—

"అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహ మాశ్రితః ।
ప్రాణాపానసమాయుక్తః పచా మ్యన్నం చతుర్విధమ్ ॥"

దీనిచేగూడ "ఈశ స్సర్వత్ర రక్షకః" అని స్పష్టమైనది. ఈశ్వరుని ఆరక్షకత్వము వారివారి ప్రారబ్ధకర్మానుగుణముగనే యుండునని తెలిసికొనవలెను.

—• మనుజుల ప్రారబ్ధఫలమును మార్చలేనట్టి యీశ్వరునిది యేమి యీ శ్వరత్వము ? అను ఆక్షేపము—
తత్సమాధానము—

ఆక్షేపము— అదృష్టమని దైవమని చెప్పబడు మనుజుల ప్రారబ్ధము త్రివిధమై యున్నదని చెప్పబడినది. ఇచ్ఛాపూర్వకముగా భోగప్రద మొకటి. అనిచ్ఛాపూర్వకముగా భోగప్రద మొకటి. పరేచ్ఛాపూర్వకముగా భోగప్రద మొకటి. అందు ఇచ్ఛాపూర్వకము విషయోపభోగము. అనిచ్ఛాపూర్వకము రోగాదికము. పరేచ్ఛాపూర్వకము కారాగారాదిబద్ధము.

ఈత్రివిధమైన ప్రారబ్ధము అవశ్యంభావి యనియు, కనుకనే నలయుధిష్ఠిరాదులు భగవదనుగ్రహపాత్రులును, ధార్మికమూర్ధన్యులును అయియుండియు రాజ్యభ్రంశ-వనవాసాది మహాక్లేశము లనుభవించినారనియు, ప్రారబ్ధఫల మవశ్యంభావి యగుటచే నది యీశ్వరునిచేతను నివారింపబడునది కాదనియు చెప్పబడినది. ఇది యీ శ్లోకములలో నున్నది—

"ఇచ్ఛాऽనిచ్ఛా పరేచ్ఛా చ ప్రారబ్ధం త్రివిధం స్మృతమ్ ।
న చాత్రైత ద్వారయితు మీశ్వరేణాపి శక్యతే॥
అవశ్యంభావి భావానాం ప్రతీకారో భవే ద్యది ।
తదా దుఃఖై ర్న లిప్యేరన్ నలరామయుధిష్ఠిరాః ॥" (పంచదశీ)

అని, ఇట్లు మహాభక్తుల దుఃఖమునే అది యవశ్యంభావి యని నివారింప లేకున్నట్టివానియందు ఏమి యీశ్వరత్వము ? అని.

సమాధానము— ప్రారబ్ధకర్మఫలమునకు ఆ యవశ్యంభావిత్వము ఈశ్వరనిర్మితమే అయియున్నది. ఈశ్వరకృతమైన అవ్యవస్థ, యీశ్వరునకును అనుసరణీయమే. ప్రభువులకు నిజమర్యాదాపరిపాలనము స్వభావము కదా.

కనుక మనుజుల ప్రారబ్ధకర్మకు తానే అవశ్యంభావిత్వము నేర్పరచి దానిని పాటించునట్టి యీశ్వరునియందు యీశ్వరత్వమునకు భంగ మేమియు లేదు. ఈవిషయ మిట్లు చెప్పబడినది—

"నచేశ్వరత్వ మీశస్య హీయతే తావతా యతః ।
అవశ్యంభావితా ప్యేషా మీశ్వరేణైవ నిర్మితా ॥" అని. (పంచదశి)

—దేవుడులేడను నాస్తికత్వవాదిమాటలు-
వానిపై సమాధానము.—

"సృష్టి భగవంతుని జ్ఞానాన్ని తెలియజేయుచున్న దని అంటారు.

1 చిత్రవర్ణము కల నెమలిపింఛాన్ని సృష్టిచిత్రమని భావించితే వర్షాకాలమున ఆపింఛమే తడిసి బరువెక్కి అంటుకొనిపోయి వాటికెంతో బాధను కలిగిస్తూందే. శత్రువులనుండితప్పించుకొనుట కష్టతరంగా నున్నదే, ఇట్టి పింఛాన్ని సృష్టించుటలో గల జ్ఞాన మెట్టిదో ?

2 మానవుని వెన్నుపూస చివరనున్న తోక ఎందుకు?

3 మానవసంఘం మధ్య మందమతులను ఏల సృష్టించాలి ? ఇట్లు పరిశీలించినచో తెలివితేటలకన్న తెలివితక్కువతనము ఎక్కువ కనబడగలదు.

4 దేవునకు సర్వజ్ఞతయు,సర్వశక్తియు కలిగినయెడల ఇంతకాలమైనతర్వాతగూడ నింకనూ మానవస్వభావంలోని పశుగుణాన్ని ఎందుకు తీసివేయలేదో?

5 గాలివానలు వచ్చి పంటలు తుడుచుకొనిపోవుటలో దేవుని ప్రేమ కనబడుచున్నదా ?

6 అతిప్రేమతో తలిదండ్రులు పెంచుకొనుచున్న పసిపాపలు హఠాత్తుగా చనిపోవుటచే విషాదము కలుగుచున్నదే. సృష్టి విధానములోని ప్రేమ, దయ, జ్ఞానము ఏమి కనబడుచున్నది?

7 దేవుడు ప్రేమ, దయ, జ్ఞానముల స్వరూపమేననీ, మానవుని కష్టాలకు కారణం మానవుని అజ్ఞానం, ఆతనికర్మ. అతడు దేవుని ఆజ్ఞలను పాటించకపోవుటే అని చెప్పుతారు. దేవునికి అతీతంగా కర్మ ఒకటి పని చేయుచున్నదా? సర్వజ్ఞుడును సర్వశక్తివంతము నయిన దేవుడు మానవునిలో అజ్ఞానాన్ని ఏల ఉంచాలి?

8 నాస్తికాభిప్రాయాలు కలిగి సంచరించువారి సందర్భంలో మానవుడె నెగ్గి దేవుడు ఓడిపోయినట్లు తేలుచున్నది.

9 సరిహద్దుభూములు గల యిరువురలో ఒకరికి వర్షం అవసరం అయిఉంటుంది. ఇంకొకరికి అనవసరమైఉంటుంది. ఇరువురు వారి కోర్కెలప్రకారం దేవుని ప్రార్థించిన దేవుడు ఎవరికోరికతీరుస్తుంది?

10 ఒక్క మతంలోనే శత్రువు లుండవచ్చు. ఎవరి జయం కొరకు వారు అదే దేవుని ప్రార్థిస్తారు. అప్పుడు ఎవరికి జయం కలుగుతుంది? ప్రార్థనే కారణమైనచో రెండవవానికి జయం ఎందుకు కలుగలేదు? ఒకరు ప్రార్థించి ఒకరు ప్రార్థించకపోరాడుటకు పోయిన ప్రార్థింపనివారికి జయం కలిగినట్లయిన అపుడు దేవునితో నిమిత్త మేముంది?

ఇట్లు పరిశీలింపగా ప్రపంచవిధానాన్ని నడిపించు దేవుడు కలదను భావం అబద్ధ మని స్పష్ట మగుచున్నది।

(నాస్తికత్వము— పు.68-72)

ఈ 10 అంశములను విచారింతము—

వీరు, 3 వ యంశములో చెప్పినట్లు మానవసంఘములో మందమతు లున్నారని, 4 వ యంశములో చెప్పినట్లు మానవస్వభావములో పశుగుణ మున్నదని, 7 వ యంశములో చెప్పినట్లు మానవునిలో అజ్ఞాన మున్నదని అంగీకరించినవారే.

ఆస్తికనాస్తికభేదము గల మానవులలో ఆ యజ్ఞానము సమానముగా మన్నను ఈశ్వరసత్తనుగూర్చి యజ్ఞానముకూడ నాస్తికులలో నుండుట విశేషము.

రెండవది పారంగీకరించిన పశుగణము. అది యేది ?

'ఆహారనిద్రాభయమైథునం చ సామాన్య మేత త్పశుభి ర్నరాణామ్'

అని చెప్పబడిన చతుష్టయమా ? లేక 'ధర్మో హి తేషా మధికో విశేషః। ధర్మేణ హీనః పశుభి స్సమానః॥' అని చెప్పబడిన శాస్త్రీయ ధర్మజ్ఞానరాహిత్యమా ? మొదటిది ఆస్తికనాస్తికసాధారణ మయినను రెండవశాస్త్రజ్ఞానరాహిత్యము నాస్తికులలో విశేషము. మనుజులకును పశువులకును గల భేదము శాస్త్రజ్ఞానాజ్ఞానమూలకమే. ఆహారాదులలో పశువులకు భోగమువలన తృప్తి. మానవులకు జ్ఞానమువలన తృప్తి. ఆ జ్ఞానము శాస్త్రాధీనము పశువులకు ప్రమాణముగా జ్ఞానేంద్రియపంచకమే కలదు. మానవులకదియు, ఆపైశాస్త్రమును ప్రమాణముగా నున్నవి. అట్టి శాస్త్ర ప్రమాణమును ధిక్కరించుట నాస్తికులలో విశేషము.

ఇంకొకటి— నియతమైన ఋతుకాలగమనమే పశుగుణము అనియతమైన సర్వకాలగమనము మానవునిదై యున్నది.

—• కాలజ్ఞానపూర్వకప్రవృత్తి మానవులలో లేనిది
జంతువులలో నున్నదనుటకు నిదర్శనము •—

గ్రహణకాలములో ఆహారము స్వీకరింపకుండుటకూడ పశుగుణమై యున్నది. దీనికి ప్రత్యక్షనిదర్శనము—

గ్రహణకాల పరిశీలనములు— 22-6-55, ఆంధ్రపత్రిక.

"సింహాలు మాంసం ముట్టుకోలేదనుట-జయపూర్ జ్యూలో సింహాలు, పులులు, ఉదయం వాటికి వేసే 10 పౌనుల పచ్చిమాంసం పై పొంచిపడేవి. నేడు ఫుదయం గ్రహణసమయంలో మాంసం ముందున్నప్పటికీ తమ కేమీ సంబంధం లేనట్టు వూరుకున్నాయి. గ్రహణం ప్రారంభంలో ఇవి తమ ముందున్న మాంసం మూచూచా యని తర్వాత వదలిపెట్టా యని కావలావారు తెలిపారు" (20-6-55, గం॥ 7-16. సూర్యగ్రహణము.)

శునకములలో ఆహారవిసర్జనమునుగూర్చి యిట్లున్నది—

"శ్వనిశమ్. శ్వనిశా" అను శబ్దములకు కృష్ణచతుర్దశి యని యర్థము చెప్పబడినది. ఆనాడు కొన్ని శునకములు ఉపవసించుచుం డుటచే నాపేరు వచ్చిన దని వ్యాకరణశాస్త్రములో నున్నది—తత్త్వ బోధినీ— 'శ్వనిశ మితి కృష్ణచతుర్దశీ- తస్యాం కిల కేచిత్ శ్వాన ఉపవసన్తి। ఏతచ్చ శాబరభాష్యే తిర్యగధికరణే స్పష్టమ్। బాలమనో రమా- శ్వనిశమితి। శునో నిశేతి విగ్రహః। కృష్ణచతుర్దశీత్యాహుః "శున శ్చతుర్దశ్యా ముపవసతః పశ్యామః" ఇతి తిర్యగధికరణే శాబర భాష్యే స్థితమ్।"

ఇట్లు చూడగా జంతువులలోగూడ కాలజ్ఞానము ఆహారవిసర్జన వివేకము స్పష్టము. ఇది శ్లాఘ్యమే కద. ఇది పశుగుణమని మనుజు నకు త్యాజ్య మగునా?

ఇది ఋతుకాలము కాదు. ఇప్పుడు గమనము తగదు. ఇది గ్రహణకాలము. ఇప్పుడు ఆహారస్వీకారము తగదు. అని జంతువులకు జ్ఞాన మున్నది. ఆ జ్ఞానము మానవునకు లేదు. మానవజ్ఞానములో ఘనత యేమున్నట్లు? నాస్తికత్వవాదులు 'జంతువులవలెనే మానవు నికికూడా ఆహారవిహారాదులు అవసరమైయున్నవి. కాని జంతువుల్లో అంతగా కానరానిప్రత్యేక గుణ మొకటి మానవుల్లో కలదు. ఇది ఆతని ఊహాశక్తి" (పు3-4) అనుచున్నారు. వీరు చెప్పిన ఊహాశక్తికి బుద్ధివిశేషమని పేరు. ఆబుద్ధి రజస్తమస్సులతో గూడియుండి చెడ్డ ఊహాలను పుట్టించును. అది యటులుండనిండు. బుద్ధి ప్రమాణము లనబడు ఇంద్రియములను పురస్కరించుకొనకుండ దేనినీ గ్రహింప లేకున్నది. అంధునిబుద్ధి వస్తుస్వరూపమును, బధిరునిబుద్ధి శబ్దములను గ్రహింపలేకున్నది. అందుచే మానవునిబుద్ధి ప్రమాణసాపేక్షము.

ఆ ప్రమాణములైన యింద్రియములలో నొక విశేషము-చూత ఫలములో రంగున్నది. రస మున్నది. చక్షురింద్రియము రంగునే గ్రహించుచు అక్కడ నున్న రసమును గ్రహింపలేకున్నది. అంధుని రసనేంద్రియము రసమునే గ్రహించుచు అక్కడ నున్న రంగును

గ్రహింపలేకున్నది. దానికి కారణము— చక్షురింద్రియమునకు రస గ్రహణశక్తి, రసనేంద్రియమునకు రూపగ్రహణశక్తి లేకుండుటే కనుక సర్వపదార్థగ్రహణశక్తి యేయింద్రియమునకు లేదు. అతీంద్రియపదార్థములను అవి గ్రహింపలేవని చెప్పనక్కరలేదు. ఇంద్రియములకు శక్యముకాని అతీంద్రియపదార్థములను, దేశ-కాల- వ్యవహిత పదార్థములను గ్రహింపజేయగల ప్రమాణము శాస్త్ర మొక్కటే. అట్టి శాస్త్రప్రమాణమును పురస్కరించుకొనని మానవబుద్ధి సూక్ష్మ విషయముల నేమి గ్రహించును ?

చారిత్రకుని బుద్ధి శిల్పమును గ్రహింపగలుగునా ? శిల్పిబుద్ధి చికిత్సావిధానమును గ్రహింపగలుగునా ? చికిత్సకుని బుద్ధి శిల్పాదులను గ్రహింపగలుగునా ? ఆయాశాస్త్రముల పఠనశ్రవణములు లేకుండ బుద్ధి, ఆయావిషయములను ఏమియు గ్రహింపజాల దని జగద్విదితము.

దీనినిబట్టి నాస్తికత్వవాదు లనిన ఊహాశక్తి, అనగా బుద్ధివిశేషము శాస్త్రధిక్కారులైన మానవులలో అసంభవము కనుక— "జంతువుల్లో కానరాని ప్రత్యేకగుణము మానవుల్లో ఊహాశక్తి" అనుమాట శాస్త్రజ్ఞానులలోనే చెల్లునుగాని శాస్త్రజ్ఞానశూన్యులలో చెల్లనేరదు.

ఏదో ఊహాశక్తి శాస్త్రజ్ఞానము లేని జంతువులలోమాత్రము లేదా ? కఱ్ఱయెత్తి తన మీదకు వచ్చుచున్న మనుజునిచూచి యీతడు నన్నుకొట్టుటకు వచ్చుచున్నాడని యూహించి పశువులు పారిపోవుట లేదా ? పచ్చగడ్డి చేతబట్టుకొని తమయొద్దకు వచ్చువానిని చూచి పెట్టుటకువచ్చుచున్నా డని యూహించి యాతని దగ్గరకు వచ్చుచుండుటలేదా ? ఇట్టి యూహాలు పశువులకు మనుజులకు సమానమే. ఆహారవిహారములలో ఋతుకాల- గ్రహణకాలములకు చెందిన ఊహాశక్తి మానవులలో లేక పశువులలోనే యున్నది. అందుచేత ఊహాశక్తినిబట్టి మానవులకు ఆధిక్యము కాదు. విధినిషేధాత్మక శాస్త్రజ్ఞానమునుబట్టియే ఆధిక్యము. అపోహాలనుపోగొట్టునది శాస్త్రజ్ఞానమే. చీకటిలో నున్న వస్తువులను ప్రకాశింపజేయునది దీపమైనట్లు అజ్ఞాన

ములో నున్న విషయములను ప్రకాశింపజేయునది శాస్త్రము. దానిని ధిక్కరించుట నాస్తికులలో విశేషము.

కేవలము బుద్ధికి తోచినట్లే ప్రవర్తించుట వానరలక్షణము కాని, మానవలక్షణము కాదు. శాస్త్రానుగతమైన బుద్ధితో ప్రవర్తించుటే మానవలక్షణము. మానవునకు శాస్త్రవిశ్వాసము లేకుండుట సుగుణము కాదు. దుర్గుణము. అన్నమందు కలుగు అరుచి యను దుర్గుణము శారీరరోగసూచకమైనట్లు శాస్త్రమందు మానవునకు కలుగు అవిశ్వాస మను దుర్గుణము రజస్తమోవృద్ధిమూలకమానసికరోగసూచక మని శాస్త్రసిద్ధాంతము కనుక శాస్త్రదృష్టి లేనట్టి మానవులు "ధర్మేణ హీనాః పశుభి స్సమానాః" అను మాటకు లక్ష్యమే అగుదురు. దీని నింతటను జూచి వెనుకజూపిన 10 అంశములను పరిశీలింతము——

1 చిత్రములను చిత్రింపగలుగు సృష్టించు భగవంతుని జ్ఞానమును తెలుపుచున్న దన్నచో అది పర్వమునకు తిండి బరువెక్కి అంటుకొని బాధకమై శత్రువశము కాపించుచున్నందున భగవంతుని దేమి జ్ఞానము? అట.

భగవంతునిగూర్చి పలుకగల అజ్ఞానము భగవంతుడు దున్నదనుట అజ్ఞానమని, భగవంతుని విజ్ఞానమని భావింపబడుచున్నది అజ్ఞానమే కాదిది విపరీతజ్ఞానము. సృష్టించు భగవంతుడు లేడను వీరు ఆ పింఛవైచిత్ర్యమునుగూర్చి యేమి చెప్పుదురు? వీరు చార్వాకమతావలంబులు కనుక వెనుక చార్వాకమతసిద్ధాంతములలో చూపబడియున్నట్లు ఆ పింఛవైచిత్ర్యము స్వాభావిక మని యందురు కాబోలు. అప్పు డది దేని స్వభావము!

"భౌతికపదార్థాలచే ఏర్పడినదేహాలు" (పు 191) అని వీర్నన్నట్లు పాంచభౌతికమైనవి దేహములు కనుక నెమలిదేహమందున్న వైచిత్ర్యము ఏయొకభూతముయొక్క స్వభావ మన్నను పంచభూతసముదాయ స్వభావమన్నను అతివ్యాప్తి తప్పదు. నెమలియందే ఆవైచిత్ర్యము, కోకిలధ్వనియందే ఆ మాధుర్యము, నర- వానర- పశు- పక్షి- కృమి- కీటాది స్వరూపములలోని ఆ వైలక్షణ్యము, సుఖదుఃఖ

ములలోని ఆ తారతమ్యము ఇట్టి అసాధారణలక్షణములకు వ్యవస్థను స్వభావవాదులు ఏపదార్థస్వభావ మని చెప్పి చేయ గలరు? స్వభావవాదులు స్వభావ మను మాటను కార్యకారణభావ బంధమునుండి తప్పించుకొనుటకు పడికట్టురాయిగా వాడుచుందురా? అప్పుడు నెమలి శత్రువశమగుటకు పింఛము కారణ మగుచున్న దను మీ మాటను శత్రువశమగుట దానికి స్వభావమని పింఛము కారణము కాదని ఎదుటివా రనలేరా? ఆ పింఛము లేని శత్రువశ మెందు కగుచున్నవి? నాస్తికత్వవాది సృష్టివైచిత్ర్యవ్యవస్థకై దాని కది స్వభావము, దీనికిది స్వభావము అనుచు స్వభావమును వర్ణించుచుండునో ఆ స్వభావము దానికే యుండుటేమి? అని శంకించి ఆయా స్వభావవ్యవస్థ యీశ్వరకృతమే యని ఈశ్వరసృష్టివాది యుద్ఘోషించును. కాబట్టి సృష్టివైచిత్ర్యము భగవంతుని జ్ఞానమును తెలుపుచున్న దనుట సత్యము. ఇట్లు ప్రథమాంశము నిరస్తము.

2. 3. 'మానవుని వెన్నుపూస చివర నున్న తోక యెందుకు మానవసంఘం మధ్య మందమతులను ఏల సృష్టించాలి? పరిశీలించినచో మా పరిశీలనాటుల కన్న సృష్టికర్తకు తెలివితక్కువతనమే కనబడ గలదు' అట.

మాకే సర్వము తెలియు నని యహంకరించువారికిగూడ తెలియని వున్నవని యనిపింపవలె నని యాతోక నుంచెనేమో? మందమతులను సృష్టించిన సృష్టికర్త ఎందుకో తెలియకుండునట్టి యాతోకను బట్టి మనము మందమతుల మనుకొనవలె నని యాతోక నుంచెనేమో. దాని ప్రయోజన మేమో తానే చెప్పలేని నిరీశ్వరవాది ఈశ్వరసృష్టివాదుల నేమని యాక్షేపించును? వీరికి నిరర్థకసృష్టి జేసిన సృష్టికర్తయందు తెలివితక్కువతనమే ఎక్కువ కనబడుచున్నదట! ఈ మాటను బట్టి యొక శ్లోకార్థము స్ఫురణమునకు వచ్చుచున్నది—

రాయని మారభూపాలుడు సృష్టికర్తనుగూర్చి వీరివలెనే దీనిని సృష్టించుటెందులకు? దానిని సృష్టించుటెందులకు? అని తన పండితునియొద్ద నాక్షేపింప నాపండితుడు "రాజా! నీవన్నవి సృష్టించుటే

కాదు. వానితోబాటు నిన్ను నన్ను గూడ సృష్టించుటనుబట్టి సృష్టికర్తకు పేరులేకుండబోయిన' దన్నట్లు ఈ శ్లోకము జెప్పెను—

'అజాగళస్థస్తన ముష్ట్రిపృష్ఠం నాసాంతరే కేశ మథాండయుగ్మం।
త్వాం మాం సృజన్ రాయనిమారభూప పూజాం న లేభే భువి పద్మయోనిః ॥'

దీనినిబట్టి తెలివితక్కువవారికి ఈశ్వరుడు తెలివితక్కువ వాడనిపించుచుండును. అందుచే ద్వితీయతృతీయాంశములు నిరస్తములు.

4 దేవునకు సర్వజ్ఞతయు, సర్వశక్తియు కలిగినయెడల ఇంతకాలమైనతర్వాతగూడ నింకను మానవస్వభావంలోని పశుగుణాన్ని ఎందుకు తీసివేయలేదు ? అట.

మానవులలో పశుగుణము కొంతకాల ముండుట కంగీకరించి 'ఇంతకాలమైనతరువాత నింకను దాని నెందుకు తీసివేయలేదు ?' సర్వజ్ఞతాసర్వశక్తులు దేవునకులేవు. అని యాక్షేపించుచున్నారు.

ఇంకను తీసివేయలేదేమని యేపశుగుణమునుగూర్చి ప్రశ్నయో ఆ పశుగుణము వారియందింకను నుండవలసినదే యని భావించి తీసివేయకపోవచ్చునని యీశ్వరసృష్టివాదులు చెప్పుదురు. ఈశ్వరునితో బనిలేదనువారు పశుగుణము నేల తీసివేయలేకపోవుచున్నారు ? వీరన్న పశుగుణము కొందరియందే యున్నది అది యక్కడనే యుండునట్లు యితరులలో లేకుండునట్లు సృష్టించుట. దేవుని సర్వజ్ఞతాసర్వశక్తులను స్పష్టీకరించుచున్నది. కాబట్టి యీ చతుర్థాంశము నిరస్తము.

5 6. గాలివానలు వచ్చి పంటలు తుడుచుకొని పోవుటలోను, అతిప్రేమతో పెంచుకొను పసిపాపలు హఠాత్తుగా చనిపోవుటలోను భగవంతుని ప్రేమ, దయ, జ్ఞానము ఏమి కనబడుచున్నది ? అట!

భగవంతుడు వీరికి లేడుకద. వీరే అతిప్రేమమూర్తులు. అతిజ్ఞానవంతులుకద. వీరియెదుట పంటలు తుడుచుకొనిపోవుట, పిల్లలు చనిపోవుట జరుగుచుండ మేమే తగుదుమని చెప్పుచు అట్టికష్టములు రాకుండ జేయనట్టి ఇట్టివారికి జ్ఞానముకాని ప్రేమకాని యేమైన నున్నదా ? అని ఈశ్వరసృష్టివాదు లడుగుదురు.

ఆగాలివానలు ఎప్పుడు ఎక్కడ రావలయునో ఆపసిపాపలు ఎప్పుడు ఎక్కడ చనిపోవవలయునో ఆజ్ఞానము భగవంతునికే ఉన్నది. గర్భస్థశిశువుయొక్క పోషణము, గర్భమందు శిశువుయొక్క ఉనికి, ప్రసవసమయమునకు అధోముఖపరివర్తనము, గర్భమునుండి శిశునిర్గమనము, శుక్రశోణితములనుండి క్రమక్రమముగా శిరస్సు, హస్తములు, పాదములు, నేత్రములు, శ్రోత్రములు, ముఖము, నాసిక ఇత్యాది వివిధావయవములతో గూడిన శరీరముయొక్క నిర్మాణము ఈకార్యక్రమమంతయు జూడ భగవంతుని ప్రేమ, దయ, జ్ఞానము వివేకవంతులకు స్పష్టమే. ఇట్టి అఘటితఘటనల నేమియు గమనింపక భగవంతుడు లేడని పాటపాడువా రుపేక్షణీయులు. తనపుత్రుని హితాహితములను చింతించునట్టి తండ్రి యొకప్పుడు మధురపదార్థమును బెట్టును. మరొకప్పుడు ఆరోగ్యమునకై చేదుపదార్థమును తినిపించును. ఒకప్పుడు ఎత్తుకొని ముద్దాడును. మరొకప్పుడు తనచేతితో నేడ్చునట్లు కొట్టును.

ఈపనులు తండ్రి జ్ఞానము, ప్రేమ, దయ లేక జేసినవా? అవి యుండి చేసినవా?

ఇంకొకటి — ఒక చక్షుష్మంతుని యాధారముతో అంధులు ప్రయాణము జేయుచుందురు. ఆతడు చల్లనిమార్గమున వారిని నడిపించుచు నెదుట కంటకాదులుండుట జూచి యాదారి తప్పించి వారి నాతపతప్తమైన మార్గమున నడిపించును. అప్పుడాయంధు లాతని నిందింతురా? మన కీతడు హితకారి యని ప్రశంసింతురా? కనుక పంచమ షష్ఠాంశములు నిరస్తములు.

7. మానవునికష్టాలకు కారణం మానవుని అజ్ఞానం, అతని కర్మ అంటారు, దేవునికి అతీతంగా కర్మ ఒకటి పనిచేయుచున్నదా? దేవుడు మానవునిలో అజ్ఞానాన్ని ఏల ఉంచాలి? అట.

వీరనుకొనునట్లు కర్మ దేవుని కతీతముగా లేదు. దేవునకు లోబడియే యున్నది. మానవునికి కష్టసుఖములను గలిగించు శక్తిని కర్మ కేర్పరచినది దేవుడే. కాబట్టి దేవుడే అతీతుడు తనది అజ్ఞానమని, దానిని తొలగించుకొనవలెనని మానవుడు భావించి గట్టికృషి జేయనంత

కాలము అజ్ఞాన మట్లేయుండును. పురుషప్రియత్నము లేకుండ నేదియు సిద్ధింపదు. కేవల పురుషప్రియత్నముచేతను సిద్ధింపదు. తన ప్రియత్నమునకు తనయదృష్టము తోడయినపుడే సిద్ధించును. ఏవిష యమై అజ్ఞాననివృత్తికి కృషిజేయుచుండునో ఆవిషయములో అజ్ఞా నము నివర్తించుచునే యున్నది. ఎవరు దురదృష్టమునుబట్టి తమ అజ్ఞానమును విజ్ఞానమనియే అనుకొందురో వారిలో దాని నట్లే దేవు డుంచును. 'యే యథా మాం ప్రిపద్యన్తే తాం స్తథై వ భజా మ్యహమ్' అని చెప్పిన దేవుడు, దేవుడు లేడనుకొను దురదృష్టవంతులపట్ల లేనట్లే యుండును. కనుక సప్తమాంశము నిరస్తము.

8 నాస్తికాభిప్రాయాలు కలిగి సంచరించువారి సందర్భములో మానవుడే నెగ్గి దేవు డోడిపోయినట్లు తేలుచున్నది. అట

నాస్తికమానవులు, ఆగాలివానలు, ఆసస్యనష్టములు, ఆభూకంప ములు, ఆవాయుగుండములు, ఆజరామరణములు, ఆక్షుత్పిపాసలు, అ వికటనదీప్రవాహములు, ఆదీర్ఘవ్యాధులు, ఆమనోవ్యధలు లోకములో నెచ్చటను రాకుండను లేకుండను చేసి దేవు నోడించి మేము నెగ్గినా మని చెప్పిన చెలునేమో! అదేమియుచేతగాక దేవుడు లేడనుభావము గల మేము సుఖముగా జీవించుచునే యున్నాము గనుక దేవునోడించి మేమే నెగ్గినామనుట హాస్యాస్పదము. దేవునే తలపెట్టని శునక సూక రాదులు జీవించుటలేదా? నాస్తికమానవులకంటెను దృఢముగా ఏ చీకు, చింత లేకుండ నవి జీవించుచున్నవి. అవి వీరి నోడించినవికాబోలు.

మానవుల రక్షణములో నున్నవి నశించుచుండుట అట్టి రక్షణముతో లేనివి సురక్షితముగా నుండుట, దేనిని బట్టి? కనుక అష్టమాంశము నిరస్తము.

9.10. "సరిహద్దు భూములుగల యిరువురిలో వర్షంఒకనికి అవసరము, మరొకనికి అనవసరము అయి యుంటుంది. వారు దేవుని ప్రార్థించిన దేవు డెవ్వని కోరిక తీర్చును? ఇద్దరు శత్రువులు తమ జయం కొరకు ఒకే దేవుని ప్రార్థిస్తారు. ఎవరికి జయం కలుగుతుంది? ఒకరు ప్రార్థించి ఒకరు ప్రార్థించక పోరాడుటలో ప్రార్థింపని వానికి జయం కలిగిన దేవునితో నిమిత్త మేముంది?" అట!

వీరి నిక్కడ నడుగవలసి యున్నది—సరిహద్దుభూములు కలిగి వర్షమొకని కవసరము ఇంకొకని కనవసరము అయియున్న వీరివంటి దేవుడు లేడను యిద్దరు నాస్తికులలో ఎవని సంకల్పము నెగ్గును? తన సంకల్పము నెగ్గవలెనని యధికప్రయత్న మొకడు చేయగా అంతప్రయత్నము చేయని రెండవ వాని సంకల్పమే నెగ్గుటలో హేతువేమి?

వీరివంటి పరమనాస్తికులై ఒకరికొకరు శత్రువులై అర్థబలము అంగబలము అధికముగా గలవా డొకడు అవి తక్కువగా గలవా డొకడు పోరాడినపుడు దుర్బలు డనిపించువాడే నెగ్గుటలో హేతు వేమి? వీనినెట్లు సరిపుచ్చగలరు?

"స్తికులు, తామప్పుడు చేసిన ప్రార్థనకంటె బలిష్ఠమైన దుర దృష్టమే మనసంకల్పమున కడ్డువచ్చినదనీ, మనము ఇప్పుడు ప్రార్థింపకున్నను మన యదృష్టము మంచి దగుటచే కాబోలు దేవుడు మనకు సత్ఫల మనుగ్రహించినాడని, తమ సంకల్పసిద్ధికి నిమిత్తముగా దేవునే కొనియాడుదురు.

నాస్తికులు, తమప్రయత్నములు ఫలింపకుండుటకు అప్పటి విషమపరిస్థితులు కారణమందురు. అప్పు డట్టి విషమపరిస్థితులేర్పడుట కేమి కారణమని ఆస్తికు లడుగుదురు. కాబట్టి వెనుకజూపిన కర్మసిద్ధాంతమును. కర్మఫలదాత భగవంతుడను సిద్ధాంతము నాశ్రయించుటకంటె గత్యంతరములేదు.

కనుక 'ప్రపంచవిధానాన్ని నడిపించు దేవుడు కలదను భావం అబద్ధమని స్పష్టమగుచున్నది" అను వీరిమాట త్రోసివేయబడినది. ఇట్లు నవమ దశమాంశములు నిరస్తములు.

'దేవుడు లేదు' 'జీవుడు లేదు' అను తనమాటలకు
నాస్తికత్వవాది యిచ్చిన నిర్వచనము,
దానిపై దోషోద్ఘాటనము—

"దేవుడు అను నది మానవకల్పితభావం కనుక అట్టి అరమునకు అనుగుణముగా సర్వనామక్రియాశబ్దములు ప్రయోగింపబడినవి. ఉదా:- దేవుడు లేడు అనుటకు బదులుగా దేవుడు లేదు అనిప్రయోగింపబడినది"

వీరి యుద్దేశప్రకారము దేవుడు లేదు అనుమాటకు దేవుడు అను కల్పితభావము లేదనికదా యర్థము. అప్పుడు వీరులేదనుట కల్పితమయి ఉన్నభావమునా? లేనిభావమునా? లేనిభావమును వీరు లేదనుట యేమిటికి? ఉన్నభావము వీరు లేదనుటెట్లు? ఆభావమును ఎవ్వరెవ్వరిలో నున్నదో అది వారిలోలేదని వీరెట్లు చెప్పగలరు? వీరుచెపిన్పంతమాత్రమున నది వారిలోలేకపోవుటెట్లు? కనుక దేవుడులేదుఅనుమాట తప్పే. ఇకవీరిలోనే మొదట దేవుడు అనుభావ ముండి తరువాత నది లేకుండ పోయినందున దేవుడు లేదు అనునది స్వవిషయముగా సంగతమే కనుక తప్పు లేదందురా? అప్పుడు శబ్దార్థము కుదిరినను 'దేవుడు నాకు లేదు' అనక సర్వసాధారణముగా 'దేవుడు లేదు' అనుటతప్పే. ఆపై వీరు లేదనిచేసినకోలాహలము తమ భావమునేకాని దేవునికాదు. కనుక దేవుడు సర్వవ్యవహారసాక్షియై యుండనే యుండెనని తెలిసికొనవలెను.

ఇంకొకటి—జీవుడు లేకుండ దేవుడు లేకుండ కేవలశరీరములే వ్యవహరించుచున్న వని వీరి వాదము.

ఇది యెట్లున్నదనగా — తోలుబొమ్మలాట జూచువాడు తెరపైని ఆడుచున్న తోలుబొమ్మలనుమాత్రము చూచి తెరలోనుండి యాబొమ్మలనాడించు వ్యక్తిని గనిపెట్టలేక స్వయముగనే బొమ్మలాడుచున్నవని వాదించువానిచందముగా నున్నది.కనుక నిది ప్రాజ్ఞగ్రాహ్యము కాదు ఈ 'నాస్తికత్వ' పుస్తక కర్తలు, ఆస్తికత్వమునకాధారములై జగద్వ్యాప్తములై నిరంతరాభ్యస్తము లగుచు శ్రుతి-స్మృతి-పురాణ-ఇతిహాస రూపముగా బహుళమై యున్న ఆర్షగ్రంథములను, తదనుగుణములై కావ్య-నాటకాదిరూపములై యున్న మహాకవుల గ్రంథములను మహావిద్వాంసుల నిబంధనగ్రంథములను అసంఖ్యాకులగు మహామేధావుల సదాచారములను వీనినన్నిటిని 222 పుటలతో గూడిన తమ నాస్తికత్వముతో తుడిచివేయుదలచినారు. ఇది స్వేచ్ఛలోని నిరంకుశప్రవృత్తి. ఇట్టి ప్రవృత్తియే లోకులలోవ్యాపించిన యెడల దేశసౌభాగ్య మెట్లుండునో పాఠకమహాశయులే యూహింతురుగాక.

—• ఆర్షగ్రంథములు – నాస్తికత్వదూషణములు •—

చరకసంహిత, సూత్రస్థానము - అ. 11.

"న పరీక్షా న పరీక్ష్యం న కర్తా కారణం న చ ।
న దేవా నర్షయ స్సిద్ధాః కర్మ కర్మఫలం న చ ॥
నాస్తికస్యాస్తి నైవాత్మా యదృచ్ఛోపహతాత్మనః ।
పాతకేభ్యః పరం చైత త్పాతకం నాస్తికగ్రహః ॥
తస్మా న్మతిం విముచ్యైతా మమార్గప్రసృతాం బుధః ।
సతాం బుద్ధిప్రదీపేన పశ్యే త్సర్వం యథాతథమ్" ॥

ప్రమాణముల నంగీకరింపని నాస్తికునకు పరీక్ష లేదు. పరీక్షింప వలసినది లేదు. కర్త లేదు. కారణము లేదు. జగత్ప్రసిద్ధమైయున్న దేవతలు లేరు. ఋషులు లేరు. సిద్ధులు లేరు. కర్మ లేదు. కర్మఫలము లేదు. ఆత్మయే లేదు. ఈనాస్తికత్వము పాతకములన్నిటికంటెను ప్రబలమైన పాతకము. అందుచే వివేకి అపమార్గమునకు జెందిన యిట్టి నాస్తికబుద్ధిని త్రోసివేసి ఆస్తికులగు సత్పురుషుల బుద్ధిప్రదీపసహాయముతో ప్రమాణసిద్ధమైన సర్వము యథాతథముగా దెలిసికొనవలయును.

శ్రీమద్రామాయణము – అయోధ్యాకాండము —

"కచ్చిన్న లోకాయతికాన్ బ్రాహ్మణాం స్తాత సేవసే ।
అనర్థకుశలా హ్యేతే బాలాః పండితమానినః ॥
ధర్మశాస్త్రేషు ముఖ్యేషు విద్యమానేషు దుర్బుధాః ।
బుద్ధి మాన్వీక్షికీం ప్రాప్య నిరర్థం ప్రవదన్తి తే ॥"

భరతుడు సపరివారముగా, వనవాసగతుడగు శ్రీరామప్రభువు యొక్క దర్శనార్థము వెళ్లినపుడు భరతునిగూర్చి చేసిన కుశలప్రశ్నలలో శ్రీరామప్రభు విట్లడిగెను —

వేదమార్గవిరోధులును, అజ్ఞులును, సర్వజ్ఞత్వాభిమానులును, అనర్థకారులును అగు నాస్తికులను నీవు సేవించుటలేదుకదా! ముఖ్యములైన ధర్మశాస్త్రములు కర్తవ్యమును బోధించుచుండ దురభిప్రాయులయిన నాస్తికులు కుతర్కముతో నిరర్థక ప్రసంగములు చేయుచుందురు. అని.

వనవాస మెట్లయినను మానిపించి శ్రీరాముని అయోధ్యకు దీసికొని వెళ్లదలచి బ్రహ్మాండప్రయత్నముతో వచ్చిన భరతునివాదమును బలపరచుటకును తన్మూలమున శ్రీరామహృదయ మెట్టిదో లోకమునకు విశదపరచుటకును నాస్తికవాద మెత్తుకొని జాబాలిమహర్షి ప్రసంగించినపుడు శ్రీరామప్రభు వాగ్రహముతో నిట్లనెను —

"నిన్దా మ్యహం కర్మ పితుః కృతం త ద్యస్త్వా మగృహ్ణా ద్విష మ స్తబుద్ధిమ్ । బుద్ధ్యాఽనయైవంవిధయా చర న్తం సునా స్తికం ధర్మపథా దపేతమ్ ।"

మహర్షీ ! ధర్మదూరమైన యిట్టి నాస్తికబుద్ధితో వ్యవహరించు నిన్ను మాతండ్రి పరిగ్రహించుటను నేను నిందించుచున్నాను. అని.

'అసత్య మప్రతిష్ఠం తే జగ దాహు రనీశ్వరమ్ ।
అపరస్పరసంభూతం కి మన్య త్కామహైతుకమ్॥ (భగవద్గీత—అ 16

భాష్యమ్ — యథా వయ మనృతప్రాయా స్తథేదం జగత్సర్వ మసత్యమ్ । నాస్య ధర్మాధర్మౌ ప్రతిష్ఠా । అతోఽప్రతిష్ఠం చేతి । త ఆసురా జనా జగ దాహుః । అనీశ్వరం చ । న చ ధర్మాధర్మ సవ్యపేక్షకోఽస్య శాసితేశ్వరో విద్యతే ఇత్యతోఽనీశ్వరం జగ దాహుః । కిం చాఽపరస్పరసంభూతం, కామప్రయుక్తయోః స్త్రీపురుషయోః రన్యోన్యసంయోగా జ్జగత్సర్వం సంభూతమ్ । కి మన్యత్కామహైతుకమ్ ? జగతః కారణం న కించి దదృష్టం ధర్మా ధర్మాదికారణా న్తరం విద్యతే । కామ ఏవ ప్రాణినాం కారణమితి లోకాయతికదృష్టి రియమ్ ।

ఏతాం దృష్టి మవష్టభ్య నష్టాత్మానోఽల్పబుద్ధయః ।
ప్రభవ న్త్యుగ్రకర్మాణః క్షయాయ జగతోఽహితాః ॥

భాష్యమ్ — ఏతాం దృష్టి మవష్టభ్య ఆశ్రిత్య । నష్టాత్మానః నష్టస్వభావాః విభ్రష్టపరలోకసాధనాః అల్పబుద్ధయో విషయవిష యాఽల్పైవ బుద్ధి ర్యేషాం తే । ప్రభవ న్తి ఉద్భవ న్తి ఉగ్రకర్మాణః క్రూరకర్మాణః జగతోఽహితాః శత్రవ ఇత్యర్థః ।

అర్జునా ! ఆసురసంపత్తికి జెందినవారి ధోరణి యిట్లుండును— మన మెట్లు అనృతప్రాయులమో అట్లు జగత్తంతయు ననృతప్రాయము.

ఈజగత్తు ధర్మాధర్మములపై ఆధారపడియుండలేదు. ప్రాణికర్మరూపమైన ధర్మాధర్మముల సహాయమున జగత్తును శాసించునట్టి యీశ్వరుడు లేడు స్త్రీపురుషసంబంధనిమిత్తమున కామమూలకముగా నుద్భవించుచున్న యీజగత్తునకు కామమే కారణముగాని, అదృష్ట మనబడు ధర్మాధర్మరూపమైన కారణాంతరము లేదు. అని. ఇట్టి నాస్తికబుద్ధి నాశ్రయించి పరలోకభ్రష్టులై విషయసుఖమందే దృష్టి కలిగి యుద్భవించి లోకమున కహితులై లోకహానికి కారకులగుచున్నారు. అని.

ఈయార్ష గ్రంథసందర్భమునుబట్టి అనర్థావహమైన నాస్తికదృష్టి హేయమనియు, సర్వశ్రేయోదాయకమైన ఆస్తికదృష్టి యుపాదేయమనియు స్పష్టమయినది.

— బహుమతములలో భారతీయులాశ్రయింపవలసిన దేమతము ? —

అర్థకామములుమాత్రమే పురుషార్థములు కాక ధర్మార్థకామమోక్షములు నాలుగును భారతీయులకు పురుషార్థములు. అందులో "ధర్మా దర్థశ్చ కామశ్చ" అని, అర్థకామప్రాప్తికి ధర్మమే మూలాధారము, "ధర్మ ఏవ హతో హన్తి ధర్మో రక్షతి రక్షితః" ధర్మహాని ఆత్మహానికరము, ధర్మరక్షణము ఆత్మరక్షణకరము లోకక్షేమకరమైన ఆధర్మము విచ్ఛిన్నము కాకుండ నిలవబెట్టుటకే 'ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే' అని భగవంతు డవతరించుట జరుగుచున్నది.

అట్టి ధర్మము—'శ్రుతిః స్త్రీ వేద ఆమ్నాయ స్త్రయీ ధర్మస్తు తద్విధిః' అను అమరకోశమునుబట్టి వేదవిహితకర్మ అయియున్నది. ఆవేదము—"అన్నా ద్భవంతి భూతాని... కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాఽక్షరసముద్భవమ్' అను భగవద్గీతాప్రకారము పరమేశ్వరావిర్భావితమైయున్నది.

ధర్మస్వరూపబోధకమగు వేదమును ఆవిర్భవింపజేసిన ఆపరమేశ్వరుడు—"వాణీయం వేదసంజ్ఞితా। మయాఽఽదౌ బ్రహ్మణే ప్రోక్తా ధర్మో యస్యాం మదాత్మకః'' (స్క-11—అ14) అని మొదట బహ్మకు. వేదమును భోధించినవాడను నేనని యుద్ధవునకుపదేశించిన వాడును 'చాతుర్వర్ణ్యం మయాసృష్టమ్' అనిచెప్పినవాడును కృష్ణభగవానుడే

"శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్ ।
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః"
అని యుపదేశించినవాడు కృష్ణభగవానుడే.

"మయాధ్యక్షేణ ప్రకృతిస్సూయతే సచరాచరమ్" చరాచరాత్మకమైయున్న ప్రకృతిని నియమించువాడను నేనని చెప్పినవాడు కృష్ణభగవానుడే 'మత్తస్సర్వం ప్రవర్తతే' 'మత్తః పరతరంనాన్యత్కించిదస్తి ధనంజయ" నావలననే సర్వము ప్రవర్తించుచున్నది. నాకంటె నధికమైనది మరేమియు లేదు అని కంఠోక్తిగా జెప్పినవాడు కృష్ణభగవానుడే.

"పితాఽహ మస్య జగతః...ఋక్సామ యజు రేవ చ" జగత్పితను నేనే, ఋగ్యజుస్సామవేదములు నేనే, అనియు 'తపా మ్యహమహం వర్షం నిగృహ్ణా మ్యుత్సృజామి చ" సూర్యమండల రూపమున ఎండ నిచ్చువాడను, వర్షము గురిపించువాడను, కురియకుండ జేయువాడను నేనే యనియు చెప్పినవాడు కృష్ణభగవానుడే.

'సర్వస్య చాహం హృదిసన్నివిష్టః మత్తః స్మృతి ర్జ్ఞాన మపోహనం ॥
చవేదైశ్చ సర్వై రహమేవ వేద్యః"

సర్వహృదయములలో నేనున్నాడను. స్మృతిగాని, జ్ఞానముగాని, అపోహ కాని, నావలననే కలుగుచుండును. వేదవేద్యుడను నేనే అని చెప్పినవాడు కృష్ణభగవానుడే.

"అపిచేత్సుదురాచారో భజతే మామనన్యభాక్। సాధురేవ స మన్తవ్యః...క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాన్తిం నిగచ్ఛతి...నమే భక్తః ప్రణశ్యతి । మాంహి పార్థవ్య పాశ్రిత్య యేఽపిస్యుః పాపయోనయః...తేపి యాన్తి పరాంగతిమ్"

ఎంత దురాచారుడయినను అనన్యభక్తితో నన్ను భజించినవాడు బాగుపడి ధర్మాత్ముడై శాంతిని బొందును. నాభక్తుడు ఎన్నడున చెడిపోడు. పాపాత్ములయినను నన్నాశ్రయించినయెడల సద్గతిని బొందుదురు. అని కంఠోక్తిగా జెప్పినవాడు కృష్ణభగవానుడే.

'యశ్శాస్త్రవిధి ముత్సృజ్య వర్తతే కామకారతః ।
స స సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాం గతిమ్
తస్మా చ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ ॥''

శాస్త్రీయమార్గము నుల్లంఘించి బుద్ధికి దోచినట్లు ప్రవర్తించువాడు ఇష్టసిద్ధిని గాని, సుఖమునుగాని, సద్గతినిగాని, బొందనేరడు కనుక కర్తవ్యాకర్తవ్యముల నిర్ణయించుటలో శాస్త్రమే ప్రమాణము. అని బోధించినవాడు కృష్ణభగవానుడే.

అట్టి పరమేశ్వరుడగు కృష్ణభగవానుని అవతారవైభవమునకు పాత్రమైనది యీభారతభూమియే.

''అత్రాపి భారతం శ్రేష్ఠం జంబూద్వీపే మహామునే।
యతో హి కర్మభూ రేషా హ్యతోఽన్యా భోగభూమయః ॥
నమో నమః కర్మభూమ్యై సుకృతం దుష్కృతం చ యత్ ।
యస్యాం ముహూర్తమాత్రేణ యుగైరపి న నశ్యతి'' ॥

జంబూద్వీపములో భారతదేశమే కర్మభూమి. మిగిలినవి భోగభూములు. ఈకర్మభూమియందు చేయబడిన సుకృతముగాని, దుష్కృతముగాని, ఒక ముహూర్తమాత్రకాలమందు చేయబడిన దయినను అది యుగములు గడిచినను ఫల మీయకుండ నశింపదు—అని చెప్పబడిన కర్మభూమి యీ భారతదేశమే. ఇట్టి భారతదేశమును ఆదినుండియు నాశ్రయించి యున్నవారు భారతీయులు. ఇట్టి భారతీయులాశ్రయింప వలసిన దేమతము? అనునది యిప్పుడు వచ్చిన ప్రశ్న.

దీనికి భగవంతుని మతమే భారతీయుల మతమని సమాధానము. భగవంతుడు గీతలోనిట్లు చెప్పెను,—

''యేమే మత మిదం నిత్య మనుతిష్ఠంతి మానవాః ।
శ్రద్ధావన్తోఽనసూయన్తో ముచ్యన్తే తేఽపి కర్మభిః ॥
యే త్వేత దభ్యసూయన్తో నాఽనుతిష్ఠంతి మే మతమ్ ॥
సర్వజ్ఞానవిమూఢాం స్తాన్ విద్ధి నష్టా న చేతసః ॥''

నామతమును దోషారోపణచేయకుండ ఆస్తిక్యబుద్ధితో నెవ్వరవలంబించి ప్రవర్తించుచుందురో వారుకర్మబంధమునుండి విముక్తులగు

దురు. ఎవ్వరు దోషారోపణ చేయుచు నామతము నాశ్రియింపకుం దురో వారు జ్ఞాన రహితులని, మూఢులని, చెడిపోవువారని తెలిసి కొనవలెను అని భగవంతుని మతముపై దోషారోపణమునకు హేతు వేమి? అను శంకకు భగవంతుడే సమాధానము చెప్పెను.

"అవజానంతి మాం మూఢా మానుషీం తను మాశ్రితమ్ !
న మాం దుష్కృతినో మూఢాః ప్రపద్యన్తే నరాధమాః......
ఆసురం భావ మాశ్రితాః ॥"

మానుషశరీరము ధరించి గోచరించు నన్ను మూఢులు తిరస్కరించుచుందురు. మూఢులు, పాపులు, ఆసురసంపత్తికి జెందినవారు నగు నరాధములు నన్ను భజింపరు. అని.

దీనిని బట్టి మనది కర్మభూమియని, మనము భారతీయులమని, మనకు భగవంతుడు శ్రీకృష్ణుడని, మనకు భగవద్గీత ప్రమాణ మని, మనకు వేదము పరమప్రమాణమని, మనకు ఋషులు చెప్పియున్నదే వేదార్థమని, మనము గీతోక్తమైన జన్మాంతరసిద్ధాంతమునకు జెందినవారమని, మనకు సద్బుద్ధి ననుగ్రహించు వాడీశ్వరుడని, మన కర్మనుబట్టి ఆయీశ్వరుడు మనకు ఫల మిచ్చు చుండునని, శ్రేయస్కాములమైన మనము శాస్త్రీయమార్గము నతిక్రమింపరాదని భావించు భారతీయులు అశ్రియింపవలసినది భగవన్మతమే. అదియే వేదమతము. అదియే యాస్తికమతము. అదియే ఆర్షమతము. అదియే శ్రీరామ మతము. అదియే శ్రీకృష్ణమతము. దానికే హిందూమతమని పేరు.

—వేదమతస్థులది మూఢవిశ్వాసమా?—

మతాంతరాభిమానులు, వేదమతస్థులది, మూఢాచారములని, మూఢ విశ్వాసములని తృణీకరించుచుందురు. మూఢవిశ్వాస మనుమాటకు విశ్వాసమందు మూఢత్వ మని యర్థమా ? విశ్వసించినవారియందు మూఢత్వ మని యర్థమా: విశ్వసించినవారు మూఢులను పక్షములో, నీయాక్షేపించువారి పూర్వులందరును వేదమతస్థులేగనుక తమపూర్వులను మూఢులనుటే యగుచున్నది.

మరియు. నేటియితరమతాభిమానులుగూడ వేదమతమును పూర్తిగా గాకున్నను గొన్నికొన్ని విషయములలో విశ్వసించినవారే

యగుటచే గొంతమూఢత్వము తమయందుగూడ నున్నట్లంగీకరింపవల సినవా రగుచున్నారు.

మతాంతరాభిమానులుకొందరు పూర్వజన్మ - పునర్జన్మములులేవ నుచు పరలోకమున్నదనుచున్నారు. పురాకృతములేదనుచు పుణ్యాపాప ములున్న వనుచున్నారు ఈశ్వరుడున్నా డనుచున్నారు. సృష్టివైష మ్యము యీశ్వరునిదయాళుత్వమునకేనిదర్శనమనుచున్నారు.సృష్టికర్త యీశ్వరుడనుచున్నారు. ఆయీశ్వరుడు నిర్గుణుడనుచున్నారు. దీనిలో గొన్నిమార్చిమరికొందరు చెప్పుచున్నారు. ఎవ్వరేమిచెప్పినను తమతమ నిర్ణయములకు అక్కడక్కడ గల వేదవాక్యములనే ప్రమాణీకరించుచు న్నారు వారు తోచినట్లు తీసికొనిన యంశములయినను వేదమతమునకు జెందినవే గనుక వేదమతస్థులయందు వారాపాదించు మూఢత్వము వారి యందుగూడ గొంతయైన నున్నదనుట కభ్యంతరములేదు

సర్వమతములకును ఆద్యమైనది వేదమతము. దానియందలి విశ్వాసము మూఢవిశ్వాసమని అనంతరమతస్థు లనినపుడు తదనంతర మతస్థులును అదేమాట తమ పూర్వమతస్థులయందు వాడుదురు. ఇట్లు తమ మాటనే తమకు పాఠము జెప్పువారు పుట్టుదురు పుట్టియున్నారు.

ఇక విశ్వసించినవారియందు మూఢత్వముగాక విశ్వాసమందు మూఢత్వమనుపక్షములో విశ్వసించినవారియందు ప్రాజ్ఞత్వముండి వారి విశ్వాసమందు మూఢత్వ ముండుట విరుద్ధము.

వేదమతస్థులది మూఢవిశ్వాస మనుటకు —

(1) వేదమతము మహాజనపరిగ్రహీతము కాదనియా ?

(2) అది కేవలము వ్యవహారసౌకర్యమునకై కల్పితమైన దనియా ?

(3) పురుషార్థబోధకము, సుప్రసిద్ధము నగు ప్రమాణాంతరమందు అనధికారులై గత్యంతరము లేక దీని నవలంబించినారనియా?

(4) ఇతరమతస్థులను తనలో జేర్చుకొనుటకై అది యేర్పడినదనియా?

(5) భక్ష్యాఽభక్ష్యాది నియమములేవియు లేనట్టిదనియా ?

(6) అప్రమాణమును ప్రమాణముగా తమ కుతర్కములచే నిశ్చ యించి ప్రవర్తించినవారి కిది యాటపట్టయిన దనియా ?

(7) అన్యసంసర్గమున వంచితులైనవారికిది యాశ్రయమైనదనియా?
(8) కేవల జీవనాధారముగా నిది స్వీకరింపబడుచున్న దనియా ?
ఏకారణముచేత వేదమతస్థులది మూఢవిశ్వాసమందురు ?

ఇది మన్వాదులచేతను మహర్షులచేతను పరిగ్రహింపబడినది. ఇది క్లేశకరకర్మప్రధానమై యున్నది. ఇది ప్రమాణమూర్ధన్యము, అపౌరుషేయము నగు వేదము నాధారపడియున్నది. ఇది సకలవిద్యాస్థాన సంస్తుతమగుచున్నది. ఇది సర్వవిధనియమసమంచితమై యున్నది. ఇది పితృపితామహాదులచే ననుసరింపబడుచు వచ్చుచున్నది. ఇది బాల్యము నుండియు ననువర్తింపజేయబడుచున్నది. ఇది యాముష్మికదృష్టితో నాశ్రయింపబడుచున్నది. ('కుసుమాంజలి' అనుసారము)

ఇట్టి వేదమతమందలి విశ్వాసమును మూఢవిశ్వాస మనుట అక్రమము.

వేదమతస్థులది సంకుచితదృష్టి యందురా ?—

సంకుచితదృష్టి యననేమి ? విశాలదృష్టి లేకుండుటా ? విశాలదృష్టి కొక హద్దున్నదా ? దేనిని విశాలదృష్టియందురో దానికంటె విశాలదృష్టి పైనున్నపుడు దానికి తక్కువైన విశాలదృష్టి సంకుచితదృష్టియే యగును. దేనిని సంకుచితదృష్టి యందురో దానికంటెను సంకుచితదృష్టి కది విశాలదృష్టియే యగును.

వేదమతస్థుల ఐహికాముష్మికదృష్టి విశాలదృష్టి. ఇతరుల ఐహికమాత్రదృష్టి సంకుచితదృష్టి యగును, వేదమతస్థుల జన్మాంతరదృష్టి విశాలదృష్టి. ఇతరుల జన్మాంతరాభావదృష్టి సంకుచితదృష్టి యగును.

ఇట్లుచూడ విశాలదృష్టి లేదని వేదమతస్థులయం దాపాదింపబడు సంకుచితదృష్టి యను దోషము ఇతరులయందే స్పష్టమగుచున్నది.

ఇంకొకటి — విశాలదృష్టికి విరోధియైన సంకుచితదృష్టి దోషమగునుగాని, దాని కవిరోధియైనది దోషము కాదు.

ఇచ్చట గొంత పరిశీలింతము — మనము శరీరధారులము; శరీరధారులలోగూడ మనుష్యులము; మనుష్యులలోగూడ భారతీయులము; భారతీయులలోగూడ నాంధ్రదేశీయులము: అందులోగూడ నొకానొక

వంశమునకు జెందినవారము; అవంశములోగూడ నొకానొక కుటుంబ మునకు జెందినవారము. ఈధర్మములన్నియు మనదేహమునకు అంత రంగముగను బహిరంగముగను జెందియున్నవే. ఎవ్వనిదేహమందు వాని కభిమానము అంతరంగము. అట్టి స్వదేహాభిమానమును పురస్క రించుకొనియే దేహసంబంధులయం దభిమాన మేర్పడును. ఇది యుత్త రోత్తరాభిమానములకంటె నంతరంగము, స్వదేహాభిమానముకంటె బహిరంగము నగుచుండును. ఇట్లుచూడ నెంతెంతవాని విశాలదృష్టి యైనను తనదేహాభిమానమును పురస్కరించుకొనకుండ సంభవింపదు. అనగా సర్వత్రాభిమానముకంటె తనదేహమం దభిమానము ప్రబలము. తనదేహమునకు గావలసిన కార్యములు చేసికొనియే యెవ్వడయినను అన్యులకు క్రమమునుబట్టి జేయుచుండును. "అంతరంగం బలీయః" అను న్యాయమున కుదాహరణముగా పాతంజలమహాభాష్యములో నీవిష యమే చెప్పబడినది — 'మనుష్యోఽయం ప్రాత రుత్థాయ ప్రథమం స్వశరీర కార్యాణి కరోతి । తత స్సుహృదాం, తతస్సంబన్ధినామ్" అని.

దీనినిబట్టి సర్వాంతరంగమై యున్న స్వదేహాభిమానము సంకు చితదృష్టికిందికే వచ్చును. లోకవ్యవహారములో నీవిధమైన సంకుచిత దృష్టి లేనివాడుండడు. అయినను తనయందభిమానముండగనేతనకుటుం బమందభిమానము, అవియుండగనే తనవంశమం దభిమానము, అవ న్నియు నుండగనే తనదేశమం దభిమానము, తనప్రజలయం దభిమా నము, తన ప్రభువునం దభిమానము విజృంభించుచునే యున్నవి ఇట్టి విశాలదృష్టికి సంకుచితదృష్టియగు స్వదేహాభిమాన మేమి విరోధించినది?

కనుక స్వదేహాభిమానము దోషము కాదు. పర ద్వేషము దోషము. స్వకుటుంబాభిమానము దోషము కాదు. పరకుటుంబద్వేషము దోషము. స్వవంశాభిమానము దోషముగాదు. పరవంశద్వేషము దోషము స్వదే శీయాభిమానము దోషముగాదు. పరదేశీయద్వేషము దోషము. స్వకు లాభిమానము దోషముగాదు. అన్యకులద్వేషము దోషము. స్వమతా భిమానము దోషముగాదు. పరమతద్వేషము దోషము.

సర్వమతములకును ఆద్యమైనది వేదమతము. ఇది — "అధికారి విభేదేన మార్గా మానం న సంశయః" అధికారిభేదమునుబట్టి వారివారికి

ఆయామతములు ప్రమాణములే యనియు —అతో "వేదస్థితోమర్త్యో నాన్యమార్గం సమాశ్రయేత్" వేదమతస్థుడు నన్యమతము నాశ్రయింప రాదనియు బోధించుచున్నది. ఈవిషయము వెనుక "సర్వమత సామరస్యము" అనుచోట విశదీకరింపబడినది. కనుక వేదమతము మతాన్తర ద్వేషము కలది కాదు.

వేదమతములోనుండి యీవలకు వచ్చినవారిచే కల్పింపబడుచు వచ్చిన మతాంతరములకే వేదమతద్వేషము కలదు, అదియే విశాల దృష్టికి విరోధియైనట్టి సంకుచితదృష్టి.

కాబట్టి వేదమతస్థులది మూఢవిశ్వాసము గాదు. సంకుచిత, దృష్టియు గాదు.

— వేదమతములోని యమ – నియమములు—వాని ఫలములు —

"అహింసా సత్య మస్తేయం బ్రహ్మచర్యాఽపరిగ్రహా ।
యమాః పంచ భవన్త్యేతే జాత్యాద్యనుగుణా మతాః ॥

అహింస. సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము, ఇవి యైదును యమములు.

"నియమా శ్శౌచసంతోషతపోమన్త్రేశసేవనా" శౌచము సంతోషము, తపము, మంత్రము, ఈశ్వరుడు, ఈయైదింటిని సేవించుట నియమములు. ఈపంచవిధయమ—నియమములు సిద్ధించినపుడు ఇట్టి ఫలములు గలుగును.

"అహింసాయాః ఫలం తస్య సన్నిధౌ వైరవర్జనమ్।
సత్యా దమోఘవాక్త్వం స్యా దస్తేయా ద్రత్నసంగతిః॥
బ్రహ్మచర్యా ద్వీర్యలాభో జన్మధీ రపరిగ్రహాత్।
"శౌచా త్స్వాంగే జుగుప్సా స్యా ద్దుర్జనస్పర్శవర్జనమ్॥
సత్త్వశుద్ధి స్సౌమనస్య మైకాత్మ్యేన్ద్రియవశ్యతే।
ఆత్మదర్శనయోగ్యత్వం మనశ్చా చ ఫలం భవేత్॥
అనుత్తమసుఖావాప్తి స్సంతోషా ద్యోగినో భవేత్।
ఇన్ద్రియాణాం చ కాయస్య సిద్ధి స్స్యా త్తపసః ఫలమ్॥

ఇన్ద్రియస్య తు సిద్ధ్యా స్యా ద్దూరాలోకాదిసంభవః।
కాయసిద్ధ్యాఽణిమాది స్స్యా త్తస్య దివ్యశరీరిణః॥
జపేన దేవతాకర్ష స్సమాధి స్త్వీశసేవయా (సర్వసిద్ధాంతసంగ్రహము)

అహింసాసిద్ధుని సన్నిధానములో జంతువులకు పరస్పరవైరము తొలగిపోవును. సత్యసిద్ధునకు అమోఘవాక్కు పర్పడును. అస్తేయ (ఒకనిసొత్తు నపహరింపకుండుట) సిద్ధునకు శ్రేష్ఠవస్తులాభము కలుగుచుండును. బ్రహ్మచర్యసిద్ధునకు వీర్యలాభము కలుగును. అపరిగ్రహసిద్ధునకు జన్మాంతరజ్ఞానముకలుగును. ఇవి యమములలోగలుగుఫలములు

ఇక నియమములు — శౌచము అనగా శుద్ధి - ద్వివిధము — బాహ్యశుద్ధి, అంతశ్శుద్ధి అని. శరీరశుద్ధిరూపమైన బాహ్యశుద్ధినిబట్టి శరీరమం దభిమానము తగ్గుచు జుగుప్స యేర్పడును. దుర్జనసాంగత్యమునందు వైముఖ్య మేర్పడును. అంతశ్శుద్ధినిబట్టి సత్యశుద్ధి, సౌమనస్యము, ఐకాత్మ్యము, ఇంద్రియనిగ్రహము, ఆత్మదర్శనయోగ్యత యివి కలుగును. యథాలాభసంతోషమునుబట్టి యుత్తమసుఖము కలుగును. తపస్సునుబట్టి యింద్రియసిద్ధియు, కాయసిద్ధియు గలిగి యింద్రియసిద్ధిచేత దూరదర్శనశక్తి, కాయసిద్ధిచేత దివ్యశరీరము మరియు అణిమాదిసిద్ధులు గలుగును. మంత్రజపమునుబట్టి దేవతాకర్షణము కలుగును. ఈశ్వరసేవనుబట్టి సమాధిస్థితి కలుగును. అని.

లోకములో శర్కరయందు మాధుర్యమున్నదని తెలిసియేయున్నను పిత్తజ్వరగ్రస్తుడు దాని నాస్వాదింపలేడు. ఆతడాదోషమును తొలగించుకొని యాస్వాదింపగలుగును. అట్లే దేహేంద్రియాదిగత దోషములను నివర్తింపజేసికొననివారు సఫలములయిన శాస్త్రీయనియమములలోని ఫలవిశేషములను తెలిసికొనియున్నను వాని ననుభవింపజాలరు ఆదోషనివృత్తికై కర్మయోగము నాశ్రయింపవలసిన దని శాస్త్రనిర్ణయము.

ఇట్టి యమ-నియమాదులతో గూడియున్నది వేదమతము దీనికే హిందూమతమని లోకప్రసిద్ధి. ఆద్యమైయున్న యిట్టి హిందూమతమునకును హిందూమతనామధారణము జేసియున్న నవ్యమతమునకును ఎంతయో అంతరమున్నది. అది యీదిగువశ్లోకములలో సంగ్రహముగా మున్నది.

— హిందూమత – నవ్యమతముల అంతరము. —

"పురా మెకాలేప్రభు రత్ర హూణ భాషాప్రచారస్య ఫలం బభాషే ।
స్యా దత్ర హిన్దూమతసంప్రదాయ ప్రభ్రష్టతా నాస్తికతా చ నూనమ్ ॥
స్యాద్విగ్రహారాధనశూన్యతా చ స్యాత్తైర్థిస్తవాచారవిలోలతా చ ।
జాతం తథా సర్వమథాపి నవ్యా బ్రువన్త్యహో హిన్దుమతం స్వకీయమ్ ॥
హిన్దుమతమేవ నాన్య న్నవ్యమతం చేతి బుద్ధి ముత్సృజత్ ।
నవ్యమతహిన్దుమతయో ర్మహా దన్తర మస్తి వచ్మి తచ్ఛృణుత ॥
నవ్యమతే ప్రామాణ్యం స్పష్టం బహుధాఽన్తరాత్మనః ప్రోక్తమ్ ।
హిన్దుమతే ప్రామాణ్యం వేదస్యైవాఽన్తరాత్మనో నోక్తమ్ ॥
నవ్యమతే వేదోఽసౌ యాదృగ్బైబిల్ ఖోరాన్ చ తాదృశః ।
హిన్దుమతే న తథా కిం త్వపౌరుషేయశ్చ నిత్యశ్చ ॥
నవ్యమతే తు స్మృతయ స్తత్తత్కాలే తథా తథా రచితాః ॥
హిందుమతే తా న తథా వేదోక్తార్థప్రకాశికా ఏవ ।
నవ్యమతే ఋషివర్యాస్సామాన్యా ఏవ నానుసర్తవ్యాః ।
హిన్దుమతే తే మన్త్రద్రష్టారోఽపి చ హితోపదేష్టారః ॥
సృష్టిప్రతిసృష్టే రపి కర్తార శ్శ్రుతిపథానుసర్తారః ।
దేవై ర్వ్యవహర్తారో బహుధా లోకోపకారకర్తారః ॥
త్రైకాలికవిజ్ఞానం సంపాద్యాఽఖండయోగశక్తివశాత్ ।
ఉపదిదిశుః కర్తవ్యం తస్మాత్తే సన్త్యవశ్య మనుగమ్యాః ॥
నవ్యమతే శాస్త్రీయాభేదా స్తే కుజనకల్పనామూలాః ।
హిన్దుమతే త్వాసృష్టే స్సిద్ధా ఏవేతి పరమసిద్ధాన్తః ॥
నవ్యమతే భేదానాం భేదన మభివృద్ధికారణం ప్రోక్తమ్ ।
హిన్దుమతే తథాచే త్సాంకర్యా దాత్మనాశనం ప్రోక్తమ్ ॥
యద్య చ్ఛాస్త్రనిషిద్ధం తత్తత్కర్తవ్య మేవ నవ్యమతే ।
త్యక్తవ్యం హిన్దుమతే పశ్యత కియ దన్తరం త్వనయోః ॥"

---

దిఙ్మాత్ర మ్మార్ష సిద్ధాన్తనిరూపణ మిదం కృతమ్ ।
కథిష్యతే నవీనానాం దూషణానాం సమీక్షణమ్ ॥

ప్రథమభాగము సమాప్తము.

# శుద్ధిపత్రము.

| పుట—పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|
| —24 | అవికొని | అవిలేని |
| —11 | తోచుటలో | తోచుటలో |
| .—26 | తోనేనేటి | తోనేటి |
| 6 —22 | లేదని | లేనిదని |
| 3 — 2 | దతో | దత్తో. |
| 5 — 8 | లోకులు | లోకుల |
| 06— 8 | కర్యితి | కరిష్యతి |
| 10— 9 | నిర్ణయ | నియమః |
| ,, 24 | శ్రిద్ధాయా | శ్రిద్ధయా |
| 21— 3 | తద్ద్వేషిభిః | తద్వేషిభిః |
| 33—13 | పరాస్య | పదస్య |
| 37— 3 | సురాత | సుతరా |
| 41—21 | ధర్మాధర్మ | ధర్మాదర్శ |
| 32—17 | సమానః | సమనాః |
| 38— 9 | ఉపనిషత్తును | ఉపనిషత్తునుబట్టి |
| 76— 6 | సాచేనదుర్భాత | సాచేదుర్భాత |
| 78— 2 | ఏషపప్రికారకః | ఏషఏవంప్రికారకః |
| ,, 17 | జ్ఞానగ్ధ | జ్ఞానదగ్ధ |
| 79—21 | శీతోష్ణోథ | శీతోష్ణేఽథ |
| 3— 7 | ఇహామందును | ఇహామందుపరమందును |
| 9—27 | వేదితదశుభ | వేదితశుభ |
| 27—20 | సగ్వాశరీర | స్వాశరీర |
| 3— 1 | పశుగణము | పశుగుణము |
| 3—22 | మతాంరా | మతాంతరా |
| ,, ,, | మతస్థులది | మతస్థులవి |